

# సూత పురాణం-2

మూలం: కవిరాజు త్రిపురనేని రామస్వామి

వచనం: బి. రామకృష్ణ



కవిరాజు 125వ జయంతి సందర్భంగా కవిరాజు త్రిపురనేని ఫౌండేషన్, తెనాలివారూ, కీ॥ శే॥ కావూరి రాఘవయ్య చౌదరిగారి జ్ఞాపకార్థం వారి కుమార్తె శ్రీమతి ఆలపాటి మాధవిగారూ సంయుక్తంగా అందిస్తున్న చిరు కానుక ఈ పుస్తకం



**సూత పురాణం-2**

***Sootha Puranam-1,*** prose version of ***Kaviraju, Tripuraneni Ramaswamy, rendered by late Sri B. Ramakrishna,*** published by **Peacock Classics,** Publication wing of **People's Trust**

**Cover Design: Surya Chandra**

Publication No: 66



This copy is not for sale. It is a gift by both Kaviraju Tripuraneni Foundation, Tenali, on the occation of the 125th birth anniversarsary of late Sri Kaviraju Tripuraneni Ramaswamy and also by Srimathi Alapati Madhavi, in memory of her father late Sri Kavuri Raghavayya Choudary.

First Published in 2011
Hyderabad, Andhra Pradesh, India

Printed at Rainbow Print pack, Hyderabad

Sole Distributors: Visalaandhra Publishing House, Hyd.

Address for Communication
G2, BLOCK NO. 6, PANCHAVATI, PRAGATHI NAGAR,
OPP. JNTU, KUKKATAPALLY, HYDERABAD - 90

EDITOR, PEACOCK CLASSICS
Phs: 98499 40791, 901020 4633, 040 2389 0328 (R)
emails: agaandhi@gmail.com, agaandhi@yahoo.co.in

# వచన సూతపురాణం

# రెండో భాగం

ఓ పాఠక మహాశయా!

సూతముని దయ వల్ల మొదటిభాగం రాయగలిగా. ఇక ఆ మహానుభావుడి కరుణ వల్లనే రెండో భాగం రాద్దామని మొదలుపెడుతున్నా- ఎంతో రసభరితంగా దీన్ని తీర్చిదిద్దుతా. సావధానంగా వినండి.

ఊరు విడచి వచ్చి ఈ ఆశ్రమంలో ఉడికీ ఉడకని దుంపల్ని తిని, ముడికూరలు తిని మొదటే నేను డస్సిపోయా. ఏదో రకంగా, కాలం గడుస్తుంది గదా.. అని తోసుకుపోతున్నా, అయితే కొంతకాలం గడిచేటప్పటికి కొంచెం కొత్త చేసింది.

గాలి, హోరుమని వీస్తుంది; ఆ గాలి విసరుటుయ్యాలలోనే పడుకోవటం, తిరగటం చేసేవాణ్ణి. అంతా కొత్త కాబట్టి, గాలి, నీళ్ళు కూడా చివరకు సరిపడలేదు. జలుబు చేసి ఒళ్ళు పులకరించింది. పులకరం ఎక్కువై బాధ పెట్టసాగింది. జ్వరం వచ్చింది; ఒడలంతా నొప్పులు పుట్టడం మొదలైంది.

దుండు ముక్కలా వుండేవాణ్ణి, తిండి సరిగా తినక సగమైపోయా.

జ్వరం బాధలో భయపడ్డా. ఇక నాకు జ్వరం తగ్గదేమోనన్న అనుమానం కలిగింది. ఇల్లు గుర్తుకు వచ్చింది. చుట్టాలూ స్నేహితులూ- కుటుంబంలోని వాళ్ళంతా, అమ్మా - నాన్న కళ్ళ ముందు మెదలటం జరిగింది. మనస్సు కలత చెందింది. అయినా ధైర్యం తెచ్చుకొని ఏదో రకంగా నిలదొక్కుకున్నా.

ఆఖరికి ఒక రోజు సాయంకాలం జ్వరం బాగా ఎక్కువైంది. గందరగోళపడ్డా - దగ్గరలో ఎవరూ లేరు. ఒక్కణ్ణే వున్నా. ధైర్యం విడవకుండా వొంటరిగానే పక్క మీద అటూ -ఇటూ పొరలాడుతూ మెల్లగా కళ్ళు మూసుకున్నా. బాగా చెమట పట్టింది. ఇంతలో కాళ్ళ చప్పుడు వినిపించింది. తడబాటు పడి కళ్ళు తెరచి చూచా.

గురువర్యుడైన సూత మహాముని బిరబిర - నా దగ్గరకు వచ్చాడు. పక్కనే నిల్చున్నాడు. నన్ను బాగా పార జూచి, ఎందుకో చరచరా తిరిగిపోయాడు. తరువాత కొంతసేపటికి ఆ మహానుభావుడు మరలా నెమ్మదిగా నా దగ్గరకు వచ్చాడు.

"బిడ్డా! ఇదిగో, ఈ మందు తీసుకో! నీ ఆరోగ్యం కుదుట పడుతుంది" అని చెప్పి,

పుడిసిలి నిండా వున్న రసాన్ని యిచ్చాడు. నేను కూడా నోటి నిండా పోసుకొని ఆ మందు గడగడ తాగేశా.

అదేందో గాని, వెంటనే జ్వరం, చేత్తో తీసేసినట్టుగా ఒక్క దెబ్బతో పారిపోయింది. నా కలవరం తగ్గింది. శరీరపు బడలిక తీరింది. నలత కూడా తొలగింది. ఇంతకు ముందున్న కలత - గందరగోళ స్థితి మాయమయ్యాయి.

అంతట్లోనే నా ముఖ లక్షణాలను చూచి, సంతోషపడి, సూత మహర్షి నాతో గూడా చెప్పకుండా - కనిపించకుండా పోయాడు. నేను గూడా పక్కమీద పడుకొని అటుఇటు పొరలాడుతున్నా. లేచి, మెల్లగా గురువుగారి దగ్గరకు పోయా. ఆ మహనీయుడు ఎంతో ప్రీతిగా నన్ను చూచాడు. చూచి...

"కుమారా! ఇప్పుడే ఇక్కడికి ఎందుకు వచ్చావయ్యా! అంత తొందర పనేమైనా వుందా? ఆరోగ్యం బాగానే బాగు పడ్డదిగా?" అని అడిగాడు.

అన్నిటికీ - ఊ కొట్టా.

"మహాత్మా! తక్కిన కథ వినాలని కుతూహలం కలిగి యిక్కడకు వచ్చా. నాకు బాగానే వుంది. బడలిక అంతా తీరింది. కాబట్టి, తరువాత ఏం జరిగిందో, ఆ కథను వివరించగోరుతున్నా.

ఆర్యులు ఎట్లా విజృంభించారు?

మంత్ర తంత్రాలతో ఎట్లా పరాభవించారు?

ద్రావిడుల్ని ఎట్లా అణిచారు?

రాజ్యాన్ని ఏ రకంగా అవతల విస్తరింపచేశారు?

ద్రావిడుల ప్రాణాలను, ఆరోగ్యాన్ని, సంపదను ఎట్లా బలి గొన్నారు?

దయచేసి, తెలియజెప్పగోరుతున్నా.

సూత మహాముని, ఈ మాటలకు - 'సరే' అని-

"పుత్రకా! నీ వడిగిన కథా విశేషం విస్తరించి చెప్పటం వీలుగాదు. ఆర్యుల మంత్రాంగాన్ని వివరించి చెప్పే ఒకటి రెండు పూర్వ కథల్ని మాత్రం వివరించి చెపుతా - సావధానంగా విను;

# యదార్థ ప్రహ్లాద చరిత్ర

నాయనా! రామస్వామీ! స్వర్గలోకంలో వొకనాడు దేవేంద్రుడు నిండుకొలువు తీర్చాడు. గోల లేకుండా నిశ్శబ్దాన్ని పాటించేట్టు ద్వారపాలకులు దేవతల్ని అదుపులో పెడుతున్నారు.

ద్రావిడ వీరుల దెబ్బకు తట్టుకోలేక వలస పోయిన తన ఆర్యజాతి యోగ క్షేమాలను తెలుసుకున్నాడు. వాళ్ళ దురవస్థని, రక్త సంబంధం వల్ల కలిగిన మానసిక బాధకు

మనస్సు చలించి మదనపడ్డాడు. గ్రుడ్ల నీరు గ్రుడ్లలోనే కుక్కుకుంటున్నాడు. ఏ రకంగానైనా తన జాతి వాళ్ళకు తోడ్పడాలని నిశ్చయించుకొన్నాడు. అయితే, యుద్ధంలో ఆరితేరిన ద్రావిడ యోధులతో పోరాడడం, పోరాడి గెలవడం సాధ్యం కాదనుకొన్నాడు. కాబట్టే, రాజనీతినుపయోగించి, వేరు వుపాయంతో ద్రావిడుల్ని అణచాలని ఆ వుపాయం కోసం వెదకుతున్నాడు,

ఇంతలో గూఢచారి పని కోసం వెళ్ళిన గూఢచారులు వచ్చారు. వచ్చిన వేగుల వాళ్ళను చూచి - "కార్యం చక్కబెట్టుకొని వచ్చారా? విశేషాలేమిటో వివరించండి" అని అడిగాడు. ఆ గూఢచారులు ఇంద్రుడికి జోహారులు చేసి ఇట్లా చెప్పారు.

"దేవేంద్రా! కొంతమంది ద్రావిడ వీరులు కలుపుగోలు తనాన్ని విడిచిపెట్టి చిందరవందరగా తిరగడం మొదలుపెట్టారు. ప్రాచీన వైభవాన్ని కోల్పోయారు. వీళ్ళల్లో శక్తి సామర్థ్యాలు నశించాయి. ద్రావిడ జాతిలో చెలరేగిన ఈ అరాచకాన్ని, గందరగోళాన్ని గమనించాడు హిరణ్యకశిపుడనే ద్రవిడరాజు.

ఈతడు మంచి కుశాగ్రబుద్ధి. తన వాళ్లల్లో కలిగిన ఈ వింత వర్తనానికి కలత చెంది, ఆ వంశపు రాజులందరినీ చేర బిలిచాడు. చిన్నా, పెద్దా అని భావించక, అందరినీ యథారీతిగా గౌరవించి, అన్ని విషయాలూ నచ్చచెప్పాడు. లోలోపల రగులుతున్న పాతపగ చిచ్చును చల్లార్చాడు. మానాభిమానాలు గల ద్రావిడ నరపతుల్ని ఎట్లాగైతేనేం... ఒకదారికి తెచ్చాడు. శత్రువుల గుండెలు జలదరించేలా అందరినీ ఒక కాడి కిందకు సమకూర్చాడు. వీరుడైన హిరణ్యకశిపుడిట్లా అందరినీ గూర్చి, పాత కక్షలన్నీ మాన్పించి, ప్రశాంత వాతావరణాన్ని కల్పించి, ద్రావిడ జాతికి చెరగని సుఖాన్ని సంతరించిపెట్టాడు.

ఇంత ముందుచూపు, తెలివిగల హిరణ్యకశిపుడే ద్రావిడ వీరులకు నాయకుడయ్యాడు. ఏటూ పాటూ తెలిసి, ఆర్య కుతంత్రాలను పసిగట్టి ఎంతో జాగ్రత్తగా మెలగుతున్నాడు. తన జాతిని ఒకే తాటితో కట్టి అందరికీ ముఖ్యుడై రాత్రింబవళ్ళూ రెప్పార్పక జాతి సంరక్షణను బాధ్యతగా స్వీకరించాడు. శత్రువులు తనవైపు తేరిపార చూడకుండా సైన్యాన్ని కట్టుదిట్టం చేసి అప్రమత్తంగా వుంటున్నాడు.

త్రిలోకాధిపతీ! హిరణ్యకశిపుడు పాలిస్తుంటే, ద్రావిడ దేశంలో కరవు కాటకాలు లేవు. ప్రజలంతా పాడి పంటలతో, సిరి సంపదలతో తులతూగుతున్నారు. ఆ రాజంటే ప్రజలకు అంతులేని ప్రేమానురాగాలున్నాయి. మాంసపు ముక్కలతో - రక్తం మడుగులతో సలసలసలాడే యజ్ఞశాలలు ఈ దేశంలో కనిపించవు. భగవంతుడికి జంతుబలులు కానరావు. ఏ సమయంలోనూ, ఇంకిపోయే నదులే లేవు. శివమెత్తి కాపు కాయకుండా వుండే చెట్లు లేవు, విసరి కొట్టే వేడిగాల్పులు లేవు. పంట పండని చవిటి ఎర్ర నేల చూద్దామన్నా లేదు.

నెల మూడు వానలు నిలచి కురుస్తున్నాయి. ఋతుధర్మం మరచిన సంవత్సరం లేదు. బీదరికం ప్రజల్లోకి రావాలంటే భయపడుతుంది. దొంగల, దారి దోపిడీగాళ్ళ భయం మచ్చుకైనా కానరాదు.

ఆ సీమలో వున్న వీరులు అగ్నినైనా పుడిసిలితో పట్టి పిసికి వేస్తామనే ధైర్యంతో వున్నారు. వాళ్ళతో ఢీకొనడమంటే, కొరవితో తల గోకికోవటమే. వాళ్ళకే మాత్రం పిరికితనం లేదు. వాళ్ళు ప్రాణభయం లేని శత్రుభయంకరులు.

మహేంద్రా! అతని సైన్యం సంగతి నీకేం చెప్పాలి. రక్తధారలతో నేల తడిసిపోయినా సరే, ప్రాణాల్ని గడ్డి పోచకంటే, తేలిగ్గా చూస్తూ రాజునూ, రాజ్యాన్నీ కాపాడుతుంది. ఎప్పుడూ కవచాల్ని ధరించి ధనుస్సులూ, బాణాలు విడిచిపెట్టకుండా కేరింతలు కొడుతూ తిరుగుతూ వుంటుంది ఆ హిరణ్యకశిపుడి సైన్యం" అని వేగులవాళ్ళు సభలోనే విన్నవించారు. చారుల మాటలు విన్న దేవగురువైన బృహస్పతి హఠాత్తుగా లేచాడు.

"దేవతా సోదరులారా! మనం శత్రువుల్ని స్వశక్తితో గెలుస్తామనే మాట పక్కకు నెట్టేయండి. అది మనవల్ల గాని పని. ద్రావిడ వీరులు మనకంటె చాల బలవంతులు. కావాలంటే ప్రాణాన్ని తృణప్రాయంగా ఒడ్డుతారు. తగిన రాజనీతి నుపయోగించి, సమయం చూచి, కుటుంబ కలహాన్ని పురికొల్పి, ఏ రకంగానైనా శత్రుసమూహాన్ని మొదలంటా నరకటం అవసరం - ఇదే మన కర్తవ్యం.

కుటుంబ కలహాన్ని సృష్టించి, పరస్పరం విరోధాన్ని కల్పించి ద్రావిడ సంఘాన్ని అల్లకల్లోల పరచాలి. అప్పుడు శ్రమలేకుండా సునాయాసంగా శత్రువుల్ని జయించవచ్చు."

బృహస్పతి చెప్పిన మాటల్ని గూఢచారులు విన్నారు. విని...

"దేవా! మధ్యలో అందుకొని మాట్లాడుతున్నందుకు మన్నించండి. మీరనుమతిస్తే, ఇంకో సంగతి చెపుతాం. శత్రువు అంతు తెలుసుకుని యే పనైనా తలపెట్టాలి. అంతేగాని, శత్రువును అంచనా వేయకుండా, అంతూ పొంతూ తెలియకుండా ఏ పనీ చేయలేం.

హిరణ్యకశిపుడికి మహాబల సంపన్నుడయిన సోదరుడొక డున్నాడు. అతని పేరు హిరణ్యాక్షుడు. యుద్ధరంగంలో అతణ్ణి ఎదిరించే వీరుడే కనిపించడు. అతడి బల పరాక్రమాలు సాటిలేనివి. అతని ఆయుధం గద - అతనికదే తోడు - దాని సహాయంతో దుష్టుల్ని శిక్షిస్తూ, శిష్టుల్ని రక్షిస్తూ దక్షిణ దేశమంతా ఎప్పుడూ తిరుగుతూ వుంటాడు. ఈతని అండదండల చేతనే ఆ రాజ్యం ఏకష్ట నష్టాలూ లేకుండా వర్ధిల్లుతూ వుంది.

ద్రావిడ సామ్రాజ్య స్థాపనా వైభవానికి హిరణ్యాక్షుడి భుజబల పరాక్రమాలే పెట్టని కోటలు. జాత్యభిమాన సంపదకు కేవలం ఈతని కలుపుగోలుతనమే కాణాచి. బడాయిపోయి ప్రగల్భాలు కొట్టే టక్కరి శత్రుమూకకు ఈతని చండశాసనం నోరు మూయించే ముందు, కుచ్చితులు చేసే ఆగడాలకు, ఈ హిరణ్యాక్షుడి ఆజ్ఞ అనే హుంకారం

దురాయికట్టు. ఇంతటి మహావీరుడు ఒంటరిగా తిరుగుతూ వుంటే, ఒంటి కొమ్ము పందినొకదానిని అతనిపైకుసిగొల్పి అతడు దాని వెంటబడి, ఆదమరచి వుండగా, మనవాళ్ళు దొంగచాటున ఆ వీరుణ్ణి సంహరించారు. ఈ ఘటన మొన్న మొన్ననే జరిగింది.

తన సోదరుడు మన వాళ్ళ మాయోపాయం వల్ల చంపబడడం హిరణ్యకశిపుడికి తెలిసింది. భరించరాని, అపారదుఃఖంలో మునిగాడు. తన చేతులు విరిగినట్లె వలవల వాపోయాడు.

భీముడూ - శూరుడూ కాబట్టి దుఃఖాన్ని దిగమింగి కర్తవ్యాన్ని ఆలోచించాడు. తన సోదరుణ్ణి కుతంత్రంతో బలిగొన్న శత్రుమూకను నామరూపాల్లేకుండా చేయాలని కంకణం కట్టుకొన్నాడు. అందుకే భయంకరమైన తపస్సు చేసి, వరాలు పొందాలని నిశ్చయించి, హిరణ్యకశిపుడు తపస్సు చేయటానికి అడవికి వెళ్ళాడు.

దేవా! మనం మాతృభూమిని విడిచి, తెలియని దేశంలోకి అడుగుపెట్టాం. అందులో కూడా భండన పండితులున్న విరోధి దేశంలో తిరుగుతున్నాం. శత్రువులు బలవంతులు. ఒదిగి వుండడం అవసరం.

ఇంకో సంగతి కూడా వినండి;

మన ఆర్యుల ప్రాణాలను కాపాడుకోవటానికీ, శత్రువులను తేలికపర్చటానికీ యిది మంచి సమయం. ఈ సమయం తప్పిందంటే, మన జీవిత కాలంలో ద్రావిడ వీరుల్ని కన్నెత్తి చూడడం కూడా కష్టమవుతుంది.

హిరణ్యకశిపుడు ఇంటిలో లేడు. అతని భార్య గర్భవతి. ఈ ద్రావిడ రాజుకు పుట్టే మొదటి కాన్పు వంశ నాశకుడౌతాడని జ్యోతిష్యులు చెప్పగా విన్నారు. ఇప్పుడామె వొంటరిగానే ఇంట వుంది. కంట వత్తిడికొని తన నాథుడి కోసం రేయింబవళ్ళూ ఎదురుచూస్తూ వుంది" అని చెప్పారు.

గూఢచారులు చెప్పిన మాటలు విన్నాడు దేవగురుడు బృహస్పతి. వాళ్ళ మాటల్లో వున్న అంతరార్థాన్ని గ్రహించాడు.

రెండుప్రక్కలా వింజామరలు వీస్తున్నారు వీవనకత్తెలు. మంద మందంగా వస్తున్న ఆ గాలవి సుఖంలో మునిగి, తన ఆచార్యత్వం చెలాయిస్తూ యింద్రుణ్ణి చూచాడు.

“వేగులవాళ్ళ వాక్యాల్లో గూఢార్థం గ్రహించా. మనం ఆలస్యం చేయరాదు. ఇప్పుడే యింద్రుడు హిరణ్యకశిపుని పట్టణానికి పోయి, అతని భార్య లీలావతిని ఇంటి నుండి బయటకు తీసుకురావాలి. గోవును చెరబట్టినట్టు పట్టుకురావాలి.

ఇంద్రుడిట్లా చేసి లీలావతిని తీసుకొని వస్తుండగా - నారదుడేదో పని మీద, ఎక్కడికో పోతున్నట్టు ఇంద్రుడికి, లీలావతికి ఎదురుపోవాలి. పోయి, ఇంద్రుణ్ణి అడిగి విషయం

తెలుసుకొని, అతణ్ణి మందలించినట్టు చేసి, 'స్త్రీని యిట్లా బలాత్కరించి తేవటం అధర్మమని చెప్పి, ఇంద్రుడి వద్ద నుంచి ఆమెను విడిపించి, తన ఆశ్రమంలో వుంచాలి.

తన ఆశ్రమంలో చేరిన లీలావతిని నారదుడెంతో ప్రేమాదరాలతో చూచి, క్రమ క్రమంగా ఆమెను మచ్చిక చేసుకోవాలి. సాంత్వన వాక్యాలు పలికి ఆమె తన మాట వినేట్టు చేసుకోవాలి. ఆ తరువాత నారదుడు తన నైపుణ్యంతో మాటల చాతుర్యంతో నెమ్మదిగా ఆమెను ద్రావిడ సంస్కృతిపై విరక్తి కలిగేట్టు చేయాలి.

ద్రావిడ జాతి యింటి వేలుపైన శివుడిపై భక్తి లేకుండా చెదరగొట్టాలి, ఎంతోకాలం నుంచి పాటిస్తున్న ద్రావిడాచారాల మీద విరక్తి కలిగేట్టు చేయాలి, తమ పూర్వీకులైన తాత తండ్రుల మీద వుండే, అధికమైన గురుభక్తిని అంతం చేయాలి.

పిలిస్తే పలికి - దేశం కోసం - జాతి కోసం ప్రాణాలైనా తృణప్రాయంగా త్యాగం చేసే దేశాభిమానాన్ని వాళ్ళల్లో లేకుండా మటుమాయమయ్యేట్టు చేయాలి, కట్టుకథల్నీ - పిట్ట కథల్నీ - ఎన్నెన్నో చెప్పి నేర్పుతో లీలావతి చెవినిల్లు కట్టుకొని మనవైపు తిప్పాలి. అంతేగాదు, కడుపులో వున్న పిండం ఈ ప్రభావానికి లొంగిపోయేట్టు చేసి, ఎట్లాగైనా యింటిలో చిచ్చు రేపాలి.

మందుమాకులతోనే చేస్తారో...! మంత్రతంత్రాలతోటే చేస్తారో...! మొత్తం మీద ఎట్లా అయితేనేం? ఎన్ని పాట్లు పడితేనేం? ఆ లీలావతిని మాత్రం మనం స్వాధీనం చేసుకోవాలి.

అప్పుడు మాత్రమే ద్రావిడ రాజ్యాన్ని నాశనం చేయగలం. దాని సంపదను కొల్లగొట్టగలం; దాని బల పరాక్రమాలను మట్టి కరిపించగలం.

భారతదేశంలో ఆర్యజాతి జయపతాకను ఆకాశంలో రెపరెపలాడేలా ఎగురవేయగలం. వాళ్ళ కళ్ళు కప్పకుండా మనం చేయగలిగేది సున్నా.

కాబట్టి నాకు, ఇదే సరైన మార్గంగా కనిపిస్తుంది. శత్రు భయంకరులైన ద్రావిడ వీరుల్ని ఇంకోరకంగా గెలవటం సాధ్యం కాదు.

'దేవేంద్రా! ఏ మాత్రం జాగు చేసినా ఫలితం దక్కకపోవచ్చు. వెంటనే పయనమైపోయి నీ పని చక్కబెట్టుకో... పో!

నారదుడి మీద పెట్టిన బాధ్యతను అతడు తప్పకుండా నిర్వర్తిస్తాడు. అతనికి ఇట్లాంటి పనుల్లో మంచి అనుభవం వుంది. ఏ సమయంలో ఏం చేయాలో అతనికి చెప్పటమంటే - తాతకు దగ్గు నేర్పటమే - అవుతుంది. ఈ పని మీరు ఏ ఆటంకం లేకుండా చేస్తే, భారతదేశంలో వున్న మనవాళ్ళు హాయిగా గుండెపై చేయి వేసుకుని నిద్రపోతారు."

గురువైన బృహస్పతి చెప్పిన మాటలు విన్నాడు ఇంద్రుడు. అతని ఆజ్ఞకు బద్ధుడై, రెట్టించిన వుత్సాహంతో, వెంటనే సభను చాలించి సారథియైన మాతలి వంక క్రీగంటి

చూపును ప్రసరింపచేశాడు.

ఇంద్రుడి చూపులో అర్థాన్ని తెలుసుకొన్న మాతలి, వెంటనే రథాన్ని సిద్ధం చేసి తెచ్చి ముందుంచాడు.

సారథి తెచ్చిన రథాన్నెక్కి దేవేంద్రుడు వీరావేశంతో తన పట్టణాన్ని విడిచి ద్రావిడ రాజు రాజధాని వైపు ప్రయాణం సాగించాడు.

భారతదేశానికి రాకపోకలు సాగించటం మాతలికి బాగా అలవాటే. తెలిసిన దారుల వెంటబడి, రథాన్ని వాయువేగ మనోవేగాలతో అదేపనిగా తోలుతున్నాడు. ఇంద్రుడి రథానికి కట్టిన ఆర్యపతాకం ఆకాశంలో రెపరెపలాడుతోంది. గుర్రాలకు బాగా చెమట పట్టింది.

ఇంతలో రథం భారతదేశంలోకి రానే వచ్చింది. భారత వర్షంలో ప్రవేశించిన యింద్రుడు, మాతలి హుటాహుటిన రథం తోలగా దక్షిణ ప్రాంతానికి వచ్చాడు.

రాజు లేని రాజ్యంలో చొరబడ్డాడు దేవతల రాజు. పొగరుతో వచ్చిన ఇంద్రుడి రాకను గాంచిన ద్రావిడ సైన్యం, అతని రాకకు కలత చెందింది. ఇదే అదననుకొన్నాడు దేవరాజు. ఒక్క క్షణం కూడా వృధా చేయకుండా గావు పట్టుతో ద్రావిడ రాజు నగరం ప్రవేశించాడు.

ఒక్క క్షణంలో చడీ చప్పుడు గాకుండా, అంతఃపురంలోకి ప్రవేశించాడు, గర్భవతియైన హిరణ్యకశిపుని భార్య లీలావతిని చూచి, రెట్టించిన కోపంతో, కళ్ళకు కొవ్వెగదట్టి ఆ సాధ్వీమతల్లిని పట్టుకోవటానికి సాహసం చేశాడు.

కొంతసేపు అదలించాడు - విదలించాడు; బెదరించాడు; పిరికిపంద - కాముకుడు - దుర్మార్గుడు అయిన దేవతల రాజు ఇంద్రుడు ఇదే సమయమని, ముందు జుట్టు పట్టుకుని బయటకు ఈడ్చి లాక్కొని వస్తున్నాడు.

ఆ మహాతల్లి - ఆ పతివ్రతారత్నం - ఎండ కన్నెరుగని సుకుమారి - ఆ దుష్టుడికి ఎదురు తిరిగింది. వాడి క్రూరమైన దేవతల నుంచి వదలించుకోవాలని ప్రయత్నం చేసింది. కాని ఫలితం దక్కలేదు, వలవల వాపోయింది,

మహాసాధ్వి అయిన లీలావతి ఆక్రందనలు, కఠిన హృదయుడైన ఆర్యజాతి రాజు దేవేంద్రుడి కరకు కసాయి గుండెకు వినిపించలేదు. ఈ మూర్ఖుడామెను లెక్కచేయక, సిగ్గు విడిచి, జాలి లేక చెరబట్టి తీసుకుపోతున్నాడు.

ఆ వనితాలలామ - ఆ ముగ్ధమనోహర లావణ్య - కుసుమ కోమలాంగి - అభిమానధని - లీలావతి తనకు జరిగిన ఈ ఘోర పరాభవానికి లజ్జావనత వదనయై, కసాయివాడి చేతిలోని గొర్రెలాగా లాగబడుతూ, గోదు గోదున విలపించసాగింది.

దుఃఖితయైన లీలావతిని తలబట్టి ఈడ్చుకొంటూ వెళుతుండగా కొంత దూరం

పోయేసరికి  దారిలో నారదుడు అడ్డం వచ్చాడు.

దారికి అడ్డం వచ్చిన ఆర్య ఋషి నారదుడు, తన మాటల చాతుర్యం స్పష్టం కానీయకుండా, ఎంతో దయగలవాడిలా, ఆదరభావం వున్నవాడిలా కాపట్యంతో మాటలాడడం మొదలుపెట్టాడు.

'ఏమయ్యా! ఇంద్రా...! ఆగు...! ఏమిటీ విచిత్రం...? నీవేం చేస్తున్నావు? ఈమె ఎవరనుకున్నావు? లీలావతి. మహా సాధ్వి. పతివ్రతా రత్నం. ఈమె ద్రవిడ సార్వభౌముడైన హిరణ్యకశిపుని అర్ధాంగి. ఈమెను చెరబట్టి బ్రతుకగలవా? జీవితాన్ని తెగించి ఈ పని చేస్తున్నావా? అయినా నీకిది తగదు.

పైగా, ఈమె యిపుడు నిండుచూలాలు. ఈమె గోడు గూడా నీకు వినిపిస్తున్నట్టు లేదు. మన్నించి విడిచిపెట్టకపోతే నీకు కీడు మూడుతుంది. నీబోటి వీరులు వేయిమంది ఒక్కసారి చుట్టుముట్టినా కొంచెం గూడా లెక్కచేయక ఒక్కడే తుత్తునియలు చేయగల వీరుడు ద్రవిడరాజు హిరణ్యకశిపుడు.

అంతటి భుజబల సంపన్నుడు - అతివీర భయంకరుడు - అయిన ద్రవిడ భూపతి యిల్లాలిని లీలావతిని చెరబట్టావు. నీకు పోగాలం దగ్గరపడ్డది. నా మాట విను; ప్రాణాల మీద ఏ మాత్రం ఆశ వున్నా, ఈమెను వెంటనే విడిచిపెట్టు.

హిరణ్యకశిపుడు, అసలే సత్వసంపన్నుడు. అంతేగాదు - ఇప్పుడు ఘోరతపస్సు చేసి వస్తున్నాడు. బాహుబలాఢ్యులలో సాటిలేనివాడు. దైవసహాయం కూడా అతనికి తోడవుతుంది." మూర్ఖుడవై ఇంతటి సాధ్విని ఎందుకు చెనుకుతావు? నా మాటలు నీ చెవి సోకలేదా?"

నారదుడు చెప్పిన మాటలు విని, యింద్రుడు తాను చేసిన పనికి ఎంతో సిగ్గు పడ్డవాడిలా నటిస్తూ ఆ స్త్రీ రత్నాన్ని విడిచిపుచ్చాడు. తరువాత నారదుడి దగ్గర సెలవు తీసుకొని యింద్రుడు తన దారిన తాను పోయాడు.

ఇక నారదుడు, లీలావతిని ఇంద్రుడి చెర విడిపించినట్లు నాటకమాడి, ఎంతో దయతో వూరడించి, ఆదరం చూపుతూ-

తల్లీ! అల్లదుగో పర్ణశాల, ఇక్కడకు చాలా దగ్గర. మెల్లగా అక్కడకు పోదాం. రా! అక్కడ ఎంతో వుల్లాసంతో వుండవచ్చు. ఈ స్థలంలోకి ఎంత ప్రయత్నించినా పోతుటీగకైనా సాధ్యం కాదు. నేను గీచిన గీత దాటి రావటానికి ఎంతటివారికైనా శక్తి సామర్థ్యాలు చాలవు.

నీవు పుణ్యాత్మురాలవు. నీ భర్త తపస్సు నుంచి తిరిగి వచ్చేదాకా ఇక్కడే హాయిగా కాలం పుచ్చవచ్చు.  ఏమీ దిగులు పడవలసిన పని లేదు.

అమ్మా! మణి మంత్రౌషధ శక్తుల చేత నీ భర్తను ఇక్కడకు రప్పిస్తా. అణిమాదులైన

అష్టసిద్ధుల్ని ప్రసాదిస్తా. నా మాట నమ్ము. ఇక్కడ నీకు ఆవంతైనా కొరత రానీయను. అణుమాత్రం కూడా నా విషయమై సందేహించకు"

అని మాయోపాయంతో కపట వినయాన్ని ప్రదర్శిస్తూ నారదుడు చెప్పాడు. ఆ మాటలకు మారు పలుకలేదు లలనామణి లీలావతి. వెంటనే దగ్గరదారి చూపుతూ ఆమెను తన వెంట పర్ణశాలకు తీసుకుపోయాడు.

ఆ నారదుడి ఆశ్రమం - ఆ పర్ణశాల లీలావతి కంటికి పెద్ద విలక్షణంగా కనిపించాయి. దీన్ని చూచేటప్పటికి ఆమెకు ఆశ్చర్యం వేసింది. అంతకు ముందామె ఎన్నో ఆశ్రమాలు - పర్ణకుటీరాలు చూచింది. కాని, యిది వాటికి భిన్నంగా విచిత్రంగా వుంది. దాన్ని చూచిన దగ్గర నుంచీ ఆమె సందేహపడజొచ్చింది.

మౌన ముద్ర దాల్చి, నారదముని వెంట మెల్లగా అడుగులు వేస్తూ పోతుంది. మనస్సులో కలవరపాటుకు గురైంది. గుండె దడదడ కొట్టుకొన్నంత పని అయింది. మిక్కిలి ధైర్యంతో - నిబ్బరంతో గడప దాటి లోపలికి వెళ్ళింది.

ఆ మునిపల్లిలో ఎక్కడ చూద్దామన్నా అగ్నిహోత్రం కనిపించదు. హోమ గుండాలన్నీ ఆరిపోయి వున్నాయి. పరికించి చూచినా ఎక్కడా యాగ ధేనువు కనిపింపదాయె; నీవారాన్ని బలియిచ్చే నిష్ఠాపరుడెవ్వడూ ఉన్నట్టు తోచలేదు. పొద్దు పొడవక ముందు నిద్రలేచే బ్రహ్మచారులే కరువయ్యారు. జపతపాలు చేసే శిష్యులు లేరు. పితృయజ్ఞం చేసేవాడు అసలే లేడు. నైమిత్తికాన్ని తీర్చే నైష్ఠికులు కూడా ఎవ్వరూ కానరారు. వేదపాఠం చెప్పు పండితులే శూన్యమయ్యారు. అతిథులూ - అభ్యాగతులూ వస్తున్న జాడలే పొడకట్టవు. నారచీరలు - జింక చర్మాలు లేవు. ఫెళ్ళున మండిపడే రావి పేళ్ళు కనబడవాయె? నిజంగా నారదాశ్రమం భలే విచిత్రంగా వుంది.

పాత వాసన లెక్కడా రావడం లేదు నారదముని కుటీరంలో. పైగా కొత్తదనం - కొత్త లక్షణం - కొత్తకాంతి కనిపించసాగాయి.

రాయంచలు వాసనల విరజిమ్మే బంగారు తామర తూండ్లను ఆరగిస్తున్నాయి; ఇంకోవంక మైనాగోరువంకలు కొత్త మామిడి లేచిగుళ్ళను సగం కొరికి మెసవుతున్నాయి; మరోవంక ఏ మాత్రం కంగారు పడకుండా చెంగల్వ మొక్కల్ని సగం కొరికి మేస్తున్న కన్నె లేళ్ళున్నాయి. ఆ వంక పండ్లార కొరకుతూ పళ్ళను తింటూ వున్న కొంటె కోణంగి పండు కోతి గుంపు వుంది. అక్కడక్కడా దట్టంగా ఏపుగా పెరిగి నీడనిచ్చే చెట్ల మీద పాకి పొదలు కట్టిన తీగెల సమూహాలున్నాయి; కొంత దూరాన చిగురాకు పందిళ్ళు పసందు గొల్పుతూ కానవస్తున్నాయి.

పుణ్యవతి - పుణ్యజన భర్త పుణ్యఫలం అయిన లీలావతి, పతివియోగ దుఃఖాగ్నిలో మరగిపోతూ కుమిలిపోతున్నది.

"పూర్వజన్మలో ఏ తక్కువ నోములు నోచి వుంటానో కాని, ఈ జన్మలో పరుల పంచ చేరి బ్రతుకవలసి వచ్చింది. అందులో, నిండుచూలాలనై యిట్లు పర పంచలలో తలదాచుకోవలసి రావటం నా పురాకృత కర్మఫలం గాక మరేమిటి?" అని మాటిమాటికీ ఉస్సురస్సురంటూ ప్రాలుమాలికతో వశం తప్పింది. నిబ్బరం తగ్గిపోయింది.

ఒకనాడు వనితారత్నమైన లీలావతి, పండువెన్నెల్లో పడుకొని పాలుపోక, నిండు చూలాలుగా వున్న సమయంలో తనకు సంభవించిన కష్టాలను తలచుకొంటూ, తన పూర్వ వైభవాన్ని తలచి, పొంగి - పొంగి పొరలి - పొరలి వస్తున్న దుఃఖాన్ని ఆపుకొంటూ లోలోపలే కుములుతూ వుంది,

'ఆనాడు - గీర్వాణి వచ్చి వాకిట్లో వేచి వుంది అని చెపితే, ఊ... కొట్టి పంపే హుందాతనం; ఇంద్రాణియైన శచీదేవి ఎందుకో కబురంపిందంటే "ఏం తొందరలే, పోదాం...!' అని కనుసైగతోనే త్రోచి పంపే జబర్దస్తీతనం; 'మారాణి చెలికత్తె యొకతె వొక మనవి తెచ్చింది. వినమంటే... వినీ విననట్టుగా వుండే ఠీవి; పార్వతి తనను ఒకసారి రమ్మన్నదని కబురు వస్తే, 'వస్తున్నాం. పోండి'- అని పలికే అధికార దర్పం - ఇవన్నీ ఇప్పుడేవి? వీటన్నిటినీ తలచుకొంటూ మనసులో కలత పడుతున్నది.

తనకు సంభవించిన కాల వైపరీత్యానికి కటకటపడుతోంది. దిక్కుమాలిన దైవం ఇట్టా ఆపద తెచ్చిపెట్టింద'ని కుములుతుంది.

'ఆహా! ఈ దుర్గతి తీరే సమయం ఎన్నడో...?' అని వాపోతుంది. 'ఇదేమి న్యాయమ'ని కునారిల్లుతుంది.

పాకపంచలో నివాసం, పురుడు పోయటానికి మునిపల్లెలో పుట్టిన ఏమీ తెలియని యెద్దె మషి మంత్రసాని. బిడ్డ పుట్టిన వెంటనే - ఉగ్గుపాలు పోసి, 'నాయనా! ఏడువబోకు' అని యేడుపు పోగొట్టి పూల తొట్టెలో వేసి స్నానం చేయించాలి. అడవి పల్లెలో పుట్టిన బిడ్డ యింతకంటె ఏ సుఖాన్ని పొందుతుంది?

జో... జో... అని జోలపాట పాడి, పొత్తిళ్ళలో పొదిగికొని, వినరాని పాటలు వినవలసివస్తుంది. దిక్కుమాలిన నాకు, ఇంతకంటె దారి లేకపోయె.

రత్నాలు పొదిగిన బంగారు శృంగార సౌధాలలో బంగారు తూగుటుయ్యాలలో ఊగవలసిన నా చిన్న తండ్రి, కడిమి చెట్లకు గట్టిన పూతీగె వుయ్యాలలో వూగవలసి వస్తుంది,

ద్రావిడ సార్వభౌముని వజ్రఖచిత సింహాసనంపై కూర్చుండవలసిన నా సొంపారు పెంపారు ముద్దుకూన, నేడు - అడవిలో - మునిపల్లెలో - బావురని యేడిస్తే ఆలించేవాళ్ళు ఒక్కరూ వుండరాయె"

అని చింతిస్తూ, తన యింటి వేలుపైన శివయ్యకు మొక్కులిడుతూ వుంది. తన

ఆలోచనలు చెదరి నాలుగు దిక్కులకు పాకిపోతున్నాయి. నిండు చూలాలు కాబట్టి ఆయాసపడుతూ దిగులు చెందుతుంది. కొంతసేపటికి ఆ గర్భవతి కన్నులు మూతలు పడసాగాయి.

ఇంతలో నారదుడు తన వీణయైన మహతిని ధరించి, తగిన సమయం వచ్చిందని యెంచి, మెల్లమెల్లగా అడుగులు వేస్తూ, అటూ - ఇటూ చుట్టుపక్కల పరిశీలిస్తూ, నవ్వుకొంటూ, తన మనస్సులో తానే యేదో నిశ్చయించుకొన్నాడు,

"గొప్ప వంశంలో జన్మించిన అభిమానవతియైన ఈమెకు ఒక్కసారి మతపు పిచ్చి తలకెక్కిస్తే, యిక అది తిరగదు. ఇదంతా భగవంతుని ఆజ్ఞ వల్లనే జరగాలి. ఈ పని చేయగలిగితే, ఇక ఆమె చేత ఎట్లాంటి పనినైనా చేయించవచ్చు. ఆమె మనసును తిప్పటం మానవుల వల్ల మాత్రం గాదు.

"కాబట్టి, యే వుపాయం చేతనైనా, సరే, ఈ మానవతిని మా వైపుకు తిప్పుకోవాలి. ఏదో మంచి మాటలు చెప్పి, ఇంకేదైనా చూపించి ఈ పని చేయక తప్పదు.

ఈమె వల్లనే ద్రావిడ కులానికి గొప్ప వుపద్రవాన్ని తెచ్చిపెట్టాలి" అని నారదుడు భావించాడు.

ఆశ్రమంలో లీలావతి విశ్రమించిన ప్రదేశానికి అతి దగ్గరలోనే ఆ పున్నమి రేయి, నారదుడు మనోహరంగా పాడటం ఆరంభించాడు. సన్నజాజి పొదరిండ్ల మీదుగా మందపవనం వీస్తున్నది. కిన్నెరసాని గొంతు లాగా, తన వీణను పలికిస్తూ ఆ ఆర్యముని సన్నటి గొంతుతో, మంజుల నాదంతో పాటలు వినిపించసాగాడు.

భర్త ఎడబాటు ఒక ప్రక్క బాధిస్తుంది. ఇంకో వంక శత్రువుల కొంపలో ప్రవాస జీవితం వేధిస్తుంది. ఏమీ తోచని అయోమయ పరిస్థితిలో, ఏమరుపాటులో వుండి, మానినీతిలకం లీలావతి నారదుడాలపిస్తున్న గానాన్ని వింటుంది. ఒక్క క్షణం విన్నదో లేదో అప్పుడే స్తంభించిపోయినట్లయి మతి చెడిపోయింది.

'అమ్మా! ఇదుగో భలే మంచి పాట పాడుతున్నా' అని చెప్పి అష్టాక్షరీ మంత్రాన్ని ఆలపించాడు.

'వనితామణీ ఇదుగో! మంచి కథ చెపుతున్నా' - అని మిక్కిలి ఇంపుసొంపు గలుగగా విష్ణువుకు సంబంధించిన వివిధ కథల్ని వినిపించాడు.

'సుదతీ! చూడు! ఎంతో మేలైన సుద్ది వినిపిస్తా -' అని మురిపెంతో ఆర్యరాజుల చరిత్రను వర్ణించి చెప్పేవాడు.

'మానినీ! ఈసారి విను; అద్భుతమైన సంగతులు చెపుతున్నా' అని వెనుకటి ద్రావిడుల ఆచారాలను తడిమేవాడు.

అప్పుడే కళ్ళు మూతలు పడుతున్న లీలావతి వీటిని రవ్వంతైనా విన్నదో, లేదో ?

కాని నారదుడు మాత్రం చిరునవ్వుతో గొంతు చినిగేట్టు ఉత్సాహంతో పాడుతూనే వున్నాడు.

స్త్రీరత్నమైన లీలావతి మాత్రం, నారదుడు చెపుతున్న విష్ణు కథల్ని 'ఇవి నాకు చెప్పవద్దు' అని అడ్డం చెప్పలేకపోయింది. దీన్ని కనిపెట్టిన నారదుడు వరుసపెట్టి విష్ణు కథలన్నిటిని చెప్పసాగాడు.

నారదుడి కథలు విని - విని ద్రవిడరాజు అర్ధాంగికి తెలియకుండానే విష్ణుభక్తి విప్పారనారంభించింది. చిట్టచివరకు తల్లి మారిపోతున్న కొద్దీ, గర్భంలో వున్న పిండం ఆలోచన కూడా మారిపోయింది.

మధురవాణియైన లీలావతికి నారదుడు చెప్పే బూటకపు కథలు నెత్తికెక్కాయి, క్రమక్రమంగా అంతకు ముందు ఆమెలో వున్న వ్యాకులపాటు గూడా లేకుండా మటుమాయమై పోయింది. ఏ మాత్రం కలత లేకుండా యిక అక్కడే వుండిపోయింది.

ఇట్లా వుండగా ఒకనాటి రాత్రి మంచి లక్షణాలు గల సుందరాకారుడైన కొడుకు జన్మించాడు.

ద్రవిడ రాజవంశ కీర్తిప్రతిష్ఠల్ని మంటగలిపే, ఆ మగబిడ్డకు ప్రహ్లాదుడనే పేరు కూడా పెట్టారు.

ముద్దులు మూటగట్టే ముగ్ధ మనోహర రూపంతో ప్రహ్లాదుడు పెరుగుతున్నాడు. నత్తినత్తిగా మాటలాడుతున్నాడు. బుడిబుడి నడకలతో తడబడుతూ నడుస్తున్నాడు.

చామనచాయ శరీర కాంతితో నవనవలాడుతున్న కొడుకును చూచి, తల్లి లీలావతి అమందానందాన్ని పొందుతున్నది. 'కొడుకా! ఇటురా!' అని పిలిచి బిగియార కౌగిట గుచ్చి పొదుగుతుంది.

నారదముని మాత్రం ఎంతో నమ్మకంతో, ప్రహ్లాదుని తల్లియైన లీలావతికి ఉపచార విధులు నిర్వర్తిస్తున్నాడు. తల్లికి గానీ, ఇతరులకు గానీ తెలియకుండా, ప్రహ్లాద కుమారుడికి విష్ణువు కథలూ, పాటలూ నేర్పసాగాడు. తననెవ్వరూ పసికట్టకుండా నారదుడు, నిత్యం ఈ పని చేస్తూనే వున్నాడు.

"ప్రహ్లాద కుమారా! అక్కడ మంచి మంచి మొల్లలున్నాయి, వాటిని తెచ్చి మాల గుచ్చవచ్చును గాని, అక్కడకుపోదాం - రా' అంటూ పొదలమాటుకు కొనిపోయేవాడు.

"కుమారా! అదుగో! ఆ చెట్లకు బాగా ఆరముగ్గిన పండ్లున్నాయి. తిందువుగాని. రా" అని చెట్ల చాటుకు తీసుకుపోయేవాడు,

"రాజతనయా! లేడిపిల్లల్ని పట్టుకుని ఆడిస్తావా? ఇవిగో అక్కడున్నాయి, వాటిని పట్టుకొనివద్దాం." అంటూ దూరదూరానికి తీసుకుపోయేవాడు.

"ఓరి నా ముద్దుతండ్రీ! రంగు రంగుల పిట్టలున్నాయి. వాటిని చూచి పొంగిపోదువుగాని, రా" అని కొమ్మల్ని బట్టి చూపించేవాడు.

ఇట్లా ఎన్నో వంకలతో ప్రహ్లాదుణ్ణి పిలిచి నారదుడు తంత్రాలు పన్నేవాడు. ఇట్లాంటి వాటిల్లో నారదుడందె వేసిన చేయి. మహా ఉద్దండుడు కూడా.

అడవిలో వున్నాడు కాబట్టే, నారదుడేం చేస్తున్నదీ, ఎవరికీ తెలియదు. అక్కడనే వున్న తల్లి లీలావతికి కళ్ళుకప్పి ఈ పని చేస్తూ వుండేవాడు ఆ దేవతల తపసి.

అప్పుడప్పుడూ తన దగ్గర వున్నప్పుడు ప్రహ్లాద కుమారుణ్ణి పిలిచి లీలావతి –

'నాయనా! మనం శివభక్తులం. శివలింగ ధారణ చేయవద్దా!' అని బతిమాలి చెప్పితే, తల్లికి ఏమీ సమాధానం చెప్పకుండా మూగమొద్దులాగా వుంటాడు.

"మన యిలవేల్పు శివుడికి మొక్కులు చెల్లించు తండ్రీ" అని బుజ్జగించి అడిగితే "ఊ ఊ" అని ప్రక్కకు వొదిగిపోయేవాడు.

"తనయా! మన దైవమైన శివదేవుడి మంత్రాన్ని చెప్పవా?" అని లాలించి ప్రేమతో అంటే – కావాలని పేరెత్తి విష్ణునామాలు పఠించేవాడు.

'పుత్రా! నీవు చాలా చెడిపోయావు. మన జాతికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నావు. నిన్ను శిక్షించేట్టు చేస్తా...' అని బెదరింపుగా అంటె – 'ఉత్తదేలే' అని చెప్పి వూరుకొంటాడు.

ఇట్లా, మొండితనాన్ని, పౌరుష్యాన్ని – కాపట్యాన్ని – ప్రహ్లాదుడు చూపిస్తున్నప్పటికీ, లేకలేక కలిగిన సంతానం కాబట్టి, తల్లియైన లీలావతి తనయుణ్ణి చూచి మొగం చిట్లించుకోదు, కనుబొమ్మ ముడిచి కోపగించుకోనైనా కోపగించుకోదు.

చివరకు తానే సర్దుకుపోయి 'భగవంతుడికి ఎన్ని పేరులుండవు. ఏ పేరుతో పిలిచినా, ఆ దేవుడు తప్పకుండా వింటాడు. పేరులో ఏముందిలే?' అనుకుని కొడుకును తిట్టకుండా, కొట్టకుండా సమ్మతించింది.

తల్లీ కొడుకుల పరిస్థితిని నారదుడు ఎప్పటికప్పుడు గమనిస్తూనే వున్నాడు. తాను కళ్ళారా చూస్తూనే వున్నాడు. తన కార్యం సఫలత చెందుతున్నందుకు, అంతులేని ఆనందాన్ని పొందుతూనే వున్నాడు.

'శత్రు కుటుంబంలో భయంకరమైన కలహాన్ని సృష్టించాను గదా' అని పొంగిపోవటం మొదలుపెట్టాడు.

ఇట్లా అయిదేళ్ళు గడిచాయి. బ్రహ్మ వల్ల వరాలు పొంది హిరణ్యకశిపుడు మనోవేగంతో తన పట్టణానికి వచ్చాడు. వచ్చీ రావటం తోటే జరిగిందంతా తెలుసుకొన్నాడు. భగ్గున మండిపోయాడు. కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి.

"మగతనం లేని యీ పంద నేను రాజధానిలో లేనప్పుడు వచ్చి, పతివ్రతా శిరోమణియైన నా అర్ధాంగిని, మందిరంలో దూరి తలపట్టి యీడుస్తాడా? ఏం చూచుకుని ఈ పనికి ఒడిగట్టాడు? దీన్ని పరికిస్తుంటే ... దైవ గతి కూడా ఆశ్చర్యంగానే వుంది.

కటకటా! ద్రవిడ రాజసింహం ఈ పరాభవాన్ని సహిస్తుందా? ఏది ఏమైనా ఆ

పిరికిపందను చెరబట్టి తీసుకువస్తా. ప్రతీకారం తీర్చుకొంటా. ద్రవిడ మగవాడు తనివితీరా చూచేట్టు, ఆర్యరాజైన యింద్రుణ్ణి పట్టి తీసుకురాకుండా విడువను"

అని అవమానంతో - రోషంతో - కుపితుడై, కాలితో నేలను ఘట్టించాడు.

తలపై పాగా ధరించాడు. చేత తళత్తళల బాకు గ్రహించాడు. సైన్యాన్ని నగరంలోనే వుంచాడు. కలకలం లేకుండా సద్దుమణిగించాడు. ఏదో కొద్దిమంది సాయుధుల్ని సహాయంగా తీసుకొని, వెంటనే వాయువేగంతో బయలుదేరి పోయాడు.

దారిలో నారదుడి ఆశ్రమాన్ని చూచి, మునీంద్రుడైన నారదుడిని చూచి నమస్కరించాడు. వేగంతో కుటీరంలోకి పోయి, భార్యను చూచి పెల్లుబికిన కుతుకంతో అనురాగ సముద్రంలో మునిగిపోయాడు. "ఇంద్రుడు మదగర్వంతో, అవకాశం కోసం వేచి వుండి, సమయం దొరగ్గానే ఏమీ అడ్డం లేకుండా అంతఃపురంలోకి పోయి, యింత అవమానం చేసి సాధ్విని చెరబట్టి తెచ్చాడు. నిజంగా ఆ దుర్మార్గుడు బ్రతకటానికి వీల్లేదు.

దేవీ! చూడు; రేపో మాపో స్వర్గాన్ని నాశనం చేస్తా. శత్రువులైన ఆర్యసైన్యాన్ని నుగ్గునుగ్గుగా చేస్తా. శత్రువుల బలం పెంపు చూస్తావుగా ఇంద్రుణ్ణి ఒక్క దెబ్బతో కాలికి బుద్ధి చెప్పేట్టు చేస్తా."

హిరణ్యకశిపుడిట్లా తన దేవేరియైన లీలావతికి జరిగిన అవమానానికి ప్రతీకారాన్ని తీర్చుకొనే విధం చెపుతున్నాడు - ఆ సమయంలో-

చిడిముడి పడుతూ - తప్పటడుగులు వేస్తూ - గొణుక్కుంటూ - మిడిసిపడుతూ ప్రహ్లాదుడు తల్లి వద్దకు వచ్చాడు.

వచ్చిన కొడుకును చూచి హిరణ్యకశిపుడు, ఆనందాశ్రువులు చిందుతుండగా పరవశుడై బాలకుణ్ణి గుచ్చి కౌగిలించుకొని, ఎత్తి ముద్దాడుతూ గడ్డాన్ని పుణికిపుచ్చుకొన్నాడు.

తడబడే నడక - బుడి బుడి మాటలు - మట్టిలో పొరలాడిన శరీరం చూచి ఆ ద్రావిడ నరపాలుడు మురిసిపోయాడు.

పుత్ర గాత్ర పరిష్వంగ సుఖ పారవశ్యంలో మునిగి లోకాన్ని మరచాడు. వెంటనే ఈ ప్రపంచంలోకి వచ్చి, తన యిల్లాలితో, కొడుకుతో ప్రయాణమై నగరానికి చేరుకొన్నాడు.

ఆర్యులు కావించిన పరాభవం మనసును కలచివేస్తుంది. ద్రవిడ భూపాలుడా స్థితిని భరించలేక వెంటనే జైత్రయాత్ర చాటించాడు. ప్రస్థాన భేరి వేయించి, అపరిమిత సైన్యంతో స్వర్గంపై దాడికి వెడలాడు.

స్వర్గ రాజధానిని చుట్టుముట్టి, సమతల ప్రదేశంలో ఒక చోట సైన్యానికి విడిది యేర్పాటు చేశాడు. కోటను ముట్టడించి, క్షణంలో స్వాధీనం చేసుకొన్నాడు, ఆర్యులంతా గుడ్లప్పగించి చూస్తూ వుండగా, శచీదేవి యెదుటనే యింద్రుణ్ణి చెరబట్టి దక్షిణా పథానికి తీసుకువచ్చాడు.

పట్టి తెచ్చిన యింద్రుణ్ణి వెట్టి పనిలో పెట్టాడు. తరువాత, ఆ పిరికిపంద మొత్తుకోళ్ళకూ, తన అర్థాంగి లీలావతి ప్రార్థనకూ మనసు కరిగి దయకలవాడై, యింద్రుణ్ణి విడిచి వచ్చాడు.

హిరణ్యకశిపుడు, కోపతాపాలు తగ్గగానే, ప్రశాంతచిత్తుడై, రాజ్యంలోని చిక్కుల్ని తొలగించి, పాలన చేస్తున్నాడు.

ఒకనాడు తన పుత్రుడి విషయం ఆలోచించి, అతణ్ణి విద్యాభ్యాసంతోటే సంస్కరించాలని నిశ్చయించుకొన్నాడు. అదే మంచి మార్గమని భావించాడు.

అయితే, బాలుడు కాబట్టి ఈ వయస్సులో నీతిశాస్త్రం చెప్పించాలంటే, అది పూర్తిగా బోధపడదు. ప్రౌఢమైన రాజ్య మంత్రాంగం తెలుసుకునే వీలు కూడా లేదు. అట్లని రాజతనయుడు చదువుకోకుండా వుండకూడదు. కాబట్టి కులగురువులైన చండామార్కుల వద్ద, యీతణ్ణి చదివించాలని హిరణ్యకశిపుడు నిర్ణయించాడు.

ఇప్పటికే పదిహేనేళ్ళు గడిచాయి. అయినా, వాళ్ళతో - వీళ్ళతో తిరిగి, నాతో పనికిమాలిన వాగ్వివాదాలు చేస్తున్నాడు. రాత్రింబవళ్ళు ఆటల రంధిలో పడి తిరుగుతున్నాడు. వీడిని ఆవరించిన ఆ మనోజాడ్యం చదివిస్తే గాని, పోదు. అందుకని సకల శాస్త్రాలూ, ఆ గురువు వద్దనే చదివిస్తా'- అని విచారించి, సకల నీతిశాస్త్ర పారంగతులూ - కుల గురువులు అయిన శుక్రాచార్యనందనులైన చండామార్కులను రావించాడు. పిలిపించిన కార్యం సమస్తం వివరించి, వాళ్ళకు బాలకుణ్ణి అప్పగించాడు.

"ఎట్లాగైనా సరే, ఇతణ్ణి మంచి పండితుడిగా తీర్చి దిద్ది తీసుకరండ"ని ఆజ్ఞగా చెప్పాడు.

తమ రాజు ఆజ్ఞ ప్రకారం విద్యాబుద్ధులు నేర్పటానికి చండామార్కులు ప్రహ్లాదుణ్ణి తీసుకుపోయారు. కాని, మూడేళ్ళు కడచాయో లేదో తిరిగి ప్రహ్లాదుణ్ణి హిరణ్యకశిపు ధరణీకాంతుడి దగ్గరకే తీసుకువచ్చారు. వచ్చి, నరపాలు ముందట రాజపుత్రుణ్ణి పెట్టి తాము చేతులు కట్టుకొని నిల్చున్నారు.

ఇంత తొందరలోనే - తన కొడుకు విద్యా పరిపూర్ణుడయ్యాడని ద్రవిడ మహీకాంతుడు సంబరపడ్డాడు. అంతలో రాజును జూచి చండామార్కులు -

"మహారాజా! ఈతడెట్లాంటి పిల్లవాడో తెలియరావటం లేదు. ఇతణ్ణి శిక్షించటం, విద్యాబుద్ధులు నేర్పటం మా వల్ల గాదు.. ఇతనికి గురుభక్తి లేదు. ఏం చెప్పినా లెక్క లేదు.

తా చెడ్డ కోతి వనమెల్లా చెరచిందన్నట్టు, ఈతడు చెడటమే గాక, ఇతరుల్ని కూడా నాశనం చేస్తున్నాడు. అందరినీ తప్పుదారి పట్టిస్తున్నాడు.

ద్రవిడ భూపాలా! రాకుమారుణ్ణి గురించి మీకేం చెప్పేది? మన కులదైవమైన

శివమూర్తిని నానా రకాలుగా తూలనాడుతున్నాడు. శివుణ్ణి గూర్చి ఏం చెప్పినా, ఏ కథ వినిపించినా, అన్నిటినీ పెడచెవిన పెడుతున్నాడు. మీరే జాగ్రత్తగా ఎట్లాగైనా ప్రహ్లాద కుమారురుణ్ణి దారికి తెచ్చుకోవాలి.

ఏం చెపితేనేం? ఎంత చెప్పితేనేం? కనీసం ఇంత కూడా ఆ తల వూపడు. మారు మాటాడకుండా తన పనేదో తాను పట్టుదలతో చేసుకుపోతూ వుంటాడు.

ధరణీ ధరేంద్రా! ఇదేం పాపమో? మన ద్రవిడ వంశంలో ఇంతవరకెన్నడూ ఇట్లాంటి పిల్లల్ని చూడలేదు. మూగవాడికి చదువు చెప్పినట్టుగా వుందేగాని, ఫలితం శూన్యం - మా గోడు అరణ్యరోదనంగా మిగిలిపోయింది.

శతవిధాల ప్రయత్నం చేసి, వివిధ మార్గాల ఇతణ్ణి చదివించాలని ప్రయత్నించాం. కాని దాని వల్ల ప్రయోజనం కనబడలేదు. ఒకవేళ ఏదైనా చదివినా, దాని అర్థం తెలుసుకోవటానికి వీసమంతైనా శ్రద్ధ చూపడు. రాకుమారుణ్ణి చదివించటం మా వల్ల గాదు మహారాజా?

చిరకాలం నుంచి సంపాదించిన అనుభవాన్ని ముందు పెట్టుకొని విద్యాబోధన చేయసాగాం. మా శక్తి యుక్తులన్నిటినీ ధారపోశాం. ఎన్నిచేసినా, ఏమీ తెలియని అజ్ఞానంలో వున్నట్టే వుంటాడు. చెప్పింది చెవికెక్కించుకోడు. ఇక ఈ బాలుణ్ణి సాకటం మా తరం గాదు.

దక్షిణ దేశాధీశా! ఈ బాలకుడు ద్రవిడ రాజవంశానికే గాదు, జాతి మొత్తానికి గుండెలపై నిప్పుల కుంపటిలా వున్నాడు. ఇంత వరకు ఏ మచ్చలేని నిష్కళంక రాజవంశానికి వేపవిత్తులాంటివాడు. ఇప్పుడే జాగ్రత్తగా చూచి ఈతణ్ణి దిద్దుకొనే భారం మీదే. అందులో ఈ బాలుడు తొలికాన్పు బిడ్డడు గదా!

ద్రవిడ రాజవంశీకుల ఉప్పు పప్పు తిన్నందుకు కృతజ్ఞులంగా నైనా రాకుమారుణ్ణి తీర్చిదిద్దుదామని చాలవరకు పోరుకు లాడాం. అయినా, మా శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరయింది. చేసేది లేకనే, తిరిగి మీ కప్పగించవలసి వస్తుంది. ఎట్లా సరిదిద్దుతారో మీరే చేయాలి.

పవిత్రమైన ద్రావిడ వంశ పరువూ -ప్రతిష్ఠలూ మట్టి పాలవకుండా వుండాలి. లోకాన్ని గూడా ఒక కంట కనిపెట్టి, ఏ రకంగా నైనా యితన్ని శిక్షించటం అవసరం. ఇది మీ ధర్మం కూడా!" అని హితవు చెప్పి చండామార్కులు హిరణ్యకశిపుడి దగ్గర సెలవు తీసుకొని వెళ్ళారు.

కుల గురువుల మాటలు చెవులకు సోకి, కుమారుని ప్రవృత్తి తెలిసికొని ధరణీధవుడు దిగులుతో తలమునకలై తలపట్టుకొన్నాడు.

హిరణ్యకశిపుడు పుత్రుడైన ప్రహ్లాదుణ్ణి దగ్గరకు తీసి - నయం - భయం - ప్రదర్శిస్తూ

మెల్లమెల్లగా బోధించసాగాడు. కాని, తండ్రి చెపుతున్న కొద్దీ, రాకుమారుడిలో మాత్సర్యం పెరుగుతుందే గాని, పూర్వపు నడవడికను ఏ మాత్రం మానదయ్యె; తండ్రి మాటను ఏ మాత్రం చెవి దూరనీయడం లేదు.

కడుపున పుట్టిన సంతానం ఒక్కడే - అని మురిసిపోతున్న సమయంలో, తన జాతికి భిన్నమైన ప్రవర్తన కొడుకులో జూచిన రాజు మనస్సు చివుక్కుమంటుంది. ఎంత నచ్చచెప్పటానికి ప్రయత్నించినా, దానికి వ్యతిరేకంగా జరుగుతూ వుంటే, ద్రవిడ రాజకంఠీరవుడికి మనస్సు తరుక్కుపోతోంది.

ఒక వంక పుత్రుడి మీద వాత్సల్యం - ఇంకో వంక కుమారుడి జాతి విరుద్ధ ప్రవర్తన -

చివరకు హిరణ్యకశిపుడు కూడా గుండె రాయి చేసుకొన్నాడు. మొండిగా తయారయ్యాడు. "ఇతడు దండన వల్లనే దారికి వస్తాడు. ఇక రెండో మార్గం లేదు' అని తేల్చుకొన్నాడు.

వాదనలతో పని లేదని తలచిన హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి శిక్షించటానికి దండోపాయాన్ని నిర్దయగా అమలుపరచాడు. పుత్ర వాత్సల్యాన్ని కూడా దిగమింగి, జాతి శ్రేయస్సు ధ్యేయంగా భావించిన స్వార్థత్యాగికి, అంతకంటె వేరే గత్యంతరం కనిపించలేదు.

బాలుడి పట్ల నిష్ఠూరంగా తండ్రి ప్రవర్తించడం ఇంటిలో వ్యతిరేకత బయలుదేరి కుటుంబంలో రెండువర్గాలుగా ఏర్పడి కలతలు బయలుదేరాయి. రాజకుటుంబంలో చిచ్చు రేగిన దుర్వార్త రాజధాని నగరంలో కమ్మింది. ప్రజలంతా అట్టుడికినట్లు కుతకుతలాడిపోయారు.

ఈ సంగతి విరోధులైన ఆర్యులకు తెలిసింది. 'ఇదే మంచి సమయమని భావించసాగారు. రాజనీతి తెలిసిన ఆర్యుల పెద్దల్ని పిలిపించారు. అంతా ఒక్కచోట గుమికూడి కర్తవ్యం ఆలోచించసాగారు. "దైవర్ష చేత ద్రావిడ రాజవంశంలో కలతలు రేపగలిగాం. ఇంకా దాన్ని, పెంచి పోషించి, విస్తరింపచేయవలసిన అవసరం వుంది. దీనికి తగిన వ్యక్తిని చూచి కార్యక్రమాన్ని పురమాయించాలి" అని అంతా ఏకగ్రీవంగా నారదుడి వంక చూచారు.

కార్యభారం నారదుడి మీదే మోపాలని నిశ్చయించారు. అతడందుకు అంగీకరించాడు.

ఇంద్రుడిచే చెరబట్టబడి, తీసుకుపోబడుతున్న లీలావతిని మార్గమధ్యంలో అడ్డగించి, తన ఆశ్రమంలో ఆశ్రయమిచ్చి కాపాడి తగిన సేవలు చేసి అమెను సంతోషపెట్టాడు. అందుకు, ఆ మానవతికి నారదుడిపై దయవుంది. ఆ స్నేహాన్ని పురస్కరించుకుని నారదుడు, తనపై పెట్టిన ఆర్యజాతి కార్యాన్ని నిర్వర్తించటానికి పూనుకున్నాడు.

ఒకనాడు నారదుడు తెచ్చుకొన్న కపట ప్రేమను ఒలకబోస్తూ రాజకుమారుడిని చూడడం కోసం వచ్చాడు. అందరూ వింటుండగా ఏవో నాలుగు పనికివచ్చే మాటలు చెప్పినట్టు చెప్పి, బాలకుణ్ణి ప్రక్కకు తీసుకుపోయి, తండ్రిపైనే లేనిపోని కొండేలు కోకొల్లలుగా చెప్పాడు. మిక్కిలి మెత్తని మాటలతో ప్రహ్లాదుడ్ని లోబరచుకోవటానికి పన్నాగం పన్నాడు.

'భూపాల కుమారా! మీ నాన్న బలగర్వంతో సాధువులైన ఆర్యులనందరినీ 'నేనే రాజును. నాకు సాటి యెవరు' అన్నట్టుగా గర్వించి యిబ్బందుల పాలు చేస్తున్నాడు. ఈ రకంగా కన్నూ-మిన్నూ గానకుండా, పద్ధతి తప్పి దేవతలందరినీ పీడిస్తూ వుంటే, చూచి వూరుకోవటం నీకు న్యాయమా! ఇది రాజనీతి అవుతుందా? ఇంతకు ముందు రాజులు లేరా? రాజ్యాన్ని పాలించలేదా? ఇంత అరాచకం - ఎప్పుడైనా, ఎవరైనా చేశారా?

యాగం చేస్తే, ముక్తి వస్తుందనే విశ్వాసంతో, ఆగమం తెలిసిన వాళ్ళంతా ఎంతో శ్రద్ధతో యాగం చేస్తుంటే...

'యాగం మోక్షాన్నిస్తుందా? ఇది నిజమా?'

అని యెగతాళి చేస్తూ మీ నాయన, యాగాలను జరక్కుండా పాడుచేస్తున్నాడు. ఎంతో ప్రయాస పడి చేస్తున్న యజ్ఞకార్యాన్ని భగ్నం చేయటం రాజయిన వాడికి తగదు. ఈ ఆగం చేయటం- ఆగడాలు చేయటం సహించదగ్గవి కావు.

కుమారా! - 'నేను పిల్లవాడిని గదా! ఏం చేస్తాను -' అని అనబోతావేమో?- బాలుడైనంత మాత్రాన ధర్మమార్గం వదలరాదు. ధర్మపీడన సహించరాదు. నిజంగా బాలుడైనవాడు ధర్మ మార్గావలంబుడై ధర్మాన్ని నిలిపితే, దైవం ఎంతో సంతోషిస్తాడు. నీవు ఒంటరివాడవనుకోకు, నీ వెంట వేనకు వేలు పెద్దలున్నారు. వాళ్ళంతా నీవు చేసే ధర్మకార్యానికి, నడుం కట్టుకొని అండగా నిలబడతారు.

నీ తండ్రి, తర్క వితర్కాలు విడిచి, మంత్ర - పురోహిత దండనాధులతో మంతనాలు జరిపి, వాళ్ల సంపర్కంతో కఠినమైన వైఖరి నవలంబిస్తున్నాడు, దీనివల్ల ప్రజలెన్ని బాధలనుభవిస్తున్నారో నీకేం చెప్పేది? ఈ రకమైన వక్రమార్గం విడిచిపెట్టి పదిమందికీ శుభం కలిగే మార్గంలో సంచరించటం ఎవరికైనా మంచిది.

అంతేగాక; ఇంకో సంగతి విను.

దేవ రహస్యం ఒకటి వుంది, దాన్ని చెబుతా విను.

ఒకనాడు నాకు కలలో స్వర్గలోక రక్షకుడూ - వేద వేదాంగాలకూ తెలియబడని వాడైన, పరమాత్మ కనిపించాడు. కనిపించి - 'నా భక్తుణ్ణి, పవిత్రమైన వాణ్ణి, ఎవడో ఒక దుర్మార్గుడు నానా రకాల ఇబ్బందుల పాలు చేస్తున్నాడట; కర్ణాకర్ణిగ తెలుస్తుంది. ఇంతకాలం ఎట్లాగో వూరుకొన్నా, ఇక ఎంత మాత్రం సహించదలచుకోలేదు.

లోకకంటకుడైన ఆ రాజు, నా భక్తుణ్ణి హింసించినపుడే, నేను ఆ సభా మండపంలోని ఒక స్తంభంలో దాగి వుండి, అతణ్ణి అంటుకోగానే, వాడి ప్రాణాలు తీస్తా - నా భక్తుణ్ణి ఒంటరివాణ్ణి చేసి, నేను చూస్తూ వుంటానా...! ' అని చెప్పాడు.

'కత్తులు నూరినంత మాత్రాన ధీరులైన వాళ్ళెవరూ కించిత్తు గూడా కంపించరు. అధర్మం పొరపాటున గూడా చేయరు. అంతా నీకు చెప్పా. పైగా భగవంతుడి యిష్టమేదో గూడా వివరించా. ఆ పైన నీ యిష్టం. ధర్మాన్ని రక్షించటమనేది శిష్టుల కిష్టమైన కార్యం గదా!

రక్షించే నాధుడు లేక, నీ రాజ్యంలోని ప్రజలంతా దినం ఒక సంవత్సరంగా గడుపుతున్నారు. బాధలన్నిటినీ ఎట్లాగో భరిస్తున్నారు. బాధితులైన ప్రజల పక్షం వహించి పోరాడితే నీకు తరగని సిరిసంపద లభిస్తాయి. శాశ్వతమైన కీర్తి దక్కుతుంది. దైవం కూడా మెచ్చుకొంటాడు.

అపూర్వమైన తన రాజనీతిని ప్రదర్శించి నారదుడు, అలౌకికుడైన ప్రహ్లాదుడికి బోధించవలసిందంతా బోధించాడు.

ప్రహ్లాదుడితో 'సరే' అని అనిపించుకొని నారదుడు అక్కడ నుండి బయలుదేరి సరాసరి విశ్వకర్మ మందిరానికి వెళ్ళాడు. ఒంటిరిగానే విశ్వకర్మతో మంతనాలాడి, మంచి నైపుణ్యం గల శిల్పుల్ని పెక్కు మందిని కూర్చి, వాళ్ళకు చెప్పవలసిన రహస్యం చెప్పాడు.

శిల్పులు ఎవరికీ తెలియకుండా, ఎంతో మెలకువతో - నేర్పుతో హిరణ్యకశిపుడి సభాస్థలం ప్రవేశించి, సందేహం ఏమాత్రం రానీయకుండా నారదుడి పంతం నెగ్గేట్టు ఒక యినుప స్థంభాన్ని నిర్మించారు.

దాని చుట్టూ తలుపులుంటాయి. లోపల బోలుగా వుంటుంది. విశ్వకర్మ శిష్యులు కాబట్టి, తమ కాల్పనికతా విశిష్టత వెలుగొందేటట్టు నిర్మించారు.

ఆ తరువాత బాగా ఆకలిగా వున్న సింహాన్ని ఒకదాన్ని నేర్పుతో పట్టి తెచ్చి, రహస్యంగా ఆ స్తంభంలో పెట్టి, తామే కాపలా కాస్తున్నారు ఆర్య మాంత్రికులు. ఏమౌతుందోనని వేచి చూస్తున్నారు.

మరుసటి రోజు హిరణ్యకశిపుడు కోపంతో మండిపోతూ సింహాసనంపై కూర్చుండి సభా మండపంలో, ప్రహ్లాదుణ్ణి పిలిచి, గద్దిస్తూ, 'ఏరా బాబూ! విష్ణువు - విష్ణువు అని ఎప్పుడూ నోరు మూత పడకుండా చెపుతూ వుంటావు, ఎక్కడ ఆ విష్ణువు? ఎక్కడ దాక్కొని వుంటాడు? చూపిస్తావా?' అని అన్నాడు.

ప్రహ్లాదుడు చిరునవ్వు నవ్వుతూ నిర్భయంగా - 'తండ్రీ! ఇదుగో ఆ విష్ణువు ఈ సభా మండపంలో వున్నాడు. చూడాలని కోరుకుంటే, తప్పకుండా చూడండి' - అని సమాధానం చెప్పాడు.

దానికి ద్రావిడ సార్వభౌముడు మండిపడి తోకతొక్కిన మహానాగంలాగా రోజుతూ గదను తీసుకుని, గిరగిర తిప్పుతూ ఆసనం నుంచి దూకి, ఆర్యులు చేసిన మోసాన్ని గ్రహించలేక ప్రహ్లాదుడు చూపిన స్తంభానికెదురుగా పోయాడు.

భూమ్యాకాశాలు దద్దరిల్లేలా సింహనాదం చేసి, స్తంభం దగ్గరకు పోయి, చేతిలోని ఉక్కు గదాదండంతో దిక్కులదిరిపోయేలా ఫెళ్ళుమని స్తంభం నేలకూలేట్టు చేతి సత్తువ కొద్దీ బలంగా కొట్టాడు.

కొట్టిన వెంటనే మర తలుపుల్ని పదదోచుకొని, భయంకరంగా గర్జిస్తూ సింహం బయటకు వచ్చి హఠాత్తుగా ద్రావిడ ధరణీంద్రుడి పైబడి తన పంజాతో, కోరలతో గీరి గాయపరిచింది.

అనుకోకుండా జరిగిన ఈ ఘటన, హిరణ్యకశిపుడు ముందు జాగ్రత్తపడే అవకాశాన్ని ఈయలేదు.

అసలే ఆకలితో నకనకలాడుతున్న సింహం బాగా చెలరేగి, చీల్చి దక్షిణ దేశాధీశుని ప్రాణాలను బలిగొన్నది.

ఆకస్మికంగా జరిగిన ఈ దుర్ఘటన ద్రవిడ రాజభట వర్గానికి దిగ్భ్రమ కలిగించింది. అక్కడే వున్న పోటుమగడు, కొండల్ని సైతం పిండి పిండి చేయగల శూరుడు కుంభాండుడు. తళతళ మెరిసే కత్తి తీసుకుని ఒక్క వేటుతో ఆ సింహాన్ని యమ పట్టణానికి పంపాడు.

ఏం జరుగుతుందో చూద్దామని పొంచి వున్న పిరికిపందలు, ఆర్య మంత్రాంగవేత్తలు కుంభాండుడి చర్య చూచి భయపడి తత్తరపాటుతో సందు గొందుల్లో దూరారు. ప్రాణాలను కాపాడుకొన్నారు.

నారదుడు మాత్రం తాననుకొన్న పని సాధించానని సంబరపడి పుప్పొంగిపోయాడు, ఏనుగునెక్కినంత సంతోషపడి, చేతిలోని తాళాలు మెరుస్తూ వుండగా నృత్యం చేశాడు.

అన్నదమ్ములైన హిరణ్యాక్ష - హిరణ్యకశిపులిద్దరూ, వొకళ్ళు పంది వల్లా, ఇంకొకళ్ళు సింహం వల్లా ఆర్యుల కపటోపాయానికి చిక్కి మరణించారు. తమ ఘనకార్యాలకు లోలోన మురిసిపోయి, ఆర్యజన సంఘం 'ఇక తమకు ఎదురులేదనీ, దేశమంతా తమ ఆజ్ఞ చెల్లుతుందనీ' ఆనందించసాగారు.

ఆర్యుల ఈ తొందరపాటు - ఉత్సాహం చూచిన నారదుడు కలవరపడ్డాడు. తొందరపడితే, మరల మొదటికే వస్తుందని గ్రహించాడు. తన వాళ్ళనందరినీ చేరదీసి - 'ఆర్య సోదరులారా' మీ తొందరపాటు ప్రమాదాన్ని కొనితెస్తుంది. ద్రావిడ జాతి నిర్వీర్యమయిందని అపోహ పడుతున్నారు. ఇప్పటి సంఘటన తెలుసుకొన్న ద్రావిడ వీరులు, దెబ్బతిన్న త్రాచుల్లా చెలరేగుతారు. ప్రాణాలపై ఆశ వదలి తెగించి పోరు చేస్తారు. రణరంగమంతా పీనుగు పెంటలైనా వెనుదీయకుండా రాజ్యరక్షణ కోసం

నడుములు బిగిస్తారు. అందుకని, ప్రమత్తంగా వుండకూడదు.

ఇప్పుడే మనమీ గద్దపై రాజ్యస్థాపన చేయాలని వెంపరలాడవద్దు. ప్రస్తుతం మీరు చేయబోయే పని రాచకార్య విరుద్ధమయింది. ప్రాణహానిని కలిగిస్తుంది. కాబట్టి, దూరాలోచన లేకుండా ప్రవర్తించడం మంచిది గాదు" అని చెప్పి ఒప్పించాడు.

ఇంకా కొంతసేపు ఆలోచించి, ముందు చేయవలసిన కర్తవ్యాన్ని కూడా తనవారికి బోధించాడు.

"సోదరులారా! పరిస్థితిని బట్టి మసలుకోవడం అవసరం. మనకు కీలుబొమ్మలా వుండే ద్రావిడజాతివాణ్ణి ఈ గద్దెపై కూర్చుండపెట్టడం ఆదిమేలుగా వుంటుంది. అనంతమైన ఈ ధాత్రిని అతడిపేర మనమే పాలించవచ్చు.

పితృహంతకుడు - జాతిద్రోహి - వంశభ్రష్టుడు - అయిన ప్రహ్లాదుణ్ణే ఆర్యులు సంతోషపడుతూ సింహాసనంపై కూర్చుండబెట్టారు. ఈ విషయం తెలిసి, ద్రావిడులంతా నిర్విణ్ణులయ్యారు. భయభ్రాంతులై ఏమీ చేయలేక దిగ్భ్రాంతి చెందారు.

కొత్త మతాన్ని స్వీకరించిన ఆవేశంలో మతిచెడి, కులాన్ని చెరిచి, ఏ మాత్రం పాపభీతి లేకుండా తల్లీ కొడుకులొక్కటై వంశక్షయాన్ని గావించారు.

# రామాయణం

ప్రహ్లాద కథ విన్న తరువాత కొంత బరువు తగ్గింది. ఎన్నో సత్యాలు దాగివున్నాయని గ్రహించా. కొంతసేపు వూరుకొని వుండి, అంతలోనే రామాయణ కథ గుర్తుకురాగా, ఆ రాముని రహస్యాలను గూడా తెలుసుకోవాలనిపించింది. సూత మహాముని కూడా మంచి వుత్సాహంగా కనిపించాడు.

'మహాత్మా! రామాయణ కథలో మీకు తెలియని వింతలు, విశేషాలు ఏమీ వుండవు గదా! కాబట్టి, అందులో వున్న విచిత్రాలు - నిజాలు వినిపించ గోరుతా.

అంతేగాకుండా, రామాయణాన్ని వాల్మీకి గదా రాశాడని అంటారు. అందులో శత్రువుల పేర్లు మార్చాడనీ, తలలు కూడా మార్చాదని, అంతా తల్లక్రిందులు చేశాడని వాల్మీకిని గురించి అంటారు.

అసలు రాముడు పుట్టకముందే రామాయణం రాశాడనీ అంటారు. ఇది నిజమా? నిజంగా రాముడు పుట్టకముందే జరగబోయే దాన్ని ఆ కవి యెట్లా చెప్పాడు? ఇందులో వుండే నిజానిజాలు మీకు తెలుసు కాబట్టి, తప్పకుండా నాకా కథ సమగ్రంగా చెప్పగోరుతా"

నేనిట్లా అడిగేటప్పటికి సూత మహామునికి ఎక్కడ లేని సంతోషం కలిగింది. ఇక మునుపటి గాథలన్నిటినీ ఒకసారి గుర్తుకు తెచ్చుకోవలసి వచ్చింది. ఎంతో ప్రేమతో,

ఉబలాటంతో నన్ను చూచాడు,

"బిడ్డా! నీవు వేసిన ప్రశ్న చాలా దొడ్డది. రామాయణాన్ని గురించి నాకు తెలిసిన మంచివీ - చెడ్డవీ అయిన గడ్డు సంగతులు కూడా చాలా వున్నాయి. అవన్నీ నీకు చెపుతా. విని మంచి చెడ్డల్ని నీవే తెలుసుకో.

వాల్మీకి కవి కావాలనే చాలా వాటికి పేర్లు మార్చాడు. ఆ పేర్లన్నిటికి చాలా చెడ్డ అర్థాలు వచ్చేట్టు కూడా చేశాడు. ఇంకొన్ని పేర్లు అపార్థం వచ్చేట్టు మార్చాడు. ఇట్లా పేర్లు మార్చటం వల్ల ఆర్యులు, తమ శత్రువులైన ద్రావిడ రాజు కీర్తిప్రతిష్ఠలు దెబ్బతింటాయని ఆ కవి భావించాడు. అతడే - చివరికి - ఆదికవి - అనే పేరు కూడా సంపాదించుకున్నాడు.

దసగీవ అనే శబ్దాన్ని - దశగ్రీవ - అనే సంస్కృత పదం లాగే మార్చి, దీనికి పది తలలు వున్నవాడు అని అర్థం చెప్పాడు. రావన్న - అనే పేరుండేదాన్ని రావణ - అని మార్చి - బొబ్బ పెట్టేవాడు - చుప్పనాక - అనే పదాన్ని శూర్పణఖ - అని సంస్కృత నామంగా మార్చి, చేటంత గోళ్ళు కలది - అని అపార్థం వచ్చేట్టు రాశాడు. రక్కసి - అనే మాటను - రక్షస్సు - అని మార్చి, దానికి ఒక అర్థం కాక - రకరకాల అర్థాలు వచ్చేట్టు చేశాడు.

వీటిని బట్టి చూస్తే వాల్మీకి సామాన్యుడైన కవి గాదు; చాలా కుతంత్రం వున్న వాడని తేలికగా గ్రహించవచ్చు. పేర్లు మార్చటంలాంటి విషయాలు ముందు ముందు వివరంగా చెపుతా. ప్రస్తుతం రామాయణానికి సంబంధించిన విశేషాలు మాత్రం చెపుతా.

# లంకా నగర వర్ణన

ద్రావిడ దేశం పైరు పచ్చలతో కలకల లాడుతూ వుంటుంది. సిరిసంపదల కాటపట్టు. ఆ దేశంలో మూడు కాలాల్లోనూ వృక్షాలు బాగా పుష్పించి, సువాసనలను విరజిమ్ముతాయి. ఆ కాలం - ఈ కాలం అనకుండా అన్ని కాలాల్లోనూ భూరుహాలు పండ్లతో బరువెక్కి విరగకాస్తాయి. మేడలు, మిద్దెలు కట్టుకోవటానికి కావలసిన వుత్తమమైన కలపనిచ్చే మద్దిచెట్లు తామర తంపరగా వున్నాయి. వివిధ సాధు జంతువులకు - నానారకాల రంగురంగు పక్షులకు ఆలవాలంగా విలసిల్లుతూ ఏపుగా పెరిగిన దట్టమైన చీకటినిచ్చే నిడువైన తరువులు, ఎక్కడ చూచినా వింత వింత తీగలు అల్లిబిల్లిగా అల్లుకొని పొదరిళ్ళకు అమర్చిన భూరుహ సంతానంతో ముచ్చట గొలిపే అటవీ ప్రాంతంతో కళ్ళకు పండుగగా వుంటుంది.

ఆ వనంలో వుండే ఏనుగులు ఓదములను కూడా లెక్క చేయకుండా మదించి గుంపులు గుంపులుగా తిరుగుతూ కావలసిన గడ్డీ గాదం యిష్టం వచ్చినట్లు తింటూ

వుంటాయి. పసరు గక్కే పచ్చని ఆకు కొమ్మల్ని, తొండాలతో పట్టుకొని పెళపెళ విరుస్తూ, ఎదురులేని రీతిలో ఘీంకారాలు చేస్తూ స్వేచ్ఛా విహారం చేస్తూ వుంటాయి.

పిడికెడు విత్తనాలు చల్లితే చాలు, ప్రజల ఆకటి మంటను చల్లార్చటానికి కావలసినంత పైరు పంటలు మూడు కాలాల్లోనూ సమృద్ధిగా పండుతాయి. ఆ నేల సారాన్ని లెక్కకట్టటం ఎవరి తరమూ కాదు, ఎంతో కమ్మని పంటలు పండే సారవంతమైన భూమి అది. ఈ దక్షిణదేశం లాంటి దేశం పుడమిలో లేనేలేదు.

అది లంకానగరం. పండితుల కునికిపట్టు, పవిత్రమైన నదీ నదాలు ప్రవహించే కీర్తి గాంచింది. మధుర ఫలాలతో నిండి, సుగంధాన్ని వెదజల్లే పూల గుత్తులతో బరువైన చెట్లు గలిగి, దివ్యమై, భవ్యమై మనోరంజకంగా వుంటుంది. నిజంగా ఈ దక్షిణ దేశం పరమ పవిత్రమైన చరిత్రగలది. ఇట్లాంటి దేశానికి, ఇంకా దక్షిణం వైపు సముద్రం వుంది.

ఆ ప్రాంత ప్రజలు కొబ్బరి తోటల్లో కాపురాలుంటారు. వాళ్ళేనాడూ విరోధాలు కొనితెచ్చుకోరు. పరాయివాళ్ళ అధికారం అనేది వాళ్ళకు తెలియదు. స్వేచ్ఛాజీవులు.

అరవం - తెలుగు- కన్నడం- మళయాళం - చెంచు ఎరుకల- గోండు మొదలైన భాషలకు మూలమైన అసలు భాషనే వాళ్ళు మాట్లాడుతారు. అవినీతి అనేది వాళ్ళకు తెలియదు. తమ మాన ప్రాణాలకు ముప్పు వాటిల్లేట్టయితే, ప్రాణాలర్పించైనా సరే, కాపాడుకొంటారు. అంతటి మానధనులన్నమాట.

శత్రువులెవరైనా తెలియకుండా తమ నేలలో అడుగుపెడితే సహించరు. అంతా ఒక్కుమ్మడిగా, - 'కో' అని అర్చి, తళుకులీనే కొత్త కత్తులను ఒరల నుండి దూసి, శత్రు కంఠాలను కసుక్కున నరికేస్తారు. మానరక్షణ కోసం ఏ పని చేయటానికైనా, ఎంతటివాణ్ణి ఎదిరించటానికైనా కొంకరు, జంకరు.

మరీ ముఖ్యంగా కోయలు, చెంచులు మాతృభూమి పట్ల చూపే అనురాగం కొలతలకందనిది.

ఈ దక్షిణ రాజ్యం ఒడిలో లంకారాజ్యం వుంది. అది శివభక్తుల నిలయం. నిష్కళంకమైనది, శంకా రాహిత్యమైనది. అట్లాంటి సీమ ఆ వంకనే కనిపించదు.

లంకను మొదట సాలకటంకట వంశస్థులైన, మాలి - సుమాలి - మాల్యవంతుడు - అనేవాళ్ళు తమ ఖడ్గ బలంతో పాలిస్తూ వుండేవాళ్ళు. వీళ్ళచే ఓడింపబడ్డ శత్రువులు, తమకెప్పుడూ జరుగుతున్న అవమానభారాన్ని సహించలేక, ఒకసారి అంతా ఏకమై లంకపై దాడి చేసి, మాలి అనే అతణ్ణి చంపారు.

మాలి చనిపోయిన తరువాత, సుమాలి - మాల్యవంతులు దాన్ని పాడుపెట్టి తాము లంకలో వుండకుండా పాతాళానికి పారిపోయారు.

మాల్యవంతాదులు పోయిన తరువాత, పాడుపడ్డ లంకను జక్కులు ఆక్రమించి, స్థిర నివాసం ఏర్పాటుచేసుకుని పాలిస్తున్నారు. అలా వున్న జక్కుల్ని, కోయలు చితకబాది, తమ బాహుబలంతో దాన్ని ఆక్రమించారు.

లంకాద్వీపానికి నాలుగు వైపులా దాదాపు, అతి విశాలమూ - అతి గంభీరమూ - అయిన సముద్రం అతుక్కున్నట్టుగా కప్పి వుంది. అందువల్ల సర్వకాల సర్వావస్థల్లో అది ఎట్లాంటివాళ్ళకైనా నివాసయోగ్యంగా వుంటుంది.

ఆ ద్వీపంలో నిడివి ఎత్తు వున్న కొండలున్నాయి. ఆ కొండలపై విశాలంగా - ఏటవాలుగా వున్న ప్రదేశం వుంది. అక్కడే మూడు శిఖరాల మధ్య, ఇతరులకు ప్రవేశించటానికే గాక, కన్నెత్తి చూడడానికి కూడా వీల్లేని దుర్గాన్ని కట్టుకొన్నారు. ఆ దుర్గాన్ని కట్టిన పనితనం చూస్తే, దాని గొప్పతనానికి కళ్ళు కుట్టని వాళ్ళే వుండరు.

ఆ పట్టణంలో వుండే యిళ్ళు, ఆకాశాన్ని తాకుతూ ఒరపిడి పడుతున్నాయన్నంత యెత్తున్నాయి. అన్నీ బంగారుహర్మ్యాలే. అయితే బంగారుకాంతులు తమలో తాము త్రోపులాడుతూ వుంటాయి.

గోపుర ప్రాకారాల గోడలు రత్నాలతో పొదగబడ్డాయి. ఆ రత్నాల కాంతులు నలు దిక్కులకూ పారుతున్నాయి.

అక్కడి రథాలకు గట్టిన పతాకపు కాంతి పుంజం, ఆకాశంలో తేలియాడుతుంది. ఆ పట్టణమందలి వీరుల జాత్యహంకారం - గజఘీంకారాలు ఒకదానితో ఒకటి పోటీపడుతున్నాయి.

రథ-గజ-తురగ - పదాతి- చతురంగ బలాలు తాము గొప్పంటే తాము గొప్పని పరస్పరం ప్రగల్భాలు పలుకుతూ వుంటాయి. అక్కడి పోటు మన్నీలు మాట జవదాటరు. ఇంతటి రమ్యమైన లంక మూడు లోకాలకూ గుండెలో ముల్లులాగా వెలసింది.

ఆ నగరంలో చల్లని పిల్లగాలులు, ఆ వుద్యానమందలి పూల కమ్మని వాసనలలో నెమ్మది నెమ్మదిగా పొరలాడి పొరలాడి వస్తూ, తమ శరీరాలకు ఆ పూల పుప్పొడి నలముకొని కుంటి నడకలతో సాగుతూ వుంటాయి.

ఆకాశంలో చల్లని చందమామ, వెన్నెల కాస్తూ వుంటే, లంకలో వుండే హాయిని వర్ణించగల దిట్ట ఎవరున్నారు?

అక్కడ నివసించే వీరులు శత్రు భీకరులు. వాళ్ళు అనుభవించని భోగాలు లేవు, వాళ్ళ ఐశ్వర్యం చెప్పనలవి కానిది, లోపల - బయట ఏ మాత్రం వెలితి రాకుండా గంభీర వర్తనంతో మెలగుతారు. విద్వేషం అణుమాత్రం కనిపించకుండా, నిరంతరం ఆనంద సాగరంలో ఓలలాడుతారు. శంక - వాళ్ళ వైపుకు రావాలంటే శంకిస్తుంది. ఇంతెందుకు, లంకా రాజ్యంలో వుండే విభూతిని వర్ణించాలంటే, సామాన్యమా?

విశాలమైన వక్షస్సూ - మోకాళ్ళు దాటిన చేతులూ - ఎత్తైన భుజాలు, ఇంతలేసి నుదురూ - మంచి నీటూ-గోటూ కలిగి ఆ లంకలోని జనమంతా ఎదురులేని వీరులయ్యారు.

ఇంతటి వైభవోపేతమైన లంకకు రాజు రావణుడు. ఇతడు సామాన్యుడా?

పది దిక్కుల్ని అవలీలగా గెలిచి, జయసూచకంగా జయస్తంభాలు నాటించిన గొప్ప బల్లిదుడాతడు; గట్టి పట్టుదలతో దశవిధ శాస్త్రాలు చదివి ప్రజ్ఞాధురీణుడని వేనోళ్ళ పొగడ్తలందిన మహా పండితుడాతడు; పధ్నాలుగు లోకాలను అవలీలగా రణరంగంలో గెలిచి తన చెప్పుచేతల్లోకి తెచ్చిన శౌర్యశాలి; పదహారు కళల్లో ఆరితేరి ప్రపంచాన్ని సంతోషపెడుతూ చందమామను గేలి చేయగల సౌమ్యమూర్తి యతడు.

తన కాలంలో ప్రజలంతా కడుపులో చల్ల కదలకుండా, గుండెపై చేయి వేసుకుని చీకు చింతలు లేకుండా సర్వ సుఖాలనుభవించేట్టు లంకను పాలిస్తున్నాడు రావణుడు.

పలు గాకి మూకలు రెచ్చి స్వైరవిహారం చేయకుండా అదుపులో పెట్టి తన దేశాన్ని ఏ మాత్రం చికాకు పాలు గాకుండా పాలిస్తున్నాడు; శత్రువులెక్కడైనా చెలరేగి తన దారికి అడ్డం వచ్చేట్టయితే, నిర్దాక్షిణ్యంగా అణచివేసి, చీల్చి చెండాడుతాడు.

బాపురే! అని లోకాలు ముక్కుపై వేలు వేసుకొని ఆశ్చర్యచకితులయ్యేట్టు, మూడు శిఖరాల నడుమ అభేద్యమైన కోట నిర్మాణం కావించి, పరాయి మూకలకు, భీకరుడయ్యాడు. కరవు కాటకాలు ప్రజల దరికి చేరనీయకుండా, ఆకలి బాధ తెలియనీకుండా ప్రజలను కన్నబిడ్డల్లాగా చూస్తున్నాడు,

ద్రావిడ వంశ కుదురుకే అతడు పట్టుకొమ్మగా కుదిరాడు. దేశ ప్రజలు తననెప్పుడూ మెచ్చి, గౌరవంతో భయభక్తులతో మెలగేట్టు చూస్తూ జాతికి తిరుగులేని నాయకుడయ్యాడు. ఆర్యజాతికి పక్కలో బల్లెమయ్యాడు.

లంకా పట్టణం ద్రావిడ సార్వభౌముని బడలికను బాపి సేదదీర్చే బంగారు పడకటిల్లు; దక్షిణ దేశం ఆ శత్రు సంహారకుడు ఉల్లాసం కోసం విహరించే వుద్యానవనం - భరతఖండం - అమేయభుజబల సంపన్నుడైన ఆ ద్రావిడ భూపాలుడి గడి తీర్చే సాముగరిడీ! ఇతర భూఖండాలు ఈ గానకళా కోవిదుడికి కాన్కలు పంపే కేంద్రాలు. ఈ రావణ సార్వభౌములు ద్రావిడ జాతికి జీవగఱ్ఱ, వీరశైవుడు, అభిమాన ధనాగ్రణి; స్వర్గలోకాధిపతిని శంకరగిరిమాన్యాలు పట్టించినవాడు; అతడే ఈ లంకను పాలిస్తున్నాడు.

అనాగరికులైన - 'కోయ' - మొదలైనవారిని నాగరికులుగా చేశాడు. వాళ్ళకు చదువు సాములు చెప్పించి చక్కబరిచాడు - 'మేమూ నాగరికత గలవారమే' - అని అభిజాత్యాన్ని చాటగలిగేట్టు, మహా మనుషులుగా మలిచాడు - నిజంగా రావణుడెంత ధన్యజీవో ....?

'అన్నమో...! రామచంద్రా...'' అని దుఃఖించే ప్రజలు అయోధ్యా నగరంలో కోకొల్లలు. కాని, లంకలో 'అన్నమో! రావణా!' అని శోకించేవాళ్ళు కాగడా బెట్టి వెదికినా ఒక్కరైనా కానరారు.

రావణుడికి సోదరుడొకడున్నాడు. అతని పేరు కుంభకర్ణుడు. ఇతడు మహా దురంధరుడు, మంచి నిదురబోతు. బాల్యంలోనే యింద్రుడి యేనుగును పట్టుకొని, దాని పొడుగాటి దంతాలతో ఉయ్యాలలూగాడు.

విభీషణుడు - ఖరుడు - అనే మారు తమ్ముళ్ళు కూడా యిద్దరున్నారు. వీరిలో విభీషణుడు గొప్ప మోసకారి; ఖరుడు - వదరుబోతేగాని, దుర్మార్గుడు మాత్రం గాదు. వీళ్ళందరికీ కలిపి వొక చెల్లెలుంది. ఆమె పేరు చుప్పనాక. ఈమె అన్నలందరికీ యెంతో ముద్దుగా వుంటుంది. మహా మాటకారి;

లంకాధిపతియైన రావణుడు మూర్తీభవించిన శివభక్తుడు. శైవులు జీవహింస చేయటానికి అంగీకరించరు. అందుకే, ఈ మహీపాలుడు కూడా అహింసావాది. ఈ జంగమదేవర తన యేలుబడి క్రింద వున్న భూభాగంలో ఎక్కడా జంతుహింస ఏ పేరుతోనూ జరగరాదనే నిర్ణయం తీసుకొన్నాడు. తన నిర్ణయాన్ని ధర్మంగా రాజ్యమంతా చాటించాడు. ఆ కట్టడి మీరితే సహించనని శాసనం చేశాడు,

వాయువు - మేఘుడు - వరుణుడు - అగ్ని - దేవతలు - తమంత తామే వచ్చి, నియమం ప్రకారం ఈతనికి వూడిగం చేసిపోతారు.

తొలి కోడి, గొంతెత్తి, 'కొక్కొరోకో' అని కూయకముందే, వాయువు వచ్చి లంకా నగరం వీధుల్ని శుభ్రం చేసి పోతాడు; పడుచు కత్తెలు వేగుబోక పడక మంచం మీద నుంచి లేవకముందే, మేఘుడు వచ్చి కలయంపి చల్లి వెళతాడు; వంటవాళ్ళు లేచి, తాము పనికి సిద్ధంగాకముందే వరుణుడు వచ్చి కుండలన్నీ నీటితో నింపి పోతాడు; వాకిటి ముందు ఊడ్చి, ముగ్గులు వేయకముందే అగ్ని, పొయ్యి రాజేసి వెళతాడు. ఇది ఆ దేవతలకు దినచర్య. కొంచెం గూడా పొలుమాలకుండా, సిగ్గు లేకుండా పై దేవతలు బానిసలుగా వచ్చి వూడిగం చేసి వెళతారు.

ఆ పట్టణంలోని స్త్రీలు, మగవాళ్ళకే మాత్రం ఏ రంగంలోనూ తీసిపోరు. సమస్త కళలూ తమ తమ కోరికలకనుగుణంగా నేర్చారు. అన్ని శాస్త్రాలూ, పురుషులతో పోటీపడి గురువుల వద్ద చదివారు.

ఇక విలువిద్యలో ఆ నగరమందలి సుందరీమణుల నైపుణ్యం చెప్పటానికే వీలు లేదు. వనితల విలువిద్యా ప్రాభవం చూచి, పురుష వీరులు ముక్కుపై వేలు వేసుకుని, 'ఔరా!' అని విస్తుపోతారు. శత్రువులు లంకానగర పూబోడుల బాణవిద్యా గరిమకు భయపడి ఆ పట్టణం వంక కన్నెత్తైనా చూడరు. ఎప్పుడూ ఆ కుసుమ కోమలులు

పట్టణాన్ని రక్షించే బాధ్యతతో వుంటారు.

లంకా నగర మానినీమణులకు తలమానికంగా లంకిణి వుంది. ఆమె పౌర సేవకు మించిన సేవగాని, గొప్ప కార్యంగాని, పుణ్యంగాని ఏదీలేదని గ్రహించి అపార ధనుర్విద్యా పాండిత్యంతో పట్టణాన్ని కాపాడటానికి నిశ్చయించుకొంది. తన కర్తవ్య నిర్వహణకు అడ్డుగా వుంటుందని గ్రహించిన ఆ పరమ త్యాగమూర్తి – పెళ్ళి కూడా మాని, అచంచల దీక్షతో – నిరుపమాన ధైర్యసాహసాలతో, బ్రహ్మచారిణిగా జీవించాలని నిశ్చయించుకొంది.

ఆమె పూనిక విని ద్రవిడపండిత మండలి – 'జేజే'లు పలికింది. బలశాలిని అయిన లంకిణీదేవి వాడి గల చేతి కత్తి లంకాపురానికి రక్షణ కవచంగా వుంది. ఆమె అండదండల్లో ఆ నగర పౌరులు గుండెపై చేయి వేసుకొని, ఆదమరచి హాయిగా నిద్రపోతున్నారు. మ్రుక్కడులైన శత్రువులకు ప్రాణగొడ్డమైన ఆయుధాన్ని ధరించి లంకిణి లంక నెప్పుడూ కాపలా కాస్తూ వుంటుంది. ఆమె పేరు వింటేనే శత్రువులు బెదరిపోతారు.

శత్రుభీకరమైన ఆమె చేతిలో కత్తిని తలచుకొంటేనే, పరాయి భూపతులు లంక వంక మొగమెత్తి చూడడానికి తత్తరపడతారు. ఈ లలనామణి వల్ల ఆ పట్టణంలో శాంతి భద్రతలకు కొదువలేదు, నగరంలో వుండే స్త్రీ రత్నాలు ఆమె త్యాగానికి ఆశ్చర్యపడి, వనితా తిలకాన్ని చూడవచ్చి లాజలు చల్లుతారు.

ఇక రావణ చక్రవర్తి ముద్దు చెల్లెలు చుప్పనాక. ఈమె అతిలోక సౌందర్యవతి. చతురాశ్రమాలలో గృహస్థాశ్రమమే గొప్పదన్న భావంతో పెళ్ళిచేసుకొని చీకూ – చింతా లేకుండా కాపురం చేస్తూ వుంది.

కొంత కాలానికి ఈమె భర్త చనిపోయాడు. అప్పటికీమెకు ఒక కొడుకు. అతడి పేరు జంబుకుడు. ఒక్కగానొక్క కొడుకు దండకారణ్యంలో తపస్సు చేస్తున్నాడు.

శూర్పణఖ గూడా తాను లంకను విడిచి కొడుకు తపస్సు చేస్తున్న దండకారణ్యానికే వెళ్ళి అక్కడే అతనికి తోడుగా పొద్దులు పుచ్చుతోంది.

వీళ్ళిద్దరు గాక బాగా చెప్పుకోదగ్గ వనితారత్నం ఇంకో ఆమె వుంది. ఆమె పేరు తాటకి. మారీచుడు– సుబాహుడు అనే యిద్దరు ఆమె కొడుకులు.

తాటకి చాలా నియమం గల యింతి. హింస చేయటం చూస్తే సహించదు. జీవహింస చేయవద్దని స్త్రీలలో బాగా ప్రచారం చేస్తూ వుంటుంది. ఈ విషయంలో ఈమెకు విసుగు – విరామం అనేవే లేవు.

రాజయోగం తాల్చి చరిస్తూ వుంటుంది. మహాభిమానవతియయిన ఈ తాటకి తన పెద్దల మాట ప్రకారం వానప్రస్థాశ్రమం స్వీకరించి, పిల్లలూ – తానూ తమ పూర్వుల వాసస్థానమైన దండకారణ్యంలోనే వుంటుంది.

ఇట్లా లంకలో స్త్రీ పురుష జాతి భేదమే వాళ్ళిద్దరి మధ్యా స్వత్వంలో మాత్రం భేదం

లేకుండా, ఆడా మగా అంతా ధర్మసంరక్షణ చేస్తూ వుంటారు.

నగరంలోని స్త్రీ పురుషులు భేదం లేకుండా పట్టణ రక్షణభారం - ధర్మరక్షణ చేస్తూ వుండగా రావణ ప్రభుడు ఆ రాజ్యాన్ని యథేచ్ఛగా పాలిస్తున్నాడు. పంతంతో శత్రురాజుల పైబడి, తన భుజబలాన్ని చూపి, ఇతర ప్రాంతాలను వశం చేసుకొని, ఆ ప్రాంతపు మనుజాధీశులను సామంతులుగా గావించుకొని, నిరుపమాన కీర్తి ప్రతిష్ఠల నార్జించుకొని దసగీవుడు కన్నబిడ్డలవోలె రాజ్యమందలి ప్రజలను పక్షపాత రహితంగా చూస్తూ, ప్రశాంతంగా రాజ్యపాలన చేస్తున్నాడు.

రావణరాజు సుభిక్షంగా లంకా రాజ్యాన్ని పాలిస్తున్న ఈ సమయంలో, ఉత్తరాదిన వున్న ఆర్యులు దక్షిణ దిక్కుకు కూడా నెమ్మది నెమ్మదిగా వచ్చారు.

వింధ్య పర్వతాలకు ఉత్తర దిశలో వున్న ద్రావిడ వీరుల్ని పారగొట్టి వాళ్ళ భూమిని ఆక్రమించుకొని పాలన సాగిస్తున్న ఆర్యులు నిర్భయంగా వుండలేకపోయారు.

బాగా పెద్ద పెద్దగా వున్న గుండ్రాళ్ళమయమైన వింధ్యపర్వత సమప్రదేశం మీదుగా దాన్ని దాటి వచ్చారు. సింహాలు - శరభాలు - పెద్దపులులు - మదించిన యేన్గులు - ఎలుగుబంట్లు - మొదలైన క్రూర మృగాలు విచ్చలవిడిగా తిరుగుతున్న దట్టమైన అడవుల్ని గడచి వచ్చారు.

వర్షాకాల సమయంలో అమిత వేగంతో జలజల ప్రవహించే సెలయేళ్ళ సమూహాన్ని ఉత్తరించారు. ఘోర భీకర విషసర్పాలు తామరతంపరగా పెనవేసుకొని భీతి పుట్టిస్తున్న పొదలూ-గడ్డి బీళ్ళూ - అతిక్రమించి యిక్కడికి వచ్చారు ఆర్యులు. ఇట్లా వచ్చిన ఆర్య జనం అక్కడక్కడ మునిపల్లెలు కట్టుకొని నివాసం చేస్తూ, గూఢచారి పనులు నిర్వర్తిస్తున్నారు. అంతేగాదు, స్థానికులైన ద్రావిడులకు వ్యతిరేకంగా జంతుహింస చేస్తూ యజ్ఞయాగాలు చేస్తున్నారు.

దండకారణ్యంలోని జనస్థానంలో మారుమూల ప్రదేశాల్లో పల్లెలు నిర్మించుకొని ఋషుల పేరుతో ఆర్య గూఢచారులు వ్యవహరిస్తున్నారు.

వృత్తవేదియైన రావణుడికి, ఆర్యుల ఈ కుతంత్రం తెలిసింది. శైవమత విరుద్ధమైన జంతుహింస చేయటం గమనించాడు. చాలాకాలం దీని గురించి ఆలోచించాడు. ఎట్లాగైనా ఆర్యుల ఈ దుశ్చర్యను, అంటే జంతు హింసాచర్యను ఆపాలని రావణుడు నిశ్చయించుకొన్నాడు. ఆలోచన వచ్చినదే తడవుగా తాటకిని పిలిపించాడు.

"అమ్మా! సాధ్వీ శిరోమణీ! తాటకీ! నేను చెప్పేది విను. ఏం చెప్పాలో, ఎట్లా చెప్పాలో గూడా బోధపడడం లేదు. చెప్పటానికి నాకు నోరే రావటం లేదు. విపరీతమైన ఈ క్రూరకర్మలు వినవలసి వస్తుంది. నా ఒడలంతా మండిపోతుంది. మాటలతో యిది తీరదు. నా పరితాపాగ్నిని ఎట్లాగైనా చల్లార్చాలమ్మా!

ఆర్యులట..! నీతిపరులట! యజ్ఞయాగాలు చేస్తారట...! ఎక్కడ నుంచో ఇక్కడికి వచ్చారట! పరోపకారం చేస్తారట...! మన ద్రావిడ వంశస్తుల్ని మంత్రాంగం పన్ని నాశనం చేస్తారట!

అమ్మా! నీ తనయులిద్దరూ బాహుబల దర్పం గలవాళ్ళు - వాళ్ళనిద్దరినీ నేను బాగా ఎరుగుదును. స్వామిభక్తి పరాయణులు. ఉత్సాహవంతులు; రణకోవిదులు - నీ పుత్రరత్నాలను తీసుకొని దండకారణ్య ప్రాంతమందలి జనస్థానానికి వెళ్ళు. ఆ సమయంలో ధైర్యసాహసాలు ప్రదర్శించి తగిన కార్యాన్ని చేపట్టాలి.

వనితామణీ! నాయీ కోరికను కాదనబోకు. ఇంకా ఏదైనా పని వుందని దీన్ని కాదని ఎదురు చెప్పబోకమ్మా! దారీ తెన్నూ తెలియక నా మనస్సు ఆరాట పడుతుంది. ఈ సమయంలో మనం ప్రతీకారం ఆలోచించకుండా వూరుకొంటే, పరిస్థితులు చేయి దాటిపోతాయి. విషమ పరిస్థితులేర్పడతాయి. పవిత్రమైన మన ద్రావిడ జాతి దుర్గతి పాలవుతుంది. అమ్మా! ఆలస్యం చేయబోకు; లే...! జాతికి విపత్తు సంభవించినప్పుడు తూష్ణీభావం ప్రదర్శించడం మంచిది గాదు. ఈ కార్యభారం నీవు వహించక తప్పదు.

లలనా శిరోమణీ! ఆర్య ఋషులు కాలాంతకులు. అవులిస్తే పేగులు లెక్కపెట్టగల దిట్టలు. అందుకనే వాళ్ళతో పౌరుషంగా మాట్లాడకు. సందర్భాన్ని బట్టి, వాళ్ళతో ఏం మాట్లాడాలో అట్లా మాట్లాడు.

మన పరిస్థితి - మన మర్యాద - మన జీవనవిధానం వాళ్ళ మనస్సు నొప్పించకుండా నెమ్మదిగా చెప్పు. మన పాలనలో వున్న భూమిలో, మన మెట్లా ఆచరిస్తామో, దానినంతా వాళ్ళకు విశదీకరించి ఏ రకంగానైనా నచ్చచెప్పి, మన భూముల్లో జంతుహింస చేయకూడదనే అభిప్రాయం వెలిబుచ్చు. ఎట్లాగైనా ఆర్యులు సాగిస్తున్న హింసాకాండను మానిపించు.

విశ్వామిత్రుడనే ఋషి ఒకడున్నాడట. అతడు అశ్వమేధ యాగం చేయాలనే యత్నంలో వున్నట్టు తెలుస్తుంది. నీవు పోయి, ఆ విశ్వామిత్రుడి ప్రయత్నాన్ని ఆపు. ఈ దుండగం జరక్కుండా చూడు.

తాటకీ! మనం ఈ సమయంలో ఉపేక్ష చేస్తే, తప్పకుండా ధర్మనాశనం జరుగుతుంది. దేశం అల్లకల్లోలమైపోతుంది. ప్రజలు కష్టాల పాలవుతారు. జాతినీ - ధర్మాన్నీ రక్షించటంలో ప్రాణం పోయినా, ఎంతో మేలు.

మన తాతలూ - ముత్తాతలూ ఈ జన్మ నీటి బుడగలాంటిదని భావించే గదా! ధర్మ రక్షణ కోసం తమ తమ ప్రాణాలు పణంగా పెట్టారు. ఇది జాతిలో పుట్టిన ప్రతి వ్యక్తి బాధ్యతగా, కర్తవ్యంగా గుర్తించవలసిన విషయం. స్వధర్మాన్ని మించిన కార్యం ఇంకోటి లేదు.

నరపాలుడి ఆజ్ఞ లేకుండా కొత్తవాళ్ళెవరూ రాజ్యంలోకి అడుగుపెట్టగూడదు. ఒకవేళ ప్రవేశిస్తే, తాము వచ్చిన సంగతి వెంటనే తెలపాలి. ఇతర ప్రాంతాల వాళ్ళెవరైనా ఇక్కడ వుంటే, వాళ్ళంతా రాజశాసనానికి కట్టుబడి వుండవలసిందే గాని, సర్వస్వతంతులై మెలగరాదు. అట్లాగే రాజశాసనానికి బద్ధులు గాకుండా ప్రవర్తిస్తే, దాని ఫలితం అనుభవించవలసి వస్తుంది. భూపాలుడు ఏ శిక్ష విధిస్తే ఆ శిక్షను తప్పకుండా శిరసా వహించవలసిందే.

ఆర్య ఋషులు దొంగల్లాగా మనదేశంలోకి ప్రవేశించి, ధర్మవిరుద్ధమైన కార్యాలు చేస్తున్నారు. రాజాజ్ఞను ధిక్కరించి ప్రతిఘటిస్తున్నారు. కాబట్టి తప్పకుండా ఆ మునులు దండించదగ్గవాళ్ళే అయ్యారు.

ముందు మంచి మాటలు చెప్పి, హింసాప్రాయమైన యజ్ఞాలను- యాగాలను మానిపించు. దండకారణ్యం నుంచి వాళ్ళను లేవగొట్టి పంపు"

పుడమి రేని ఆజ్ఞను తలపై మోసుకొని, రాచకార్యాన్ని చక్కబెట్టడానికి తాటకి ముందుగా తన యింటికి పోయింది. తన తనయులైన మారీచ సుబాహుల్ని పిలిచి రావణ రాజు చెప్పిందంతా చెప్పింది. మారీచ సుబాహులిద్దరూ తల్లితో కలసి, కవచధారులై, అస్త్రశస్త్రాలు గ్రహించి విశ్వామిత్రుడు యజ్ఞం చేస్తున్న ప్రదేశానికి వెళ్ళారు.

తాటకీ రమణి తన కొడుకులిద్దరితో విశ్వామిత్రుణ్ణి కలసి, తమ రాజు చెప్పినట్లుగానే విషయమంతా పూసగుచ్చినట్టు చెప్పింది.

ద్రవిడకాంత మాటలకు గాధినందనుడు నిప్పులు తొక్కిన కోతిలాగా చిందులు వేస్తూ, కోపంతో మండిపోతూ గుడ్లెర్ర జేశాడు.

'ఇంత మాటలు చెపుతాడా రావణుడు?' అని ఎగిరిపడ్డాడు.

మూర్ఖత్వం మూర్తీభవించిందా...! అన్నట్టు, కిందా మీదా తెలియకుండా ఆగ్రహంతో కౌశికుడు వణికిపోతున్నాడు, మాటా- మంతీ - ఏమీ లేదు. చిటపట లాడుతున్నాడు. తన వాచాలత్వం చాటుకోవటానికా అన్నట్లు నోరు పారవేసుకొని యిష్టం వచ్చినట్లు కారుకూతలు కూశాడు.

'ఎవడు వచ్చినా - ఎవరెన్ని చెప్పినా - మా కార్యక్రమాలు మానుకోం. మా పనులన్నీ యథావిధిగానే సాగుతాయి. మమ్మల్ని అడ్డుకొని, మా కార్యకలాపాలను నిరోధించే వాడెవ్వడూ లేదు" అని నిర్లక్ష్యంగా చెప్పాడు, అతని మాటల్లో కనీసపు మర్యాద కూడా ఎక్కడా కానరాలేదు.

విశ్వామిత్రుడి వింత ధోరణికి తాటకి విస్తుపోయింది. 'తాము ఎంతో మర్యాదగా, వినయంగా లంకాధిపతి పల్కులు వినిపిస్తే, ఈతడు ఇంత వింతగా ప్రవర్తించటమేమిటా...? అని తెల్లబోయింది.

అయినా, అతని నిర్లక్ష్య వైఖరికి తాటకీ సతి, కొంచెం కూడా సంక్షోభపడలేదు. తొందర పడలేదు. ఇంచుకంత కూడా నిబ్బరాన్ని కోల్పోలేదు. కాని, రాజాజ్ఞను నెరవేర్చాలి గదా? తనను కర్తవ్యం ఆదేశిస్తుంది. విశ్వామిత్రుడి వైఖరి గమనించి, ఇతడు మాటలతో చక్కబడడని భావించింది; మామూలు పద్ధతిలో దారికి రాడని తలచింది; ప్రక్కనే వున్న కొడుకులు యిద్దరి వంక పారచూచింది.

తల్లి చూపుల్లోని ఆంతర్యాన్ని గ్రహించిన మారీచ సుబాహులు-

"ఓయీ! దొంగ బ్రాహ్మడా! మంచీ - చెడ్డల్ని ఆలోచించవు. నీ మాటలు నీవే గాని, మా మాటల్ని చెవి దూరనీయవు. మొండిపట్టు విడిచిపెట్టవు, జీవహింస చేసి జీవిస్తానంటావు. సోలలకొద్దీ సోమరసం తాగటం ఘనమనుకొంటున్నావు.

మా నేలలో వుండి, మా ధర్మానికి వ్యతిరేకంగా ప్రవర్తించటం రాజాజ్ఞను ఉల్లంఘించడం చేస్తున్నావు. ఎంత మర్యాదగా - మంచిగా చెప్పినా వినవు, నీవేం చేస్తావో? చూస్తాం!" అని విశ్వామిత్రుడి యజ్ఞవాటికను ధ్వంసం చేయటానికి సంసిద్ధులయ్యారు.

యజ్ఞగుండానికి చెంతనే వున్న యూప స్తంభానికి కట్టివేసిన ఆవు ఊడ మెడతమ్మెలను తప్పించి విడిచిపెట్టారు. ముక్కలు ముక్కలుగా చేసి కుప్పలు వోసిన రావిచెట్టు వేళ్ళను, చిదుగుల్ని చెల్లా చెదురుగా చిమ్మివేశారు; ఘుమఘుమలాడుతూ ముక్కు పుటాలకు విందు చేసే ఆవునేతి కుండలనన్నింటినీ బోర్లించారు; భగభగమని మండుతూ నాల్కలు చాస్తున్న హోమాగ్ని జ్వాలల్ని చల్లార్చారు. దర్భలను అటూ- ఇటూ పారజల్లారు; యజ్ఞవాటిక దగ్గరవున్న ఆర్య మునులు భయపడి కాలికి బుద్ధిచెపుతూ వుంటే, ఇంకా కొంచెం బెదిరించి పారగొట్టారు.

ఇంత జరుగుతూ వుంటే విశ్వామిత్రుడు ఏమీ చేయలేక గుడ్లు మిటకరించి చూస్తూ వుండిపోయాడు. చూచి-చూచి యిక భరించలేక, కోపంతో కుతకుత వుడికిపోయాడు. ఏం ఆలోచించాడో... ఏమో...!

ఎంతో కాలం నుంచి తన దగ్గరే వున్న పాతదైన దండాన్ని తీసుకొన్నాడు; కమండులువు చేత బట్టుకొన్నాడు. చినిగిపోయిన జింక చర్మాన్ని చంకన బెట్టాడు. శిష్యుల వంక చూచి - 'లెండు - లెండు' అని చెప్పి వాళ్ళను లేవదీశాడు. సాకేతపురం వైపు ప్రయాణం సాగించాడు.

# విశ్వామిత్రుడు అయోధ్యకేగుట

ద్రవిడ వీరులు కావించిన యజ్ఞావరోధానికి, కుపితుడైన ఆర్య రాజర్షి తన గోడు వినిపించుకోవటానికి ప్రభువైన దశరథుడి దగ్గరకు బయలుదేరాడు.

'నట్టడివిలో వుంటూ, కారాకులూ తింటూ, పడియలోని నీళ్ళు తాగుతూ ప్రశాంత జీవనం గడుపుతున్న మాబోటి మునులను అనరాని మాటలని అదరిస్తూ - బెదరిస్తూ - కండకావరంతో మీదకి దూకుతూ బాధపెడుతున్నారు ఆకతాయిలైన ద్రావిడులు. ఈ విషయం రాజుతో చెప్పి వీళ్ళ అంతు తేలుస్తా! లేని పోనివన్నీ చెప్పి, తగిన శాస్తి చేయిస్తా - నా సంగతి అర్థమయ్యేట్టు చేస్తా'- అంటూ గొణిగాడు.

ఇంతటితో ఆగక....

యజ్ఞయాగాలు చేస్తూ, ఆవుల్ని చంపుతున్నాం; గోవుల్ని చంపితే, వీళ్ళ కొంప యేం మునుగుతుంది? దానివల్ల వీళ్ళకు వచ్చిన నష్టమేముంది? కష్టమేముంది? జంతుహింస మానమంటారేమిటి ఈ ద్రావిడులు? ఆవు మాంసం రుచి వీళ్ళకు తెలియదు. ఒక్కసారి దీని రుచి చూస్తే, యిక జన్మలో మరచిపోరు. మాకంటే, వీళ్ళే యెక్కువ తింటారు. ఎంత ప్రయత్నించినా ఈ ద్రావిడులు ఆవు మాంసం తినటం అలవాటు చేసుకోలేదు. అఖరికి సోమరసం తాగటం అలవాటు చేయలేకపోయాం. వీళ్ళు వీటిని అలవాటు చేసుకున్నట్టయితే, మాకీ గొడవ వుండేది గాదు.

ద్రావిడ భూమిలో ఆడవాళ్ళు కూడా, బాణం సంధించి, గురిచూచి, శత్రువుల కంఠాలను తెంచే నైపుణ్యాన్ని సంపాదించారు. అంతేగాదు; పెద్ద పెద్ద సైన్యాన్ని సమకూర్చుకొని సైన్యం ముందుభాగాన వుండి నడిపించే శక్తి సామర్థ్యాలున్నాయి.

స్త్రీలకు గూడా యింత చేవ వున్న రాజ్యాన్ని యింతకు ముందు చూడలేదు. వీళ్ళను మాటలతో గాదు, చేతలతో గూడా జయించటం చాలా కష్టంగా వుంది.

స్త్రీలూ - పురుషులూ తమ జాతి పరువు నిల్పటం కోసం, ధన - మాన- ప్రాణాలను బలిపెట్టి అయినా సరే, పోరాటం చేసే తెగువ వున్న దేశంలో ఎంత వీరులైతే మాత్రం - శత్రువులేంచేస్తారు? పరువు పోగొట్టుకోవటంతప్ప వాళ్ళను చెణకలేరు."

అని చింతిస్తూ, వ్యాకులపాటు గల మనస్సు కలవారై విశ్వామిత్రుడు శిష్యులతో కూడి, ఇక అటూ - ఇటూ చూడకుండా, ముందు వెనుకలాలోచించకుండా అడుగులు లెక్కపెడుతూ కాలినడకతోటే, గాలి పాటలు పాడుకుంటూ - నెమ్మదిగా ప్రయాణమై సాకేతం దారి పట్టాడు.

దారి కడ్డం వచ్చిన యెన్నో వాగులూ - వంకలూ దాటాడు. దట్టంగా వున్న అడవి మార్గాన పయనమై దండకారణ్యాన్ని దాటాడు. విరామం ఎరక్కుండా నడచి నడచి, తొట్రుపాటు పడుతూ, ద్రావిడుల వల్ల కలిగిన అవమానం తలచుకొంటూ గాధిసుతుడయోధ్యకు చేరాడు.

అయోధ్యకు చేరిన విశ్వామిత్రుడు, ముందుగా సూర్యవంశ కులగురువైన వసిష్ఠుడి కొంపకు వెళ్ళాడు. కులగురువులతో రహస్యంగా చెవిలో ఏదో గొణిగాడు, అదిగాదు,

ఇది కాదు అని యిద్దరూ చాలా చర్చించుకొన్నారు.

చివరకు - 'ఆహా...! ఇట్లా చేద్దాం...!' అని అనుకొని కుశిక తనూభవుడు- "సూర్యవంశ ప్రభువైన దశరథుణ్ణి, ఎప్పుడు చూద్దామా...!' అన్న సంభ్రమంతో గబగబా పోయి, రాజును దర్శించాడు.

వచ్చిన విశ్వామిత్రుడికి వందనలాచరించి, కూర్చోవటానికి ఆసనం చూపించాడు దశరథ మహీపాలుడు. రాజర్షి ఆసనంపై కూర్చుండి తన మనోవ్యగ్రతను బహిర్గతం కానీయకుండా యెంతో నిబ్బరంగా, ఏమీ పని లేనివాడుగా తమాయించుకుని, దశరథుడి యోగక్షేమాలడిగి, కొనగోళ్ళతో గడ్డాన్ని చిక్కు తీస్తున్నవాడిలా వుండిపోయాడు.

విశ్వామిత్రుడు సహజంగా రాజు; రాజ లక్షణాలు, గుణాలు - పరిస్థితి మొత్తం అనుభవంలో వున్నవాడు. కాబట్టే- తటాలున తాను వచ్చిన పనిని తెల్పకుండా, దశరథుడి ముఖ కవళికను గమనిస్తూ, తగిన సమయం కోసం చూడసాగాడు.

తన మనోభావాలను బయట పడనీయకుండా, జాగ్రత్త పడ్డాడు. తొట్రుపాటుగాని, తొందరపాటుగాని కొంచెం గూడా కనబడనీయకుండా వుదాత్తుడుగా వున్నాడు.

సమయం కోసం చూస్తున్న విశ్వామిత్రుడు, దశరథుడి ముఖ కవళికలను గమనించాడు. మంచి నమ్మకంతో, ఇతరులు కూడా 'భళీ' అని మెచ్చుకొనేట్టుగా, ఎంతో జాలితో తన సంగతి చెప్పనారంభించాడు.

'దశరథ మహారాజా! పాప భూయిష్టమైన ప్రవర్తనను విడిచిపెట్టి, సంసార బంధాన్ని తెగతెంపులు చేసుకొని, బహుజనావాస యోగ్యాలైన పట్టణాలను విడిచి, అడవుల్లో - పల్లెల్లో - క్రూర మృగాల మధ్య, వాటితో చెలిమి చేసి, కఠినాతి కఠినమైన ఆచారాలను చేపట్టి, మొలచుట్టూ పారుటాకుల్ని చుట్టుకొని, భోగ భాగ్యాలనన్నిటినీ కాలితో తన్ని షడ్రసోపేతమైన భోజనాన్ని విడిచి - వనసీమల్లో దొరికిన కాయ గసరులతో పొట్ట నింపుకొంటూ, పారమార్థికచింతనే పరమావధిగా, తాపసాశ్రమాన్ని నెలకొల్పి బ్రతుకున్నాం.

గొప్ప గొప్ప మేధావులైన మునులు, ఇన్ని అగచాట్లు పడుతూ దండకారణ్యంలో తపస్సు చేయటం, ఎందుకో తెలుసా? మహత్తరమైన సూర్యవంశం దినదినాభివృద్ధి కాంచాలనే కాంక్షతోనే.

కానీ, నరపాల చంద్రా! ఆర్యులనే పేరు వినిపిస్తే చాలు, అక్కడ ద్రావిడ రాజులు మితిమీరిన ఆగ్రహంతో పైబడి చంపటానికి వస్తారు. మా లాంటి బక్కచిక్కిన బడుగువాళ్ళం. ఏం చేయగలం?

అక్కడ పారే సెలయేళ్ళ నీటినే దోసిళ్ళతో ముప్పూట కడుపార తాగి తృప్తిపడుతున్నాం; పండి, రాలిన యెండుటాకులూ - పళ్ళూ వొక పూట తిని యేదో వొక మూల

పడివుంటున్నాం. వనాంతర సుమాల సుగంధంలో పొరలివచ్చే గాలిని తనివితీరా ఆస్వాదిస్తున్నాం. మనసుపడ్డప్పుడు మాత్రం, యేదో వొక పోట నివ్వరి భోజనం చేసి అవస్థ పడుతున్నాం.

ఎవ్వరి జోలీ లేకుండా పొగల సమీపంలో కూర్చుండి, మా బ్రతుకు మేం బ్రతుకుతున్నాం. ఇట్లాంటి సాధువృత్తిలో వున్న మమ్మల్ని చూచి, క్రూరమృగాలను చూచినట్టుగా, ఏవగించుకొంటూ వుంటారు ద్రావిడులు. జాతి వైరమే దీని కంతటికీ కారణం"

విశ్వామిత్రుడు తన గోడు చెప్పుకుపోతున్నాడు. దశరథుడు మాత్రం కిమ్మనకుండా, వింటున్నాడు, అతనిలో కొంచెం గూడా స్పందన కనిపించలేదు. గాధిసుతుడు దాన్ని సహించలేకపోయాడు; భరించలేకపోయాడు.

ఇక లాభం లేదనుకొని దశరథుడి మనస్సుకు ఘాటుగా నాటుకొనేట్టు చేయాలనుకొన్నాడు.

"రాజా! ఎంత చెప్పినా, వులకవు - పలకవు. నేను చెప్పిందేదీ నీ చెవి దూరినట్టు లేదు. కాస్త దూరం ఆలోచించి, పార చూడు. నా మాటలు బహుశః నీకు అసహ్యమనిపించాయేమో? బ్రాహ్మడి మంచి చెడ్డలు చూడని రాజు రాజ్యం ఈ లోకంలో ఎక్కువకాలం నిలవదు. బ్రాహ్మణుడు సంతుష్టుడు కాకపోతే రాజ్యానికే కీడు. అట్లాంటి రాజు కోరి కష్టాలు కొని తెచ్చుకొంటాడు.

పులి నోటి కండలాగా, గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకొని పడరాని పాట్లు పడుతూ భయంకరమైన మనో వ్యథ ననుభవిస్తూ విజాతీయుల మధ్య క్షణమొక యుగంగా, దినదిన గండంగా బ్రతుకున్న మునుల స్థితి -ఏమి తెలియనివాడిలా వుండడం మంచిదేనా? ఇది వివేకుల పనేనా?

నీ రాజ్య విస్తృతి కోసమే గదా! మునులు దండకారణ్యంలో నానా తిప్పలు పడుతూ బ్రతుకుతున్నది. దీన్ని నీవు గమనించినట్లే లేదు. ఈ ఊసు ఎత్తనే ఎత్తవు. ఇంతటి కృతఘ్నుతను నేను సహించలేను.

తినో - తినకో బక్క చిక్కి, గొంతు దాకా విషాదాన్ని దిగమింగి తాపసులు దండకారణ్యం ప్రవేశించారు. వచ్చినప్పటి నుంచీ ద్రావిడ రాజుల వల్ల ఎదురయ్యే దుర్భర పరిస్థితులకు కలత చెందారు. నూరితే వెలిగే వాళ్ళ చిక్కటాకులకు బెంబేలెత్తి పోయారు. అన్నీ భరించి, సహించి - చివరకు దారిలేక యీనాడు - 'నీవే దిక్కని, నిన్నాశ్రయించటానికి వచ్చారు. వాళ్ళను చేర బిలిచి, ఆదరించి ఉపకారం చేయవు. కారణమేమిటో బోధపడకుండా వుంది."

విశ్వామిత్రుడిట్లా కటువుగా మాట్లాడేటప్పటికి, దశరథ నరపాలుడు కటకట పడ్డాడు.

దైన్యంతో, బాధతో వివశుడై దిక్కులు చూస్తూ భయమూ - భక్తీ ప్రదర్శిస్తూ సమాధానం చెప్పాడు.

"మునీంద్రా! కులపతులైన మునీశ్వరులకు బాధలు కలుగుతూ వుంటే, కలత పడకుండా వుంటామా? ఎంత మాటన్నారు మీరు? మా మనస్సు మనస్సులో వుంటుందా? దుఃఖితులం కాకుండా వుంటామా? ఎంతటి భయంకర ప్రళయం వచ్చిపడ్డా రఘువీరులు బ్రాహ్మణులను రక్షించకుండా వుంటారా? వారిని శత్రువుల కప్పగించి, వుపేక్షాభావంతో మిన్నకుంటారా? ఇంతలేసి నిందలు నాపై మోపుట తగునా?

ఇదుగో, ఇప్పుడే పోదాం రండి. నా భుజబలంతో ద్రావిడుల మార్గాలన్నీ శోధించి, అరికడతా. నా ఆయుధాల ధాటిని అడ్డుకొనే వాడెవ్వడో చూస్తా.

నా తూణీరం నుండి అమ్ములు - 'రంయిమ'ని తమంత తాము దూకుతున్నాయి. వేగమీ దండకారణ్యానికి పోయి, శత్రువులైన ద్రావిడ వీరుల్ని నుగ్గు నూచగా చేస్తా. వాళ్ళెంతటి మగటిమి గలవాళ్ళైనా, ఎంత బొబ్బలుపెట్టినా... 'కాంద్రు కాంద్రు' మని సమస్త శత్రువుల్ని ఒక్క వూపుతో మింగిపారేస్తా - ఆలస్యం చేయకండి, రండి...! వెళదాం.

ఓ మహాత్మా! అభం శుభం తెలియని నా బోటివాడి మీద నిందలు మోపటం భావ్యం గాదు; ధర్మం గాదు.

ప్రతిదినమూ - బ్రాహ్మణ సంతర్పణ అయిన తరువాతనే గదా మా వంశీయులు అంతో -ఇంతో భుజిస్తారు.

ఏ కాలంలోనైనా మా రఘువంశ ప్రభువులు, తాము రాజుల మన్న సంగతి చెప్పుకొని విఱ్ఱవీగలేదు. బ్రాహ్మణుల ఆనతి లేకుండా స్వతంత్రించి, చిన్నమెత్తు పని కూడా చేసి యెరుగరే? మా పై యింత అనుమానం కలగటానికి కారణం బోధపడడం లేదు.

పదండి! మునివర్యా! నేను ప్రయాణమయ్యా! మీకు కీడు కలిగిస్తున్న విద్రోహులైన ద్రావిడ హంతకుల్ని హతమారుస్తా. నా చెవులతో ఇట్లాంటి మాటలను వినలేను; సహించలేను"

దశరథుడిట్లా విశ్వామిత్రుడితో చెపుతూ వుండగా, వసిష్ఠుడు వచ్చాడు. ఇరువురిమధ్య జరిగిన సంభాషణ సారాంశాన్ని గ్రహించాడు. ఏమీ తెలియనివాడులాగా, రఘుకుల మహారాజును జూచి...

"ఓ రాజా! నీవు చాలా వయస్సు మీద పడ్డవాడవు. ఇక్కడ వుండి పరిపాలన చేయటానికి సరిపోతావు కాని, భీకర దుర్గమారణ్యాలలో దూరి ముక్కడులైన ద్రావిడ మన్నీలతో తలపడి యుద్ధం చేయటం చాలా కష్టం.

వయస్సు చూద్దామా...! వాచిపోయింది! పటుత్వం తగ్గింది; చెలువం సన్నగిల్లింది;

నీకీ లోకంలో కావలసిన కోర్కెలన్నీ తీరిపోయాయి. నీకున్న అలపు - చలము - ఎందుకూ పనికిరావు. అంతేగాక, ఇంకో విషయం గూడా ఆలోచించు. నీ కొడుకులకు శత్రు మరణమంటే యేమిటో నేర్పవలసిన అవసరం కూడా వుంది.

కాబట్టి, నీ ముద్దు బిడ్డలైన రామలక్ష్మణులను ఈ మహానుభావుడి వెంట పంపు. నీకు వచ్చిన యిబ్బందేమీ లేదు. పరమ పవిత్రుడు నీ బిడ్డల్ని పూవుల్లో బెట్టి చూచుకొంటాడు. శత్రుసేనలను రూపుమాపే విధం నేర్పి, బాణ విద్యలో ఆరితేరిన వారిగా తీర్చిదిద్ది మన సన్నిధికి తిరిగి తీసుకువస్తాడు.

ఈ పని చేస్తే సూర్యవంశం వన్నె - వాసీ గాంచి లోకంలో సాటి లేనిదిగా వెలుగొందుతుంది. నీ యశోలతికలు నాలుగు దిక్కుల పాకి, అల్లుకొంటాయి. ఇందులో నీవు ముందు వెనుకలు ఆలోచించవలసింది యేమీ లేదు." అని చెప్పాడు.

కుల గురువైన వసిష్ఠుడు చెప్పిన మాటలు విని దశరథనరపాలుడు ఆవులించాడు. కంట తడి బెట్టుకొన్నాడు. కానక కన్న సంతానాన్ని సుకుమార శరీరుల్ని - విశ్వామిత్రుడి వెంట కీకారణ్యాలకు పంపటం దశరథ భూమి పతికి మనోవ్యధను తెచ్చిపెట్టింది. అయినా తప్పదు.

కంట తడి తోటే బిడ్డలిద్దరినీ చేర బిలిచి జత చేశాడు. గుండె చివుక్కుమంటున్నా, తప్పక రామలక్ష్మణులిద్దరినీ, విశ్వామిత్రముని చేతిలో పెట్టాడు.

"లేక లేక కల్గిన సంతానం మీ చేత బెడుతున్నా. నా దుఃఖాన్ని యెట్లా మాన్పుతారో? మునీంద్రా!" బొటబొట కన్నీరు కార్చాడు సూర్యకుల ధరాధిపతి.

రామలక్ష్మణులు చెరివొక ప్రక్కన చిందులు తొక్కుతూ విశ్వామిత్రుడి వెంట పయనమై బయలుదేరారు. వాళ్ళిద్దరూ తన వెంట రావడం వల్ల మురిసిపోయాడు గాధినందనుడు.

"అమ్మయ్యా! ఈ రోజుతో నాకు కల్గుతున్న ముప్పు తొలగిపోతుంది-" అనుకుంటూ, ఆ భయంకరమైన కీకారణ్యంలోకి అడుగుపెట్టి ప్రయాణం సాగించాడు.

"ఇక ఈ దండకారణ్యంలో వున్న ద్రావిడులనందరినీ పేరు పేరు చెప్పి యేరివేస్తా - ద్రవిడ జాతినంతా బూడిద చేస్తా-" సంబరపడుతూ నడక సాగించాడు కుశికతనూభవుడు.

"రామలక్ష్మణులు చాలా చిన్నవాళ్ళు; ఒకవేళ వింటినారి మోతలు వింటే, వాటి భీకరధ్వనికి భయపడతారేమో? తొందరపడి ఏమీ చేయకూడదు. జాగ్రత్తగా ఆలోచించి, క్రమక్రమంగా కార్యం నెరవేరేట్టు చూడాలి. లేకపోతే, అనుకొన్నదానికి భిన్నంగా జరుగవచ్చు.

పొరపాటున దారిలో తలవని తలంపుగా భయంకర పరిస్థితి యేర్పడ్డా, నెమ్మదిగా వీపు తట్టి, భయం పోగొట్టి, ముందుగా రాముడికి సాహసం వచ్చేట్టు చేయాలి.

ప్రయాణాన్ని సాగిస్తున్నాడు విశ్వామిత్రుడు.

తన మనస్సులోని తికమకల్ని మానాడు. ద్రావిడ జాతిపై పెల్లుబుకుతున్న వుద్రేకాన్ని అణచివేశాడు.

లోకులకెవ్వరికీ తెలియకుండా, కార్యాన్ని సాధించాలని, వొక వుపాయం ఆలోచించాడు.

విశ్వామిత్రుడు రకరకాలుగా ఆలోచిస్తున్నాడు.

"తాటకి దండకారణ్యంలో ఈ ప్రాంతంలోనే సంచరిస్తూ వుంటుంది. మురిమురి చీకట్లు దిక్కులను ముసిరే సమయంలో, ఆమె వొంటరిగా వుంటుంది. అకస్మాత్తుగా ఒకసారి ఆమెపై బడి ప్రాణాలు తీయటానికి అవకాశం వుంటుంది. ఆడుది గదా! ఎటు పోయి, ఎటు వచ్చినా పని చక్కబెట్టుకోవచ్చు. ఈ చర్యవల్ల రాముడికి భయం కూడా పోగొట్టవచ్చు."

వివిధ రకాల ఆలోచనలతో, విశ్వామిత్రుడు రామలక్ష్మణుల్ని వెంటబెట్టుకొని సాగిపోతున్నాడు. పొద్దు పడమటి దిక్కుకు వాలింది.

ముగ్గురూ ఇరుకుగా వున్న దండకాటవిని కాలిబాటనే పయనిస్తున్నారు. విశ్వామిత్రుడు మార్గమధ్యంలో, రాజ తనయులిద్దరికీ, ఆర్య ద్రావిడ సంఘర్షణలను, లోగడ జరిగిన వాటిని వివరిస్తున్నాడు.

శౌర్యరసం పొంగిపోయే విధంగా గాథల్ని కళ్ళకు కట్టినట్టుగా వినిపిస్తున్నాడు. ద్రావిడుల పేరెత్తితేనే రఘునందనులు మండిపడేట్టు చెబుతున్నాడు. ద్రావిడులపై తీరని కసిని నూరిపోశాడు. దారిలో కనిపించినా కాలుదువ్వేట్టు చెవినిల్లు కట్టి చెప్పాడు.

ఇట్లా కొంతదూరం నడిచారు. అదాటున సంభ్రమంతో ఒకచోట నిలబడి, రాముణ్ణి చూచి, ప్రసన్నవదనుడై దగ్గరకు పిలిచి చెప్పాడు.

"నాయనా! రామా! అదుగో! అక్కడ చూచావా. చూడు; ఆ పొదరిల్లు, దానిలో తాటకి అనే ద్రావిడ వనిత, మాయలమారి రాత్రిపూట వశిస్తూ వుంటుంది. ఈవిడ ఆర్యులందరినీ నానారకాలుగా హింసిస్తూ వుంటుంది. గోహంతకులని ప్రచారం చేస్తూ నిందిస్తూ వుంటుంది. ముందు దీన్ని మన కార్యానికి తొలిముద్దగా రూపుమాపటం అవసరం. రామచంద్రా! ఒకవేళ ఈమె స్త్రీ గదా! అని జాలి చూపుతావేమో? ఈ జగజ్జంతపై అట్లాంటి జాలి చూపవలసిన పని లేదు. మమ్మల్ని యెంత బాధిస్తుందో! అనుభవించే మాకు తెలుసు. ఎంతకైనా తగిందే...! ఏమాత్రం ఎదురాడకుండా, వెంటనే నీ ధనుస్సుకు ఆహారంగా చెయ్.."

విశ్వామిత్రుడి మాటలు విని, రామలక్ష్మణులిద్దరూ ధనువులెక్కుపెట్టి, దిక్కులు పిక్కటిల్లేలా అల్లెతాళ్ళను మోగించారు.

భూనభోంతరాలు దద్దరిల్లే, ఆశింజినీ రావం విని, తాటకి దబ్బున బయటకు వచ్చి నిలిచింది. ఇంకేముంది? ఎక్కుపెట్టిన రఘునందనుల ధనుస్సుల నుండి బాణాలు గుంపులు గుంపులుగా వాటెడు వచ్చి, తాటకిపై బడ్డాయి. చిత్తజల్లుగా వచ్చిపడ్డ తూపుల తాకిడికి, తాటకీ కాంత దేహం తూటులుపడి రక్తం మడుగుగా కారింది. చూస్తూ వుండగానే, కాళ్ళూ – చేతులూ తెగిపోయాయి. అక్కడే నేలపై కూలి ప్రాణాలు వదిలింది.

ఆహా! ఆర్యవంశ క్షత్రియ కుమారులు ఎంత బలశాలులో...!

తాటకి మరణించటం చూచిన విశ్వామిత్రుడికి మొగం – 'ఇంత' అయింది. పట్టరాని సంతోషంతో పొంగిపోయాడు, కేకిసలు కొట్టాడు.

ద్రావిడ కాంత చనిపోవటంతోటే, రామలక్ష్మణులు విల్లెక్కుదించి ధనస్సులు మూపులకు తగిలించారు.

ముక్కు నుండీ – నోటి నుండీ – నెత్తురు ధారకట్టగా, చాపచుట్టగా నేలపై పడ్డ ఆ వనితను కసిదీర గాంచి, పెదనవ్వు నవ్వి దశరథ తనయుల్ని తీసుకొని గాధిపుత్రుడు ముందుకు సాగిపోయాడు.

తొంభై యేళ్ళు దాటిన మూడు కాళ్ళ ముసలి వగ్గును తాటకిని నవ యౌవనమందుండే కండకావరంతో మిట్టవడుతున్న రాకుమారులచే చంపించి, వైమరచి సల్లాపాలాడుకొంటూ విశ్వామిత్రుడు చిందులు వేస్తున్నాడు.

అయినా, రణ పాండిత్యంలో ఆరితేరిన ద్రావిడ వీరయోధుల్ని యెదుర్కొని నిలువరించగల దిట్టతనం రామలక్ష్మణులకు లేదని కలత పీడిస్తుంది గాధీతనయుణ్ణి. కదన కోవిదులైన ద్రవిడ వీరుల ప్రతాప పౌరుషాలకు దశరథనందనులు, ఏ విధంగానూ సాటిరారనే అనుమానం అతణ్ణి వెన్నాడింది.

ఆ సంశయంతోటే పాలుపోక, ముందుకు సాగిపోతూ, తాను అంతకు ముందు నేర్చుకున్న శస్త్రాస్త్ర విద్యను సమస్తం నేర్పాడు. ఆశ్రమంలో ప్రవేశించి, తల్లడపడుతున్న మనస్సుతో సంబరాలన్నీ కూర్చుకొని, ఎన్నడో రుచి చచ్చిన నాలుక తుప్పును వదిలించానికి తొందర పడుతూ గోమేధం చేయాలని ప్రయత్నం చేస్తున్నాడు.

తమ తల్లి తాటకి రామలక్ష్మణుల చేతిలో మరణించిందని తెలియని మారీచ సుబాహులు, తల్లి ఆజ్ఞను శిరసా వహిస్తున్నవాళ్ళు కాబట్టి, విశ్వామిత్రుడు చేయతలపెట్టిన గోమేధాన్ని విఘ్నం చేయాలనే తలంపుతో వచ్చారు.

తాటకిని చంపిన నెత్తుటి తడియారకుండగనే, అదే చేత్తో వాడి శరాలను సంధించి, చీకటిలో నిలచి, చడీచప్పుడు గాకుండా అల్లె త్రాటిని చెవి దాగా లాగి విడిచాడు రాముడు. వాటిల్లో వొక బాణం దూసుకొని వచ్చి సుబాహుణ్ణి తాకింది. అతడు వెంటనే నేలపై వొరిగాడు.

రెండో బాణం సరిగా గురి కుదరకపోవడం వల్ల, గురి తప్పి మారీచుణ్ణి చంపలేక పోయింది. అయితే మారీచుడు దాని తాకు తగిలి మూర్ఛిల్లినట్లై, కిందపడి, కొంతసేపటికి తేరి, భయపడి పారిపోయాడు.

తరువాత విశ్వామిత్రుడు ఏ ఆటంకం లేకుండా, యజ్ఞాన్ని పూర్తి కావించి, రామలక్ష్మణుల శక్తిసామర్థ్యాలు ఇంకా తగిన స్థాయికి ఎదగలేదని గ్రహించాడు. పోటు మన్నీలైప ద్రావిడవీరులను హతమార్చటానికి వీళ్ళ భుజబలాటోపం సమర్థమైంది కాదని భావించి మిన్నకుండాడు.

అట్లా కొంతకాలం దశరథ పుత్రులను ఆశ్రమంలో తన వద్దనే వుంచుకొని, యిక వాళ్ళతో కావలసిన పనియేమీ లేదని భావించి కుశిక తనూజాతుడు వాళ్ళను తీసుకొని నేరుగా మిథిలకు ప్రయాణమైపోయాడు.

అక్కడ మిథిలలో జనకుని యింట దాదాపు పది పన్నెండు తరాల నుండి చివికి చెదబట్టిన పాత వింటి బద్ద వొకటి వుంది. దాన్ని రాముడితో విరిపించి, అతని కంటె పెద్దదీ – పుట్టు పూర్వోత్తరాలు తెలియనిదీ – అయిన జనకుడి కూతురుగా పేరొందిన సీతతో పెళ్ళి జరిపించాడు.

'ఏనాటి నుంచో, యిద్దరి మధ్యా పచ్చగడ్డి వేస్తే భగ్గున మండే రెండు క్షత్రియ కూటాలకు, రాజకీయ సఖ్యత కూర్చాలని, ఆలోచించి విశ్వామిత్రుడు జనక దశరథ కుటుంబాలకు బాంధవ్యం కలిపాడు.

రాముడు సీతను పెళ్ళియాడిన తరువాత, సాకేత నగరానికి తిరిగి వస్తూ, దారిలో ముసలి వగ్గు, వడుగైన పరశురాముణ్ణి తన గురువుగారి వింటిబద్దను విరిచాడనే కోపంతో రాముడిపై మండిపడుతున్నవాణ్ణి – భంగపరచి అతణ్ణి వింధ్య పర్వతాలు దాటి దక్షిణ దేశానికి పంపారు.

దక్షిణాదిలో గల కేరళ దేశానికి పోయి, అక్కడ అరణ్య నాగరికతను వ్యాప్తి చేయవలసిందిగా కట్టడి చేశారు.

ఆ తరువాత గాధినందనుడు రామలక్ష్మణులను తీసుకొని, అయోధ్యకు పోయి, బాలకులనిద్దరినీ దశరథుడి కప్పగించి, తాను తన యిచ్ఛ వచ్చిన ప్రాంతానికి వెళ్ళాడు.

వయసుడిగినా, రాజ్యంపై కాంక్ష వదలక దశరథుడు పాలనా బాధ్యతలు రాముడికీయకుండా తానే పాలిస్తున్నాడు. రాముడు సీతతో హాయిగా కామక్రీడలో మునిగి కాలం వెళ్ళబుచ్చుతున్నాడు.

ఇట్లా వుండగా, ఆనాడు తాను– తాటకి, మారీచ సుబాహుల రక్తాన్ని చవిచూచిన ఘట్టం గుర్తుకువచ్చి, ఎట్లాగైనా సరే, ఏదో వంకతో దండకాటవిలోని ద్రావిడ భూములకు పోయి, అక్కడ ఆర్య రాజ్య విస్తృతి కావించాలని భావించాడు. సమయం కోసం వేచి

చూస్తున్నాడు.

ఇంతలో తండ్రి దశరథుడు వార్ధక్య భారంపైన పడడం వల్ల రాజ్యభారం మోయలేక, దాన్ని తనకు కట్టబెట్టాలని ఆలోచిస్తున్నట్లుగా రాముడు విన్నాడు.

పట్టాభిషిక్తుడై రాజ్యభారం వహిస్తే, తాననుకున్న పని నెరవేరదని భావించాడు రాముడు. వెంటనే పినతల్లి కైక దగ్గరకు పోయాడు. విషయమంతా పూసగుచ్చినట్టు చెప్పాడు.

"అమ్మా! ఎట్లాగైనా నన్ను దండకారణ్యం పంపే ఏర్పాటు చేయి. ఆ అరణ్య వీధుల్లో తిరిగే భాగ్యం అబ్బితే, శత్రుమూకను చీల్చి చెండాడి, ఆర్య రాజ్య రమాప్రభలు దశదిశలా వెలుగొందేట్టు చేస్తా.

రాజులు సంతుష్టులైతే, భ్రష్టులౌతారని చెప్పే పెద్దల వాక్యం నీకు తెలియంది కాదమ్మా! నీవే నాకు ఏడుగడవు తల్లీ! నీవు దప్ప నాకింకెవరు వున్నారు? జననీ! నా కోర్కె కాదనకు; ఆర్య రాజ్య విస్తృతి నీ చేతిలో వుంది."

రాముడి మాటలన్నీ విన్న పినతల్లి కైక అతణ్ణి అక్కున చేర్చుకుంది. నిండు ప్రేమతో, చనవుతో తల నిమురుతూ-

"కన్నతండ్రీ! నీ యిష్ట ప్రకారమే చేస్తా. సమయం కనిపెట్టి తప్పకుండా, ఏ వుపాయం చేతనైనా, నీ కార్యం నెరవేరుస్తా. ఈ విషయంలో ఎంతటి నిందలు మోయటానికైనా వెనుదీయను. ఏమాత్రం సందేహించను తండ్రీ! నా మాట నమ్ము -" కైక చెప్పింది.

పినతల్లి మాటలు విన్న శ్రీరామచంద్రుడు సంతోష తరంగిత మనస్కుడై, ఆమె దగ్గర సెలవు తీసుకొని తన నివాసానికి వెళ్ళాడు.

ఆ తరువాత వొకనాడు, కైకేయీ పుట్టినింట దాసియైన మంధర పరుగు పరుగున వచ్చి-

"దేవీ! కేకయ రాజనందినీ! దశరథ సార్వభౌముడు శ్రీరామచంద్రుణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేయటానికి లగ్నం నిశ్చయించాడు. అందుకు కావలసిన సంబారాలన్నీ సమకూరుస్తున్నాడు. ఆ పర్వదినం కూడా రేపే." రొజుతూ రొప్పుతూ చెప్పింది.

అదను కోసం చూస్తున్న కైక, మందర తెచ్చిన ఈ వార్తకు లోలోపల మురిసిపోయింది. అనుకోకుండా కలసి వచ్చిన సమయాన్ని జారవిడువకూడదనుకొంది.

ఇంతకు ముందొకసారి ఆర్య ద్రావిడ ఘోర భీకరసంగ్రామంలో, తాను చేసిన సహాయానికి సంతోషపడి, తన భర్త దశరథుడిచ్చిన రెండు వరాలను గుర్తుకు తెచ్చుకొంది. వాటిని యిప్పుడు కోరుకోవాలని ఆత్రపడ్డది.

ఒక వరం ద్వారా - రాముణ్ణి వనవాసానికి పంపాలి. రెండో వరం ద్వారా - తన కొడుకైన భరతుడికి రాజ్య పట్టాభిషేకం జరగాలి.

గట్టిగా పట్టుబట్టి వయోవృద్ధుడు - స్త్రీ లోలుడయిన చక్రవర్తిని నొప్పించి, ఒప్పించింది.

ఈ సమాచారం శ్రీరాముడికి పంపింది.

వెంటనే సహధర్మచారిణియైన సీతతోనూ- సోదరుడైన లక్ష్మణుడితోనూ దండకాటవిలో సంచరించటానికి బయలుదేరాడు.

తండ్రి దశరథుడు వద్దని వలవల యేడుస్తున్నా, వినిపించుకోకుండా పయనమై పోయాడు.

సుమంత్రుడు రథం సిద్ధం చేసి తెచ్చాడు. సీతా రామ లక్ష్మణులు ముగ్గురూ ఆ రథమెక్కి రాజమార్గాన వెళ్ళారు.

కొంతదూరం పోయేసరికి గంగాతీరం వచ్చింది. సుమంత్రుడు ఆ నదీ తీరాన ముగ్గురినీ వదిలి, వదలలేక - వదలలేక, కనుచూపు మేర వరకు తిరిగి, తిరిగి చూస్తూ అయోధ్యా నగరానికి తిరుగుముఖం పట్టాడు.

సుమంత్రుడు పోయిన తరువాత ఏమీ తోచక, గంగానదిని దాటడానికి దొన్నె కోసం వేచి చూస్తున్నారు.

అంతలో రాజనీతివేత్తయయిన రాముడు. దేశకాలపాత్రాలను తెలుసుకొంటూ చతురుపాయ ప్రయోగంతో, తన కోర్కె నెరవేర్చుకోవాలని భావించాడు.

అక్కడే బోయ పెద్ద, ఆ ప్రాంతాలకెల్ల గొప్పవాడుగా చెప్పబడుతున్నవాడు, ఎంత నిండు ఏటిమీదనైనా పడవను అవలీలగా, నిర్భయంగా నడుపగల నేర్పరి అయిన గుహుడు అనే వాడితో స్నేహం చేశాడు రాముడు.

గుహుడితో కొంతసేపు ఆయా మంచి చెడ్డలు చెప్పుకొని, అతణ్ణి తనవాడుగా చేసుకొన్నాడు రాముడు. మంచి మాటలతోనే పడవనెక్కి, గంగ దాటి ఆవలి వొడ్డుకు చేరారు ముగ్గురూ.

గుహుడు కూడా సీతారామలక్ష్మణులను గంగను దాటించి, తన యభిమానాన్ని చాటుకొన్నాడు.

అట్లా గంగానదిని దాటిన ఆ ముగ్గురూ, కాలి నడకతోనే అంతూ పొంతూ లేని అడవి కేసి వెళ్ళారు. కొంతదూరం పోయి, పోయి చిత్రకూటమనే పర్వతం చేరుకొన్నారు. అది నివాసయోగ్యంగా వుందని భావించి అక్కడే వశించారు.

ఇంతలోనే, తన తండ్రి దశరథ భూపాలుడు మరణించిన వార్త తీసుకొని భరతుడు రానే వచ్చాడు.

"తండ్రి చనిపోయాడు కాబట్టి, నీవే వచ్చి రాజ్యభారం వహించవలసింద-"ని భరతుడు రాముణ్ణి ప్రార్థించి, అయోధ్యకు రమ్మని పట్టుపట్టాడు.

తండ్రి మరణవార్త విన్న రాముడు పరితపించాడు. రాజధానికి తిరిగిపోయే ఆలోచన లేదు. కాబట్టి భరతుడికి, తన పాదుకలనిచ్చి రాజ్యపాలన చేసుకొమ్మని చెప్పి పంపాడు.

భరతుడు పోయిన తరువాత రాముడాలోచనలో పడ్డాడు.

"ఈ చిత్రకూటం అయోధ్యకు చాల దగ్గరలో వుంది. భరతుడికి నేనంటే వల్లమాలిన ప్రేమ. నేనిక్కడే వుంటే, ఈతడు చీటికీ – మాటికీ వస్తాడు. ఇట్లాగే, రాజ్యానికి తిరిగి రమ్మని బాధ పెట్టవచ్చు. పొరపాటున జాలితో మెత్తపడి, కర్తవ్యాన్ని మరచి, నేనూ సుముఖత చూపవచ్చు. కాబట్టి, యిక్కడ వుండడం మంచిది గాదు. భరతుడికి కూడా తెలియని సుదూర ప్రాంతానికి పోవటం మంచిది."

వానలను లెక్కసేయక, ఎముకలు గొరికే చలిని సహించి, వురుములకు – మెరుపులకూ ఉలిక్కిపడక, వుబ్బ కోరిచి, ఎండను, దప్పికను భరించి, అక్కడి నుంచి దక్షిణ దిక్కుగా పయనమై పోయారు.

ఇట్లా పోగా – పోగా కొంత దూరం పోయిన తరువాత దారిలో ఒక ముని కుమారుడు కనిపించాడు. అతణ్ణి చూడగానే సంతోషం వేసింది సీతా రామలక్ష్మణులకు.

ఆ మునికుమారుణ్ణి యోగ క్షేమాలడిగాడు రాముడు.

"కుమారా! ఈ అడవిలో మున్యాశ్రమాలున్నాయా? ఇక్కడకు దగ్గరలో ఏదైనా ఆశ్రమం వుందా? –"

రాముడి మాటలు విన్న బ్రహ్మచారి – "దేవా! ఈ దారిలోనే, దగ్గరలో ఒక ఋష్యాశ్రమం వుంది. అది చాలా రమణీయంగా వుంటుంది." అని చెప్పాడు.

ఆ మాటలకు ప్రాణాలు లేచి వచ్చినట్టై, ముని బాలకుడు చెప్పిన బాట బట్టి ముగ్గురూ సాగిపోతున్నారు.

ఆ దారిన, నాలుగడుగులు వేశారో – లేదో – ఒక స్త్రీ వాళ్ళ కంటబడ్డది.

చిన్నతనం నుంచే పరసేవే వృత్తిగా పెట్టుకొని ముని ఋషుల పర్ణ కుటీరాల్లో దొరికే, కమికెడు తింటూ, వాళ్ళ సంపర్కమే శరణ్యంగా, అదే స్వర్గమని భావిస్తూ, ఆ కామిని మునిపల్లెలో తిరుగుతూ వుంటుంది.

ఇట్లా చెపుతూ వుంటే, నేను కూడా సంకులిత మనస్సు కలవాడనై, అభిమానాన్ని విడిచిపెట్టి, మున్యాశ్రమాలను మెట్టి తిరిగే, ఆమె చరిత్ర తెలుసుకోవాలని బుద్ధి పుట్టింది.

ఆమె యెవరు?

ఆమె చరిత్ర యెట్లాటిదో?

ఆమె అనుపాను లెట్లాంటివో?

సవివరంగా తెలుసుకోవాలని కోర్కె పుట్టి, సూత మహాముని మోము చూచి, "మునీంద్రా! రాముడికి కనిపించిన ఆ స్త్రీ యెవరు?

ఆమె పేరేది?

ఏ జాతిలో పుట్టింది?

ప్రస్తుతం ఆమె జాతి వునికిలో వుందా?

ఒకవేళ వుంటే, అది యెక్కడ వుంది?"

ఈ విషయాలన్నీ క్లుప్తంగా చెప్ప ప్రార్థిస్తున్నా.

నా మాటలు విన్న సూత ఋషి - అర కన్నులు మొగిడ్చి, కొంత వుండి, చెప్పటం మొదలుపెట్టాడు.

"కుమారా! రామస్వామీ! పెద్దవాళ్ళెవరూ ఆమెకు పేరు పెట్టలేదు. జాతి పేరుతో మాత్రం ఆమెను శబరి అని పిలుస్తారు.

అక్కడున్న మునులందరికీ బట్టలుతుకుతూ వుంటుంది. ఇంకా, అడ్డమైన చాకిరి చేస్తుంది. ఎన్నాళ్ళ నుంచో వాళ్ళనే కనిపెట్టుకుని వుంటుంది. అంతా చేస్తే, వాళ్ళు వేసేది వొక ముద్ద కూడు. ఏ మాత్రం ఎబ్బెరికం లేకుండా, అన్ని పనులూ చేస్తుంది. జాతి మర్యాద, గౌరవాలు నట్టేట్లో కలిపింది.

జాతి భ్రష్ట - అనే కారణంతో, శబర జాతి వాళ్ళంతా ఆమెను సంఘం నుంచి వెలి వేశారు. తనను వెలివేశారనే కోపం, ఆమెకు తన జాతివాళ్ళపై వుంది అనే భావంతో జాతి పట్ల వ్యవహరిస్తుంది. తన జాతిని విడిచిపుచ్చింది.

తన వాళ్ళను విడిచి పెట్టినప్పటినుంచీ, ఆమె ముని పల్లెల నాశ్రయించే, యెల్లకాలం బ్రతుకు నీడుస్తుంది. వాళ్ళేదో పాసిన కూడు వేస్తే, యింత తిని, వాళ్ళ పంచల్లో పడి వుంటుంది. వాళ్ళు చెప్పుకొనే వేదాంతం వింటూ - 'బ్రహ్మ విద్యనూ, పాసిన కూటినీ' - ప్రసాదించారని భావిస్తూ బ్రతుకుతుంది.

అక్కడున్న ముని జనం, తమకు నమ్మినబంటుగా సేవ చేస్తున్న ఆమెను చూచి జాలితో కనుబొమలెగురవేస్తూ వుంటారు.

శబరిని వాళ్ళెప్పుడూ పేరు పెట్టి పిలవలేదు. దీనికి కారణం తెలుసా?

తాము ఆర్యులమనీ, శబరికాంతను పేరు పెట్టి పిలిస్తే, తమ పరువు ఎక్కడ పోతుందనే గర్వం.

అభిమానమున్న యేవ్యక్తి, యిట్లాంటి అవమానాన్ని సహించదు. వీళ్ళంతా - ఆమెను - 'చెంచెత' - అని మాత్రమే పిలుస్తారు.

జయపురం కొండ ప్రాంతాల్లో ఈనాటికి యీమె జాతి ప్రజలున్నారు. వాళ్ళను నేడు మనం - 'సవరులు' అని పిలుస్తున్నాం- ఇది వరకు వీళ్ళనే - 'వానరులు' - అని పిలిచేవాళ్ళు. ఈ విషయం నీకు తెలిసే వుండాలి.

ఆనాడు శబరులుగా పిలువబడ్డ వాళ్ళే ఈనాడు - సవరులుగా మన చేత పిలువబడుతున్నారు. నాగరికతలో ఆనాటికీ, యీనాటికీ పెద్ద మార్పున్నట్టు కనబడదు.' అని చెప్పి, అసలు కథలోకి దిగాడు సూతమునీంద్రుడు.

సీతారామలక్ష్మణులు, మార్గాయాసాన్ని గూడా లెక్కచేయక తమకెదురైన ఆ శబరి కాంత ఆతిథ్యాన్ని స్వీకరించటానికి సంభ్రమించారు.

నడక అలవాటు లేని మీదట, అంతఃపురాల్లో సుఖాలనుభవించిన వీళ్ళ ముగ్గురికి ముచ్చెమటలు పోసి, చెమట కుళ్ళంతా దిగజారిపోయింది. కొంతసేపటికి, ఆ శ్రమ భూమిని సమీపించారు.

అంతకు ముందే సీతారామలక్ష్మణుల గురించి, అక్కడి మునులు చెప్పిన ఆనవాళ్ళను బట్టి, శబరి ఆ ముగ్గురినీ గుర్తించి పరమానందంతో పొంగిపోయింది.

పండ్ల బరువు వల్ల వంగిన చెట్ల కొమ్మల నుండి, మంచి, మంచి పండ్లను కోసి, రుచి చూచి, బాగా రుచి గల వాటిని ఎంగిలి చేసిన వాటిని రాముడి కిచ్చింది. ఇంకా తనకు అందకుండా పైనున్న వాటిని చెంగున ఎగిరి కోసి యిచ్చింది.

నకనకలాడుతున్న ఆకటిని బాపుకోవటం కర్తవ్యం కాబట్టి రాముడా యెంగిలి పండ్లనే సంతోషంతో ఆరగించాడు.

ద్రవిడ ప్రజలచే ఈసడింపబడి, అభిజాత్యాన్ని కోల్పోయిన శబరి కాంత యెంగిలి పండ్లను రాముడు ఏమాత్రం ఏవగించుకోక తిన్నాడు.

కార్యశూరులకు పట్టింపులనేవి వుండవు.

ప్రతిరోజూ ఆర్య ఋషుల యెంగిలి కూడు తిని, తన దేహాన్ని పోషించుకుంది శబరి. రాముడామె యెంగిలి తిన్నాడు. ఇందులో తప్పేమీ లేదు. ఉమ్మి ఉమ్మిలో కలసిపోతుంది.

శబరి భక్తిని కనిపెట్టి, సంతోషించి ఆమెకు కంటిచూపుతోనే మోక్షాన్ని కట్టపెట్టాడు రాముడు.

ఎండలకెండి, వానలకు తడిసి, క్రూరమృగాల భీకరార్భటులకు జడిసి, యేం చేయాలో తోచక, మధ్యలో కొంతసేపు ఆగుతూ ఆ అడవి దారిలో రాముడు సీతాలక్ష్మణులతో సాగుతున్నాడు.

ముదురు వెదురు బియ్యపు కూడు తిని పొట్టనిండా పుట్ట తేనె తాగి, మడ్డి యిప్పకల్లు ఆరగించి, ముగ్గురూ అరణ్య మార్గాన గమిస్తున్నారు .

ఏదుపందులు - సివంగులు - ఎలుగుబంట్లు - కుందేళ్ళు- తోడేళ్ళు - లేళ్ళు - చిరుతపులులు - పెద్ద పులులూ - సింహాలు ఇంకా వివిధ రకాల జంతువులకు నిలయమైన కీకారణ్యంలో కాళ్ళు బలపాలు కట్టేట్టు తిరుగుతున్నారు.

నానుడు వానలు కురవటం వల్ల చేయెత్తు పెరిగిన గడ్డి పొదలలో మునిగి, దాగుడు మూతలాడుతూ మెకాలు భీతిగొల్పుతున్నాయి.

ఎంత దూరం నడిచినా, వాస యోగ్యమైన ప్రదేశం కనిపించలేదు. నడచి - నడచీ

విసుగుపుట్టి, చీకాకు పడుతూ వెళుతూనే వున్నారు ముగ్గురూ.

కొంతదూరం పోయేటప్పటికి, తమ దారికి దాపులోనే వొక పర్ణశాల కనపడ్డది. 'అమ్మయ్య!' అనుకొని అక్కడికి చేరారు.

ఆ పర్ణశాలలో అగస్త్యుడనే ఋషి, తన భార్య లోపాముద్రతో కాపురం వుంటున్నాడని తెలుసుకొన్నారు. 'ఆయనను చూడడం మంచిద'ని భావించి ముగ్గురూ కలిసి, ఆ ముని దగ్గరకు వెళ్ళారు.

పోయి, తమ కుల గోత్ర నామాలు చెప్పుకొని, తముమ తాము పరిచయం చేసుకొని వినయంతో సాష్టాంగ నమస్కారం చేశారు.

మిక్కిలి వినయంతో నమస్కరించిన వాళ్ళ ముగ్గురినీ చూచి, అగస్త్యుడు సంతోషపడి, దీవించి - భూత భవిష్యద్వర్తమానాలు తెలిసినవాడు కాబట్టి రాముడి వల్ల సొంతం గ్రహించి, కొంతసేపు బాధపడి, అంతలోనే తేరుకొని రాముణ్ణి చూచి-

"రాఘవులారా! ఇక్కడి నుంచి, ఇంకా కొంచెం ముందుకుపోతే, దగ్గరలోనే - పంచవటి- అనే వనం వుంది. అది మీ బోటి వాళ్ళకు వాసయోగ్యంగా వుంటుంది.

ఏపుగా పెరిగి వృక్షాల నీడలో, మునులంతా అక్కడ చెక్కు చెమర్చకుండా నివశిస్తారు. అక్కడకు పోతే మీకు మానసికశాంతి, విశ్రాంతి కలుగుతాయి. కాబట్టి, ఆ ప్రాంతానికి పోయి నివాసమేర్పాటు చేసుకోండి. ముని దర్శన లాభం కూడా కలుగుతుంది" అన్నాడు.

ముని పుంగవుడైన అగస్త్యుడి అనుమతి తీసుకొని, పంచవటికి పోయే దారి గూడా మునినడిగి తెలుసుకొని సీతాసమన్వితులైన రాఘవులు హుటాహుటి నడకలతో ఆ ప్రాంతానికి ప్రయాణమయ్యారు.

ఎట్టకేలకు పంచవటిపోయి, ఆ ప్రాంతాన్ని వాసయోగ్యంగా భావించి అక్కడ వొక పర్ణశాల కట్టుకొని కాపురమంటున్నారు. లక్ష్మణుడు - సీతారాములకు బాసటగా వున్నాడు. జరిగిందంతా నెమరు వేసుకొంటూ కాలం వెళ్ళబుచ్చుతున్నారు.

తన జాతివాళ్ళూ - తన కులం వాళ్ళూ కంటికి కనుపించని సుదూర ప్రాంతంలో, ఎండ పొడగూడా పడని సాంద్రారణ్యభూమిలో, 'హోరు'మని తోలే గాలి, వుయ్యాల లూగించే పొరుటాకుల కప్పుగల పాకలో కాపురం వుంటున్నారు.

అలవాటు ప్రకారం వొకనాడు, కారు నల్లని కాకి వొకటి పర్ణశాలలో దూరి, సీత బెదరగొడుతున్నా పోకుండా, అట్లాగే మొండికేసుకుని వుంది. కాకిని చూచి బెదరిపోయిన ధరణిజ భర్తతో నొక్కులు నొక్కి పలికి, చివరకు దాన్ని చంపించింది.

రాముడు కాకిని చంపి, దాన్ని ఆ కుటీరపు కాకివాసానికి జారిపోకుండా బంధించాడు. ఇక ఇక్కడ నుంచి దృష్టి దోషం తమకేమి తగులదని భావించాడు.

ద్రావిడులు పక్షుల్లో కాకిని అభిమానంగా పూజిస్తారు. ఇది ద్రావిడ జాతిపక్షిగా

గౌరవింపబడుతుంది. ఈ సంగతి రాముడికి తెలుసు. అందుకే కసిదీరేట్టు కాకిని చంపి, తన యింటి ముందు కట్టేశాడు.

కావాలనే రాముడు ద్రావిడ జాతితో వైరం పెట్టుకొన్నాడు. వీళ్ళతో వివాదం పెట్టుకోవటానికి ఇంతకంటే మార్గం లేదనుకొన్నాడు.

కారుచీకట్లు దిశలను కమ్మి పాలిస్తున్న వేళలో, గొర్రెలను కాసే గొర్రెల కాపరిలాగా, లక్ష్మణుడు నిద్రమాని తెల్లవారులూ సీతారాములకు కాపలా కాస్తూ వుంటాడు.

ఆ పంచవటిలో, పర్ణశాల నిర్మించుకొని కాపురం చేస్తూ వున్నారు. ఒక రోజున లక్ష్మణుడు, ఇనుప గొడ్డలి నొకటి చేత్తో పట్టుకొని మూపు మీద వురులు వ్రేలాడుతూ వుండగా భోజనానికి కందమూలాలు తెద్దామని బయలుదేరాడు.

కందమూలాలు తేవటానికని అడవిలో కొంత దూరం పోయాడు. ఆ దారిలో సౌమిత్రికి తళతళ మెరుస్తూ ఒక చంద్రహాసం కనిపించింది. దానికి మంచి పదను వుంది.

చంద్రహాసాన్ని చూచిన లక్ష్మణుడి మొగంలో మందహాసం మోసులెత్తింది. దానికి బాగా పదును వుందో - లేదో చూద్దామని ప్రక్కనే వున్న పుష్ప ఫలభరవినమ్రాలైన మంచి మంచి చెట్లను నరకటం మొదలుపెట్టాడు.

ఆ ప్రక్కనే ముని పల్లె వొకటి వుంది. లక్ష్మణుడిట్లా పుష్ప ఫలభరితాలైన వృక్షాలను నరకడం ఆ ముని పల్లెలోని ఋషులు చూచారు. వెంటనే వాళ్ళంతా పరుగు పరుగున వచ్చి;

"ఓ దయామయా! మంచి, మంచి పండ్లను కాస్తూ, మాకందరికీ ఆశ్రయాన్నిస్తున్న ఈ చెట్లను నరకటం దేనికి? మా మీద మీకు దయ వుంటే, వొక పనిచేసి పెట్టు. దానితో మా చిక్కులు తీరిపోతాయి.

అదుగో! అటు చూడు; ఎదురుగా వెదురు పొద కనిపిస్తుంది. అక్కడికి నీవు తొందరగా పద. ఆ పొదను నేలమట్టం చేయటం అవసరం. దీనిలో ఏదులు స్వైరవిహారం చేస్తూ వుంటాయి. అవి ఎంతటి వీరుణ్ణైనా లెక్కచేయవు."

ఆ మునుల మాటలు విన్న లక్ష్మణుడు వెంటనే, చిప్ప కత్తి పదును సరి చూచుకొని, దృఢతరమైన తన కుడిచేతి నమాంతంగా ఎత్తి, వొక్క వ్రేటుతో వెదురుపొదను పడగూల్చాడు.

ఆ పొదనుండి కత్తిని తీసేటప్పటికి, దానిపై నెత్తుటి చారలు కనిపించాయి - వెదురు బియ్యం రక్తంతో తడిసిన అక్షతలుగా భాసించాయి. ఈ దృశ్యాన్ని చూచేటప్పటికి లక్ష్మణుడి గుండె బేజారెత్తింది; కన్నులు చెదరిపోయాయి. - 'ఎంత పాపం మూటకట్టుకొన్నానో?' అని కలత చెందాడు. 'ఇక ఏం చేయాలా? ఎట్లాగా-?' అని వాపోయాడు.

అటూ - ఇటూ చూచేప్పటికి మెడ తెగిన మునినాథుడొకడు గభాలున కనిపించాడు.

అది గాంచి లక్ష్మణుడు గడగడ వణకిపోయాడు.

ఏడుపు పొర్లుకొని వచ్చింది; కళ్ళవెంట బొటబొట కన్నీళ్ళు ముత్యాలు రాలినట్లు వరుసగట్టి రాలాయి. ఎవరైనా మునులు చూస్తారేమోనని ముసుగుపెట్టి, పర్ణశాలలో వున్న అన్న దగ్గరకు పోయి, కాళ్ళ మీద పడ్డాడు. కట్టలు తెంచుకొని ప్రవహిస్తున్న నది వోలె, ఆపినా ఆపని దుఃఖంతో రాముడి పాదాలు వదలకుండా వున్నాడు.

"అన్నా! తెలియక ఘోర పాపం చేశా. ఆపన్నుడనైన నన్ను కాపాడు. నీకంటే నాకు దిక్కెవరూ లేరు. అక్కడున్న పొదలో కూర్చుండి ఒక బ్రాహ్మణుడు ఘోర తపస్సు చేస్తున్నాడు. నేనా పొదను నరుకుతూ వుంటే, తెలియకుండా, ఆ తపోధరుడి తల కూడా తెగిపడ్డది. తెలియకుండా బ్రహ్మహత్య జరిగిపోయింది. వంశీ నాశనం చేద్దామనుకొంటే, వంశమే నాశనమయ్యే పరిస్థితి యేర్పడ్డది.

దుందుడుకుతనంతో నిష్కారణంగా, అజ్ఞానం అలముకోగా నీచకార్యం చేశా. దీనికేమైనా నిష్కృతి వుంటే, పరిష్కారం చూపి నన్ను ఉద్ధరించమని వేడుకొంటున్నా-"

ఈ మాటలు విన్న రాముడు

"కుమారా! అక్కటా! ఎంత ప్రమాదం జరిగింది? దుర్మార్గులను సంహరించి ధర్మాన్ని కాపాడుదామని వచ్చిన మనకు బలే సంకట పరిస్థితి సంభవించింది. ఇట్లాంటి స్థితి రాకూడదు. ఏం చేయాలో తోచటం లేదే -" లక్ష్మణుణ్ణి వోదార్చాడు.

లక్ష్మణుడు చేసిన కార్యాన్ని గమనించిన మునులు, రాముడున్న పర్ణశాలకు వచ్చారు. సోదరుణ్ణి వోదారుస్తున్న రాముడి మాటలు విన్నారు.

"మహారాజా! రామా! నీ సోదరుడు బ్రహ్మహత్య చేయలేదు. తల తెగిపడ్డ ముని బ్రాహ్మణుడు కాదు. అతడు దొంగ బ్రాహ్మణుడు; దొంగ తపసి; రావణుడి సోదరియైన శూర్పణఖ అనేదాని కొడుకు. అతడి పేరు జంబుకుడు. అతణ్ణి చంపితే పాపం రాదు."

మునుల మాటలకు రామలక్ష్మణులు సంతోషించారు. 'అంతకు ముందు తాము భయపడ్డ బ్రహ్మహత్యా దోషం తప్పింది గదా!' అని ఆనందించారు.

'ఎట్లాగైతేనేం? వాస్తవాన్ని చెప్పకుండా, తమ కార్యం నెరవేర్చుకొన్నాం గదా! తమ కడ్డంగా వున్న వొకణ్ణి పరిమార్చగలిగాం-' అని మునులు లోలోన సంతసించి, వొక్కరొక్కరుగా తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు.

సుప్రసిద్ధుడూ - విదిత యశస్కుడూ - అయిన లంకాధిపతి రావణుడికి మారు చెల్లెలూ, ఖరుడికి తోబుట్టువూ, జంబుకుడి తల్లీ అయిన శూర్పణఖ అభిజాత్యం గలది.

'నవ యౌవనంలో వుండగానే దొమ్మి సమరంలో చుప్పనాక భర్త మరణించాడు. అప్పటి నుంచి జీవితంపై విరక్తి పుట్టి యెల్లప్పుడూ వుపవాసాలు చేసి, శరీరాన్ని శుష్కింపచేస్తుంది. ఏండ్లూ, పూండ్లు గడిచాయి. వార్ధక్యం పైన బడ్డది. మొగం మొరటుగా

వుంది; శరీరం ముడుతలు పడ్డది. చూట్టానికి ఏవగింపు గొలుపుతుంది.

కొడుకు మీద ప్రేమ వదలక, అంత ముసలితనంలో కూడా ఆ దండకారణ్యంలో కొడుకు కోసమే వొక పర్ణశాల నిర్మించుకొని ఎక్కడికీ పోకుండా నివశిస్తోంది.

భర్త మరణంతోటే, జీవిత సుఖాలనన్నిటినీ పరిత్యజించి వైరాగ్యాన్ని స్వీకరించింది. పారలౌకిక చింతనలో కాలం వెళ్ళబుచ్చుతుంది. చుట్టపక్కాల దరి కూడా వెళ్ళటం మానింది.

లేక లేక కలిగిన యేకైక పుత్రుడు మహోగ్రతపం చేస్తున్నాడు. తనయుడి తపో దీక్షకు జాలిపడి, చూచిపోవటానికి వస్తుంది. తపస్సు చాలించిన సమయంలో పూవుల్ని – పండుల్ని అందిచ్చి వెడుతూ వుంటుంది.

ఇది చుప్పనాక దినచర్య.

యథాప్రకారంగా ఆనాడు కూడా మంచి రుచికరమైన ఫలాలను సొంతంగా ఏరి తెచ్చింది. అంతకంటె రుచిగల దుంపలను శ్రమకోర్చి సేకరించుకొని వచ్చింది. దేవ పూజకని అడవి సమస్తం తిరిగి పరిమళాన్ని విరజిమ్మే సుమరాణాలను కూడా ప్రోగు చేసుకొని యేతెంచింది. తన కుమారుని సంప్రీతికని తొట్రుపడుతూ బిరబిరా వచ్చింది శూర్పణఖ.

కాని, ప్రతిరోజూ కనిపించే తన కొడుకు ఆనాడు కనిపించలేదు. తన ముద్దుబిడ్డ తపస్సు చేసుకొనే వెదురుపొద కుప్పకూలిపోయి వుంది. గుండె దడ దడ కొట్టుకోసాగింది. ఏదో అనుమానం తొందర పెట్టుతోంది చుప్పనాకను. కొడుకు కోసం చుట్టుపక్కల పొలమంతా శోధించసాగింది.

చుట్టుపక్కల చూస్తున్న సమయంలో, వెదురు పొద మధ్యలో వొక చోట మొండెం కనిపించింది. దాన్ని చూచిన శూర్పణఖకు, పుత్రశోకం ఉత్కటమై కట్టలు తెగి పొంగి పారింది. కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. మూర్తీభవించిన శోకదేవతలాగా వున్న ఆ దీనురాలిని వోదార్చటానికి అక్కడ ఎవరున్నారు? గుండెచెదరి శోకవివశురాలై వున్మత్తురాలైంది.

కొడుకు శవం మీద పడి ఆక్రోశిస్తుంది. గోదుగోదుమని విలపిస్తుంది. తల నేలకేసి బాదుకొంటుంది. దండకాటవి దద్దరిల్లేలా పెద్దగా విలపించి, విలపించి యేడువలేక చివరకు ఆపింది.

అంతలో పక్కనే ఉన్న మునిపల్లె గుర్తుకు వచ్చింది. శోకభరాక్రాంత చిత్తంతో ఇనుమడించిన కోపం పెనవేసుకోగా హుటాహుటిన ఆ మునుల దగ్గరకు పోయింది.

"ఓ తాపసులారా! ఇదేం పాపం? నా కొడుకునెవరో దుర్మార్గుడు చంపిపోయాడు. ఆ నీచుడెవరో చెప్పండి – చెప్పకపోతే మీ ప్రాణాలు మీకు దక్కవు.

చుప్పనాక మాటలకు మునులంతా ఒక్కసారి గతుక్కుమన్నారు.

"అయ్యో! తల్లీ! ఎంత ఘోరం జరిగిపోయిందమ్మా! మీ అబ్బాయిని చంపారా? ఆ క్రూరకర్ములెవరో మాకు తెలియదమ్మా! నీ కొడుకు మరణం ఎప్పుడు జరిగిందో కూడా తెలియదు. కాని, ఒక్క సంగతి. 'అదుగో! ఆ పర్ణశాలలో ఒక స్త్రీతో కలసి యిద్దరు పురుషులుంటున్నారు. బహుశః తెలియక, వాళ్ళేమయినా ఈ పని చేశారేమో చెప్పలేము.

కడుపు మంట చల్లార్చుకోవటం కోసం అడవిలో దొరికే కంద మూలాలను తిని, సెలయేళ్ళ నీటిని పొట్టనిండా తాగి పొద్దు పుచ్చుతున్న మాబోటి వాళ్ళం, పాపమనకుండా- అకారణంగా లోకుల్ని చంపుతామా? తల్లీ! ఆ పని చేయటానికి మాకు చేతులెట్లా వస్తాయమ్మా!

తొందరగా ఆ పర్ణకుటీరానికి పోయి, వాళ్ళనడుగు. నీ తనయుణ్ణి దొంగచాటుగా చంపినవాళ్ళెవరో తెలిస్తే, తప్పకుండా యేమాత్రం సంకోచించకుండా అబద్ధం కూడా ఆడకుండా నిజం చెబుతారు - ఇట్లా మమ్మల్ని అడిగినందువల్ల లాభం లేదు."

మునులు చెప్పిన మాటలన్నీ విన్నది చుప్పనాక.

ముసలితనం వల్ల నడుం వంగిపోయింది. అవయవాల్లో పటుత్వం తగ్గి తూలిపోతూ వుంది. భరింపరాని దుఃఖం ముంచెత్తటంవల్ల నిలువునా కంపించి పోతూ వుంది.

'కలలో కూడా పరులకు అపకారం తలపెట్టని నాకు ఈ కడుపు కోత - అగచాట్లు దాపురించాయే?' అని భావిస్తూ ఆ పర్ణశాలకు పోయింది.

చుప్పనాక పోయిన సమయానికి శ్రీరాముడు సీతతో సుద్దులాడుతున్నాడు. తొంగిచూచింది ద్రావిడ కాంత: ఆ సంగతి గమనించి సీత వొక చెనటి నవ్వు నవ్వింది.

సీత నవ్విన పెడనవ్వును శూర్పణఖ లెక్కలోకి తీసుకోలేదు. నేరుగా రాముడి దగ్గరకు పోయింది.

"మీరెవ్వరో నాకు తెలియదు. పరమ తపోనిరతుడు, జీవహింసా పరాఙ్ముఖుడు, పరహింస వల్ల వచ్చే పాపమంటే విరక్తిగా వుండేవాడు, నాకున్న వొక్కగానొక్క కొడుకు జంబుకుడనేవాడు, తల తెగి నేల మీద పడి వుండాడు.

అక్కడ వున్న మునిపల్లెలోని మునులనందరినీ అడిగితే- ఈ విషయం మాకు తెలియదు. కాని - మీ తనయుణ్ణి చంపిన హంతకులెవరో, ఆ పర్ణశాలలోని వాళ్ళకు తెలుసు' - అని చెప్పారు. అందుకే నేను మీ దగ్గరకు వచ్చా- కన్న కడుపు కాబట్టి ప్రతీకారం తీర్చుకోవాలని తొందరపడుతున్నా. ఈ విషయం మీకు తెలిస్తే చెప్పి ధన్యులు కండి- అప్రక్ర విక్రమ భుజబల సంపన్నుడైన లంకాధిపతి రావణుణ్ణి చెనకి బ్రతికి బట్టగట్టిన వాడెవరూ యింతవరకు ఈ లోకంలో లేడు - నేనతని సోదరిని. మీకీ సంగతి తెలియదని చెపుతున్నా-"

శూర్పణఖ పలుకులు విన్నాడు శ్రీరాముడు.

"నీ పుత్రుణ్ణి చంపినవాణ్ణి మేమెరుగుదుము. నీ కుమారుడు జంబుకుడు ముని జనానికి అపకారం చేస్తున్నాడు. అందుకే మేము చంపాం"

రాముడు చెప్పిన మాటలు విని, మిన్ను విరిగి నేల కూలినట్లు నివ్వెర గొందింది. దుస్సహ శోకభారంతో - కోపంతో వివశురాలైంది శూర్పణఖ.

"ఔరా ద్రోహులారా! హంతకులారా! మునులకు అపకారం చేశాడనే నీలాపనిందలేసి, నిరపరాధి - అహింసామూర్తి, నా కుమారుడు జంబుకుణ్ణి చంపి సిగ్గు గూడా పడకుండా వున్నారే? మీరు క్షంతవ్యులు; ద్రావిడ రాజ పుత్రికలు పరాభవాగ్నిని సహించజాలరని తెలియదు కాబోలు-" అంటూ మొలలో వున్న కత్తి దూసి, రాముడి పైకి దూకింది. ఆ దృశ్యాన్ని చూచిన సీత భయపడి కెవ్వున కేక వేసింది.

రాముడులిక్కిపడి, శూర్పణఖ చేతిని తన చేతిలోకి యిరికించి గట్టిగా పట్టుకొని, అదిమి వుంచాడు. అంతలోనే లక్ష్మణుడు వచ్చి, ఆమె మెడ చేతిని విరిచి కట్టి, రాముడి ఆజ్ఞ మేరకు నిస్సహాయురాలైన అబలను, అందులో వృద్ధ వనితను ముక్కు చెవులు కోసి, విరూపను చేసి క్షత్రియోచితమైన ధర్మాన్ని నెరవేర్చినట్టుగా విడిచిపుచ్చాడు.

తీరని పరాభవానికి లోనైన ద్రావిడ రాజకాంత, అదలుతూ, రోజుతూ - దిక్కులు పిక్కటిల్లేలా అరుస్తూ, అడవుల బడి తన సోదరుడైన ఖరుడి దగ్గరకు పోయింది. తనకు జరిగిన పరాభవం - తన కొడుకుకు సంభవించిన దుర్మరణం పూసగుచ్చినట్లుగా చెప్పింది.

సోదరి చెప్పిన వృత్తాంతమంతా విన్న ఖరుడు మండిపడి బలాలను కూర్చుకొని రాముడిపైకి దండెత్తి వచ్చి భీకరయుద్ధంలో మరణించాడు.

రాముడి చేతిలో ఖరుడు చంపబడడం చూచిన శూర్పణఖకు, కాలు చేతులాడలేదు. ఇక ఈ అడవిలో వుండలేననుకొన్నది. చీర చెరగు కాళ్ళ క్రింద బేరాడుతుండగా లంకకు పోయింది.

ద్రావిడ నేత రావణ సార్వభౌముడికి, తనకు జరిగిన పరాభవం - జంబుక కుమారుడి ఘోరమరణం వివరించింది. ప్రతీకారం కావించటం, జాతి ధర్మమని హెచ్చరించింది. జరిగిన పరాభవానికి ప్రతిగా, ఆర్యజాతికి తగిన బుద్ధి చెప్పాలని శోక సంతప్త హృదయంతో విన్నవించింది.

చుప్పనాక చెప్పిన మాటలు - ఆమెకు జరిగిన పరాభవం - జంబుకుడు మరణం - విని, కని రావణుడు కోపంతో వూగిపోయాడు. ఆర్యజాతి కావించిన దురాగతానికి, ద్రవిడ ప్రభుని మానసం కుతకుతలాడిపోయింది. కొంతసేపు నిశ్చలమనస్కుడై వుండి - తరువాత, హుంకారం చేశాడు.

వెంటనే తన ఆంతరంగిక సచివుడైన మారీచుణ్ణి పిలిపించాడు. మంతనాలాడి – 'రాజపుత్రిక, అందులో నా సోదరి అయిన చుప్పనాకకు ఆర్య రాజపుత్రులు, రామ లక్ష్మణులు కావించిన అవమానం నన్నాపాదమస్తకం దహించి వేస్తుంది. అంతేగాదు, సమస్త ద్రావిడ జాతికి మానసిక సంక్షోభాన్ని కలిగిస్తున్న, కాకి హత్య నన్ను ఒక చోట కూర్చుండనీయటం లేదు.

ఏ పరిస్థితుల్లోనూ దీన్ని సహించేది లేదు. ప్రతీకారం తప్పనిసరిగా కావించాలి. స్త్రీల విషయంలో వీరులాచరించవలసిన దానికంటే, వాళ్ళు చాలా వ్యతిరేకంగా ప్రవర్తించారు. కాబట్టి రాముడికి కూడా స్త్రీ మూలకమైన పరాభవమే చేయటం సరిగా వుంటుంది అని నిశ్చయించి, మారీచుడికి కర్తవ్యం వుపదేశించి పంపాడు.

తరువాత మారీచుడు దండకాటవీ ప్రాంతానికి వచ్చి, పంచవటి పరిసరాలలో తిరుగుతూ మాయలేడి రూపంలో రామలక్ష్మణుల్ని దూరంగా తీసుకుపోయాడు. ఆ సమయంలో రావణుడు పర్ణశాలలో వున్న సీతను మునివేషంలో దొంగిలించి తీసుకు వెడుతూ, దారికడ్డం వచ్చిన జటాయువును చంపి, ఉత్తుంగ తరంగాలతో హోరుమంటున్న – దక్షిణ సముద్రాన్ని దాటి, తన అంతఃపురానికి తీసుకుపోయాడు. అట్లా తీసుకుపోయిన రావణుడు, తనలో తాను ఆలోచన చేయసాగాడు.

"భర్త వున్న పరాయిస్త్రీని దొంగిలించి తెచ్చి, తన యింటిలో వుంచుకోవటం తప్పు. లోకాపవాదం తప్పకుండా వస్తుంది. ఈ మూర్ఖలోకం వెనుకా ముందూ ఆలోచించదు. లోకం నోరుమూయటం సాధ్యం గాదు, కాబట్టి సీతను పట్టణానికి సమీపంలో వున్న అశోకవనంలో వుంచుతా. ఎంతైనా రాజపుత్రిక కాబట్టి ఆమె రాణివాసానికి తగ్గట్లుగానే అన్ని యేర్పాట్లు చేస్తా – ఏమీ కొరత రానీయను.

ఆమెకు పొద్దు గడవటం కష్టం కనుక, తమ్ముని కుమార్తెను త్రిజటను సీత వద్ద రక్షణగా వుంచుతా–" పండితుడైన రావణుడు తొందరపడకుండా, ఏ మాత్రం ఆత్ర పడకుండా నిర్ణయించాడు.

సీతను అశోకవనం మధ్యలో వుంచి, ఆమెకు కాపుగా త్రిజటను పెట్టి, అవిచారిత మనస్కుడై, ఏమీ మానసిక క్షోభ లేకుండా లంకలో కాలక్షేపం చేస్తున్నాడు రావణుడు.

మూడు లోకాలను గెలిచి, లోకజ్ఞానంలో ఆరితేరిన లౌకిక శిరోమణి, ప్రజలను కన్నబిడ్డలవలె కంటికి రెప్పలా కాపాడే మహాప్రభువు, రావణుడు చాలా అమాయకుడు.

కాకపోతే, తమ్ముడి కూతురు త్రిజట మోసగత్తె – అని తెలిసి కూడా తన వాళ్ళే అనే విశ్వాసంతో సీతకు కాపలా పెట్టి లంకను కన్నురెప్పపాటులో గజిబిజి చేస్తాడా?

త్రిజటను కాపుపెట్టటం లంకకు చిచ్చుపెట్టడమేనన్న నిజాన్ని నిష్కపటియైన దసగ్రీవుడు గ్రహించలేకపోయాడు.

ఇక్కడ రాముడు, భార్యయైన సీతను కోల్పోయి, ఏ రకంగానూ దుఃఖాన్ని ఆపుకోలేక విచారచిత్తుడై, ఎక్కడైనా కనిపిస్తుందేమోనని ఆ కాననమంతా గాలించటానికి తమ్ముడితో కలసి బయలుదేరాడు.

పోయిన పోకగా పోయి పోయి అడవులన్నీ గాలించి, సీతనెక్కడా చూడక దుః ఖిస్తున్న రామలక్ష్మణులకు, రావణుడిచే కూల్చబడి కొనవూపిరితో వున్న తమ తండ్రి, స్నేహితుడైన జటాయువు సీతా సమాచారం తనకు తెలిసినంతవరకు చెప్పాడు.

జటాయువు మాటలు విని, వాళ్ళిద్దరూ తిన్నగా పోయి ఋష్యమూక పర్వతాన్ని సమీపించారు. అక్కడ దట్టంగా పెరిగి, మంచినీడగా వున్న విప్పలి చెట్టు క్రింద వున్న రచ్చబండపై కూర్చున్నారు.

అదే సమయంలో, అక్కడే మంత్రులతో సంచారం చేస్తున్న సుగ్రీవుడు దూరాన నుంచి, రామలక్ష్మణుల్ని చూచి భయం పుట్టి గడగడ వణికిపోయాడు – ఆంజనేయుణ్ణి చూచి.

"ఓ ఆంజనేయా? అదుగో చూచావా? రణకర్కశులైన యిద్దరు వీరులు ధనుర్బాణాలు ధరించి ఆ చెట్టు దగ్గర విడిగా కూర్చున్నారు. వాళ్ళేం పని మీద వచ్చారో? మనకపకారం చేయించటానికి దుర్మార్గులెవరైనా తీసుకువచ్చారా?

ఆలస్యం చేయకుండా వెంటనే పోయి, వాళ్ళ వివరాలన్నీ తెలుసుకొని, వాళ్ళ వృత్తి – ప్రవృత్తి – కూడా యేమిటో గ్రహించి తొందరగారా.

నీవు చిన్నతనంలో మునిపల్లెలో వుండి, చాకచక్యాన్ని నేర్పును చూపి చదువు సాములు నేర్చుకొన్నావు. పైగా ఆర్యభాష నీకు బాగా తెలుసు. కాబట్టి వాళ్ళ దగ్గరకు పోయి, నేర్పుగా మాట్లాడి, అసలు విషయం తెలుసుకో, దీనికి నీవే సమర్థుడవు.

ఆ విలుకాండ్రను చూస్తుంటే, వాళ్ళ మొఖాన ఆర్యుల కవళికలు కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. తప్పకుండా వాళ్ళు ఆర్యులే అవుతారు. సందేహం లేదు. తక్షణమే అక్కడికిపో. ఈ కార్యం నీ వల్లనే అవుతుంది. నీలాగా ఆర్యుల ఆనుపానులు తెలిసినవాడుగాని, తెలుసుకోగలవాడు గానీ మనలో యింకెవ్వరూ లేరు"

సుగ్రీవుడు హనుమంతుణ్ణి పురమాయించాడు.

సుగ్రీవుడి ఆజ్ఞను శిరసావహించాడు వాయుపుత్రుడు.

"ఆర్యుల ఆచారాలన్నీ నిజంగా నాకు తెలిసినంతగా మా వాళ్ళకెవ్వరికీ తెలియవు. వాళ్ళ గుట్టుమట్టులు కూడా బాగా తెలుసు" అనుకొన్నాడు.

వెంటనే వాయునందనుడు వాయువేగంతో పోయి రామలక్ష్మణుల్ని సమీపించాడు. తిన్నగా సూర్యవంశ కుమారుల్ని చేరి, ఎడంగా నిలచి నమస్కారాలు చేస్తూ, ఎంతో వినయంగా తాను వచ్చిన పనిని విన్నవించాడు. వాళ్ళ వల్ల అంతా తెలుసుకొని, తన

ప్రభువైన సుగ్రీవుడికి ఆర్యరాజులకూ స్నేహం కూర్చాలని నిశ్చయించాడు.

వెంటనే ఋష్యమూక పర్వతం దగ్గరకు తీసుకుపోయాడు రామలక్ష్మణులిద్దరినీ.

కొమ్మల రాపిడితో నిప్పు పుట్టించి, అగ్నిసాక్షిగా, రామలక్ష్మణులకూ - సుగ్రీవుడికీ సఖ్యం కావించాడు. ఆ తరువాత వాళ్ళు పరస్పరం, ఒకరి భార్య సంగతి వొకరు చెప్పుకుని, సుగ్రీవుడి భార్యను రాముడూ, రాముడి భార్యను సుగ్రీవుడూ ఇప్పించేట్టు ప్రతినలు తీసుకొన్నారు.

అని సూతుడు చెప్పగానే...

"గురువర్యా! మీరు చెప్పిన వాక్యం నాకు బోధపడలేదు. దాని అర్థం వివరించి చెప్ప వేడుకొంటున్నా-" అని మధ్యలో అడిగా.

నా ప్రార్థనను మన్నించి సూతమహర్షి, నా సందేహాన్ని తీర్చటానికి చెప్పటం మొదలుపెట్టాడు.

"సుగ్రీవుడి సోదరుడైన వాలిని శక్తిహీనుణ్ణి చేసి, చంపి, వానర రాజ్యరమయైన 'రుమను' సుగ్రీవుడికిచ్చి మాట నిలబెట్టుకోవటం రాముడి కర్తవ్యం.

ఆ తరువాత వానరరాజు, సుగ్రీవుడు సీత ఏ ప్రదేశంలో వుందో వెదకించి, సీత జాడ తెలిసిన తరువాత, ఒకవేళ యుద్ధం చేయవలసి వస్తే చేసియైనా సరే, ఆమెను తెచ్చి రాముడికీయటం సుగ్రీవుడి కర్తవ్యం.

ఇట్లా యిద్దరూ పరస్పరం బాసలు చేసుకొన్నారు.

మాట తీసుకున్న వెంటనే సూర్యసుతుడు సుగ్రీవుడు సింహనాదం చేసి, కిష్కింధా నగరానికి పోయాడు. పోయి, యుద్ధానికి రమ్మని వాలిని రెచ్చగొట్టి రణం చేయటానికి తీసుకొని వచ్చాడు.

వాలిని తీసుకురావటం చూచిన రాముడికి కంపరమెత్తింది.

వాలి బలపరాక్రమాదులు ముందే విన్నాడు రాముడు. చూడగానే అతని శక్తి సామర్థ్యాలను అంచనా వేసుకున్నాడు. ఎదుటపడి ఆ బలశాలిని ఢీకొనటం - ఎక్కటికయ్యంలో ఆ శూరుడితో తలపడడం, తలపడి బయటపడడం, సాధ్యం గాదని భావించాడు. అందుకే పొదమాటున దాగి మహా భయంకరమైన ఆ యుద్ధంలో అంతటి వాలిని నేలకూల్చాడు.

రాముడు స్వార్థంతో, వానర రాజ్యానికి రాజుగా కిష్కింధా నగరంలో సుగ్రీవుడికి పట్టాభిషేకం గావించాడు. వాలి భార్యను కూడా సుగ్రీవుడు వుంచుకొన్నాడు.

వాలి తన తమ్ముడు సుగ్రీవుడి భార్యను మదమెక్కి తీసుకుపోయాడు. రాముడు వాలిని సంహరించి ధర్మాన్ని తిరిగి ప్రతిష్ఠించాడని చెపుతారు.

తనకు మేలు చేశాడనే కృతజ్ఞతా భావంతో సుగ్రీవుడు, అన్ని దిక్కుల్లో వున్న వానర

శ్రేష్ఠుల్ని కొండల్లో - కోనల్లో - కీకారణ్యాల్లో వున్న వాళ్ళనందరినీ తన ఆజ్ఞగా చెప్పి పిలిపించాడు.

ఒకచోట కూడిన తన వాళ్ళను సీతను వెతకటానికి సమస్త దిక్కులకు పంపే యేర్పాటు చేశాడు. వానరులు కూడా సీత జాడ నెట్లాగైనా గాలించి కనుక్కోవటానికి ప్రయాణ సన్నాహులయ్యారు.

వాళ్ళల్లో హనుమంతుడు - జాంబవంతుడు - నలుడు - నీలుడు - మైధుడు- విద్విదుడు - మొదలైన ప్రముఖులు, కిష్కింధ యువరాజు, వాలి తనయుడు అంగదుడి సేనా నాయకత్వంలో దక్షిణ దిక్కుకు బయలుదేరారు.

ఆ సమయంలో రాముడు హనుమంతుణ్ణి పిలిచి, కౌగలించుకుని, కళ్ళవెంట బాష్పాలు జడివానలాగా, ధార లొలుకుతూ వుండగా దగ్గుత్తికతో ఇట్లా అన్నాడు.

"వాయుపుత్రా! సీత యెండకన్నెరుగని యిల్లాలు. ఇంతకు ముందు అడవుల్లో తిరిగి, పడరాని పాట్లు పడ్డది. ఎన్నో కడగండ్లపాలైంది. పెట్టుకొన్న ఆశలన్నీ అడియాసలైపోగా, పరాయివాడి పంచలో యెట్లా బ్రతుకుతుందో? యేమో?

ఎంతోకాలం ఎడబాటు భరించలేం. ఈ ఎడబాటు శాశ్వతమైతే, జీవించటమే కష్టమవుతుంది.

హనుమా! నీవు నాకే గాదు, మా ఆర్య జాతి మొత్తానికే దాసుడవన్న సంగతి తెలుసు. నీకు మా జాతి పట్ల వున్న చిత్తశుద్ధిని నేను శంకించను.

కాబట్టి, ఇదుగో, ఈ ముద్దుటుంగరాన్ని నీకిస్తున్నా - సీతను చూచి, ఆమెకు నా క్షేమ సమాచారాలు తెలియజేయి. నేను పంపినట్లు గుర్తుగా నీకిచ్చిన ముద్దుటుంగరాన్ని భూమిజాతకీయి. ఆమెను కూడా అడిగి, ఏదైనా ఆనవాలు తీసుకురా. ఈ విషయం మాత్రం మరచిపోకు, నీకు చేసిన ఈ సాయం నేనెప్పటికీ మరచిపోను. నా మాట నమ్ము."

అని చెప్పి, పొంగి, పొరలి వచ్చే దుఃఖాన్ని దిగమింగి, "పోయి రమ్మ"ని చెప్పాడు రాఘవుడు.

రాముడి మాటలకు పొంగిపోయి, కొంటె హనుమ - వానర సేనతో కూడి కుప్పిగంతులు వేస్తూ చెంగలించాడు.

హనుమంతుడు ముందు భాగాన నిలబడి సైన్యాన్ని నడిపిస్తున్నాడు. వానరులంతా చెలరేగి, సీతను వెదకటానికి దక్షిణ దిశకు ప్రయాణం మొదలుపెట్టారు.

ఇక, అక్కడ లంకలో పరిస్థితి......

సవతాలి బిడ్డలు సైదోడులు కావటం వల్ల మనసులో విరిపోట్లు మానలేదు. విభీషణుని భార్య సరమ సరజాతి స్త్రీ. అందువల్ల ద్రావిడ జాత్యభిమానం అవిసిపోయింది.

సీతకు కాపుగా వుంచిన త్రిజట సరమ కూతురు.

ఆవు చేలో మేస్తుంటే- దూడ గట్టున మేయదు గదా! నూలు చాలు గుడ్డకు తప్పకుండా వస్తుంది. తల్లి సరమ లక్షణాలన్నిటినీ త్రిజట పుణికిపుచ్చుకొంది. పెదతండ్రి రావణుడి రాజ్యానికి చిచ్చుపెట్టింది.

రాజ్యకాంక్ష మనసులో రగిలి దహించివేస్తుంటే, విభీషణుడు కూడా పెళ్లాం పిల్లలు చెప్పిందంతా వినటానికి సిద్ధంగా వున్నాడు. లంకలో యింటిపోరు మిక్కుటమయింది. అది, చిలికి చిలికి గాలివానగా మారి, చివరకు 'ఇంటి గుట్టు లంకకు చేటు'గా అయింది.

లోకాలన్నీ జయించిన విజయగర్వం కళ్ళను కప్పటం వల్ల రావణుడు ప్రమత్తుడయ్యాడు. అందుకే, తన చావు తాను కోరి తెచ్చుకొన్నాడు. ఈ రకంగా లంక దురవస్థకు లోనైంది.

అశోకవనంలో త్రిజట, పెదతండ్రి మాట వింటున్నట్టే నటిస్తూ తాను చేయవలసిందేదో చేస్తూనే వుంది.

విభీషణుడి తనయ త్రిజట సీతకు కాపలా వుండి, చిన్నారి పొన్నారి నవ్వులు చిలుకరిస్తూ, చేతులు మోడుస్తూ, అతి వినయాన్ని ప్రదర్శిస్తూ భయభక్తులు చూపుతూ సకల సపర్యలు చేస్తూ వుంది.

అన్ని వేళలా ఆమెను కనిపెట్టుకుని వుండి, జనకజకు తలలో నాలుకగా మెలగుతూ, చాకచక్యంతో నేర్పును కనబరుస్తూ తన మీద గట్టి నమ్మకం కలిగేట్టు చేసుకొంది.

సీత యేం చెప్పినా యెదురు చెప్పదు; ఏ మాత్రం బెదిరింపు మాటలు మాట్లాడదు. మితిమీరిన భక్తిని చూపుతుంది; తన నడవడికతో ఆమెను ప్రసన్నురాలిని చేసుకుంది.

ఇట్లా సీతకు చేరువైన త్రిజట, ఒకనాడు చెవినిల్లు కట్టుకొని ధరణిజకు పదేపదే చెప్పటం మొదలుపెట్టింది.

"అమ్మా! సీతమ్మ తల్లీ! పది రోజులు కూడా కాలేదు. తన కొడుకును పంపి స్వర్గాధిపతియైన యింద్రుణ్ణి రథానికి కట్టి తెప్పించాడు. నాలుగు రోజులైనా కాలేదు - దేవతల నందనోద్యానంలో జొరబడి దాన్ని చీకాకు పరచాడు; మూన్నాళ్ళు కూడా కాలేదమ్మా! మా పెదనాయన తానొక్కడే పోయి, ఈశ్వరుడి పడకటింటిని వుద్రూతలూపి వచ్చాడు. రెండు దినాలైందో - కాలేదో? అన్న మీద దండెత్తిపోయి పుష్పకాన్ని కొల్లగొట్టాడు.

అమ్మా! ఎన్నని చెప్పేది? ఏమని చెప్పేది? మా పెదనాన్న చేస్తున్న ఆగడాలకు అంతూ - పొంతూ లేదు. ఆయన చేస్తున్న ఘోరాలు చూస్తున్నా - వింటున్నా తలతిరిగిపోతుందమ్మా!

లంకా రాజ్యమని చెప్పుకోవటమేగాని, యిందులో ఏముందమ్మా! ఈయన చేస్తున్న

కిరాతక కృత్యాలకు ఒక్క రోజున్నా తల యెత్తుకొని తిరుగలేకపోతున్నాం.

ఇక మా నాన్నను చూద్దామా! అంటే... ఆయన ఒట్టి అమాయకుడు, కుదుమిస్తే, పండుగనుకొంటాడు. లోకులేం చెప్పినా... డూ...డూ... బసవన్నలాగా విని తలవూపుతాడు. అందరి మాటలనూ నమ్మి చివరకు అగచాట్లను నెత్తిమీదకు తెచ్చుకొంటాడు. ఆయనకెంత చెప్పినా ప్రయోజనం వుండదు. నేనూ - మా అమ్మా - వివరంగా ఎన్నో విషయాలు చెపుతాం. కాని ఏం లాభం? అంతా చెవిటివాడి ముందు శంఖం వూదినట్లే; అడవి గాచిన వెన్నెల్లా అవుతుంది. మా దంతా అరణ్య రోదనం.

మమ్మల్ని దీనుల్ని చేశాడు. రాతలు చెడినంత మాత్రాన వాజ యెక్కడికిపోతుంది?

ఏ మాటకామాటే చెప్పాలమ్మా! మా పెద్దమ్మ మండోదరి సద్గుణాలరాశి. ఉత్తమ సాధ్వి, అపురూప సౌందర్యవతీలలామ; అంతఃపురానికే వన్నె తెచ్చే మహా యిల్లాలు.

మమ్మల్ని కన్నతల్లిలా చూస్తుంది; ఎంతో ప్రేమతో ఆదరిస్తుంది; ఈ ప్రేమ నిత్యనూతనంగా వుంటుంది. ఏనాడూ కొంచెం కూడా లోటు రానీయదు. అందరూ ఆమె పట్ల వినయం - భయం- భక్తి చూపిస్తారు.

రాజ్యకాంక్ష మమ్మల్ని ఎంత రాయిడిస్తున్నా, మా పెద్దమ్మ మాపై చూపే ప్రేమ ఆటంకంగా వుంది; ఆమె మంచితనం అడ్డం వస్తుంది. అందుకే ఎన్ని యిబ్బందులు ఎదురౌతున్నా, ఏం చేయకుండా వూరుకొంటున్నాం"

త్రిజట చెప్పిన మాటలు సీతకు అమృతంలాగా వున్నాయి. జనకజ మొగం చేటంత అయింది. త్రిజటను ఆపాద మస్తకం చూచి తడిమి తృప్తి పడ్డది.

"సుగుణవతీ! త్రిజట' సాధు చరిత్రయైన మీ అమ్మ సరమను ఒక్కదాన్నే రేపో, మాపో నా దగ్గరకు తీసుకురా. ఆమెతో పరిచయం చేసుకొని, చెప్పవలసిన ధర్మాలెన్నో చెపుతా రా - ఇక భవిష్యత్తులో చేయవలసిన కార్యం ముందు ముందు చెప్పుకొందాం.

సీత పలుకులన్నీ త్రిజట విన్నది. 'చిత్తం' - అని చెప్పి, ఇక, ఆలస్యం దేనికనుకొని - 'ఇప్పుడే మా అమ్మను తీసుకొని వస్తా-' అని చెప్పి, అడుగులు లెక్కపెట్టుకొంటూ, అంతఃపురంవైపు దారి తీసింది.

పొద్దు గూకింది - చీకటి దట్టంగా అలముకొంది. ఆ సమయంలో తన కూతురు త్రిజట దారి చూపిస్తుండగా సరమ, సీత వున్న అశోక వనానికి బయలుదేరి వచ్చింది. ఒంటరిగానే వచ్చిన సరమ అశోకవనంలో రామపత్ని వున్న చెట్టు క్రింద, ఆమెకు దగ్గరగా జరిగి కూర్చుంది.

చాల పొద్దుపోయేదాకా, ఏదో పడిపోయినట్లుగా ముచ్చటలాడింది. సీతతో సంభాషించిన తరువాత సరమ, భూమిజాతకి నమస్కరించి ప్రేమ పూర్వకంగా ఆమె దగ్గర సెలవు తీసుకొని తిరిగి నగరానికి బయలుదేరింది. త్రిజట తన తల్లిని కుంటినడకతో

కొంతదూరం పంపి వెనక్కు తిరిగి సీత దగ్గరకు వచ్చింది.

పుత్రా! రామస్వామీ! అక్కడ కిష్కింధ నుండి బయలుదేరిన వానర సైన్యం సమాచారాన్ని వివరిస్తా, విను.

హనుమంతుడు నాయకుడుగా ముందు భాగాన వుండి వనచర సైన్యాన్ని నడిపిస్తున్నాడు. యువరాజైన అంగదుడు కూడా వాళ్ళతో వున్నాడు. అంతా సముద్రం దగ్గరకు చేరారు.

సముద్రం ఒడ్డుకు చేరిన కపి సైన్యం వనరు తెలుసుకొని సముద్రాన్ని దాటాలని ఆలోచిస్తుంది.

చాలాసేపు మనసులో చర్చించుకొన్నారు. అందరికి సముద్రం దాటాలని చెప్పారు. కాని, యెవ్వరూ ముందుకు రాలేదు. చివరికి జాంబవంతుడు ప్రేరేపించేటప్పటికి, హనుమంతుడే సముద్రం దాటటానికి సాహసించి నడుం గట్టాడు.

గండి చిన్నదైతే కప్ప గంతులు వేసేవాడు; పెద్దదైతే ఈతగొట్టేవాడు. తాను సముద్రం దాటటం చూచి, తక్కిన వానరులంతా కులికి కులికి పొగడుతూ వుంటే, ప్రొద్దుగూకే వేళకు లంకను చేరాడు వాయుపుత్రుడు.

నదురుబెదురు లేకుండా, పదునైన కత్తి ధరించి కంటిపై కునుకు గూడా రానీయకుండా లంకిణి అనే ద్రావిడకాంత లంకానగర గవనును ఏమరక కావలా కాస్తుంది. హనుమంతుడు దొంగచాటుగా పోయి, దొంగపోటు పొడిచి ఆమెను చంపాడు.

అప్పటికింకా బాగా చీకటి పడలేదు. సంజవేళ దాటి చీకటి దట్టంగా కమ్మితే గాని, తన నెవ్వరూ గుర్తుపట్టరని భావించి, బాగా చీకటి పడేవరకు అక్కడున్న పొదల్లో దాక్కొన్నాడు గాలిసుతుడు.

చీకట్లు దెసలను ముసురుకొన్నాయి. కన్ను పొడుచున్నా కనుపించని కారుచీకటి. సందుగొందులు దూరటానికి, ఇదే సమయమనుకొన్నాడు. ఇక తన్నెవ్వరూ ఆనవాలు పట్టరనుకొన్నాడు. సీతను వెతకటానికి బయలుదేరాడు హనుమంతుడు.

లంకా పట్టణాన్ని చూచిన హనుమంతుడు ఆశ్చర్యపోయాడు. ఈడూ జోడూ లేనిదాని సంపదను కాంచి, అతనికి పళ్ళు పులిశాయి. మేడల మిద్దెల రామణీయకత కన్నుల పండువుగా వుండడం గమనించి కళ్ళు కుట్టాయి. ఆ పట్టణం – 'రాసిబోసిన సౌందర్యమా?' అన్నట్లుగా అనిపించింది వానరుడికి– ఆ మేడల క్రీనీడల వంగి వంగి నడుస్తూ భూమిజను వెదకటం మొదలుపెట్టాడు.

ఎంతో నేర్పుతూ లంకంతా గాలించాడు. ఎక్కడా సీత వున్న జాడ కనిపించలేదు. "ఇస్సీ! తన ప్రయత్నమంతా – శ్రమంతా వృథా అయిందే–?" అని బాధపడ్డాడు. దూరాన అశోకవనం కనిపించింది. దాన్ని కూడా వెదకి రావటం మంచిదని మనస్సులో

అనుకొని, అశోకవనం వైపు వెళ్ళాడు.

దట్టంగా అల్లుకొన్న తీగ పందిరి నట్టనడమ, చిగురుటాకులు అశోక వృక్షం మొదట్లో చెంపన చేయి పెట్టుకొని ముడుచుకొని చింతలో కూర్చున్న వనితను చూచాడు వాయుసుతుడు. ఆమెనే సీతగా గుర్తించి, చెలగి గంతులు వేశాడు.

దగ్గరకు పోయాడు. తానెవరో రహస్యంగా తెలుపుకొన్నాడు. తాను వచ్చిన పని గూడా చెప్పాడు. భద్రంగా ముడివేసి దాచిన వుంగరాన్ని తీసి ఆమెకిచ్చాడు. ఆమె దగ్గర నుంచి శిరోభూషణాన్ని తీసుకొన్నాడు. మంతనాలాడి, ఆమె దగ్గర సెలవు తీసుకొని బయలుదేరబోతూ....

"తల్లీ! ఎవ్వరూ చూడరు. ఎవరి కంట బడకుండా, నిన్ను నేను తీసుకొనిపోగలను. ఒక్క నిమిషంలో సముద్రాన్ని దాటి, రఘురాముడి ముందు బెట్టగలను. మనసులో దట్టంగా అలముకొన్న దుఃఖాన్ని పోగొట్టుకొని రామ చంద్రుడు సంతోషిస్తాడు" అన్నాడు.

వనచరుడి మాటలు విన్న సీత నవ్వుతూ – తన భర్తయైన రాముడి మర్మాన్ని విప్పి చెపుతూ అతణ్ణి చూచింది.

వాయుపుత్రా! నిజంగా రావణుడు నిగ్రహం లేక మోహావేశంతో నన్ను బలవంతం చేస్తే ఏం చేయగలను? కాని, అతడలాంటివాడు కాదు. తమకం లేనివాడు. లంకేశ్వరుడు దుర్మార్గుడైతే, రెప్పపాటు కాలం కూడా యిక్కడ నిలవలేను. ద్రావిడ కాంతలు ఎంత రద్దీ చేస్తారో? ఎంత రవ్వగావిస్తారో? చెప్పలేం. అన్నీ చూచి కూడా ద్రావిడ రాజు నిబ్బరంతో నా వంటి మీద చేయి వేయటంగాని, మోహ దృష్టితో చూడడం గాని లేదు.

బంగారు లేడి, నా భర్తను మోసగిస్తే, ఆయన దూరంగా పోతే రావణుడు వచ్చి నన్ను దొంగతనంగా తెచ్చాడనే మాట నిజం గాదు. అన్నీ తెలిసే పొరపాటున మేము ఆ పరిస్థితి కల్పించాం. అట్లా అయితేనేగాని, మా కార్యసిద్ధి చేకూరదు. లేకపోతే, మేం సుఖాలన్నీ త్యజించి దండకాటవి ద్రవిడ భూములకు వచ్చిన ప్రయోజనం నెరవేరదు.

కాబట్టి, భీకర రణాంగణంలో రావణుణ్ణీ, అతని జాతిని నాశనం చేయటం అవసరం. లేదా– మాయోపాయం చేతనైనా, ద్రావిడ జాతిని తిరిగి దాస్యంలో ముంచి, ఆర్యపాలన చిరస్థాయిగా వుండేటట్లు చేయాలి. ఇది మా ధ్యేయం. ఇంకో రకమైన కార్యమేదీ మాకు నచ్చదు. నీ వెన్ని చెప్పినా, మా చెవిని దూరవు కూడా.

ఇప్పుడు నేను నీతో రఘువంశోద్భవుడి దగ్గరకు రావటం కుదరదు. అట్లా చేస్తే కార్యమంతా చెడిపోతుంది. నీవు మా ఆర్యజాతికి నమ్మినబంటువన్న సంగతి తెలుసు."

సీత చాలా సొగసుగా మాట్లాడింది.

ఆంజనేయుడు భూసుతకు రెండు చేతులెత్తి నమస్కరించి... 'అమ్మా! సీతమ్మ తల్లీ! చిత్తం; పోయివస్తా...! అని పయనమయ్యాడు.

కొంతదూరం పోయి, - "ఇక్కడదాకా వచ్చా గదా? రావణరాజును చూడకుండా ఎట్లా పోవాలి? అతణ్ణి చూడడం వుత్తమ కార్యం. బాహు సంపద చూపించటం కూడా భావ్యమే" - అనుకొని యినుమడించిన వుత్సాహంతో క్షణంలో శరీరాన్ని పెంచాడు.

పెద్ద పెద్ద వృక్షాలనన్నిటినీ విరగ్గొట్టాడు; కూలదన్నాడు; కొమ్మల్ని విరిచాడు. కొన్ని వృక్షాలను కూకటి వేళ్ళతో పెకలించి నేలపై పడవేశాడు; మరి కొన్ని భూజాలను పీకి తలకిందులు చేశాడు.

ఈ ఆకతాయి చేష్టల్ని వారించటానికి వచ్చిన లంకా నగరవాసుల్ని భటుల్ని చావమోదాడు; కొందరిని చంపాడు.

సుగ్రీవ సేవకుడు చేస్తున్న భీకర కృత్యాన్ని విని, అక్షయ కుమారుడు ధనుర్ధారియై వచ్చి, వాడి గల బాణాలను తెరపి లేకుండా అతనిపై కురిపించాడు. చాలాసేపు ఒకరికొకరు తీసిపోకుండా పోరాడారు. చివరికి అక్షయుడు ఆ యుద్ధంలో మరణించాడు.

అక్షయుడి మరణవార్త విన్న యింద్రజిత్తు వచ్చి, తన జిత్తులనుపయోగించి, పదును గల శస్త్రాల నుపయోగించి, హనుమంతుణ్ణి సొమ్మసిల చేశాడు. మూర్ఛపోయిన ఆంజనేయుణ్ణి బంధించి తండ్రి వద్దకు తీసుకుపోయాడు మేఘనాదుడు.

కుమారుడి పరాక్రమాన్ని గమనించిన రావణుడు - "ఔరా - ? " అని మెచ్చుకొన్నాడు.

హనుమంతుడు కూడా ఇంతలో మూర్ఛ తేరి, రావణుణ్ణి చూచాడు. ఆశ్చర్యపోయాడు.

"అహో! ఈతడేనా, ధనపతియైన కుబేరుడి అలకా నగరంలో చొరవారి పుష్పక విమానాన్ని తెచ్చిన వీరుడు? ఈతడేనా ముక్కంటి కైలాసగిరిపైకెత్తి వుగ్రూతలూపినవాడు?

ఆనాడు దేవతా మూకను బట్టి వెట్టివాళ్ళను జేసి పీడించిన ఘనుడీతడేనా? కొడుకును చంపి స్వర్గలోకాధిపతిని పెడరెక్కలు విరిచి, రథానికి కట్టించి తెప్పించిన శూరుడితడేనా...?

తన నగరాన్ని ఈడుజోడు లేనిదానిగా జేసిన మానఘనుడూ - అభిమాన ధనుడూ - ఈతడేనా?

'తాటితో నన్ను బంధించినా చూడగానే, రెండు చేతులెత్తి జోహారు చేయాలనే బుద్ధి పుడుతుంది.

ఔరా...! ఇంతటి తేజశ్శాలి కావటం వల్లనే, ముల్లోకాలను అరికట్టి నిలువరించ గలిగాడు. తెగువ చూపి, నేలనంతా తన గుప్పిటలోకి తెచ్చుకొన్నాడు- మూడు లోకాల్లోనూ ఈతని జన్మ ధన్యం."

హనుమంతుడిట్లా విచారిస్తూ వుండగా, ప్రతాపసముద్దీప్తుడైన రావణుడు పట్టుబడ్డ పగవాణ్ణి చూచాడు.

ఇతణ్ణి విడిగా గాక, కొలువులోనే శిక్షించటం మంది"దని భావించి, తన మంత్రివర్గాన్ని పిలిపించాడు. మంత్రవేత్త వెంటనే కొలువు చేయటానికి సిద్ధపడుతున్నాడు.

తన కూతురు త్రిజట వల్ల సమస్తం తెలుసుకొన్న విభీషణుడు వుపాయంతోనైనా, ఆంజనేయుడికి పడే శిక్ష తప్పించటం తనకు మేలు కలుగుతుందని ఆలోచించి, అతిశయించిన వుత్సాహంతో, నిండుకొలువుకు పోయి, అక్కడ – 'మరణదండన వొక్కటే తగిన శిక్ష' అని అడుగుతూ వున్న చర్చను విన్నాడు. వెంటనే దాన్ని వారించి, తన అన్నయైన రావణుణ్ణి చూచి –

"అన్నా! దూత అవధ్యుడు గదా! అతణ్ణి చంపటం ధర్మం గాదు. నీ వంటి మహానుభావుడే ఈ రకంగా నీతి విడిచి దూతను చంపితే, ధర్మ వినాశం జరిగిందని ప్రపంచం ఆడిపోసుకొంటుంది. ఈతణ్ణి చంపటం మాని, యింకా, యేదైనా శిక్ష విధించి పంపటం వుచితంగా వుంటుంది.

దూతల్ని చంపుతూ పోయేటట్లయితే, రాజులకూ – రాజులకూ మధ్య జరిగే రాయబారాలెట్లా జరుగుతాయి? దూతల్ని చంపటం ధరాధిపతులకు ధర్మం గాదు.

ఒకవేళ దూత దుండగీడైతే, అతనికి అంగవైకల్యం చేసి పంపటం మంచిది. కాబట్టి, పాత గుడ్డలు తెప్పించి యితని మొలకు చుట్టి, కొరవి నిప్పు అంటించండి"

విభీషణుడి సలహాలోని మర్మం తెలియని నిష్కల్మష హృదయుడైన రావణుడు, తమ్ముడి మాటలకు – 'సరే' అన్నాడు.

భటులకు ఆజ్ఞ జారీ చేసి, తాను కొలువు కూటం వీడిపోయాడు.

హనుమకు గుడ్డలు చుట్ట కట్టెర్ర నిప్పును అంటించి సాగనంపారు. దానితో ఆంజనేయుడు దిక్కులదిరేలాగ బొబ్బరింతలు పెట్టాడు.

మంటలు గుప్పు గుప్పున పైకి లేచాయి. హనుమ తోక చిచ్చు లంకా పట్టణ దుర్గానికి తోకచుక్కయింది. ఇల్లిల్లూ దూరి నిప్పు పెట్టాడు – తోక మొత్తం బూడిద కుప్పగా మారింది.

వాయుపుత్రుడు సముద్రాన్ని దాటి, అంగదాదుల్ని కలుసుకొన్నాడు. అందరూ కలసి రాముడున్న చోటికి వచ్చారు.

సీత యిచ్చిన శిరోభూషణాన్ని రామచంద్రుడికి హనుమ యిచ్చాడు. జరిగిన సమస్త వృత్తాంతం చెప్పి, సీతా మహాదేవి వృత్తాంతం వివరించాడు.

భార్య వృత్తాంతం విన్న రాముడు భోరున దుఃఖించాడు. కొంతసేపు దీనత్వాన్ని పక్కకు పెట్టి వెంటనే లంకను ముట్టడించటానికి, సైన్యాన్ని హుటాహుటిని నడిపించమని ఆజ్ఞాపించాడు.

దూత యెవడు? ఈ హనుమంతుణ్ణి ఏ రాజు దూతగా పంపాడు? రాముడైనా సీతను చూచి రమ్మన్నాడే కాని, దూతగా బోయి రావణుడితో తగినట్లుగా మాట్లాడి రాయబారం నడిపి రమ్మని పంపలేదుగా?

ఇది యెంత మోసమో?

దూతగా వచ్చినవాడు లంకిణిని చంపటమెందుకు? పట్టణంలో రాత్రిపూట యెందుకు ప్రవేశించాడు? సీతతో మాట్లాడవలసిన అవసరమేమి వచ్చింది? సుందర మనోజ్ఞమైన వనాన్ని ఎందుకు నాశనం చేశాడు? అక్షయ కుమారాదుల్ని సంహరించటమెందుకు?

ఇందులో ఒక ధర్మసూక్ష్మం వుంది. మతిమంతులైన పెద్దలు తెలిసి కూడా మునుపు దీన్ని కప్పిపుచ్చారు. నీకా ధర్మ సూక్ష్మాన్ని తేటతెల్లంగా చెపుతా.

"దూత...! దూత...! అని తొందరగా చెప్పి, దూతను చంపటం దోషమని బొంకు బొంకితే, రావణుడు నిజమని భ్రమించి, దాన్ని తప్పించుకునే వంక తెలియక మోసపోయాడు.

ఇక అక్కడ కిష్కింధా నగరంలో సుగ్రీవునాజ్ఞ గట్టిగా పాటిస్తూ వానర సైన్యాలు మితిమీరిన ఉత్సాహంతో లంకానగరాన్ని చుట్టుముట్టడానికి కదలసాగాయి.

సీతను తీసుకురావటానికి వానర సేనాపతులు తమకున్న అపార బలాలతో బయలుదేరాయి. ప్రాణాలొడ్డియయినా సరే, సీతను తీసుకురావలిసిందేనని బీరాలు పలుకుతూ, అడివిలో దొరికిన పండ్ల నన్నిటిని యేరి తింటూ వెళుతున్నారు. రాఘవులు సుగ్రీవుని వెంట నడుస్తున్నారు.

కపిసేన కోలాహలం చేస్తూ – కో – అని అర్చుతూ దూకుడుగా నడక సాగించింది. రఘుకులనందనులూ – వానరరాజూ చెట్టపట్టాలు పట్టుకొని కేరింతలు కొడుతూ సైన్యాన్ని అనుసరిస్తున్నారు.

ఇట్లా కొన్ని వారాలు నడచి – నడచి దక్షిణ సముద్రపుటొడ్డు చేరారు వానరులు.

'సముద్రం పెద్దది – సైన్యమూ అపారం! దాన్ని దాటటమెట్లా?' – అని ఆలోచనలో పడ్డారు. సుగ్రీవుణ్ణి – హనుమంతుణ్ణి పిలిచి రామలక్ష్మణులు దీర్ఘంగా ఆలోచించటం మొదలుపెట్టారు.

రాముడు కపిసైన్యంతో సముద్రమున కావల వొడ్డున దిగి వున్నట్లు వేగులవారి వల్ల రావణుడు తెలుసుకొన్నాడు. వెంటనే లంకాధిపతి అప్తులైన మంత్రులను, దండనాయకులను పిలిపించాడు. విషయమంతా వివరంగా వివరించాడు. పరిస్థితిని సమీక్షించి, కర్తవ్యమేమిటో బాగా ఆలోచించి నిర్ణ యించండని కొలువు కూటంలోనే చెప్పాడు. తన అన్న రావణుడు కొలువు దీర్చి యుద్ధ విషయం చర్చిస్తున్న సంగతి యెట్లాగో విభీషణుడు కనిపెట్టాడు. వెంటనే ఆలస్యం చేయకుండా వుపాయం పన్ని కొలువులో దూరాడు.

సభలో ఏకాంతంగా కూర్చొని, సభా విశేషాలన్నీ గమనిస్తూ వంచన మనస్కుడై ఆలోచించటం మొదలుపెట్టాడు.

"మంచి అవకాశం వచ్చింది. ఈ అవకాశాన్ని జారవిడుచుకోగూడదు. సభలో ఏమి చర్చించుకొంటున్నా, దానికి వ్యతిరేకంగా మాట్లాడి సభాసభ్యుల సమక్షంలో అన్నతో బయటకు గెంటి వేయించుకునేట్టు ప్రవర్తిస్తా. అంతా మా అగ్రజుణ్ణే నిందించేట్టు చేస్తా, తప్పంతా ఆయనదేనన్నట్టు నడుచుకొంటా.

తరువాత లంకా నగరాన్ని విడిచి, రాముణ్ణి ఆశ్రయించి ఆయన పాదపద్మాల దగ్గర వాలి నమస్కరిస్తా.

ఇదే తగిన వుపాయంగా తోస్తుంది. దీని వల్ల ఏ అపాయమూ రాకుండా నా కోర్కెని సిద్ధింపజేసుకొంటా–" నిండుసభలో జంకుకొంకులు లేకుండా, పాపభీతిని కూడా తలంచకుండా వంచకుడై మాట్లాడాడు.

"అన్నా ద్రావిడేశ్వరా! మీరు సీతను తీసుకొని వచ్చి అశోకవనంలో పెట్టినప్పటి నుంచీ లంకలో ఎన్నో దుశ్శకునాలు కనిపిస్తున్నాయి. ప్రజలంతా భయంతో దిక్కు తోచకుండా వున్నారు. ఏమీ పాలుపోవడం లేదు. ఈ పరిస్థితుల్లో రామచంద్రుడితో సంధి చేసుకోవటం అత్యావశ్యకం. లంకానగరం నశించకుండా రక్షించబడుతుంది. ద్రావిడ ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లుతారు."

రాముడు సుగుణాభిరాముడు. అతడు తామసి కాదు. శరణన్న వాళ్ళను తప్పకుండా కాపాడుతాడు. పొగరుబోతుల మాటలను లెక్కించరాదు. వాళ్ళేమయినా నోటికి వచ్చింది చెపుతారు.

ఇంతటి వుపద్రవాన్ని శూర్పణఖ గదా! తెచ్చిపెట్టింది. ఈ ద్వేషాగ్ని చుట్టబెట్టి లంకనే కాల్చటానికి సిద్ధమైంది. ఎట్లాగైనా సరే, ఈ ఆపదను మీరే తప్పించాలి.

విభీషణుడి మాటలు విన్న రావణుడు మండిపడ్డాడు; పండ్లు పటపట కొరికాడు; గుడ్లురిమాడు; వికటాట్టహాసం చేశాడు - పొంగి పొరలే కోపాన్ని అపలేక పోయాడు.

"కటా! సోదరుడే యిట్లా మాట్లాడాడే"– అని చిర్రుముర్రాడాడు లంకేశ్వరుడు.

"అకటా! స్వజాతి వారెవరైనా సభలో సిగ్గు విడిచి యిట్లా మాట్లాడుతారా? ఇది సహించరానిది. జాతి వైరినే శరణు గోరుమని అంటాడా? వీడు తమ్ముడా? ఉభయ కులాల్ని చెరచటానికి పుట్టిన శూద్రుడు. వీణ్ణి యిక్కడ వుంచరాదు; పాప భయం కూడా యిట్లాంటి వాడి పట్ల చూపనవసరం లేదు. ప్రేమానురాగాలకు ఇందులో తావు లేదు. తక్షణమే నగరం నుంచి వెళ్ళగొడతా.

వీడు పెడమార్గాన తిరుగుతున్నాడని తెలిసి కూడా తమ్ముడనే భావంతో యిన్నాళ్ళూ చూచీ - చూడనట్లూరుకొన్నా. అదే వీణ్ణి యింతవాణ్ణి చేసింది. లంకకు కీడు తెచ్చింది. నా ముందే యింతటి అసహ్యపు మాటల్ని పలుకుతున్నాడు. ఇక తమ్ముడని చూడరాదు. వీణ్ణి ఎట్లా క్షమించాలి?

జాతి పౌరుషం - జాత్యభిమానం - జాతి గౌరవం - జాతి పరువు వీడిలో చూద్దామన్నా మచ్చుకైనా లేవు. వీడెట్లా పుట్టాడో? కుక్క మూతి పిందె- మా వంశ నాశనానికే వీడు పుట్టినట్లుంది."

అని తనలో తాను మధన పడుతున్నాడు.

ఇంతలో విభీషణుడు మళ్ళా అందుకొన్నాడు.

"అన్నా! ఏ మాలోచిస్తున్నావు? తప్పు నీదే; అనవసరంగా రాముడితో విరోధం పెట్టుకోకు. సీత నాతనికి సమర్పించి శరణు వేడు. దయామయుడైన రాముడు తప్పకుండా నిన్నాదరిస్తాడు.

శూర్పణఖకు జరిగిన పరాభవానికి ప్రతీకారం తీర్చుకోవాలనే కాంక్షతో, సమస్త ద్రావిడ జాతిని నీవు బుగ్గిపాలు చేయవద్దు. రఘునందనుడికి శరణమనకపోతే సర్వనాశనం తప్పదు. ఇది తథ్యం; ఇందులో ఏమాత్రం సందేహం లేదు."

విభీషణుడి పలుకులను అధిక్షేపిస్తూ కుపితుడైన లంకాపురాధినాథుడు,

"ఓరి జాతి ద్రోహి! ఓరి పాపి! బ్రతికినన్నాళ్లు రావణ సార్వభౌముడు పౌరుషంతో - అభిమానంతో బ్రతికాడనే కీర్తికి కళంకమాపాదించను. సర్వనాశనమైనా జాతి పరువు ప్రతిష్ఠలను కాపాడుతా. శత్రువులను నుగ్గనూచ చేస్తా.

ఎల్లప్పుడూ తొమ్మిది కోట్ల శివాలయాలను పూజిస్తూ పవిత్రములైనవిరా ఈ చేతులు; ధర్మ పీడన కావించే దుర్మార్గుల కుత్తుకలనుత్తరించే కత్తుల తళత్తళల కాంతి పుంజాలతో అలంకరింపబడ్డవిరా ఈ చేతులు; నిరంతరదాన జలధారలతో పరిప్లుతములైనవిరా ఈ చేతులు; ఇట్లాంటి చేతులు ఒక నీచ మానవుడికి - జాతి వైరికి - హితభాగ్యుడికి కైవారం చేస్తాయా? నీకు నోరెట్లా వచ్చిందిరా? నీ నాలుక చీలికలు చేస్తా" అని గట్టిగా అరికాలితో తన్నాడు.

ఆ తన్నుతో గద్దె మీద వున్న విభీషణుడు కిందకు దొర్లాడు.

అవకాశం కోసం యెదురుచూస్తున్న విభీషణుడిది మంచి అదనను కొన్నాడు. తన కోర్కె ఫలించిందని లోలోన పొంగిపోయాడు; కొలువువీడాడు. వెడుతూ - అగ్రజుణ్ణి నోటికి వచ్చినట్టు దుర్భాషలాడాడు.

తనతోపాటు నలుగురు మంత్రుల్ని కూడా తీసుకొని విభీషణుడప్పుడే సముద్రాన్ని దాటిపోయి, దీన వదనంతో శ్రీరాముడి కాళ్ళపైబడ్డాడు.

'అభయమిస్తే గాని లేవనని' పట్టుపట్టాడు. విభీషణుడెవ్వరో తెలియని రాముడు అట్లాగే చూస్తూ వుండిపోయాడు.

హనుమంతుడు తాను లంకకు వచ్చినప్పుడు విభీషణుడు కావించిన సహాయం మనసులో వుంచుకొని రాముడికి నచ్చచెప్పాడు. వాయుసుతుని మాట మీద రావణుడు

విభీషణుణ్ణి స్నేహితుడిగా స్వీకరించాడు. అక్కడే లంకకు పట్టాభిషిక్తుణ్ణి చేశాడు.

ద్రావిడ శిల్పియైన నలుడు, రాముడి ఆజ్ఞ శిరసా వహించి, గండ్లు పూడ్చి దక్షిణ సముద్రాన్ని దాటటానికి సేతువును నిర్మించాడు. రాముడు కపిసేనతో సముద్రాన్ని దాటి, సువేలంలో దండును విడియించాడు.

కిష్కింధ యువరాజైన అంగదుణ్ణి రాయబారిగా సంధి చేయటానికి లంకేశ్వరుడి వద్దకు పంపాడు.

రాయబారం చెడిపోయింది. రావణుడు జాత్యభిమానాన్ని విడనాడటానికి ఇష్టపడలేదు. ప్రాణాలొడ్డియైనా స్వాభిజాత్యాన్ని కాపాడుకోవాలని నిశ్చయించాడు.

సంధి పొసగక పోవటంతో యుద్ధమే శరణ్యమైంది.

భూనభోంతరాలు దద్దరిల్లేటట్లు యుద్ధభేరీ భాంకారాలు మోగాయి. సైనికుల కోలాహలం మిన్నుముట్టింది.

సంధి కుదరలేదని సరమ బిరబిరా పోయి అశోకవనంలోని సీతకు చెప్పింది. ఆ సంగతి విన్న జానకి చెట్టు కిందనే కూర్చుండి నిట్టూర్పు పుచ్చి - "చివరకు, ఏది కానున్నదో అది తప్పకుండా అవుతుంది. కాని, నా మాట వొకటి ఆలకించు" అని సరమను వేడుకొంది.

"అమ్మా! సరమా వధూటీ! గుప్తి కర్మ ఎట్లా కొనసాగుతుందో? మంత్ర నిశ్చయం మాటయేమో? తెలుసుకొని వచ్చి నాకు వివరంగా చెప్పు. నిన్ను ఎప్పటికీ మరువను."

సీత తన్ను ప్రాథేయపడి వేడుకొంది గదా! - అని సరమ వెంటనే పట్టణంలో ప్రవేశించి, రహస్యాలన్నీ తెలుసుకొని ఆలస్యం చేయకుండా తొందరగా వచ్చి మైధిలికి పూసగుచ్చినట్లు సంగతులన్నీ చెప్పింది.

తనకు తెలిసిన వర్తమానాన్ని సీత వెంటనే సూర్యవంశోద్భవుడైన రాముడికి చేరవేసింది. యుద్ధం ఏమవుతుందోనని మనసులో మధన పడుతూంది.

రెండు పక్షాల వాళ్ళూ యుద్ధానికి సిద్ధమై, మహాదారుణ రణం ప్రారంభించారు. ఉభయ సైనికుల పెడబొబ్బలు, పెడనవ్వులూ కనకతప్పెటల మోతలూ - ఏనుగుల ఘీంకారాలూ - గుర్రాల సదలింపుతో భూతలం మొత్తం దద్దరిల్లిపోయింది. రోదసీ గహ్వరం తూట్లు పడ్డట్టుగా అయింది.

చావుకు తెగించి, కను రెప్పపాటులో యుద్ధం ముగించటానికన్నట్లు వీర రసావేశంతో - అట్టహాసంతో - భుజబల గర్వంతో - యుద్ధం జరుగుతూ వుంది. మోటువాళ్ళైన వానర సైన్యం ధాటికి తట్టుకోలేక లంక సైనికులొరిగారు.

తమ సైన్యం కపి సైన్యం ముందు నిలబడలేకపోవటాన్ని గమనించిన యింద్రజిత్తు. ప్రక్కలనే నిలచి కొంతసేపు తాను కూడా యుద్ధం చేశాడు. ఫలితం తొందరలో

కనిపించేట్టు లేదు. యజ్ఞదత్తాలైన రథాశ్వాలుండడం మంచిదని భావించి, యుద్ధరంగం నుండి బయటపడి లంకా నగరం ప్రవేశించి, నికుంభిలలో హోమం చేయటం మొదలుపెట్టాడు.

ఈ సంగతి గూఢచారుల వల్ల తెలుసుకొన్న విభీషణుడు వెంటనే రాముడికి చెప్పాడు. శ్రీరాముడు సైన్యసమేతంగా లక్ష్మణుణ్ణి పంపాడు. కాని, లక్ష్మణుడికి మేఘనాదుడు, ఎక్కడ హోమం చేస్తున్నదీ తెలియలేదు. ఇంద్రజిత్తు ఉనికి తెలియక తహతహపడుతున్నాడు సౌమిత్రి.

విభీషణుడు రాజ్యం మీద కాంక్ష బలిసిపోయి, అడియాసకు పాలుపడి, జాతి విరోధితో స్నేహం చేశాడు. కన్నకూతురినీ - కట్టుకొన్న భార్యనూ ఏమాత్రం శంక లేకుండా లంకలో ఉంచాడు. శరణుగోరి శత్రువు పక్క చేరి జాతి వృక్షాన్ని మొత్తాన్ని కూకటి వేళ్ళతో కూల్చటానికి సిద్ధంగా వున్నాడు.

తన భార్యా బిడ్డల్ని నిరంతరం ప్రేమాభిమానాలతో కంటికి రెప్పలా కాపాడుతున్న తన అన్న కొడుకు గదా! అని కూడా రవ్వంత జాలి చూపకుండా, ఇంద్రజిత్తు కుమారుడు హోమం చేస్తున్న నికుంభిలను పట్టుబట్టి లక్ష్మణ కుమారుడికి చూపించాడు.

ఆహా! విభీషణుడు నిజంగా పరమ భాగవతోత్తముడు గదా! మచ్చ లేని విమల చరిత్రుడు గదా!

సరమా సతీవిభుడైన విభీషణుడు ఈ రకంగా లక్ష్మణుడికి హోమ ప్రదేశం చూపించేప్పటికి, సౌమిత్రి బాణ పరంపర గుప్పించి మేఘనాదుణ్ణి సంహరించాడు.

జ్యేష్ఠ పుత్రుడి మరణవార్త చెవినిబడ్డ వెంటనే ద్రావిడ సార్వభౌముడు పట్టరాని దుఃఖంతో వివశుడయ్యాడు. కొంతసేపటికి తేరుకుని కోపోద్రిక్త మానసుడై, శత్రు సంహారం కావించటానికి మార్గాన్ని వెతికాడు.

పాతాళ హోమం చేసి, భుజబలాన్ని సంపాదించి విజయలక్ష్మిని చేపట్టాలని ద్రవిడ రాజశేఖరుడు భావించాడు. ఎవ్వరూ కనిపించనిచోట, రహస్య ప్రదేశంలో తానొక్కడే పాతాళ హోమం చేయాలని నిశ్చయించుకొన్నాడు.

దీని నెరిగిన విభీషణుడు క్షణాల మీద రాముడికి వార్తనందించాడు. సిగ్గూ ఎగ్గూ లేకుండా రాముడు అంగదాదుల్ని సైన్యసమేతంగా రావణ ప్రభువు చేస్తున్న యజ్ఞాన్ని విఘ్నం చేయండని పంపాడు.

రాముడి మాటల్ని నెత్తిన ధరించి, వాలినందనుడు మొదలైనవాళ్ళు లంకాధిపతిని వెదకటానికి వెళ్ళారు. ఎంత వెదికినా రావణుడి జాడ వారికి తెలియదు. తెలియక తిప్పలుపడుతున్నారు.

అంగదాదుల తిప్పలు చూసిన సరమ సిగ్గుమాలి, రావణుడు హోమం చేస్తున్న

ప్రదేశాన్ని వేలితో చూపింది. ఆ యువరాజు వెంటనే ఆతృతలో తొందరగా ఆ చోటుకు చేరాడు.

పెనుగొండలా ఆసనంపై కూర్చుండి, అగ్నిహోత్రం వేలుస్తున్న సర్వతో సమానుడైన లంకాధిపుని చూచి అతని విలక్షణత్వానికి అంగదుడు నివ్వెరపడి, యజ్ఞం విఘ్నం చేయటం సాధ్యంకాక, రావణుడి అంతఃపురం వైపు వెళ్ళాడు.

అంతఃపురంలో రావణుడి భార్య అపురూప సౌందర్యవతి సాధుశీల. మండోదరి చెక్కున చేయి చేర్చుకుని ప్రస్తుత పరిస్థితిని తలపోసి చింతిస్తూ వుంది.

ఏ అడ్డమూ లేకుండా వున్న అంతఃపురం ప్రవేశించి అంగదుడు, మాటామంతీ లేకుండా మండోదరీ సాధ్వీమ తల్లిని సమీపించి ముత్యాలపాపట బొట్టు నేలపై రాలేట్టుగా లాగి బిరబిరా రాజవీధుల గుండా ఈడ్చుకొని, లంకేశ్వరుని ముందు నిలబెట్టాడు. ఈ సన్నివేశాన్ని చూచి తోడికోడలు సరమ పకపకా నవ్వింది.

తన సతి మండోదరి విలాపం ఆలించిన రావణుడు ఆగ్రహోదగ్రుడై మండిపడ్తూ, కిష్కింధ యువరాజు అంగదుడి ఎదురు రొమ్ముపై ఒక తన్నుతన్ని, అర్ధాంగిని విడిపించాడు. ద్రవిడ భూపతి తన్ను దాకిన యువరాజు కాలికి బుద్ధి చెప్పాడు.

పరాభవానలం వల్ల తపిస్తున్న సుగుణాల మాల మండోదరిని రావణుడోదార్చి, 'శతృమూకల తునుమాడి జయాన్ని తెస్తానని' వెంటనే రథమెక్కి యజ్ఞ భూమికి పోయి బాణాగ్నిని బయలంతా క్రమ్మించి శత్రుమూకలను చీకాకుపరిచాడు.

సీతాపహరణం గావించి లంకాధిపుడు పడరాని అవమాన బాధ అనుభవించాడు; అయినా, సీతను దట్టమైన అశోకవనంలో కూర్చుండబెట్టాడు. అక్కడ చెట్టు నీడలో హాయిగా వుందామె.

దీనిని సాకుగా తీసుకుని శ్రీరాముడు – "ఔరా! రావణుడెంత దుర్మార్గుడు గదా! అని గొంతు చించుకుని లోకానికి చాటి చెప్పుతున్నాడు.

కాని, వనితారత్నం – సుగుణాల పేటి – కారుణ్యమూర్తి మండోదరిని మోటు మర్కటుడొకడు రాణీవాసం జొరబారి,కొప్పు పట్టి దుర్మదంతో రాజవీధుల గుండా ఈడిస్తే, రాముడు పల్లెత్తి మాట కూడా – 'ఇది తప్పు' అని అనలేదు. ఔరా! ఈ మైథిలీ భర్త ఎంతటి ధార్మికుడోగదా!

నూరేండ్లు దాటిన ముసలివాడయి, పడుచువాడిలా, చెవి వరకు ధనుస్సును లాగి వర్తులాకారంగా చేసి అమ్ముల పొదినుండి పుంఖానుపుంఖాలుగా బాణాలను శత్రుసైన్యం పైకి గుప్పించి భీకరరణం కావిస్తున్నాడు రావణ ప్రభుడు.

మోటు వనచరులైన వానరులు లంకాధిపతి బాణక్షతికి తాళలేక సంగర భూమిలో నిలువలేక, వెనక్కి చూడకుండా, శరీరానికి తాకుతున్న పోటుల్ని చూచుకుంటూ ఆర్చుతూ

ఐదు పది చేశారు. ఈ యుద్ధం సంగతి దేవుడెరుగు గాని ఎవరి కాలి కొద్ది వాళ్ళు పరుగెత్తసాగారు.

కపి సైన్యం చెల్లాచెదురై పారిపోవడం చూచిన రాఘవుడు ఉగ్రకోపుడై అడ్డం వచ్చి "పారిపోకండి; పారిపోకండి, నిలవండి; అని రావణ సార్వభౌముణ్ణి తూటాడ తలంచాడు.

రాముడి విజృంభణాన్ని చూచిన ద్రవిడరాజు భీకరంగా అర్చి, కుడి యెడమల చేతులతో తూణీరాల నుండి తూపుల తీసి తొడిగి వేశాడు. దశరథ సుతుడు కాలుసేతులాడక చేష్టలుడిగి దిక్కులు చూస్తున్నాడు.

అంత విభీషణుడు మాటలేమీ మాటాడక మెల్ల మెల్లగా వచ్చి, పక్కనే పొంచి, సమయం కోసం పరికించి చూస్తూ, యుద్ధంలో సందడి కనిపెట్టి గదను సారిస్తూ రావణుడి రథ గజాలను నాల్గింటిని చంపాడు.

ఆహా! విభీషణుడెంత శూరుడో?

విరథుడైన రావణ ధరారమణుడు వెంటనే, ఇంకో రథాన్ని యెక్కి యుద్ధం చేయసాగాడు. మెరుపు మెరిసిన చందాన ముదిమి వయస్సులో గూడా అంతటా తానేయై వాడి తూపులతో రాముణ్ణి సైతం గందరగోళపరిచాడు.

ఆ సన్నివేశం చూచిన రాముడికి కళ్ళు గిరగిరా తిరిగాయి.

తన అగ్రజుడి భండన పాండితికి రాముడు చాలలేదు. బడలిన రాముణ్ణి చూచాడు విభీషణుడు.

"రామా! మా అన్న రణకోవిదుడు; ధర్మయుద్ధం చేసి ఈతణ్ణి గెలవటం ఎవ్వరితరమూ కాదు. కాబట్టి, అధర్మమని భావించక, పొత్తికడుపుపై గురిపెట్టి కొట్టు. అప్పుడే, ఈ యుద్ధ విశారదుణ్ణి పడగొట్టగలవు. ఆలస్యం చేయకు; కానిమ్ము-"

విభీషణుడి సలహా పాటించి వాడియైన తూపు తొడిగి నాభి మీద నాటి రావణ సరేంద్రుణ్ణి దబ్బాటులో నేలగూల్చాడు రాముడు.

బాపురే! - భాగవతోత్తముడైన విభీషణుడి మాట యెంత గురిగా వుందో?

ఈ చర్య ధర్మమో? అధర్మమో పని మాత్రం తీరింది.

ప్రాణాలు పోయి, చాపకట్టగా ధరణిపై బడ్డ అన్నకు దహన సంస్కారాది క్రియలు చేయనని మొండికెత్తాడు.

రావణుడు ధర్మదూరుడనీ - అధిక పాపి అనీ - చెప్పటం మొదలు పెట్టాడు.

సరమా పతి చేష్టితం గమనించిన రాముడు - "ఈ సంగతి వింటే లోకం, ధర్మహీనుడు విభీషణుడు - అని నిందిస్తుందేమోనని ఆలోచించాడు. విభీషణుణ్ణి చూచి - 'విభీషణా! నీ కిది మంచిది గాదు; ద్రావిడ రాజైన రావణుడు లోక విజేత మాత్రమే గాదు. నీకు అగ్రజుడు కూడా, కాబట్టి అగ్ని సంస్కారాలు తప్పకుండా చేయవలసిందే. చావుతో

తప్పులన్నీ సమసిపోతాయి. కాబట్టి ప్రేతకు అగ్ని సంస్కారాలు చేయటం తప్పనిసరి అని రాముడు ఆజ్ఞాపించాడు.

"ఔనని" విభీషణుడు రాముడు చెప్పినట్లే చేశాడు.

"ఉలవలు తింటావా? బసవన్నా!" అంటే. ఔను;

పాలు తాగుతావా బసవన్నా! - అంటే ఔను"

అని ఆర్యుడైన రాముడి చెప్పుచేతలకు తలవొగ్గి - మా విభీషణుడు మంచి మార్గం పట్టి ఎన్నో సన్నుతులు గాంచాడు.

సమస్త లోకాల్లోనూ ఇట్లాంటి రాజు లేడనే ప్రఖ్యాతి గాంచాడు రావణుడు; చదువు సాములు నేర్చి తనకెవ్వరూ సాటిలేరనే ప్రసిద్ధి పొందాడు; మిడిసిపడే మిసమిసలాడే యౌవన వంతులనదువులో పెట్టి యశస్సు నార్జించాడు; శత్రువులు రాజధానిలోకి చొరకుండా చుట్టూ పరిఖనేర్పాటు చేసి గొప్పవాడయ్యాడు.

ఈ ధరణిపై పుట్టినవాడు చావక తప్పదు. చావు అనేది యెప్పుడో వొకప్పుడు రానే వస్తుంది. కాని, రావణుడు జాతి అభివృద్ధి కోసం జీవితమంతా త్యాగం చేసి యుద్ధభూమిలో మరణించాడు.

ఆహా! ద్రవిడ భూమీపతి యెంత ధన్యుడో?

రాజు లేని లంకా నగరానికి విభీషణుణ్ణి రాముడు రాజుగా చేశాడు. సీతను అగ్ని ప్రవేశం కావించి, పరిశుద్ధయైనదన్న విశ్వాసంతో తిరిగి తీసుకొని వానరులతో కలసి వైభవోపేతంగా అయోధ్యకు చేరాడు.

శత్రువు భార్యను తీసుకుపోతే, వానరులను శరణుజొచ్చి వాళ్ళ సాయంతో పగవాణ్ణి వధించి, భార్యను తిరిగి తెచ్చుకొని రాముడు సత్కీర్తి సౌధాన్ని కట్టుకొన్నాడు.

ఎంత రమ్మంటే మాత్రం...? ఎవరి అదృష్టం ఎవరికి వస్తుంది?

# ముగింపు

ఆనాటికి కథా శ్రవణం ముగిసింది. సంధ్యావందనాదులు ముగించా - ఆ రాత్రి నిద్రపోయి, తెల్లవారుజామునే తత్తరపడి లేచా.

కాలకృత్యాలు తీర్చుకొని, గురువర్యుడైన సూత మహాముని వద్దకు పోయి నమస్కరించా.

"గురువర్యా! కడచిన రాత్రి నాకు ఒక కల వచ్చింది. మా ప్రాంతాల్లో ఏవో గడబిడలు జరిగాయట. జనమంతా రకరకాల అగచాట్లకు - కడగండ్లకు గురయ్యారట. నేనిప్పుడక్కడకు పోయి, సంగతులన్నీ తెలుసుకొని వచ్చి మీకు వివరిస్తా.

నాక్కూడా యింటికి పోవాలని బుద్ధి పుట్టింది. ఒక్కసారి మా వూరు పోయి వస్తా.

చుట్టపక్కాల నందరినీ చూచి పలకరించి, రెండు నెలల్లో తిరిగి వస్తా - తెలుసుకోవలసిన ధర్మాలను, విషయాలను తెలుసుకొంటా.

మీరు భూత, భవిష్యద్వర్తమానాలు తెలుసుకోగల శక్తి సామర్థ్యాలున్న వారు; ఐనా ఒకసారి నేను కళ్ళతో చూచి వచ్చి సమస్తం మీకెరిగిస్తా, తప్పుగా భావించకండి.

నా మాటలు విన్నారు గురుదేవులు. వెంటనే లేచి, ఒక ఔషధాన్ని తీసుకొని వచ్చాడు.

"రామస్వామీ! ఇదిగో! ఇది, అపురూపమైన ఔషధం. దీన్ని అరికాలికి పూసుకొంటే, ఎంతదూరమైనా, శ్రమ లేకుండా ఒక్క రెప్పపాటులో పోవలసిన చోటికి ఆకాశంలో ఎగిరిపోతావు.

ఆ మహాత్మునిమాటలకు ఎంతో ఆనందం వేసింది.

అంతలోనే ముని నాధుణ్ణి చూచి బిక్కమొగం వేశా. ఏం తోచక, కాసేపు కూర్చున్నా. ఇక తప్పదని లేచి ప్రయాణమై పావుకోళ్ళు సంచిలో సర్దుకొన్నా.

పాదలేపనం అరికాలికి రాసుకొని, నేల మీద నుంచి ఆకాశానికెగిరా. తెల్లవారక ముందే మా వూరి చెరువు గట్టుమీద వున్న చెట్టు కింద వాలాను.

# తొలి పలుకులు

రామ రావణ యుద్ధకాలం నాటికి వింధ్య దక్షిణ దిక్కున గల భూభాగం మహారణ్యాలతో నిండి ఉండేది. పరాజితులైన ద్రావిడులు ప్రాణసంరక్షణ కోసం చెట్టుల గుట్టల పాలై మధ్యదేశంలో అల్లాడుతూ ఉన్నట్టు కనిపిస్తోంది. దక్షిణా పథానికి విచ్చేసిన రాముడికి విరాధుని వంటి వారెవ్వరో ఒకరిద్దరు మాత్రమే దానవులు ఎదురుపడ్డారు. కాబట్టి ఆనాడు దక్షిణాపథంలో వానర రాజ్యం తప్ప ద్రావిడ రాజ్యాలు గానీ, ద్రావిడ రాజులు గానీ ఉన్నట్టు కనపడదు. అంతేకాక, దక్షిణాపథం ద్రావిడ జనాకీర్ణంగా కూడా లేదు. నామమాత్ర పట్టణమైన కిష్కింధాపురం ఒక్కటే కంటికి కనిపిస్తోంది.

భారత కాలం నాటికి ఈ పరిస్థితులు తారుమారైపోయాయి. దక్షిణాపథాన పాండ్యరాజ్యం చాలా సుప్రసిద్ధంగా ఉంది. దీని ప్రభువు మలయధ్వజుడు. ఈ రాజశ్రేష్ఠుని పుత్రిక అయిన చిత్రాంగదను అర్జునుడు వివాహమాడాడు. ఈవిధంగా మలయధ్వజుడు పార్థుణ్ణి ఇంటి అల్లుణ్ణి చేసుకొన్నాడు. చిత్రాంగద కూడా తండ్రిని తలదన్నగల కొడుకును బభ్రువాహనుణ్ణి కన్నది. మలయధ్వజుడు బాగా దురభిమానం, అహంకారం కలిగిన రాజు. కృష్ణార్జునులే తనకు దీటురారని నిక్కి నీల్గేవాడు. ఇతను అతిరథుడు. ఎవరితోనైనా సరిపోల్చి చెప్పితే కనుబొమలు ముడిచేవాడు. అల్లుడి కోసం కురుక్షేత్రయుద్ధంలో పాల్గొన్న ఇతను అశ్వత్థామ చేతిలో చచ్చిపోయాడు.

ఇంకా కళింగ రాజ్యం కూడా ప్రసిద్ధికెక్కి ఉన్నది. దీని రాజు చిత్రాంగదుడు. దుర్యోధన

సార్వభౌమునికి కూతురునిచ్చిన మామ. వయోవృద్ధుడు. కురుక్షేత్ర యుద్ధంలో కళింగ సైన్యాలు ఒళ్ళు దాచుకోకుండా మహాదారుణంగా పోరాడాయి. ఈ కళింగ రాజు పౌండ్రక వాసుదేవుడితోనూ, కాశీరాజు తోనూ బాగా స్నేహం కలిగి ఉండేవాడు. యాదవులు హీనజాతి సంభవులని కాళింగులు గేలిచేసేవారు. ఈ కళింగరాజు బలరాముణ్ణి ఈ విధంగా ఎన్నోసార్లు గేలిచేసి ఆ బలరాముడి చేతిలోనే చచ్చాడు.

నిషాద దేశం: దీనికి కృష్ణుడి పినతండ్రి కుమారుడైన ఏకలవ్యుడు ప్రభువు. ఇంకా సాళ్వదేశం ఉంది. భీష్మకుడు పరిపాలించిన విదర్భ ఉంది. ఇలాంటివే ఎన్నో రాజ్యాలు తలెత్తాయి. ద్రావిడ దేశమంతా జనాకీర్ణంగానే ఉంది. రాక్షసత్వాన్ని వదిలేసి ద్రావిడులు మానవులయ్యారు. అడవులు వదిలిపెట్టి రాలేక అక్కడే మోటు జీవనం సాగిస్తున్న ఘటోత్కచుడు తదితరులు రాక్షసులుగానే పరిగణింపబడ్డారు.

మధ్య దేశంలో (అనగా వింధ్య పర్వత పంక్తిని ఆనుకుని ఉత్తరాన ఉన్న దేశం) ద్రావిడ రాజ్యాలు చిక్కురుబొక్కురుగా ఉన్నాయి. మధ్యదేశంలోని ద్రావిడులు పూర్వపు ఔన్నత్యాన్ని గడింపగలిగారు. మధ్యదేశం: దీనికి జరాసంధుడు ప్రభువు. చేది దేశం: దీనికి శిశుపాలుడు ప్రభువు. దశార్ణ దేశం: దీనికి కాశిరాజు ప్రభువు. అవంతి దేశం: దీనికి పాండవుల పినతల్లి కుమారులూ, కృష్ణుడి బావమరదులూ అయిన విందానవిందులు ప్రభువులు. మధుర, శూరసేన దేశాలు: వీటికి కంసుడు ప్రభువు. కుంతి భోజదేశం: దీనికి కుంతి పెంపుడు తండ్రి అయిన కుంతి భోజుడు ప్రభువు. హైహయ దేశం: దీనికి నీలుడు ప్రభువు.

ఇప్పటికి ఆర్య ద్రావిడుల మధ్య వివాహ రూపకమైన చుట్టరికం బాగా బలపడిపోయింది. వసుదేవుని చెల్లెలూ, కుంతిభోజుని పెంపుడు కుమార్తె అయిన పృథ(కుంతి)ను పాండురాజు పరిణయమాడాడు. అర్జునుని చుట్టరికమంతా ద్రావిడులతోనే. చిత్రాంగద, ఉలూచి, సుభద్ర ముగ్గురూ ద్రావిడ కన్యలే. ఒక కడుపు చేసుకున్న దాశరాజు కూతురు సత్యవతిని శంతనుడు పెళ్ళాడాడు. భీముడు హిడింబను గాంధర్వ పద్ధతిలో గైకొన్నాడు. ఇలాంటివెన్నో చూపించొచ్చు.

దేశం ఇలాంటి స్థితిలో ఉండగా జరాసంధుడు మగధ దేశానికి రాజయ్యాడు. అతణ్ణి జాతివైరం ప్రేరేపించగా ద్రావిడ రాజులనందర్నీ ఒక్క తాటిమీదకు తెచ్చి ఆర్యులను దేశంనుంచి తరిమేయడానికి పూనుకొన్నాడు. ఈ ఉత్కృష్ట కార్యంలో చాలావరకూ సఫలీకృత మనోరథుడయ్యాడు.

చేది దేశానికి రాజైన శిశుపాలుడూ, గంగాతీరవాసులైన మహాయోధులు హంసడిభకులూ ఇతనికి మంత్రులూ సేనాపతులూ అయ్యారు. మూర్తికావత పురానికి రాజయిన సాళ్వుణ్ణి ఇతను సామంతుడిగా చేసుకొన్నాడు. పౌండ్రక దేశానికి ప్రభువైన

పౌండ్రక వాసుదేవుణ్ణి స్నేహితుడిగా చేసుకొన్నాడు. మధురాధినాథుడైన కంసుడు ఇతని అల్లుడయ్యాడు. ప్రాగ్జోతిష పురాధీశ్వరుడైన నరకుడు నేస్తమయ్యాడు. నిషాద నాథుడైన ఏకలవ్యుడు మిత్రుడయ్యాడు. జరాసంధ సార్వభౌముని శ్వేతచ్ఛత్రం కింద ద్రావిడులు ఒక పక్కన చేరారు. ఒకప్పుడు కర్ణ జరాసంధులు ఒకరితో ఒకరు పోరాడి బలాబలాలు చూసుకొని మిత్రులయ్యారు. జరాసంధుని ప్రయత్నాలు ఈవిధంగా ఫలవంతమయ్యే స్థితికి వచ్చాయి. కానీ దైవవిధి వేరే విధంగా ఉంది. అవరోధం సంభవించింది. ఆ అవరోధం జరాసంధుడు దాటలేనటువంటిది. మహా మాంత్రికుడైన శ్రీకృష్ణుడు అవతరించాడు. కథ తలకిందైంది. ఒకవిధంగా రాయదగిన భారత చరిత్ర వేరే విధంగా రాయాల్సివచ్చింది. విధి దుర్లంఘము కదా!

# యాదవులెవరు?

శ్రీకృష్ణుడు మధురలో యదుకులంలో ప్రభవించాడు. తల్లిదండ్రుల్ని చెరసాల పాలుచేసి తరువాత తాను పుట్టాడు. యాదవులు, వార్ష్ణేయులు, భోజులు, అంధకులు, సాత్వతులు, దశార్హులు అనే తెగలు ఆనాడు మధురలో కాపురముంటున్నాయి. ద్రావిడ జాతి అనే వృక్షానికి ఈ జాతులు కొమ్మలూ, రెమ్మల వంటివి.

యాదవులను గురించి పురాణాలు ఏంచెప్తున్నాయో మనం పరిశీలిద్దాం. చంద్రవంశ సార్వభౌముడైన యయాతి పెద్ద కుమారుడు యదువు. ఇతనూ, ఇతని ముగ్గురు తమ్ముళ్ళూ తండ్రి ఆజ్ఞ పాలింపకపోవడంతో చక్రవర్తులు కాలేదు. కడగొట్టు కొడుకైన పూరుడు తండ్రి ఆనతి జవదాటకుండా పాటించడంతో చక్రవర్తి అయ్యాడు. గుప్తంగా దీనిలో ఒక ధర్మసూక్ష్మం ఇమిడుంది. యయాతికి ఇద్దరు భార్యలు. పెద్ద భార్య దేవయాని. ఈమె రాక్షస గురువైన శుక్రాచార్యుని కూతురు. యయాతి చంద్రవంశ క్షత్రియుడు. శుక్రాచార్యుడు బ్రాహ్మణుడు. కాబట్టి యయాతి దేవయానుల వివాహం ప్రతిలోమ వివాహమౌతుంది. ప్రతిలోమ వివాహంలో సంకరులు పుడతారని స్మృతికర్తలు ఘంటాపథంగా చెప్తున్నారు. కాబట్టి క్షత్రియ పురుషునికీ, బ్రాహ్మణ స్త్రీకీ పుట్టిన వాడెవడై ఉంటాడు? "బ్రాహ్మణ్యామ్ క్షత్రియాత్సూత:" అంటే బ్రాహ్మణస్త్రీకి, క్షత్రియునికీ పుట్టినవాడు సూతుడౌతాడు. సూతుడికి రాజ్యాధికారం లేదు. అందుచేతనే యదువుకు యౌవరాజ్య పట్టాభిషేకం గానీ, పట్టాభిషేకంగానీ జరిగి ఉండలేదు.

ఇక యయాతి రెండో భార్య అయిన శర్మిష్ఠ గురించి విచారిద్దాం. ఈమె దానవేంద్రుడైన వృషపర్వుని కూతురు. ద్రావిడ ప్రభువుల్ని భారతకాలం నాడు క్షత్రియులుగానే ఆర్యులు చూడటం మొదలెట్టారు. అందుచేతనే యయాతి శర్మిష్ఠల వివాహం సవర్ణ వివాహమైంది. ఈ కారణంగా యయాతి అనంతరం శర్మిష్ఠ కొడుకైన

పూరుడు చక్రవర్తి అయ్యాడు. ఈ పూరుడే కౌరవ పాండవులకు మూలపురుషుడు. యదువు యదు, వృష్ణి, భోజ, అంధక తదితర జాతులకు మూలపురుషుడు. యాదవుల గురించి భాగవతం ఏంచెప్తున్నదో చూద్దాం: ద్వాదశ స్కంధంలో భవిష్యన్నరపాల రాజ్య పరిపాలన కాలనిర్ణయానువర్ణనంలో ఈ క్రింది వాక్యాలు చెప్పబడ్డాయి. "పురంజయుండు మగధ దేశాధిపతియై పుట్టె. అంత నతండు పుళింద యదు మద్ర దేశవాసులగు హీనజాతి జనులు బ్రహ్మజ్ఞాన విహీనులై హరిభక్తి విరహితులై యుండువారికి"-ఈ మాటలను పరిశీలించి చూస్తే యాదవులు పుళిందులతో సాటివారుగా కనపడుతున్నారు. పుళిందులెవరు? "భేదాః కిరాత, శబర పుళిందామ్లేచ్ఛజాతయః" అని అమరుడు కంఠోక్తిగా వచిస్తున్నాడు. కనుక యాదవులు మ్లేచ్ఛజాతివారు. ఇక మ్లేచ్ఛులంటే ఎవరు? "మ్లేచ్ఛంతే అవ్యక్తం భాషంతే ఇతి మ్లేచ్ఛాః." మ్లేచ్ఛ, అవ్యక్తే శబ్దే, అనగా అవ్యక్తమైన భాష కలవారు. ఆర్యులకు ద్రావిడ భాషలు "అవ్యక్తా"లే. ద్రావిడ భాషల గురించి ఆర్యుల్లో వ్యాపించి ఉన్న ఇలాంటి అభిప్రాయాలే నేటికీ మన చెవుల పడుతున్నాయి. నన్నయ కాలం నాడు తెలుగు భాష "గాసట బీసట"గా ఉందని తలపబడింది. తెలుగు దేశంలో పుట్టి, తెలుగు భాష నేర్చిన నన్నయలాంటి వారికే తెలుగు "గాసట బీసట"గా కనబడినప్పుడు తెలుగు బాస నుడికారం తెలియని ఆర్యులకు తెలుగు భాష అవ్యక్తంగా ఎందుకు కనపడదు? ఈ మ్లేచ్ఛ జాతులన్నీ అనార్యులని, అంటే ద్రావిడులని మా అభిప్రాయం.

వసుదేవుని మూడో తమ్ముడైన 'అనాధృష్టి' కుమారుడు ఏకలవ్యుడు. ఇతనికి శత్రుఘ్నుడని ఇంకో పేరు కూడా ఉంది. ఈ ఏకలవ్యుడు "నైషాది"అని బ్రహ్మపురాణం మొగమాటం లేకుండా సత్యం వెలిబుచ్చుతోంది. కాబట్టి యదుజాతి మ్లేచ్ఛజాతి. అనగా ఆటవికులైన కిరాతాది జాతుల్లోనివారు. అటువంటి యదుకులంలో శ్రీకృష్ణుడు జన్మించాడు.

యదువృష్ణి భోజాంధకాది జాతుల్లో భోజ వంశం రాజవంశం.అనగా ఈ జాతుల్ని పరిపాలించే రాజులు భోజకులంవారై ఉండాలి. వసుదేవుని భార్యయైన దేవకి, శ్రీకృష్ణుని భార్యయైన రుక్మిణి ఈ భోజకులానికి చెందిన స్త్రీలే. వసుదేవుని చెల్లెలైన పృథ (కుంతి) భోజకులంలోని రాజైన కుంతిభోజునికి పెంపకానికి పోయి 'కుంతి' అయ్యింది. కుంతిభోజునికి నాగులతో చుట్టరికం ఉందంటారు. నాగులకు పెళ్ళిళ్ళు లేవు. అందువల్లనే కాబోలు కుంతి సంతానం కని దిసంతుతో పెళ్ళి చేసుకొన్నది.

భోజులకు కంసుడు ప్రభువయ్యాడు. తద్వారా యదు వృష్ణి భోజాంధకాదులకందరకూ ప్రభువయ్యాడు. జరాసంధుడు తన కూతుళ్ళయిన హస్తిని, ప్రాప్తినిల నిద్దరినీ కంసుడికిచ్చి పెళ్ళి చేసాడు. భోజులు అధిక సంఖ్యాకులూ, రాజవంశంవారూ, సార్వభౌమునితో చుట్టరికం కలిగినవారూ అవడం చేత యదు వృష్ణి కులాలను తమతో సరిసమానంగా చూసుకొనే అలవాటు వాళ్ళకు లేకపోయింది. అందువల్ల యదువృష్ణి కులాలకూ,

భోజాంధకులకూ తమతమ మనస్సుల్లో విభేదాలు తలెత్తి స్థిరపడ్డాయి. ఈ సమయంలో కంసభీతితో కుములుతున్న దేవకీ వసుదేవులకు చెరలో చిన్నికృష్ణుడు జన్మించాడు. కంసుడు వేలు విడిచిన మేనల్లుణ్ణి చంపుతాడేమోననే భయంతో పుట్టిన వెంటనే అర్ధరాత్రి వేళ వసుదేవుడు కృష్ణుణ్ణి తీసుకుపోయి వ్రేపల్లెలో ఉన్న నందగోపకుని భార్య యశోద పక్కన పడుకోబెట్టి ఆమె ప్రసవించిన ఆడబిడ్డను తెచ్చుకున్నాడు. కంసుడు ఈ ఆడపాపను చంపేసాడు. కృష్ణుడు గోపకుని ఇంట్లో పెరిగి గోపాలుడయ్యాడు. శ్రీకృష్ణుడు వ్రేపల్లెలో బాల్య పౌగండాలు గడిపాడు. శ్రీకృష్ణుని పెంపుడు తండ్రియైన నందుడు రాజపట్టణానికి దగ్గరగా ఉండటానికి భయపడి, బృందావనానికి వలస పోయాడు.

వ్రేపల్లెలో ఉండగా వసుదేవుని ఇంటి పురోహితుడైన గర్గుడు వ్రేపల్లెకు వచ్చినప్పుడు నందుడు రామకృష్ణులకు నామకరణం చేయమని వేడుకున్నాడు. అప్పుడు గర్గ మహాముని చెప్పిన మాటల్ని ఆలకించండి: "తొల్లి యీ శిశువు ధవళారుణ పీత వర్ణుడై యిప్పుడు నల్లనైన కతంబున గృష్ణుండయ్యె." పరిశీలించండి, ధవళారుణ పీత వర్ణాలు వరసగా బ్రహ్మ క్షత్రియ వైశ్యుల వర్ణాలు. నల్లని వర్ణం శూద్ర వర్ణం. అంటే అనార్య వర్ణం. దీన్నిబట్టి చూసినా యదుకులం ద్రావిడ జాతిగానే స్పష్టమౌతోంది.

శ్రీకృష్ణుడు బృందావనంలో తన యవ్వనంలో కొంతభాగం గడిపాడు. గోప ప్రభువైన నందునికి లేకలేక పుట్టిన సంతానం కావడంతో నందుడు శ్రీకృష్ణుణ్ణి అదుపాజ్ఞల్లో పెట్టి పెంచలేదు. శ్రీకృష్ణుడు బృందావనమంతా విచ్చలవిడిగా తిరగనేర్చాడు. ఆకతాయి అయ్యాడు. మల్లుడయ్యాడు. జారుడయ్యాడు. చోరుడయ్యాడు. గాయకుడయ్యాడు. తాంత్రికుడయ్యాడు. వేదాంతి అయ్యాడు. స్వేచ్ఛా మధుర రసాన్ని కుత్తుకబంటి గ్రోలాడు. ప్రాకృత లోకానికి నిర్ణయింపబడిన మర్యాదలు అతనికి నచ్చలేదు.

ఈ మర్యాదలకు లొంగి ప్రవర్తించడానికి స్వేచ్ఛాజీవనసారం గ్రోలిన ఈ మహాతేజశ్శాలి ప్రవృత్తి తిరుగుబాటు చేసింది. ఫలితంగా ఆటవికుల కట్టుబాట్లను చెల్లాచెదురు చేసింది.

ఈ స్వేచ్ఛా జీవనమే భవిష్యత్ రాజకీయరంగంలో శ్రీకృష్ణుణ్ణి ఎదురులేనివాణ్ణిగా చేసింది. బృందావనంలోని శరత్కాలపు రాత్రులన్నీ రసం చిప్పిల్లే ఇతని మధుర వేణుగానంతో ఉత్ఫుల్లమయ్యాయి. చంపక సౌగంధికా వాసితాలైన సరస్సులన్నీ ఇతని జలక్రీడలతో అల్లడి తల్లడి అయ్యాయి. వ్యాకోచ వివిధ పుష్ప సౌరభ్య సంవాసితాలయిన నికుంజ పుంజాలు ఇతని రాసక్రీడల వల్ల పరిక్షుణ్ణాలయ్యాయి. మాధవీలతా మంటపాలు ఇతనికి పరిష్కృత పుష్పశయ్యాగారాలయ్యాయి. గోప గోపికా రసనాగ్రాలపై నిరంతరం ఇతని నామం మంగళ తూర్యారావాలతో నాట్యమాడింది. అహో! స్వేచ్ఛాజీవనానికి మూల్యమేది?

కళ్ళు తెరవనినాడే గోపకుని ఇంటికి తీసుకుపోబడి, అక్కడే పెరిగి పెద్దవాడై కూడా కృష్ణుడు తన వంశాచారాలనూ, సంప్రదాయాలనూ విస్మరింపలేకపోయాడు. ఏమి ఈ చిత్రం? కిరాత జనసామాన్య శిరోలంకారమైన నెమలి పింఛం నెత్తిపైన ఉయ్యాలో జంపాలో అంటూండగా, పిల్లంగ్రోవిని చేత పట్టి, కనుబొమలెగరేస్తూ, ఆ వెదురు నాళం మీద మునివేళ్ళు తాండవింపజేస్తూ గోపికా జనాన్ని చిందులు తొక్కించాడు. ఆ మనోజ్ఞ వేణుగానాన్ని ఆలకించిన ఏ ఆటవికుడు పాటకు సరిపడే అడుగువెయ్యకుండా వెళ్ళగలడు? నిశిత బాణ పరంపరచే కాని కార్యం ముట్టుకుంటే విరిగిపోయే వెదురు బూరతో చేయనేర్చాడు. ఆ రసిక శిఖామణికి బృందావనమంతా కైవసమైపోయింది.

శ్రీకృష్ణుడు నెమ్మదిగా రాజకీయరంగంలో ప్రవేశించాడు. మహా మేధావియైన ఇతనికి భావి కార్యాలు కళ్ళకు కట్టినట్టు కనపడసాగాయి. తల్లిదండ్రులు పడ్డ కష్టాలు, తనను చిన్నప్పుడు కంసుడు పెట్టిన పాట్లు, భోజులు తమను అగౌరవంగా చూసే విధానం శ్రీకృష్ణుని మనస్సును కలవరపెట్టసాగాయి. భోజులను పదవీచ్యుతుల్ని చేసి, ద్రావిడ సార్వభౌముడైన జరాసంధుని పీచమణచి, తానే ఆ పదవిని ఆక్రమించకూడదా! అనే ఊహ కలిగింది. వెంటనే ప్రయత్నాలు చేయబూనాడు. ఈ ప్రయత్నాల వల్ల చేతికందనున్న పండు చేజారిపోతున్నట్టు జరాసంధునికి తోచింది. దాంతో మాగధుడు కోపోద్రిక్తుడై అతి రహస్యంగా ప్రతి ప్రయత్నాలు చేసేందుకు సన్నద్ధుడయ్యాడు. ఈ విధంగా ఇద్దరికీ మధ్య ఆంతరంగిక యుద్ధం తలెత్తింది. ఇద్దరూ బయటపడ్డారు. చేతులు కలిపారు. చదరంగం ఆటలోకి దిగారు. ఎత్తుకు పైఎత్తుతో కొంతకాలం గడిపారు. మహా మాంత్రికుడైన శ్రీకృష్ణుని ముందు జరాసంధుని ఎత్తులు సాగలేదు. భటుల్ని కోల్పోయాడు. గుర్రాలు, ఏనుగులు మాయమయ్యాయి. రథాలు ధ్వంసమయ్యాయి. మంత్రులు మటుమాయమయ్యారు. ఆట కట్టింది. ఇరవై ముప్పై ఏళ్ళు పోరాడి పోరాడి శ్రీకృష్ణుడు ఆట కట్టించాడు. అయితే తనకు మాత్రం ఫలితం దక్కలేదు. కృష్ణ నిర్యాణ సమయానికి యాదవులు బాగా బలవంతులయ్యారు. కానీ క్షత్రియత్వాన్ని పొందలేకపోయారు. క్షత్రియులతో వియ్యం, నెయ్యం, కాదంటే కయ్యం చేయగల సామర్థ్యాన్ని సంపాదించారు. మకుటంలేని మహారాజులయ్యారు. దానితో అవసాన దశ సంప్రాప్తమయింది. సుగుణాలన్నీ నశించాయి. యాదవ కులంలో మిండరికం, తాగుబోతుతనం క్రమక్రమంగా ఎక్కువయ్యాయి. గురు ధిక్కారం మూడు పూవులూ ఆరు కాయలుగా సర్వత్రా విస్తరించింది. పెద్దల దగ్గర నుంచి పిల్లల వరకూ అందరూ తాగుడుకు బానిసలయ్యారు. బలరామ సాత్యకుల సురాపానానికి హద్దుల్లేకుండా పోయింది. కోడిపందేలకు వెళ్ళినట్టు వెళ్ళి, సముద్రతీరంలో తెగ తాగి, యదు వృష్ణి భోజాంధకులంతా తన్నుకు చచ్చారు. కృష్ణుడు చూస్తుండగనే ఇదంతా జరిగిపోయింది.

# శ్రీకృష్ణుని రాజనీతి

ఈ అమేయ ప్రతిభావంతునికి ఉన్న దూరదృష్టి అద్భుతజనకం. తన కార్యసాఫల్యానికి అవరోధాలు కలిగితే ఎలాంటి సాధన సంపత్తితోనైనా వాటిని తొలగించుకోడానికి వెనుదీయడు. కార్య నిశ్చయం కూడా చాలా వేగంగా చేస్తూంటాడు. సామాన్య రాజకుటుంబంలో జన్మించి భారతలోకాన్నంతా ఒక కీలుబొమ్మలా ఆడించడానికి ఎలాంటి ప్రతిభ ఉండాలి? చుట్టపక్కాలు కూడా ఇతని రాజ్యతృష్ణకు ఆహుతి అయ్యేవారు. అయితే శత్రువనేవాడే మిగలకుండా చెయ్యాలని ఎప్పుడూ ప్రయత్నించినట్టు కనపడదు.

శ్రీకృష్ణుడు యావత్ భారతవర్షంలో పలుకుబడినో, రాచరికాన్నో సంపాదించాలని చిన్నతనం నుంచీ తలుస్తూనే ఉన్నాడు. దీనికోసం ముందుగా స్వసంఘంలో పెత్తనం సమకూర్చుకోవలసి . వేగంగా చుట్టరికాలను విస్తరింపజేసాడు. యదు వృష్ణి భోజ అంధక సాత్వతి కన్యలను పెళ్ళాడి, అంతరంగిక శత్రుత్వాలు లేకుండా చేసుకున్నాడు. కానీ మేనమామ అయిన కంసుడు అడ్డం వచ్చాడు. వెనకా ముందూ చూడకుండా అతన్ని తుదముట్టించాడు. ముసలివాడైన తన తాత ఉగ్రసేనుణ్ణి నామమాత్రపు రాజును చేసి, నిరాటంకమైన విస్తృతమైన పెత్తనాన్ని సాగించుకున్నాడు. కంసవధ సందర్భంలో శ్రీకృష్ణుని అద్భుత రాజనీతి లోకానికి విదితమైంది. కంసభీతి వల్ల కృష్ణుని వంశంవారు పలుదేశాలకు వలసపోయారు. అందువల్ల యాదవుల్లో బాగా అసంతృప్తి ప్రబలి ఉంది. ఆ విషయం కనిపెట్టి శ్రీకృష్ణుడొక్కడే అన్నతో కలిసి మధురకు రహస్యంగా వెళ్ళాడు. రాజకుటుంబం రహస్యాలు తెలుసుకోవాలంటే దాసీ సాంగత్యం చెయ్యాలని పెద్దలు చెప్తుంటారు. మధురకు వెళ్ళిన గోపాలుడు తిన్నగా కంసుని ఇంటి దాసి, త్రివక్ర అయిన కుబ్జ ఇంటికి వెళ్ళాడు. వెళ్ళడమే కాదు, దానితో రతిక్రీడల్లో తేలి అలరించాడు. దానినుంచి ఏం రహస్యాలు గ్రహించాడో భగవంతుడికి తెలుసు. కానీ నేరుగా నిర్భయంగా హఠాత్తుగా రాజసభకే వెళ్ళి కంసుని మీద పడి చంపేసాడు. అయితే రాజ్యాన్ని స్వాధీనం చేసుకునే ప్రయత్నాలు మాత్రం చేయలేదు. ముసలివాణ్ణి గద్దె మీద పెట్టాడు. వలస వెళ్లిపోయిన తన వాళ్ళను రప్పించి, అభయ ప్రదానం చేసి, మధుర నెలవుల్ని ఇప్పించి, తన పక్షాన్ని బలపరచుకున్నాడు. కంసవధతో శ్రీకృష్ణుడికి బలవంతులతో విరోధం సంప్రాప్తమయింది. కానీ స్వసంఘాన్ని గిరిగీసి నిలప గలిగాడు. కంసుడంటే సామాన్యుడు కాదు; జరాసంధుని అల్లుడు. జరాసంధుని బలపరాక్రమాలూ, ముష్టియుద్ధ కౌశలం లోకవిదితం. అతని సైన్యం వీరులైన సుశిక్షితులైన భటులతో నిండినది. ఇతని బంధుగణం కూడా ఎక్కువ. ద్రావిడ సంఘం చీలిపోయింది. రెండు పాయలైంది. బహుళ సంఖ్యాకులు జరాసంధుని కేతన పటాంచలం కింద పోగయ్యారు. యదు వృష్ణి భోజాంధకుల్లో

అధిక సంఖ్యాకుల్ని చేపట్టి, శ్రీకృష్ణుడు జరాసంధునితో ఢీకొన్నాడు. జరాసంధుని పక్షాన ఉన్న వీరుల్ని చీలదీసి, ఒకరు తోడు వచ్చేలోపునే ఒకర్ని నిర్జించడం ప్రారంభించాడు. ఆశ్రమంలో హంసడిభకులను మాయోపాయంతో కూల్చాడు. దీనితో జరాసంధుడు అదిరిపడి, అప్రమత్తుడై పలుమార్లు దండెత్తి పోయి శ్రీకృష్ణుణ్ణి పరాభూతుని చేసాడు. మధురలో ఉంటే ప్రాణాలు దక్కవని గ్రహించి, జలదుర్గాన్ని ఆశ్రయించడం ఉత్తమమని ఊహించి, శ్రీకృష్ణుడు వెంటనే సముద్రంలో ద్వారవతి అనే పట్టణాన్ని కట్టించి అక్కడికి తరలిపోయాడు.

ఇక్కడనుంచి నిర్భయంగా తంత్రాలు పన్నసాగాడు. ఏకలవ్యుడు ఈ సమయంలోనే ద్వారవతిపై దండెత్తి, ఆ నగరాన్ని బాగా ధ్వంసంచేసి మట్టగించివేసాడు. సాల్వుడు వికత్థనాలాడుతున్నాడు. శిశుపాలుడు మహోల్లాసంగా సైన్యాన్ని సమకూర్చుకొని బెదిరిస్తున్నాడు.

# విషమస్థితి

ఈ విషమస్థితిలో దిక్కుతోచలేదు. దరీ తెన్నూ కానరాలేదు. ఏవైపు చూసినా శత్రువుల సింహనాదాలే. ఏవైపు తిలకించినా వైరి ధనుష్టంకారాలే. ఏవైపు కాంచినా శత్రు సేనాశిబిరాలే. ద్రావిడుల్లో ఒక్క వీరుడైనా చేయూతనిచ్చేవాడు కనపడ్డంలేదు. శ్రీకృష్ణుడు భయభ్రాంతుడయ్యాడు. చకితుడయ్యాడు. జడుడయ్యాడు. ఆర్యుల సాంగత్యాన్ని ఆశిద్దామంటే అప్పటికి ఆర్య రాజుల్లో విరోధాలు లేకపోవడం వల్ల తనని ఆదరించరు. వారితో కలవడానికి ఇష్టపడలేదు. ఇక ఒక్కటే శరణ్యం; మంత్రం. మంత్ర సహాయంతో ఆర్యుల్లో చీలిక తెచ్చి ఒక పక్షాన్ని చేపట్టాలి. అదెలా జరుగుతుంది? కురు పాండవుల మధ్య విరోధం కనిపించడం లేదు. ఇక తప్పదు. కల్పించాలి. ధర్మరాజుతో రాజసూయం చేయించాలని నిశ్చయించాడు. జరాసంధుడు ఎదురుతిరిగాడు. పాండవులు తనను ఆశ్రయింపక తప్పదు. భీమార్జున కృష్ణులు ముగ్గురూ స్నాతక బ్రాహ్మణ వేషాలు ధరించి, కుట్ర పన్ని, గిరివ్రజపురంలో ప్రవేశించి, అర్ధరాత్రి వేళ రాజమందిరంలోనే జరాసంధుణ్ణి హతమార్చారు. రాజసూయం పూర్తయింది. అగ్రపూజ విషయంలో భిన్నాభిప్రాయం వ్యక్తం చేసిన శిశుపాలుడు ప్రమత్తుడై ఉండగా శ్రీకృష్ణుడు చక్రం ప్రయోగించి సంహరించాడు. రాజసూయం చూసిన దుర్యోధనుడికి కన్నుకుట్టి, ఈర్ష్యాసూయలేర్పడి రాజుకోసాగాయి. రాజసూయ సమాప్తితో శత్రువర్గంలోని ఇద్దరు మహాయోధులు సమాప్తి చెందారు. శ్రీకృష్ణుడికి అప్పుడు కొంతవరకూ మనశ్శాంతి చేకూరింది. శిశుపాల వధ తరువాత శ్రీకృష్ణుడు సాళ్వుని పౌండ్రక వాసుదేవుణ్ణి చంపగలిగాడు. ఇక ఉపద్రవం లేని స్థితికి వచ్చానని శ్రీకృష్ణుడు భావించాడు. ఉత్సాహం మిన్నుముట్టింది. సాహసంతో

కార్యాలు చేయసాగాడు. ఈ విధంగా ఆర్యులతో పొత్తు కుదుర్చుకుని, దాన్ని క్రమక్రమంగా పటిష్టం చేసుకుని, ద్రావిడ సంఘ విముఖుడయ్యాడు. విముఖుడవడమే కాదు ద్రావిడ జాతి నిర్మూలనకే పూనుకున్నాడు.

# శ్రీకృష్ణుని రాయబారం

కురు పాండవుల మధ్య తాను వెదజల్లిన విరోధ బీజాలు చిగురించి,పెరిగి, పెద్దవై మహా దారుణమైన కురుక్షేత్ర యుద్ధానికి మూలకందమయ్యాయి. శ్రీకృష్ణుని తంత్రం ఫలవంతమయింది. మంచి తరుణం వచ్చింది. దాయభాగ విషయమై భారత యుద్ధం ఆసన్నమైంది. సంధి చెడి భారత సంగ్రామమే ప్రవర్తిల్లితే తనకు అమిత లాభమని చక్కగా గ్రహించాడు. కురు పాండవులకు పోరాటం కలిగి ఎవ్వరు గెల్చినా తనకు నష్టం వాటిల్లకుండా ఉండేటట్టు ఎత్తులు వెయ్యసాగాడు. ఇరుపక్షాల్లో ఉన్న మహావీరులు చావడమే అతని అభిమతమయ్యింది. ఎవరు గెల్చినా అధిక నష్టంతో గెలుస్తారని విశ్వసించాడు. గెలిచినవారుకూడా బాగా బలహీనులుగా ఉంటారని నమ్మాడు. అలాంటివాణ్ణి తనచేతిలో ఉంచుకొని కీలుబొమ్మలా ఆడించగలుగుతానని సంపూర్ణంగా విశ్వసించాడు. అందుకే తెలిసి తెలిసి సౌప్తిక వధకు అంగీకరించి, పాండవులూ సాత్యకీ తప్ప మిగిలిన అందర్నీ అశ్వత్థామ పాలుచేసాడు. సాత్యకి తనకు నచ్చిన బంటు కాకపోయుంటే సౌప్తిక వధలో పేరులేకుండా పోయేవాడే. దీనినంతా కూలంకషంగా చర్చించే, యాదవ మహావీరుల్ని యుద్ధంలోకి రానీయలేదు. సాత్యకి, చేకితానులు తప్ప యాదవవీరులెవ్వరూ పాండవ పక్షాన చేరడానికి రాలేదు. కృతవర్మ, విందానువిందులు, నారాయణ గోపాలురు తప్ప ఇతరులెవ్వరూ కౌరవ పక్షానికి పోలేదు. సత్యభామా వివాహ సందర్భంలో కృతవర్మ శ్రీకృష్ణునికి పగవాడయ్యాడు. అందుకే అతను కౌరవులతో కలిసాడు. విందానువిందులు పాండవుల పినతల్లి బిడ్డలై ఉండి కూడా పాండవ విద్వేషులు. అందువల్ల వారు కౌరవ పక్షం చేరారు. నారాయణ గోపాలుర్ని శ్రీకృష్ణుడు యుద్ధానికి పురికొల్పి పంపాడు. ఈ నారాయణ గోపాలురు మహా బలవంతులూ, పొగరుబోతులూను. పైగా శ్రీకృష్ణుణ్ణి తిరస్కరించదానికి వెనుదీయనివారు. అందుకే ఇష్టంవచ్చినట్టు చంపిపారేయవచ్చునని తలచి, కుతంత్రం పన్ని వాళ్ళను కౌరవబలంలో చేరమని పంపించాడు. ప్రద్యుమ్న, గద సారణ, చారుధేష్ణ, సాంబాదులు కురుక్షేత్రయుద్ధంలో దిగి ఉంటే ఆ యుద్ధం అలా ఉండేది కాదు. కురుక్షేత్రయుద్ధంలో పాండవులు విజయులైనా బాగా దుర్బలురయ్యారు. జయం నామమాత్ర జయమైంది. చతురంగ బలమూ లేదు. వీరులూ లేరు. ఉత్సాహమూ బంధునాశంతో నశించింది. పుత్రుల మరణంతో దిగులేర్పడింది. ఈ కారణం వల్ల పాండవులు శ్రీకృష్ణుణ్ణి అవసరం

వచ్చినప్పుడు కూడా ధిక్కరించడానికి శక్తిసామర్థ్యాలు లేక ఉన్నారు. ఈ స్థితిలో ఉన్న పాండవుల్ని శ్రీకృష్ణుడు తన చేతిలో ఉంచుకొని ఆడించడం చాలా సులభమైంది.

పైన చెప్పిన కారణాల వల్ల మొట్టమొదటి నుంచీ శ్రీకృష్ణునికి సంధి చెడగొట్టాలనే తలంపు. భారతంలో శ్రీకృష్ణుడు సంధికై వెళ్ళే వేళ చెప్పిన వాక్యాలు ఆలకించండి.

**ఉద్యోగ పర్వం, తృతీయాశ్వాసం:**
**"ఆ సుయోధను ముక్కున నావిగలుగ**
**బుడమి నీకీడు గావున బోర కలుగు**
**నేను గయ్యపు శకునము లెన్నియేని**
**కంటి నీవనుత్సాహివి కాగవలయు.**

చతురంగ బలంబుల నాయితంబు గావించుచు దొరలం బురికొల్పి కొనుచు నాలస్యము లేక సమరమునకు సన్నాహంబు సేయుచుండ వలయు."

భీమసేనుణ్ణి పురికొల్పడానికి కూడా ఈ ఉద్దేశ్యమే మూలకారణం. ద్రౌపదిని ఓదార్చే సమయంలో చెప్పిన సూక్తులకు కూడా ఈ ఆలోచనే ముఖ్యహేతువు. ఆయా ఘట్టాలను చదివితే సర్వం బోధపడుతుంది.

కౌరవ సభలో సంధి విషయం ముచ్చటించేటప్పుడు సైతం ఏ పద్ధతి అవలంబిస్తే తప్పకుండా సంధి చెడిపోతుందో ఆ పద్ధతిలోనే మాటాడాడు. రాయబారి సంధి పొసగడానికి అవసరమైన కారణాలను చెప్పాలిగానీ, తన పక్షాన్ని ముందుగా మితిమీరి కొనియాడటం ధర్మమా? తన పక్షం వారిలో ఉన్న మంచిని గోరంతలు కొండంతలుగా ఉపన్యసించడం లెస్సయా? ఎదుటి పక్షంలో ఉన్న చెడును గోరంతలు కొండంతలుగా నిందించడం మేలా? ఈ ఫక్కీ సంధి కూర్చడానికా? చెడగొట్టడానికా?

ఇక సంధి నియమాలను గురించి చర్చిద్దాం. పాండవులు కృష్ణుని ముఖతా అయిదూళ్ళు అడిగారు. ఆ అయిదూళ్ళేవి?

**1. మాకంది 2. వారణావతం 3. కుశస్థలి 4. వృకస్థలి 5. మరేదైనా ఒక ఊరు.**

ఈ ఊళ్ళెలాంటివి? ఎవ్వరివి? వీటిలో మాకంది, వారణావతం పాంచాలరాజ్యంలోనివి. కుమారాస్త్ర ప్రదర్శన అనంతరం కౌరవ పాండవులు ద్రుపదుణ్ణి చావగొట్టి వీటిని లాక్కొని గురుదక్షిణగా ద్రోణాచార్యుడికిచ్చారు. మూడోదైన కుశస్థలి కర్ణుడు యాదవుల్ని ఓడించి గుంజుకొన్నది. కర్ణుని స్వార్జితం. సంధి కుదరడానికే కృష్ణుడు ఈ ఊళ్ళు అడిగి ఉంటాడా? ఈ ఊళ్ళపై దుర్యోధన చక్రవర్తికి పెత్తనమేముంటుంది? ఎట్లాగైనా ఈ ఊళ్ళను దుర్యోధనుడు ఇవ్వడానికి ఇష్టపడితే కర్ణ ద్రోణులు కౌరవపక్షం

నుంచి చీలిపోవచ్చుననే ఆశతో వేసిన ఎత్తు. ఎత్తు సాగలేదు. ధర్మజుడు గురుధనాపహరణానికి జంకలేదు. మొండి దుర్యోధనుడు సంధి కుదరనీయలేదని ప్రాకృత లోకం ఆడిపోసుకుంది. ఏం చిత్రమో కదా! నీతివేత్త భీష్ముడు నోరెత్తలేదు. ఇతనెప్పుడూ మతకరీ, కపటియే కదా!

శ్రీకృష్ణుడు యుద్ధాన్ని ఎలా నడిపించాడు? రణనీతి గంగలో కలిపి ధర్మజుడికి విజయం చేకూర్చాడు. భూరీశ్రవుని వధ, ద్రోణవధ, కర్ణవధ, దుర్యోధన వధ- ఇవన్నీ అతిహేయాలు, నింద్యాలు, యుద్ధ ప్రారంభంలో ఏర్పరచుకొన్న నియమాలకు పూర్తి విరుద్ధాలు.

# యాదవ ప్రళయం

కురుక్షేత్ర యుద్ధ సమాప్తితో భారతవర్షంలో శ్రీకృష్ణుని ఆజ్ఞ సుగ్రీవాజ్ఞయైపోయింది. దానితో యాదవులు కన్నుకానకుండాపోయారు. మిన్ను మన్ను ఎరుగనివారుగా తయారయ్యారు. కావరం ఎగదట్టింది. పోతరించారు. ఈ అప్రతిహత అధికారం యాదవ పతన హేతువైంది. ద్వారకాపురమంతా తాగుబోతులమయమై పోయింది. పానశాలలూ, కల్లుపాకలూ కిక్కిరిసిపోయాయి. జారత్వం హెచ్చింది. మద్యపానం అపరిమితమయ్యింది. చీకులమ్మే అంగళ్ళు విస్తరించాయి. (భారత మౌసల పర్వంలోని 29, 40, 57, 93, 66 పద్యాలను తిలకించండి) ఆచార్య తిరస్కారం చెలరేగింది. ఏకలవ్యుడు రణ నిహతుడైనా, అతని సంబంధికులు అదను కోసం చూస్తూ, ద్వారకను ముట్టడించే ఉన్నారు. భారతవర్షాన్నంతా అదిమిపట్టి ఉంచగలిగిన శ్రీకృష్ణుడు యాదవులను మాత్రం మర్యాదాబుద్ధుల్ని చేయలేక నీరవుడయ్యాడు. నిర్వీర్యుడయ్యాడు. యాదవ కుమారులు ఒళ్ళు తెలియక మత్తులై, సముద్ర తీరానికి పోయి చెడ తాగి, లేనిపోని పోరాటం కల్పించుకొని కొట్టుకొని చచ్చారు. ఏకలవ్య సంబంధికులు సమయం దొరికింది కదా అని సముద్రతీరంలో కనిపెట్టుకొని ఉన్నారు. యాదవులు నిశ్శేషంగా చచ్చి రణరంగాన పడి ఉన్నప్పుడు, బభ్రువు అనేవాడు ఆ దారుణ రణరంగాన అతి దీనంగా ఏడుస్తూ తిరుగుతుంటే బోయవాడొకడు దొంగదెబ్బతో అతన్ని తెగటార్చాడు. శ్రీకృష్ణుడు రుక్మిణిని బలవంతంగా ఎత్తుకుపోయినప్పుడు, కోపం పట్టలేక శిశుపాలుడు ద్వారక మీద పడి, ఈ బభ్రువు భార్యనే అపహరించి తీసుకుపోయాడు.

యాదవ ప్రళయానంతరం శ్రీకృష్ణుడు అతిదుఃఖంతో ఒక చెట్టు నీడలో పడుకుని ఉండగా, ఇంకో బోయడు బాణాలతో తీవ్రంగా గాయపరిచి ప్రాణాలు హరించాడు. శ్రీకృష్ణుని వధకు మన పూర్వులు కట్టుకథ నొకదాన్ని సృజించి సమాధానం చెప్పజూశారు. కానీ, బభ్రు వధకు ఎలాంటి సమాధానమూ చెప్పడానికి ప్రయత్నించలేదు. సమాధానం

లేకపోవడం వల్లే, యాదవ కాంతలను ద్వారకాపురి నుంచి కృష్ణుని అనుమతితో ఇంద్రప్రస్థ పురానికి అర్జునుడు తోడ్కొనిపోతుండగా బోయలు చుట్టుముట్టారు. ముసలివాడైన అర్జునుడు గాండీవం మోపెట్టలేకపోయాడు. బోయలు విస్తారసంఖ్యలో ఉండటం చేతా, తానొక్కడవడం చేతా, రక్షణీయులు స్త్రీ బాల వృద్ధజనం అవడంచేతా కలవరపడి క్రీడి గాండీవం మోపెట్టలేకపోయుంటాడు. దీన్ని కనిపెట్టిన బోయలు పెచ్చుపెరిగి యాదవ కాంతల్ని నిలువు దోపిడి చేసారు. అంతటితో ఊరుకోక, కొంతమందిని లేవదీసుకు పోయారు. మరికొంతమంది తమంతట తామే లేచిపోయి చెంచువాళ్ళతో కాపురం కోసం అడవులకు పోయారు. ఇలాంటి కులావమానంతో శ్రీకృష్ణుని అవతారం ముగిసింది. అధిక రాజ్యతృష్ణతో బలవద్విరోధం సంపాదించుకొన్నవాళ్ళు అంత్యకాలంలో నిరుపద్రవంగానూ, సుఖంగానూ గడపగలుగుతారా?

భారతకాలం నాటికి సాంఘిక పరిస్థితులు చాలా తారుమారయ్యాయి. అనులోమ వివాహాలు విరివిగా జరుగుతున్నాయి. ఒక నిదర్శనం చూపిస్తాము. చంద్రవంశ క్షత్రియుడైన ముద్గలుని సంతానం బ్రాహ్మణులయ్యారు. బ్రాహ్మణులే కాదు. నాలుగు కులాల వారయ్యారని భాగవతం చాటుతోంది. నేటికీ ముద్గల గోత్రజులు బ్రాహ్మణుల్లో ఉన్నారు. ముద్గలుని పుత్రుడైన దివోదాసుని వంశంలో ద్రుపదుడు జన్మించి క్షత్రియుడిగానే ఉన్నాడు. ముద్గలుని కుమార్తెయైన అహల్య వంశంలో కృపాచార్యుడు పుట్టి బ్రాహ్మణుడయ్యాడు. అహల్య గౌతముడనే బ్రాహ్మణుని పెళ్ళాడి బ్రాహ్మణ సంతానాన్ని కన్నది. తేలిన సంగతి ఏమి? కృపాచార్యునికి తల్లి వైపు చుట్టాలు పాంచాలురు. కృపాచార్యుని చెల్లెలయిన కృపి ద్రోణాచార్యుని పరిణయమాడి అశ్వత్థామను కన్నది. ఒకే వంశంలో పుట్టిన పాంచాలురకు రాజ్యం ఉండి, తనకు లేదనే కాబోలు అశ్వత్థామకు పాంచాలురపై అంత దురాగ్రహం. బ్రాహ్మణుడై ఉండీ క్షత్రియత్వం పూనడానికీ ఇదే కారణం. దీని ఫలితమే కాబోలు అతని హృదయ కార్కశ్యం కూడా. చదువరులకు సుకరంగా ఉండటానికి ద్రుపద కృపాచార్యుల వంశాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాం.

# శ్రీకృష్ణుని వంశవృక్షం

## (బ్రహ్మ పురాణం ప్రకారం)

శ్రీకృష్ణుడు, యుద్ధవుడు, ఏకలవ్యుడు అన్నదమ్ముల బిడ్డలు. బ్రహ్మపురాణం సుభద్రను బలరాముని తోబుట్టువుగా చెప్తోంది. భాగవత పురాణం శ్రీకృష్ణుని తోబుట్టువుగా చెప్తోంది. వీటిలో ఏది నిజమో కదా! వంశ వృక్షాలనైనా పురాణాలు సరిగా ఇవ్వలేకపోతున్నాయి. త్రికాల వేదులయిన మునులు చెప్పినందువల్ల కాబోలు.

# ద్రుపద కృపాచార్య వంశవృక్షం

సగోత్రజులు కూడా తమలో తాము పెళ్ళి చేసుకొనే ఆచారం ఉంది. సాత్యకి వంశంలో పుట్టిన సత్యభామను శ్రీకృష్ణుడు పెళ్ళాడాడు.

## వంశ వృక్షం

| | యుధాజిత్తు |
|---|---|
| | ననమిత్రుడు |
| నిమ్నుడు | శిని |
| ప్రసేనుడు; సత్రాజిత్తు | సత్యకుడు |
| సత్యభామ | సాత్యకి |

# కర్ణుడు సూతుడేనా?

ఇంతవరకూ కర్ణుడు సూతుడని పురాణాలూ, భారతమూ వచిస్తున్నాయి. ఈ కింవదంతిని ఆధారంగా చేసుకుని అనేక గాథలు బయలుదేరాయి. కానీ, భాగవతంలో చెప్పబడిన వంశవృక్షాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాం. దాన్నిబట్టి చూస్తే కర్ణుని పెంపుడు తండ్రియైన అతిరథుడు చంద్రవంశ క్షత్రియుడైనట్టు కనిపిస్తోంది. ఈ చిత్రమేంటో, కర్ణుడు సూతపుత్రుడనే ప్రవాదం ఎందుకు పుట్టిందో దుర్గ్రాహ్యంగా ఉంది. పుట్టిననాటి నుంచీ కర్ణుడు దురదృష్టవంతుడే.

## (యయాతి కొడుకు అనువు సంతతి)

## చంద్రవంశం

రోమపాదుడు

చతురంగుడు

బృధులాక్షుడు

బృహద్రథుడు

బృహన్మనస్సు
జయద్రధుడు
విజయుడు
ధృతి
ధృతవ్రతుడు
సత్యకర్ముడు
అతిరధుడు
కర్ణుడు

# భీష్ముడు

ఆసేతు శీతాచలం భారతవర్షంలోని హిందువులు భీష్మణ్ణి స్వార్థ త్యాగి అనీ, నీతివేత్తనీ నేటికీ కొనియాడుతున్నారు. కానీ ఇంత కపటి, ఇంత పక్షపాతి భారత యోధుల్లో మరొకరు కనిపించరు. దక్షిణ గో(గ్రహణ సమయంలో అర్జునుడు గోవుల్ని మరలించడానికి బయటపడినప్పుడు పదమూడు వర్షాలు పూర్తికాలేదని దుర్యోధనుని నమ్మకం. అందుచేతనే గో(గ్రహణం జరిగింది. భీష్ముడు ఇది తెలిసే ఒప్పుకొన్నాడు. నిజంగా పదమూడు సంవత్సరాలు చెల్లిపోయి ఉంటే భీష్ముడు దుర్యోధనుడికి గో(గ్రహణానికి ముందే చెప్పి ఉండేవాడు. అలా జరగలేదు. పదమూడేళ్ళు పూర్తయ్యాయి కదా అని తాతను దుర్యోధనుడు ప్రశ్నించినప్పుడు మహా నీతివేత్తయైన భీష్ముడు ఏం సమాధానం చెప్పాడో చూడండి.

**సీ॥ రెండవయేట నొక్కండధిమాసమి**
**ట్లెక్కిన యన్నెల లెల్ల గూర్చి**
**కొన బదుమూడు హాయనములు దప్పక**
**నిన్నటి తోడనె నిండెనంత.**
**(విరాట పర్వం, చతుర్థాశ్వాసం, 232 వ పద్యం)**

ఈ సిద్ధాంతమెక్కడిదో బోధపడదు. అధిక మాసాల యొక్క ఉద్దేశ్యమేంటి? సౌరమానం ప్రకారం సంవత్సరానికి ఉండదగిన రో॥ 365-6 గంటలూ, చంద్రమానంలోని పన్నెండు మాసాలూ కూర్చితే తగ్గిన దినాల్ని పూర్తి చేయడానికే కదా ఏర్పడింది? అలాంటప్పుడు ఆ అధికమాసాల్ని ప్రత్యేకంగా లెక్క పెట్టి దొంగలెక్క సిద్ధం చేసి భీష్ముడు దుర్యోధనుణ్ణి మోసపుచ్చగలిగాడు. ఇలాంటి సంప్రతి(లెక్కలు చూసేవాడు) ఎక్కడా పుట్టుండడు కదా!
అతి కపటియై కర్ణుణ్ణి అర్ధరధుడిగా నిరూపించాడు. నిజంగా కర్ణుణ్ణి నిరసించి,

నిరుత్సాహుణ్ణి చేసే ఆలోచనే లేకపోతే, కర్ణుణ్ణి అతిరథ శ్రేష్ఠునిగా ప్రకటించి, అతనికున్న శాపాదుల వల్ల నిర్వీర్యుడవడం చేత చేయదగినంత యుద్ధం చేయలేడని చెప్పాల్సి ఉంటుంది. తెలిసి తెలిసే పాండవులకు తోడ్పడ్డం కోసం ఈ పద్ధతిని అవలంబించాడు. అంపశయ్యమీద భీష్ముడు పడి ఉండగా కర్ణుడు చూడ్డానికి వెళ్ళినప్పుడు ఇద్దరికీ మధ్య జరిగిన సంభాషణాన్ని చూడండి.

## రాధ

రాధ లిద్దరున్నట్టు పురాణాలలో చెప్పబడిఉంది. ఒక రాధ నందుని చెల్లెలు; కృష్ణుని మేనత్త. రెండో రాధ కృష్ణుని సయ్యాటకత్తె; గోపికల్లో చెలిమికత్తె. ఈ రాధే మహా భక్తురాలనీ, కృష్ణుని పరతత్వ మహత్వం కనిపెట్టిన జాణ అనీ భక్తులచే వర్ణింపబడింది. నామసామ్యాన్ని బట్టి ఒళ్ళు తెలియని భక్తకోటి ఈ ఇద్దరినీ ఒక్కరుగా చేసేసింది. ఇలాంటిదే ఇంకో ఉదాహరణ ఇస్తాం. చంద్రవంశంలో దశరథుడనే రాజొకడున్నాడు. ఇతనికి శాంతి అనే కుమార్తె ఉంది. ఈవిణ్ణే ఋష్యశృంగునికిచ్చి పెళ్ళి చేసారు. సూర్యవంశంలో శ్రీరాముని జనకుడైన దశరథుడున్నాడు. మతిమాలిన భక్తులు ఈ ఇరువురు దశరథుల్నీ ఒక్కటి చేసేసారు. శాంతను సీతకు ఆడబడుచును చేసారు. ఆడవాళ్ళ పాటల్లోకీ ఎక్కించారు. ఇలాంటి ప్రమాదాలు ఎన్నెన్ని ఉన్నాయో ఎవడికి తెలుసు?

## ధృష్టద్యుమ్నుడు

భారతం ఇతన్ని శ్వేతజాతుడనీ, అయోనిజుడనీ వచిస్తోంది. అయోనిజులు శ్వేతాంగులే. ఈ అయోనిజులు చాలాకాలం క్రితం గ్రీకుల్లో ఒక తెగగా ఉన్నారు. అయోనియన్ సముద్రమనీ, అయోనియన్ దీవులనీ వీళ్ళ పేరుతో నేటికీ సుప్రసిద్ధాలై ఉన్నాయి. కాబట్టి భారత వర్షానికి ధృష్టద్యుమ్నుడు దత్తపుత్రుడని ఊహిస్తున్నాం.

## ధర్మజ భీమార్జునులు ముగ్గురూ కుంతీదేవి పుత్రులేనా?

పృథాసుతులనబడే ధర్మజ భీమార్జునులు ముగ్గురూ పార్థులని పిలవబడక, ఒక్క అర్జునుడే పార్థుడని పిలవబడ్డం వల్ల అర్జునుడొక్కడే కుంతి పుత్రుడని కొందరు వాదిస్తున్నారు. భారతవీరుల చరిత్రలో బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ఈ వాదాన్ని మొలకెత్తించారు. ఆయన తమ వాదాన్ని బలపరచుకోడానికి అనేక కారణాలనిచ్చి ఉన్నారు. అదలా ఉంచితే, బ్రహ్మపురాణంలో యయాతి వంశాన్ని చెప్పేటప్పుడు "కృష్ణ ద్వైపాయనుడగు వ్యాసులా వైచిత్ర వీర్యక్షేత్రంబున, మాతృనియోగానుసారంబున ధృతరాష్ట్రుడు, పాండుడు, విదురుడు ననువారలను బుట్టించెను. ధృతరాష్ట్రునికి

గాంధారియందు నూర్గురు పుత్రులు పుట్టిరి. అందు దుర్యోధనుడు జ్యేష్ఠుడై యెల్లరకు ప్రభువై యుండెను. పాండునకు ధనంజయుడు, నాతనికి సుభద్రయందు నభిమన్యుడు, నాతనికి పరీక్షితుండును బుట్టిరి" అని వర్ణింపబడింది. దీన్నిబట్టి చూస్తే, ధర్మజ భీములు కౌంతేయులు గానీ, పాండవేయులు గానీ కానట్టు కనపడుతోంది. ఒకవేళ పాండురాజుకు కృతక పుత్రులేమో! ఆ కాలంలో కృతక పుత్రులు ధర్మసంతానంగానే పరిగణింపబడ్డారు.

# మొత్తుకోళ్ళు

ఒకడేమో చెవిటి దేవుడు. ఒకడు పాము చెవుల దేవుడు. వారు ఆవిధంగానే లోక పాలన చేస్తూంటారు. వారిని ఏ విధంగా ప్రార్థించాలో అర్థం కాక భక్త కోటికి ప్రాణసంకటంగా మారింది.

పరమ పురుషా! నువ్వు సకల భువనాలలో వ్యాపించి ఉన్నావని బుద్ధిమంతులు నీ గురించి నోరార పొగుడుతుంటారు. అదే నిజమైతే నిన్ను వెతుకుతూ తీర్థయాత్రలు చేయడం భగవదపచారం కాదా?

పరమ సుగుణవతిని మూర్ఖుడి పాలుచేస్తావు. మూర్ఖురాల్ని తీసుకొచ్చి సరసం తెలిసినవాడికి అప్పగిస్తావు. ఇదేం పద్ధతి స్వామీ? ప్రపంచమంతా దుర్భరమైన దు:ఖభారంతో మగ్గిపోతుంటే చూసి బాగా మురిసిపోతుంటావా? ఇలాగైతే భూమ్మీద నిన్ను నమ్మేవాళ్ళుంటారా?

పాఠకా! తరువాతి కథావిశేషాల్ని శేషం లేకుండా చెప్తాను. సావధానంగా విను.

చిన్ననాటి స్నేహితులతో, శ్రేయోభిలాషులతో, బంధువులతో కలిసి కొన్నాళ్ళు సుఖంగానే గడిపాను. కానీ ఎందుకో క్రమంగా ఆ బతుకు కష్టమనిపించింది. పుట్టిన ఊళ్ళో ఉండ బుద్ధి కాలేదు. చివరికి ఒకరోజున ఏం తోచక, ఊరకే ఉండలేక ఒక ఆలోచన వచ్చింది. ప్రశాంతత కోసం సూత మహర్షి ఆశ్రమానికి వెళ్ళి, కొన్ని రోజులు అక్కడే ఉండి, అనేక నీతి విశేషాల్ని గ్రహిస్తే మంచి జరుగుతుంది కదా! అనిపించింది. ప్రయాణం నిశ్చయించుకున్నాను.

యోగులు ఆకాశమార్గాన ప్రయాణించడానికి ఉపయోగించే పావుకోళ్ళు మూలనపడి బూజు పట్టిపోయి ఉన్నాయి. వాటిని తీసుకుని, ఓపిగ్గా శుభ్రం చేసి, తూర్పు తెల్లారకముందే వెళ్ళాలని తొందర తొందరగా ఆకాశమార్గాన తేలుతూ బయలుదేరాను.

దూరం లెక్క చేయకుండా నేను వెళ్తున్న దార్లో రివ్వుమంటూ చలిగాలులు నా ముఖాన్ని రాసుకుంటూ పోతుంటే, అవి నాకు పడక విలవిలలాడిపోయాను. అయినా ఓపిక పట్టి, మనసు రాయి చేసుకుని, లేత కరిమబ్బులు నా ఒంటిని తాకుతుండగా ఆకాశ వీధిలో ప్రయాణం సాగించాను. గగన మార్గంలో ఇలా ప్రయాణం చేసి, సూర్యుడు

పొద్దెక్కకముందే, ఒకచోట గురువుగారి పర్ణశాలను గుర్తు పట్టి, ఒక్క అంగలో గంగ ఒడ్డున దిగాను. అప్పటికప్పుడే సూత మహర్షి తన కుటీరం ముందర నేలమీద నల్లని జింక చర్మం పరుచుకుని కూర్చుని ఉన్నారు. నన్ను చూసి నవ్వుమొహంతో కనుసైగ చేసి రమ్మని పిలిచారు. దగ్గరకు వెళ్ళి సాష్టాంగ దండ ప్రణామాలు ఆచరించి, కూర్చున్నాను. ఆయన నన్ను చూసి 'కుమారా! అలా బక్కచిక్కిపోయావేం నాయనా!' అని అడిగారు. నేను కూడా దు:ఖాన్ని బయటకు తెలియనీయకుండా 'మునివరా! పరమసాధ్వీ, పైకి చెప్పకపోయినా అంతరంగం నిండా అనురాగం కలిగి ఉన్నదీ అయిన నా భార్య పోవడంతో నాకు మతి పోయింది. అందువల్ల నేనిలా శుష్కించి, శుష్కించి ఎండిపోయి, చావలేక ఎముకల పోగులా మిగిలాను' అని చెప్పాను.

నా మాటలు విన్న గురువుగారు ముఖం కాస్త వికారంగా పెట్టి ఊరుకున్నారు. కాస్సేపటి తర్వాత, 'మానవతి, ఉత్తమ చరిత్ర కలిగినదీ, అలవాటయినదీ అయిన భార్య స్వర్గస్థురాలైతే బాధపడ్డం మానకూడదు. అయినా మానక చేసేదేముంది? సుఖమే కదా పోయేదీ? కనుక లోలోపల దు:ఖించడం మానేసి, పెద్దలు నడిచిన దారిలో నడుచుకో. సుఖ దు:ఖాల్ని ఒకేలా చూడు. సుఖదు:ఖాలనేవి కావడి కుండలు. ఈ విషయం తెలుసుకుని మసలితే మేలు జరుగుతుంది' అన్నారు. ఆ మాటలకు నేను కూడా విచారం నుంచి తేరుకుని, పీకల దాకా ఉన్న శోకాన్ని దిగమింగి, నేను వచ్చిన పనిని నివేదించాను. జన్మభూమి దుర్దశనంతా వినిపించాను. పురాణకథలు వినాలన్న కుతూహలంతో ఇలా ప్రార్థించాను:

# కథాప్రారంభం

శ్రీకృష్ణుడి చరిత్ర సకలం ఆయన పుట్టుపూర్వోత్తరాలన్నిటితో సహా చెప్పండి. తల్లిదండ్రులెవరు? దాయాదులెవరు? తాత ముత్తాతలూ, సోదరులూ ఎవరు? ఎక్కడ పుట్టాడు? ఎక్కడ పెరిగాడు? పెట్టి పెంచిన వాళ్ళ పేర్లేంటి? బాల్యాన్ని ఎక్కడ, ఏవిధంగా గడిపాడు? ఎవరితో యుద్ధాలు చేశాడు? ఏం కోరి చేశాడు? చుట్టపక్కాలెవరు? శత్రువులెవ్వరు? రాజ్యతంత్రాన్ని ఎవరితో కలిసి, ఎట్లు సాగించాడు? ఏం ఫలితం సాధించాడు? అవసానదశ ఎలా గడిపాడు?

కృష్ణుడు పాలిండ్లు పుణికి పుచ్చని అందాల గోపకాంత పుట్టనే లేదట. పగలూ రాత్రీ తేడాలేకుండా అతను అడుగుపెట్టని గోపిక ఇల్లు వ్రేపల్లెలో ఒక్కటి కూడా లేదట. పిన్నవయస్సులో అతను వెంటపడి కెలకని వెన్నకుండ లేనే లేదట. "రారా! పోరా!"అని 'రా' శబ్దంతో పిలవని పడుచుపిల్ల ఒక్కత్తి కూడా కనిపించదట. ఔరా! కృష్ణుడు పోకిరితనంతో కోక ముడి విప్పుతుంటే విప్పనివ్వని వయ్యారి, రైకముడి విప్పనివ్వకుండా

సాకులు చెప్పే చిత్రాంగి వ్రేపల్లెలో ఎవరూ ఉండేవారు కాదట. దీనిలో నిజమెంత?

కృష్ణుని పోకిరితనం చేత వ్రేపల్లెలోని మగవాళ్ళంతా వావి వరసలు విడిచిపెట్టి వ్యభిచారులయ్యారని సాటి లోకులు ఎలుగెత్తి చాటుతుంటారు. దీనిలో ఎంత నిజముంది?

మునీశ్వరా! అన్నం కూడా తినలేని పాలబుగ్గల వయస్సులోనే మేనత్త అయిన రాధను ప్రేమించి, ఆమెతో కలసి పడక మీదికి చేరాడంటారు. నిజమేనా?

ఇతణ్ణి కొందరు గొల్లవాడంటారు. కొందరు గొల్లవాడు కాదు, యాదవుడనే పేరుగల వార్ష్ణేయుడంటారు. ఇంకొంతమంది గద్దెనెక్కడానికి వీల్లేని క్షత్రియుడంటారు. ఇందులో ఏది నిజమో తెల్పండి.

మేటి వీరుల, విలుకాళ్ళ తలదన్ని వాళ్ళ కైమోడ్పులకు పాత్రుడైన ఏకలవ్యుడితో కృష్ణునికి ఆజన్మ శత్రుత్వం ఎందుకు పుట్టిందో మునీశ్వరా! సెలవీయండి.

ఇదీ అదీ అని ఏముంది? మీకు తెలిసింత వరకూ గుట్టుమట్టులు సహా శ్రీకృష్ణుని చరిత్రను ఆమూలాగ్రంగా చెప్పండి అని వేడుకోగా, సూత మహర్షి అత్యుత్సాహంతో ఇలా చెప్పసాగాడు:

సూర్యబింబాన్ని కప్పే మిడతల దండులాగా ఆర్యులు హిమాలయ పర్వత ప్రాంత భూమిపై దండెత్తి, ఆక్రమించారు. వాళ్ళను సంహరించలేక, నిలువరించలేక ద్రావిడ ప్రభువులు ఆ ప్రాంతాన్ని వదిలిపెట్టి, మధ్యదేశానికి వచ్చారు. చెల్లాచెదురై రహస్యంగా పొంచి ఉన్న సేనల్ని పోగేసి, అక్కడక్కడా మోహరించి, చిన్న చిన్న రాజ్యాల్ని ఎన్నింటినో సేకరించి, ఏలుకోసాగారు. కాలవైపరీత్యానికి కలవరపడుతున్నప్పటికీ, భుజశక్తి ప్రకాశించగా విరోధాలూ శత్రుత్వాలూ లేకుండా గౌరవంగా పరిపాలన సాగిస్తున్నారు.

పుండ్ర, హైహయ, చైద్య, భోజ, అంధక, దశార్హ, సాత్వత, యదువృష్ణి జాతులన్నీ మధ్యదేశంలో బలవంతులై ఏ ఈతి బాధలు లేకుండా ఏలుబడి సాగిస్తుండగా, మాగధుడూ ఎంతటి శత్రువీరుణ్ణైనా ఇట్టే మట్టికరిపించగల సమర్థుడూ అయిన జరాసంధుడు సార్వభౌముడై, అవని సమస్తం ఏకఛత్రంగా, జనరంజకంగా పరిపాలిస్తున్నాడు. భయంతో ఇటు తేరిపార చూడలేకపోతున్న ఆర్యులు ఎలాగైనా సరే జరాసంధుణ్ణి అడ్డుతొలగించాలని అనుదినం మాయోపాయాలు పన్నుతూ అదను కోసం వేచిచూస్తున్నారు.

బృహద్రథుని కుమారుడైన జరాసంధుడు కొండల చుట్టూ నేర్పుగా కోటను కట్టి, అనుకూలమైన రీతిలో గిరివ్రజం అనే ఒక పట్టణానికి రూపకల్పన చేసాడు. దానిలో నివసిస్తూ, బలపరాక్రమాలతో తన జాతిశత్రువుల్ని సంహరిస్తూ, కీర్తి సర్వత్రా వ్యాప్తి చెందగా ఓటమి అనేది లేకుండా రాజ్యపాలన చేస్తున్నాడు.

ఆ గిరివ్రజ పురానికి ఒక రహస్య మార్గం ఉంది. ఎవడైనా అందులో కాలు పెడితే

చెవులు తూట్లు పడేటట్లు దుందుభులు తమంతట తామే మోగుతాయి. దానితో ఎవడో వస్తున్నాడని అందరికీ ఇట్టే తెలిసిపోతుంది.

దేవీ పూజాహితుడై, పవిత్రుడై, బ్రాహ్మణుల్ని భక్తితో పూజిస్తూ, ఎప్పుడూ నీతి తప్పకుండా జరాసంధుడు భూమండలాన్ని పరిపాలిస్తున్నాడు.

యాదవ వంశమనే వృక్షానికి అంధక, సాత్వత, వృష్ణి,భోజులూ ఆపైన దశార్హ వర్గం ముఖ్యమైన కొమ్మలుగా విస్తరించి ఉన్నాయి. వీరంతా ఎలాంటి భేదాలు లేకుండా, ఎల్లప్పుడూ వేడుకతో, మధురాపురంలో వివాదాలు తలెత్తకుండా ధర్మానికి కట్టుబడి పరిపాలన చేస్తున్నారు.

వీరంతా రాజ్యకాంక్షతో మధురాపురం చేరడానికి ముందు అరణ్యాల్లో ఉండేవారు. తమ భుజశక్తిని నమ్ముకుని వేటను వృత్తిగా స్వీకరించి జీవనం సాగించేవారు.

ఆలోచించి చూస్తే యదువృష్ణి, భోజ, అంధక మొదలైన వారిలో భోజ కులం వారు రాజ వంశీకులుగా కనిపిస్తారు. అందువల్లనే భోజకులస్థుడైన ఉగ్రసేనుడు యథోచితంగా రాజయ్యాడు. కంసుడు మొదలైన వారు ఈ ఉగ్రసేనుని కన్నబిడ్డలు. దేవకీ దేవి కంసుడి పినతండ్రయిన దేవక మహారాజు కుమార్తె. అయినా కంసుడు ఆమెను తోబుట్టువుగా ప్రేమగా చూసుకునేవాడు. ఉగ్రసేనుడు వృద్ధుడై పోవడంతో కంసుడు రాజ్యభారం వహించి, మధురలో ఎలాంటి చీకాకులూ తలెత్తకుండా తన భుజబలంతో ప్రజల్ని కాపాడుతున్నాడు.

ధైర్యశాలి, శౌర్యశాలి, గదాయుద్ధంలో సాటిలేని యోధుడు, శత్రువులకు సింహస్వప్నం అయిన జరాసంధుడు తన బంధుజనులంతా కొనియాడగా తన ఇద్దరు కూతుళ్ళనూ బాహుబల సంపన్నుడైన కంసుడికిచ్చి అత్యంత వైభవంగా పెళ్ళి చేసాడు.

మరోపక్క వసుదేవుడు యాదవ వార్ష్ణేయ జాతులన్నిటికీ కులపెద్ద అయ్యాడు. అతడు కుల పెద్ద అయింది ఎప్పట్నుంచో వస్తున్న సంప్రదాయం వల్లనే గాని తన భుజబలం, బుద్ధిబలం వల్ల మాత్రం కాదు. శత్రు సమూహాల్ని సంహరించే బలం అతనికి లేదు. దేశాన్ని జయించే తంత్రాలూ తెలియవు. అయినా ఆశ్చర్యకరమైన విషయమేమంటే అతను పదమూడు మందిని పెళ్ళాడాడు. ఎందుకంటారా? ఏం చేయాలో తోచక. ఊరికే ఉండలేక.

భోజ వంశీయులకూ, యాదవులకూ మధ్య సంబంధాలెపుడూ విచిత్రంగా ఉండేవి. లోపల్లోపల శత్రుత్వాలున్నా బయటికి స్నేహం నటించేవారు. ఈర్ష్య, దురభిమానాలు ఎక్కువగా ఉండేవి. అంతరంగంలో ఒకర్నొకరు అస్సలు నమ్మేవారు కాదు.

సంఖ్యాబలం ఎక్కువగా ఉండటం, తమ వంశంలో పుట్టిన వాడే రాజు కావడంతో భోజ కులస్థులు ఎవరినీ లెక్కచేయకుండా గర్వంతో తిరిగేవారు. కృతవర్మ, అక్రూరుడు,

శతధన్వుడు, ప్రసేనుడు, సత్రాజిత్తులు భోజ అంధకులకు పెద్దలై, రాజుకు అనేక విధాల సహాయపడేవారు.

పెళ్ళుమని పన్నెండు మందిని పెళ్ళాడిన వసుదేవుడు మనసులో మరులు పురులెత్తగా, జంకూగొంకూ లేకుండా పదమూడోసారి పెళ్ళికుమారుడి వేషం కట్టాడు. భోజ కులంతో వియ్యమందుకోవాలనేది అతని కోరిక. కిట్టని వాళ్ళు తిట్టుకున్నా వసుదేవుడు మాత్రం భోజవంశస్థుడైన దేవకుని ముద్దుల కుమార్తె దేవకి దేవిని అట్టహాసంగా వివాహమాడాడు. రాజైన వసుదేవుడు ఈ విధంగా తనకు భోజుల ప్రాపకం లభించిందని, తన అభీష్టాలన్నీ నెరవేరుతాయనీ మహా సంతోషించాడు.

కానీ..పాపం..దేవకి మెడలో తాళిబొట్టు పడ్డప్పుడే తన మెడలో ఉరితాడు పడిందని కంసుడు గ్రహించలేకపోయాడు. చిత్రం కదా! ఎప్పుడు ఏ పని ఎట్టా అవుతుందో ఎవరికి తెలుస్తుంది చెప్పు.

కంసుడు తన చెల్లెలికీ, బావకూ ప్రేమతో చీర సారెలెన్నిటినో అరణంగా ఇచ్చి మహా వైభవంగా సాగనంపడానికి సిద్ధమయ్యాడు. చెల్లెలు అత్తింటికి వెళ్ళిపోతోందనే దు:ఖం నుంచి తేరుకుని, రథంపై వారిని ఎక్కించుకుని తీసుకువెళుతుండగా, ఎండ తీవ్రతకు అందరూ చెమటతో తడిసిపోయారు. మార్గాయాసం తీర్చుకోడానికి కాస్సేపు విశ్రమించాలని తలచి ఒక చోట ఆగారు. దేవకి, వసుదేవుడు, కంసుడు కూడా రథం దిగి మెల్లగా చల్లని చెట్ల నీడల్లోకి వెళ్ళి విశ్రమించారు.

ఇంతలో వీరినే వెంబడించి వస్తూ సమయం కోసం ఎదురుచూస్తున్న ఆర్యజాతికి చెందిన తాంత్రికుడొకడు దట్టమైన పొదల వెనక కనపడకుండా దాక్కుని, ఆకాశవాణి అని అందరూ అనుకునేటట్టుగా గొంతెత్తి ఇలా అరిచాడు: "కంసా! నీ చెల్లెలి అష్టమ గర్భం నిన్ను అంతం చేస్తుంది."

ఈ మాటలు చెవిన పడగానే కంసుడు ఉలిక్కిపడ్డాడు. సంకోచించాడు. మౌనం వహించాడు. కొంచెం కొంచెంగా ఆ మాటల్ని నమ్మడం మొదలెట్టాడు. ఏమనిచెప్పాలి? చెల్లెల్ని చంపెయ్యాలని మనస్సులో నిశ్చయించుకున్నాడు.

కుటిలమైన ప్రచారాలను నమ్మిన అతనికి చెల్లెల్ని చూసినప్పుడల్లా కుటిలమైన ఆలోచనలు కలిగాయి. సన్మార్గాన్ని తప్పి నిశిత కరవాలంతో ఆమెను కడతేర్చాలనే బుద్ధి పుడుతోంది. మనసు వక్రంగా మారింది. భావాలు చపలమయ్యాయి. స్వార్థం ఎంత పక్కదారి పట్టిస్తుందో చూడు. తోడబుట్టిందాన్ని, తోడు నీడైన దాన్ని కరకు కరవాలంతో తెగనరకి చంపెయ్యాలని భావించాడు.

కంసుడి ముఖ కవళికల్ని చూసి, విషయం గ్రహించిన వసుదేవుడు కంసుడికి అడ్డొచ్చి, దీన స్వరంతో ఇలా అన్నాడు:

"బావా! కాస్త ఆలోచించు. సిరిసంపదలు వెలిగి ఆరిపోయే మెరుపు తీగల్లాంటివి. భోగభాగ్యాలు నీటిబుడగల్లా అశాశ్వతమైనవి. దాసదాసీ జనాలూ, సంతానం మీసాల మీద తేనెల్లాంటివారు. పరమార్థం తెలిసినవారు వీటిని నమ్మి ఎప్పుడూ ధర్మాన్ని విడిచిపెట్టరు. పాపానికి ఒడిగట్టరు. అయినా తల్లి మాటున పెరిగిన పిల్ల. అమాయకురాలు. మాయమర్మాలు ఎరుగనిది. వాలుకన్నుల నుంచి కన్నీరు జాలువారగా వలవలా ఏడుస్తున్నది. ఇలాంటి ఆడదాన్ని కనికరం లేకుండా కడతేర్చడం న్యాయమా?

"మంగళ స్నానం చేసిన తలవెంట్రుకల నుంచి ఆగాగి నీటిబొట్లు పడటం ఇంకా మానలేదు. ఎర్రని అగురు చిగురాకును మించిన పాదాల పారాణి ఆరలేదు. తలమీంచి తలంబ్రాలు పడ్డప్పుడు బట్టల కంటుకున్న పసుపు పోనేలేదు. కొత్త పెళ్ళికూతురులో కొత్తకొత్తగా అంకురించే సిగ్గు ఇంకా వదల్లేదు. అయ్యయ్యో! అలాంటి చెల్లెల్ని పెళ్ళిపీటల మీద నుంచి లేపి, అరణమిచ్చి అత్తవారింటికి పంపిస్తానని చెప్పి తీసుకొచ్చి ఆలోచన అనేదే లేకుండా ఆమె గొంతు కోయడం ధర్మమా?

"కాబట్టి బావా! కరుణ చూపించు. నేను కూడా ఒక మార్గం చెప్తాను. దానివల్ల నీకూ ప్రాణభయం తొలగిపోతుంది. దేవకి ప్రాణాలూ నిలుస్తాయి. సందేహం లేదు. అదేమిటంటే, బిడ్డలు పుట్టీ పుట్టగానే ఎలాంటి అడ్డూ చెప్పకుండా నీకు అప్పగిస్తాను. నా మాటలు నమ్మి ఈమెకు అపకారం తలపెట్టకుండా వదిలిపెట్టు."

వసుదేవుడు చెప్పింది విని భోజకులైక భూషణుడైన కంసుడు చాలా సంతోషించాడు. ఈ విధంగా ఉపద్రవం తప్పిపోతున్నప్పుడు ముగ్ధ, పద్మంలాంటి ముఖం కలిగినదీ అయిన తన సహోదరిని ఊరకే చంపడమెందుకనుకున్నాడు. వెంటనే రథానికి గుర్రాలు పూన్చి, బావనూ, చెల్లెల్నీ ఎక్కించుకుని, తానే తోలుతూ ఇద్దరినీ అత్తింట దింపి వచ్చాడు కంసుడు. ఆందోళన తగ్గి మధురలో ఏ చింతా లేకుండా ఉన్నాడు. కొంతకాలం గడిచింది.

ఒకనాడు వసుదేవుడు తొలిచూలు బిడ్డను తీసుకువచ్చి కంసుడికిచ్చాడు. ఆ పసికందును చంపడానికి కంసుడికి చేతులు రాలేదు. పసిపాపను వసుదేవుడికి తిరిగి ఇచ్చి, "ఈ బిడ్డ మూలంగా నాకేం ఆపద వస్తుంది? పాపని తీసుకుని వెళ్ళిపో. ఏమైనా సరే, నేనీ బిడ్డని చంపలేను" అని చెప్పి కంసభూపతి వసుదేవుణ్ణి పంపేసాడు.

కంసుడు ఏ రోజున ప్రాణభీతితో తన ప్రాణాలకు ముప్పు తలపెడతాడో, ఏనాడు తన కన్నబిడ్డను తనకు కాకుండా చేస్తాడోననే భయం వసుదేవుడిని నిరంతరం పీడించసాగింది. ఒకపక్క దుందుభి భయం. మరోపక్క మనస్సును దహిస్తున్న శోకాగ్ని. ఈ పరిస్థితుల్లో కంసుణ్ణి కడతేర్చడానికి రోజూ కుట్రలు పన్నసాగాడు. ఇదంతా కంసుడికి తెలిసిపోయింది. పట్టలేని కోపంతో వసుదేవుణ్ణి పట్టి సతీసమేతంగా చెరసాలలో బంధించాడు.

గర్భవతి గనుక చెరసాలకు కాపలా పెట్టి, ఆమె బిడ్డను కనగానే కత్తివేటుతో సంహరించి ప్రాణభయం మొత్తం పోగొట్టుకుంటానని అట్టహాసంతో పలికాడు కంసుడు. వెంటనే అతని మనస్సులో సందేహం మొదలైంది. 'అష్టమ గర్భం అనే మాటను నేను స్పష్టంగా విన్నానో లేదో! ఎందుకొచ్చిన కష్టం. నా ఇష్టం వచ్చినట్టు చేస్తా. మాయమాటలు చెప్పడమెందుకు? ఎవ్వడినైనా ఎందుకు నమ్మాలి? ఏ పుట్టలో ఏ పాముందో ఎవడికి తెలుసు? క్రూరత్వం అని ఎవడైనా అంటే ఏం మునిగిపోతుంది?' అని ఒక నిర్ణయానికొచ్చాడు. తల్లిదండ్రులు గొల్లుమంటుండగా అల్లుళ్ళనందర్నీ పట్టి ఆగ్రహంతో చంపేసాడు. దానితో అప్పటిదాకా చెదరిపోయిన అతని గుండె కుదుటపడింది.

కొన్నాళ్ళు గడిచాయి. అనంతరం ఓ అర్ధరాత్రి వేళ, అందరూ నిద్రపోతున్న సమయంలో, చెరసాలలో దేవకి చిన్ని కృష్ణుని ప్రసవించింది.

కారాగారం కావు కావుమని మార్మోగింది. బిడ్డను చూసి తల్లిదండ్రులకు ఆనందం, దు:ఖం రెండూ ఒకేసారి కలిగాయి. వీణ్ణి బ్రతికించుకోవడమెలా అని బెంగపడ్డారు. చివరికి వసుదేవుడు ఆందోళన నుంచి బయటపడి, ఒక ఉపాయం ఆలోచించాడు. ఒదిగి ఒదిగి కావలి వాళ్ళను తప్పించుకొని, కాళ్ళ సంకెళ్ళను వదిలించుకుని, చేతిలో నెత్తుటికందుతో, దారికి అడ్డంగా ఉన్న యమునా నదిలో దిగి, నడిచి దాటి పోగలిగిన పాటిరేవులో అవతలి గట్టుకు చేరుకున్నాడు. ఈ క్రమంలో దుందుభికి అందకుండా తప్పించుకున్నాడు. కేవలం పుత్రవ్యామోహంతో కిందా మీదా చూడకుండా ఇంతటి సాహసం చేశాడు వసుదేవుడు. నెత్తుటికందును గుండెలకు హత్తుకుని జంకూగొంకూ లేకుండా చీకట్లో అడవిలో పడి ముందుకు సాగిపోయాడు. పొంగిన ఈ పుత్ర వ్యామోహం ఏమైనా చేయిస్తుంది కదా!

నంద గోపకుడు గోపాలురతో కలిసి, బృంద దగ్గర ఒక పల్లెను కట్టుకుని ఉంటున్నాడు. పశువులే తన సంపదలు కాగా ఆవుల మందల్ని కోకొల్లలుగా ఆర్జించుకున్నాడు. నందుని పల్లెలోని వనభూముల్లో ఎక్కడ చూసినా పశువులే. ఎక్కడ చూసినా ఆలమందలే. ఎక్కడ చూసినా గోసమూహాల్ని మేపే గోపకుల మూకలే. పచ్చని పచ్చిక బయళ్ళపై పరుగులు తీసే కోడెదూడలే. దృఢంగా పొడుచుకొచ్చిన కొమ్ములు, వంపు తిరిగిన మెడలు, కారు నలుపు మూపురాలు కలిగిన గోరాజులు అక్కడి గుట్ట మెట్టల్లో తిరుగాడుతుంటాయి.

పుల్లావులొకపక్క గడ్డి మేస్తుంటే, నల్లావులు మరోపక్క నెమరేస్తుంటాయి. కర్రావులు ఓపక్క గాడి దగ్గర మేస్తుంటే, ఎర్రని దోరావులు దొడ్లో ఉంటాయి. బూడిద రంగు మసరావులు కసవు మేస్తుంటే, పొగ రంగులోని మైలావులకు ఒకపక్క పాలు పితుకుతుంటారు. తెల్లని వెల్లావులు మరోపక్క పరుగులు తీస్తూంటే, మచ్చల బట్టావులు ఇంకోపక్క బయట నిలిచి ఉంటాయి. ఇలా నందుని ఆలమందలుండే గోశాల

దోసతోటలా కనువిందు చేస్తూంటుంది. పాడి ఆవులు తమకూ, తమవారికీ ఎక్కువై పోయేటంత పాడినిస్తాయి.

కోడె గిత్తలు కాలు దువ్వి, మోర వంచి రంకెలేస్తుంటే పసుల దొడ్డి మార్మోగిపోతుంది. ఆ సందడికి కారు పెయ్యలు మేత మానేసి, ఉత్సాహంగా తోకలెత్తి, మెడలు సారించి, ముక్కు పుటాలు ఎగరేస్తూంటాయి. పలుపు తాళ్ళ మోపులు, చిక్కాలు, పొడవైన తాళ్ళు, ముఖానికి అలంకరించే వస్తువులు, కట్టుగుంజ గుదిబండలు, పెద్ద పెద్ద చెర్నాకోల కట్టలు, ఎద్దు కొమ్ములకు కట్టే కుచ్చుల తాళ్ళు, మెడలో కట్టే మువ్వల పట్టీలు, బంధాలు, పగ్గాలు...ఇలా ఎన్నెన్నో నిత్యం నందుని గోశాలలో కనిపిస్తూ కనువిందు చేస్తూంటాయి. బక్క చిక్కిన దూడగాని, తెగులు పడ్డ ఆవు గాని, వట్టిపోయిన ఆవు గాని, గొడ్డుమోతు ఆవు గాని నందుని ఆలమందలో మచ్చుకు కూడా కనిపించవు.

నందుని ధర్మపత్ని పేరు యశోద. ఆవిడ ఆడపిల్లను ప్రసవించిందని తెలిసి వసుదేవుడు ఆత్రపాటుతో తన బిడ్డను ఎదకు హత్తుకుని, ఏదో ఆలోచిస్తూ అక్కడకు వెళ్ళాడు. చుట్టూ ముళ్ళ కంచెల్లాంటి అడ్డంకులేవీ లేని వ్రేపల్లెలో ప్రవేశించి, అలికిడి లేకుండా పిల్లిలా నక్కి నక్కి యశోద ఉన్న చోటికి పోయాడు. పురుటాలి పొత్తిళ్ళలో తన బిడ్డను ఉంచి, ఆమె బిడ్డను తీసుకుని తిరుగు ప్రయాణమయ్యాడు.

కటిక చీకట్లో దారి తెలియక అటు తిరిగి ఇటు తిరిగి చివరికెలాగో మళ్ళీ యమునా నది దాటి, చెరసాలకు చేరుకున్నాడు. తాను తీసుకొచ్చిన పసిపాపను బాలింతరాలైన భార్యకిచ్చి, ఏమీ తెలియనట్టు కాళ్ళకు సంకెళ్ళు తగిలించుకుని, నిద్రపోయాడు వసుదేవుడు. ఇంతలో, చెల్లెలు ప్రసవించిన విషయం కాపలావాళ్ళ ద్వారా కంసుడికి తెలిసింది. హుటాహుటిన కారాగృహానికి వచ్చాడు. చెల్లెలు కంట తడిపెట్టి వలవలా విలపిస్తున్నా లెక్క చెయ్యకుండా ఆమె చేతుల్లోని పసికూనను బలవంతంగా లాక్కున్నాడు. ఆ పసికందును గాల్లోకి ఎగరేసి కత్తివేటుకు ఎర చేసి తిరిగి వెళ్ళిపోయాడు.

ఇంక అక్కడ వ్రేపల్లెలో– నందుని ఇంట్లో ఉన్న కృష్ణుడు పెరుగు తాగుతూ, వెన్న తింటూ, ఒళ్ళు నిగనిగలాడుతుండగా ఆనందంగా పెరుగుతున్నాడు. కలవారి ఇంటిబిడ్డకు ఏం తక్కువ?

నందుడికి రాధ అనే చెల్లెలు వుంది. ఆమె ఎంతో ప్రేమతో అల్లారుముద్దుగా కృష్ణుని పెంచుతున్నది. ఆమె ప్రాపులో అతని దుండగపు చేష్టలకు అంతే లేకుండా పోతున్నది. ఇట్లా ముద్దుగా వున్న కృష్ణుడు క్రమంగ పెరుగుతూ కొంటెకృష్ణుడు అయ్యాడు. ఆ వయస్సులోనే ఆవుల వెంటపడి అడవుల తిరుగుతూ, ఆలమందల్ని కాయడానికి పరుగులు తీయడం మొదలుపెట్టాడు. కులవిద్య కదా! దాన్ని ఎవడైనా ఎట్లా విడిచిపెడతారు?

మందకట్టు, మర్యాదలన్నీ తప్పి కృష్ణుడు ఆలమందల్ని కాయడం నేర్చాడు. మందల్ని కాసే వాళ్ళంతా తనను మెచ్చే మాటలాడుతూ వుంటారు. మందల్లో తిరుగుతూ మాటలెన్నో నేర్చాడు.

నందుడేమో ఆ వ్రేపల్లెకు దొర. కృష్ణుడేమో అతనికి లేక లేక కలిగిన ఒక్కగానొక్క బిడ్డ. గారాబానికి హద్దులు లేవు. అందుకే కృష్ణుడికి చేష్టలు మితిమీరాయి. నందుడి బిడ్డడు బుద్ధిమంతుడిగా వుంటాడా?

అంతులేని గారాబంతో పెరుగుతుండడం వల్ల, మారాములు చేయడం కూడా ఎక్కువైనాయి. అభిరాముడైన శ్రీకృష్ణుడికి, వ్రేపల్లెలోని రామలతో స్నేహాలు కూడా ఎక్కువైనాయి. ఒక్కోరోజు కొంటె కృష్ణుడు తనతోటి స్నేహితులతో కలిసి యమునా నది ఒడ్డుకు వెళ్ళేవాడు. అక్కడకు నీళ్ళు తెచ్చుకోవడానికి గోపికలు వస్తారు. ఆ గోపికలు యమునా నదిలోకుండలతో నీళ్ళు నింపి నెత్తిన పెట్టుకుని బయలు దేరే సమయం చూసి, కృష్ణుడు  విల్లంబులు తీసుకుని ఆకతాయి చేష్టలుగా, గోపికల నెత్తిపై వున్న నీళ్ళ కుండలను గురి చూసి కొట్టేవాడు. ఆ అమ్ములు కుండకు తాకి నీరు కారుతుంటే, వెంటనే ఇంకొక బాణం వేసి నీళ్ళు కారకుండా చేసేవాడు. అతని కొంటె పనులు చెప్పడం  కష్టం.

చిన్న వాడయ్యి, గోపికలతో సయ్యాటలాడుతూ ఆవులు కాయడానికి వెళ్ళినవాడు మరునాడు ఇంటికి రావడానికి జాగు చేసేవాడు. మందల దగ్గర నుండి పెందల కడనే రాలేదామా! ఇదేమి చిత్తం? అని కృష్ణుడి రాకకు  ఎదురు చూస్తూ మేనత్త రాధ వాకిట ముంగిట కళ్ళలో వత్తు పెట్టుకుని ఆతృతతో ఎదురుచూస్తూ ఉంటుంది.

ఇంటికి వచ్చీరాగానే, తుంటరి వాడైన కృష్ణుడిని వెంట పెట్టుకుని మేనత్త రాధ ఆలస్యం చేయకుండా దగ్గరకు తీసుకుని 'నా కన్న తండ్రీ! అన్నా! జడుసుకుంటున్నావా?' అని బుజ్జగిస్తూ లోపలికి తీసుకుని పోతుంది.

లోపలికి తీసుకుని, పోయి ఆవు వెన్నతో శరీరం అంతా నలుగుపెట్టినట్టు బాగా పూసి తోముతుంది. ఆపైన గోరు వెచ్చని నీటితో స్నానం చేయించి, పొడిగుడ్డతో ఒళ్ళంతా శుభ్రంగా తుడుస్తుంది. అగరు, సాంబ్రాణి పొగవేస్తుంది. ఇక ముద్దుగా 'రారా! నా అన్న!' అని పిలిచి అన్నం పెడుతుంది.

ఆవునెయ్యితో వండిన కూరలు, ఆరురసాలతో మంచి రుచికరంగా వండిన మేలురకాలైన వంటకాలు వడ్డించి, కృష్ణుడు తింటూంటే పక్కనే కూర్చుని తృప్తిగా అతనిని చూస్తూ, మేనత్త రాధ తనివి తీరా ఆనందిస్తూ వుంటుంది.

కృష్ణుడు సహజంగ యదువంశంలో పుట్టాడు. అందుకని ఇతనిని యాదవుడని అంటారు. అయితే నందగోపుని ఇంటిలో కదా పెరిగాడు. కాబట్టి గొల్లడని కూడా

అంటారు. అంతేకాని యాదవులు గొల్లలు కావడం కానీ, గొల్లలు యాదవులు కావడం కానీ లేదు. ఇద్దరూ ఒక్కటి కాదు.

వృష్ణి కులం యదువంశంలో ఒక భాగం. కృష్ణుడు వృష్ణి కులంలో పుట్టిన వాడు. అందుకని ఇతనిని వర్ష్ణేయుడు అని అనడం కూడా జరుగుతుంది.

ఈ రకంగా కృష్ణుడు చిన్నతనంలో బాల్య క్రీడల్లో మంచి ఆసక్తి కలిగి నందుని గోష్ఠంలో తిరుగుతున్నాడు.

మిడిసిపడే పడుచుతనం, మిసమిసలాడే నవ్య శరీర శోభ, అందం చిందే చంద్రబింబంలాంటి మొఖం, ఎప్పుడూ కిలకిలలాడే ఉత్సాహం అన్నీ కలబోసిన రాధ అనే ఒక జవ్వని నందుని గోవులని కాస్తూ వుంటుంది.

కృష్ణుడు కూడా నందుని ఆలమందలో సంచరిస్తూ వున్నాడు. రాధ కూడా కీలారితనంతో నందుని మందలోనే సంచరిస్తూ వుంది.

కాలక్రమంగా వ్రేపల్లెలో మందలో తిరుగుతున్న రాధా కృష్ణులకు పరస్పర స్నేహం ఏర్పడ్డది. ఈడూ జోడు కలసి శైశవ క్రీడల్లో ఇద్దరూ పొద్దుపుచ్చుతున్నారు. కొంతకాలం గడిచింది. ఆ స్నేహం క్రమక్రమంగా పెరిగి అనురాగంగా మారింది. అది క్షణ క్షణం పెరుగుతూ వుంది.

. పొద్దుపొడిచింది మొదలుకుని, పొద్దుకూకే దాకా చిన్ని రాధాకృష్ణులు విడదీయరాని చెలిమితో మెలుగుతూ ఒకళ్ళనొకళ్ళు విడిచి క్షణం కూడా వుండకుండా ఏవేవో సుద్దులు చెప్పుకుంటూ వుంటారు.

పొదల్లో దాగుతారు కాసేపు. అంతలోనే నదీ తీరానికి పరుగెత్తుతారు. ఎవ్వరూ చూడకుండా చెట్టు నీడన నక్కుతారు. గట్టులెక్కుతారు, పుట్టలెక్కుతారు. ఇట్లా రాధికా కృష్ణులిద్దరూ అనురాగ మగ్నులై లోకులెవ్వరూ చూడకుండా ఆడుకుంటూ వుంటారు.

కోడెల మెడలో కట్టిన మువ్వల రవళి ముచ్చట గొలుపుతుండగా, నడుముకు బిగించిన మొలమాల మువ్వలు గణగణా మ్రోగులూ వుండగా రాధిక తామర తోటలో వాటిని అదిలించుకుని వచ్చి కృష్ణుడిని వెతికి అతని పక్కనే వచ్చి కూర్చుంటుంది.

వెన్నెల రోజుల్లో చిరునవ్వు వెన్నెల కురిపిస్తూ వెన్నుడు రథం తీసుకుని వెన్నెల కుప్పలనాడతాడు. వాళ్ళ జంటను చూస్తుంటే నిజంగా వెన్నెల పక్షులైన చకోర పక్షుల జంటలాగా వుంటారు. వెన్నదొంగకృష్ణుడు, వయ్యారిభామ రాధా చూడగా ప్రణయరసమగ్నులై చరిస్తూ వుంటారు.

బలసిన స్తనాల మధ్య ఇరుక్కుని ప్రకాశించే పుంజుల దండ, ఆ చనుల పైభాగాన చిక్కింది. పుంజల దండల మధ్య భాగంలో వున్న పులిగోరు పతకం అటునిటు ఊగులాడుతూ, మనోహరంగా భాసిస్తూ వుంది. మెడ నిండా ఇంత ఎత్తున

అలంకరించబడ్డ గురువెంద దండలు అల్లిబిల్లిగా మెలివడి గుమస్తూ వున్నాయి. పచ్చరాళ్ళు పొదగిన అచ్చాకుండల హారాలు, రాధిక ఎత్తైన చనులపై ఎగిసిపడుతున్నాయి. అడ్డబాస ముంగెరలు పోటీ పడి ప్రకాశిస్తున్నాయి. కాలి అందెలు గల్లుగల్లు మని మ్రోగుతున్నాయి. తనసోయగాల్ని చూసి రాధ తనలోతానే పరవశం చెంది, తనివి చెందుతుంది.

కొప్పువిదిలిస్తే, నల్లటి తుమ్మెద రెక్కల్లా వున్న వెంట్రుకలు పిరుదులదాకా వచ్చి వింత సోయగాల్ని కల్పిస్తున్నాయి. మొగం మీదకు దూకిన ముంగురులు ముద్దుల మూటగట్టుతున్నాయి. ఈ స్థితిలో బంగారు బొమ్మలాగా వున్న రాధిక కోడె వయస్సులో వున్న యువకుల ధైర్యాన్ని తలకిందులు చేస్తుంది.

పొద్దుపొడవకముందే అటూ ఇటూ పొర్లాడి, నిద్ర లేచి, దూముడి వేసుకుని అందులో పూలు తురిమి చిన్న కర్ర పట్టుకుని అందరికంటే ముందే దొడ్డి నుండి ఆలమందను తోలుకుని పోతుంది.

జారిపోయిన పైటను సరి చేసుకునే నెపంతో బిగువైన తన స్తనాలను కనిపించేటట్టు చేస్తుంది. చిత్తంగా కళ్ళు మూసుకోగలరనే భావం కలిగేటట్టు ఊదుమారంలో ముంచి ఎత్తుతుంది. గుమ్మపాలను తీసుకుని వచ్చి 'నా సామి! ఇదిగో? తీసుకో' అని పాలదుత్తను అందిస్తుంది. "నే నెవరినో కనుక్కో" అని వెనుకగా వచ్చి, కృష్ణుడి వీపుకి రొమ్ములు గట్టిగా తగిలేటట్టు వీపుకు ఆనుకుని గట్టిగా కళ్ళు మూస్తుంది.

అందాల రాశి రాధ తెలిసో తెలియకో దొంగ కృష్ణుని ప్రేమ అంతా దొంగిలించింది. ప్రపంచాన్ని అంతా మింగగలిగిన నెరజాణ రాధ అందచందాలెన్నో చెప్పడం బహుకష్టం.

పోటీపడి పొడుచుకు వస్తున్న చనుమొనలు చింపుతాయేమోనన్న అనుమానంతో చనుకట్టు ధరించడం మానివేసింది. పైట చెరగుమాటున రొమ్ములపట్టును కప్పుకుని తిరుగుతుంది. ఇలాంటి మిడిమేలపు మిడిసిపాటు గల పొదువులాడిని పుట్టినాకనే ఎరుగమని లోకం భావించేటట్టు చేస్తుంది.

కల్లాకపటం తెలియని రాధ కృష్ణునిపై అనురాగం పెంచుకుంది. అది క్రొన్నాన సాగుతూంది. ఉత్సాహంతో నల్లనయ్యను సరాగాలాడే కోర్కె పుట్టింది. రాగం తీస్తూ పుష్పపరాగం అతనిపై విదిలించింది. అంతలో కృష్ణుడు పట్టుకోరాగా అందకుండా గడుచుతనంతో నేర్పరియై పారిపోతుంది.

కృష్ణుడు ఒక చోట నిలబడి ఎర్రని తన పెదవిపై పిల్లని గోవి నుంచి రెండు చేతులతో పట్టుకుని ఊదుతూ వుంటే చటుక్కున వచ్చి పూలగుత్తులని తెచ్చి ఆ మురళికి కుట్టుతుంది. కృష్ణుడు వెంటపడితే తుర్రుమని జారి పూపొదల్లో దూరి దాగుడు మూతలాడుతుంది ఆ జగజ్జంత రాధ.

కొండగోగుల పూలు తెచ్చి కొంటె సిగలో చుట్టి 'మా కొండదు చూడండి' అని కొండాటకమాడుతుంది ఒకసారి. నెమలి పింఛం తెచ్చి నెత్తిపై కుదురుగా పెట్టి అటు ఇటు కుదిలించి, ఊగించి కులుకులాడుతుంది మరోసారి. చిమ్మనగ్రోవితో పుప్పొడి దట్టంగా విరజిమ్మి 'ఏమిరా! మాధవా!' అని ఎత్తిపొడుస్తుంది ఇంకోసారి. బొండుమల్లెల దండతెచ్చి దండ చేతికి కట్టి అతని దండనే నిలిచి దండం పెడుతుంది ఒక్కోసారి. అక్కడే వున్న జాజిపూల మండపంలో పిలిచి కనపడకుండా పరుగులు తీస్తుంది ఇంకోసారి. కృష్ణునిపై వల్లమాలిన ప్రేమతో రాధిక సంబరం అంతా ఇంతా అని చెప్పడానికి వీలు లేకుండా వుంది.

'ఓ రాధా రమణీ! ఇదేమిటి చెక్కిళ్ళపై చిన్ని చిన్ని గీటులున్నాయి? గేదగి చెట్టు పొదల దగ్గరకి వెళ్ళావా? అదేమిటి? మొగమంతా పుప్పొడితో నిండిపోయింది, పొగడమ్రాను చెంగట నిలుచున్నావా? అరే..! నీలోని వేళ్ళన్నీ బాగా ఎర్రబడ్డాయి ఎందుకని? కొమ్మావి కొమ్మల చిగురాకుల్ని కోశావా? వగలాడి! నీ జారు ముడి చెదరి చిక్కుచిక్కుగా అయింది ఎందువల్లనో? ముళ్ళపొదలో దూరావా? బాలా! కదలకుండా ఒక చోట కూర్చోలేవుగా! కాలుకదలకుండా ఉండలేవు" అని చిట్టి వ్రేలుతో రాధాతరుణి చెంపను మెల్లగా గీటి కృష్ణుడు బుజ్జగిస్తూ వుంటాడు.

కృష్ణుడు ఇట్లా బుజ్జగిస్తూ వుంటే, రాధిక మాత్రం తక్కువ తిన్నదా!

కొండగోగు పూలు తెచ్చి కృష్ణుడి చెవుల్లో అందంగా పెట్టి చూచి, ఆసోయగానికి పరవశం చెందుతుంది. మెడ నిండా మెట్టతామర దండలను దిగవైచి ముసిముసి నవ్వులతో మునిగిపోతుంది. కలువపూల దండను ఆతని సిగకు జారకుండా చుట్టి సంతోషంతో గంతులు వేస్తుంది. అందమైన పొగడ పూలతో నేర్పుగా దండలు కట్టి వాటిని మణికట్టుకు చుట్టి లోలోపలే గొణుగుతుంది. మొఖానికి పుప్పొడి బొట్టుపెట్టుతుంది. నెత్తిపై నెమలి ఈకలు దోపి పగలబడి నవ్వుతుంది. ఇష్టం వచ్చినట్లుగా పైన బడి ముద్దులు పెట్టుకుంటూ బృందావన వీధిలో సంచరిస్తూ వుంటుంది. ఒక్కోసారి యశోదానందనుడు ప్రియురాలు రాధను పక్కనే పెట్టుకుని త్రిభంగిమలో నిలుచుండి విశ్వసమ్మోహనంగా మురళిని వాయిస్తాడు.

ఆ మురళీ గానమాధుర్యాన్ని మందల్లోని ఆవులు వెంట్రుకలు నిక్కబొడుచుకుని నెవరువేయడం మాని నిలువు గుడ్లతో నిలిచి వింటాయి. కాళిందీ నదీజలంలో చేరిన చేపలన్నీ ఎదురెక్కి ఒడ్డుకు చేరి చెవులతో తాగుతాయి. నల్లని త్రాచులు కూడా గంధపు చెక్కల నుండి సరసరా పాకి వచ్చి పడగలు విప్పి నాట్యం చేస్తూ ఆలకిస్తాయి. వ్రేపల్లెలో వున్న గొల్లభామలు గుంపులుగుంపులుగా పనీపాటలను విడిచివచ్చి చుట్టూచేరి తనివి తీరా ఆస్వాదిస్తారు.

పొద్దున్నే లేస్తూనే కృష్ణుడు రాధనుతలచుకుంటూ వెన్నతో కలిపిన చద్దిని ఆదరాబాదరా తిని పిల్లన గ్రోవిని నెమ్మదిగా ఊదుకుంటూ ముగ్ధమనోహర రూపిణి అయిన రాధ ముద్దుమొగం చూడాలనే ఆతృత వెన్నంటి తరుముతుండగా మందతో వెళతాడు.

రాధాకృష్ణులిద్దరూ శబ్దార్థాలలాగా విడదీయరాని అనురాగంతో వుంటున్నారు. ఆ జంట ప్రేమమాధుర్యంలో ప్రపంచాన్నే మరచి సంచరిస్తున్నారు. యోగీశ్వరులులాగా నిరంతరం ఒకటిగానే తిరుగుతుంటారు.

ఇంటికాడా, మందకాడా రాధ కృష్ణుడి కళ్ళకు నిండారా కనిపిస్తుంది. కృష్ణుడిగా రాత్రింబవళ్ళూ ఎక్కడ చూసినా లోకమంతా రాధామయంగా కనిపిస్తుంది.

రాధకు కూడా బృందావనం గోపికా బృందం అంతా కృష్ణమయంగా భాసిస్తుంది. శ్రీ కృష్ణుడు తప్ప ఆమె కళ్ళకు ఇంకోటి కనపడనే కనపడదు.

కొంచెం కూడా భయం లేకుండా పొద్దస్తమానం ఒక్కడే ఊరంతా తావులాడుతూ తిరుగుతాడు. తిరిగితిరిగి కేరింతలు కొడుతూ కిలకిలా నవ్వుతూ ఇంటికి చేరతాడు శ్రీ కృష్ణుడు.

ముక్కు, గోళ్ళు చికించి మోరపైకెత్తిన అచ్చోసిన కోడెను అరచేతి దెబ్బతో అదిమిపట్టి వుంచుతాడు. కాలుదువ్వి పోరాడే కారుగిత్తల్ని అటూ ఇటూ మొత్తి మధ్యలో నిలబడి పోరాటాన్ని ఆపుచేస్తాడు. ఖణిల్లని రంకెవేసి అంకెకు రాని కోడెలని చెవులు పట్టుకుని తెగించి ఒక్కడే దారికి తెస్తాడు. కాలిబంధాలని తెంపుకుని ఛెంగుఛెంగున చంగణాలు వేసే మదపు కోడెలని వడిసి పట్టి ఒక్కడే లొంగదీసుకుంటాడు.

యౌవన గర్వం చేత ఇతరులు ఎవ్వరూ చేయలేని ఎన్నో పనులని తాను ఒక్కడే చేస్తున్నాడు. కృష్ణుడి సాహస కార్యాలకి ఆకర్షితులయ్యి ఎంతోమంది యువకులాతని మిత్రకోటిలోచేరారు.

ఎంత వీరుణ్ణని బింకాలు పలికినా, జగజ్జెట్టినని పొంగినా అతనిని పట్టుదలతో ఓడించి తన చెల్లడం కింద పెడుతూంటాడు. బుసకొట్టే కోడెత్రాచునైనా పుట్టకలుగులో నుండే బయటకు లాగి తోకపట్టుకుని విసిరి కొడతాడు. మదించిన దున్నలనైనా సరే అవలీలగా కొమ్ములను పట్టుకుని ఒక్క నిమిషంలో నిలుపుతాడు. ఎత్తైన నెత్తమ్ములకు ఎగబ్రాకి గంధభేరుండపు గోళ్ళు వెదకి వేటాడుతాడు.

తోడి గోపకుమారకులు వెంటనంటి తోడురాగా ఆకతాయి పనులు ఇష్టం వచ్చినట్లు చేస్తూ ఎదురేమీ లేకుండా సంచరిస్తున్నాడు కృష్ణుడు.

శరత్కాలపు రాత్రులు పిండారబోసినట్లు ప్రకాశిస్తూన్నాయి. గోపికాతరుణీమణులు పట్టరానంత ఉల్లాసంతో విహరిస్తున్నారు. కృష్ణుడు యవ్వనోద్రేకంతో రారాజై బృందావనంలో రాసక్రీడలాడుతూ చాతుర్యాన్ని ప్రదర్శిస్తున్నాడు.

ప్రవేశించడానికే వీలులేని కీకారణ్యాలలో మత్తెక్కి తిరగడం మొదలుపెట్టాడు. యమునానది తెలినీట స్నానమాడుతున్న గోపికా వనితల చీరలను మూటకట్టడం నేర్చాడు. తనతోపాటు ఆలమందల కాచే గొల్లపడుచులను విలాసంగా ముట్టడం నేర్చాడు. వ్రేపల్లెలోని కొంపలన్నీ దూరి కొండాటకమాడుతూ దాచుకున్న వెన్నముద్దలని మెసపడం ప్రారంభించాడు. అతని కొంటెతనానికి హద్దులు లేవు. గొప్ప ఇంటి బిడ్డ కాబట్టి ఎవ్వరూ అడ్డం చెప్పరు. అతన్ని అవునని కాని, కాదని కాని ఎవ్వరూ అనడం లేదు.

కృష్ణుడు ఇట్లా క్రమంగా పెరిగి పెద్దవాడయ్యాడు. కిందామీద కానకుండా రెచ్చిపోతున్నాడు.

ఒక రోజున పెద్దబండిని దేనికది ఊడిపోయేటట్టు కాలితో ఒక్క తన్నుతన్నేవాడు. ఇంకో రోజు పెద్ద త్రాచుపామును పట్టుకుని గిరగిరా తిప్పి బాధించి చంపేవాడు. మరోరోజు సుడిగాలిని పైబడి ఎగచిమ్ముతాడు. ఒక దినం కార్చిచ్చును మిసిమేస్తాడు. ఇంకోదినం గాడిదను పట్టుకుని పీడిస్తాడు. మరోదినం మదించిన ఆంబోతు ప్రాణం తీసేవాడు. ఒకపొద్దు యమునానదిలో దూకుతాడు. ఇంకోపొద్దు రాకాసి మొఖమును తన్నేవాడు. కృష్ణుడు చేస్తున్న ఈ సాహసచర్యలకు రాధిక బెంబేలు పడిపోయేది. “ఆహా! ఇతడు నిజంగా దేవుడంతటివాడు” అని ఎప్పుడూ విన్నవించుకుంటూ పక్కనే నక్కి వుంటుంది. పరవశత్వం చెంది జపిస్తూ వుంటుంది.

వసుదేవ నందనుడునూ రాధపై మరులుగొని, ఆమె కొంగు పట్టుకుని విడవకుండా వెంటపడి పోతూ వుంటాడు.

పశువులను కాస్తానని చెప్పి నందనందనుడు మందకు పోతాడు. కాని పొరపాటున కూడా పశువుల దగ్గరకు పోకుండా రాధ కోసం వెతకి, రాధను కూడి తప్పించుకు పోతూంటాడు. కృష్ణుని చేష్టలన్నీ మేనత్త అయిన రాధ తెలుసుకుని లోనే సంబరపడి ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వుంటుంది.

అనురాగంతో రాధను కూడి మరి రసాంబోధిలో తలమునకలుగా తిరుగుతున్నప్పటికీ దేవకీ తనయుడు అప్రమత్తంగా లేడు. తన మేనమామ అయిన కంసుడు గురించి రాత్రింబవళ్ళూ ఆలోచిస్తూనే వున్నాడు.

'ఎప్పుడూ మనస్సులో కోపంపెట్టుకుని, క్రూరమైన ఆలోచనలుచేసన్తూండే భోజకులాభిమానియైన కంసుడు బ్రతికి వుంటే ఇక నా గాథలు చెప్పే పనే లేదు. రాజభోగం అనుభవించడానికి వీలులేదు. నా బాధలు తీరవు. పైగా ఏదో ఒక రోజు ప్రాణం మీదకు రాకుండా పోదు.'

పొంగిపొరలి ప్రవహిస్తున్న భోజ వంశ దౌర్జన్యవాహినికి చెలియలికట్ట వేయాలి. లేకపోతే అదిపొంగి యాదవ ద్వీపాన్ని ముంచివేస్తుంది. అని లోపల ఆలోచిస్తూ వుంటాడు.

'నేనే చక్రవర్తిని. నాకెవ్వరూ సాటిలేరు.' అనే గర్వంతో ఎవ్వరినీ లెక్కచేయకుండా జరాసంధుడు ప్రవర్తిస్తున్నాడు. ఈతనని నాశనం చేయకపోతే లాభం లేదు. కంసుడు, డిభకుడు, సాళ్వుడు, నరకుడు, హంసుడు, దంతవక్త్రుడు, శిశుపాలుడు, పౌండ్రక వాసుదేవుడు మొదలైన విలుకాండ్రు, ఏకలవ్యుడు మొదలైన యోధానుయోధులు తనకు అండగా వుండటం వల్ల మాగధుడు విర్రవీగి సంచరిస్తున్నాడు.

ఒక్కొక్క వంకతో ఒక్కోసారి ఈ వీరయోధులని ఒక్కక్కరినే క్రమక్రమంగా సంహరించాలి. జరాసంధుని రెక్కలులేని పక్షిని చేయాలి. లేకపోతే రాజ్యభోగాలు దక్కవు. రాచరికపు గౌరవం కూడా లభించదు.

కాని ఒక్క విషయం గమనంలోకి తీసుకోవాలి. జరాసంధుడు సామాన్యుడు కాదు. దివ్యసేనా సమన్వితుడు. యుద్ధ విశారదుడు. శత్రు భీకరుడు. ఈతనితో తెగించి ఒంటరిగా పోరాడితే ఓటమి తప్పదు.

చాకచక్యాన్ని ప్రదర్శించి ఎట్లాగైనా జరాసంధుని శత్రువర్గంతో చుట్టరికాన్ని సంపాదించాలి. రణవిశారదులైన వీరులని పోగు చేయాలి. బయటకు పొక్కనీయకుండా సైన్యసంపదను కూడబెట్టాలి. అదే రాజనీతి. ఇట్లా చేస్తే రేపు యుద్ధం సంభవిస్తే తప్పకుండా మేలు జరుగుతుంది. అని కృతనిశ్చయుడై ఆవులించి వెంటనే ఇంటికి వెళ్ళాడు కంసుని మేనల్లుడు.

కార్యభారం మనస్సులో కలతపెడుతుంది. అందుకే రాధ దగ్గరకు పోకుండా ఒక్కడే వెళ్ళాడు.

కంటికి కునుకురావడం లేదు దేవకీ తనయుడికి. మగత నిద్రలో కలలు చోటు చేసుకుంటున్నాయి. ఒకసారి ప్రియురాలి పాదపద్మాల జంట లత్తుకరసం కనిపిస్తే, ఇంకొక ప్రక్క శత్రుసేన నులివెచ్చని క్రొన్నెత్తురు ప్రవాహం కనువిందు చేస్తుంది. ఒక వంక తన ముద్దరాలి వాలు చూపులు కంటపడితే ఇంకొక వంక వైరుల తూపులు ద్యోతకమవుతున్నాయి. ఒక దారి మదన రంగస్థలీమండపం కనిపిస్తే, ఇంకోదారి కదనరంగస్థలీగరిమం కానబడుతుంది. ఒక ప్రక్క కామ తంత్రోపరీతి కార్యాలు తడితే, ఇంకో ప్రక్క రాజ్య తంత్ర రాజీ తలుపున తడుతుంది.

అన్యదుర్లభమైన కార్యాన్ని చేయాలని పట్టుపట్టడం వల్ల రాత్రివేళ నిదుర లేక కలవలం చెందుతున్నాడు. కార్యాతురత వల్ల కంటికి నిదురే కరువయ్యింది.

దూరదృష్టి, దివ్యదృష్టి కలిగిన కృష్ణుడు వెంటనే బహుబాంధవ సంపాదన కోసం నడుం కట్టి బహుళ ప్రయత్నం చేయదానికి సిద్ధపడ్డాడు.

భోజ భూపాలుని కూతురు రుక్మిణీని రాక్షస వివాహ పద్ధతిలో పెళ్ళి చేసుకున్నాడు. రకరకాల బూటకాలు చెప్పి, మరులు చూపి సత్యభామను చెట్టపట్టాడు. విందాను

విందుల ప్రియసహోదరి మిత్రవిందను మెలకువతో చేయిపట్టాడు. పందెమొడ్డి నగ్నజిత్తు నరపాలుని ముద్దుబిడ్డ నాగ్నజితిని పరిణయమాడాడు. నరకుడిని సంహరించి అతని చెరలో వున్న 16,000మంది రాచకన్యలను చెర నుండి విడిపించి వాళ్ళ అందరికీ తాళి కట్టాడు. దానితో మధ్య దేశమంతా తనకి చుట్టాలమయమయింది.

పోరాడితే ఓటమి తప్పదు.

అంతటితో ఆగలేదు; అతి భయంకరాడవుల్లో యమునా నదీ తటిలో స్వైరవిహారం చేస్తూ సంచరిస్తున్న కాళింది అనే ఆటవిక కన్యను తన వారికెవ్వరికీ చెప్పకుండా పెళ్ళిచేసుకున్నాడు.

పెళ్ళిపెద్దలంతా ఆశ్చర్యచకితులై చూస్తూ వుండగా, మత్స్యయంత్రాన్ని పడగొట్టి ముద్రభూపాల తనయ, గుణసముద్రయైన భద్రను మహావైభవంతో వివాహమాడాడు.

కొండగుహల్లో తిరుగుతున్న భల్లూకజాతి వీరుడైన జాంబవంతుణ్ణి ఓడించి, అతని బిడ్డ జాంబవతిని పాణిగ్రహణం చేశాడు. దీనివల్ల అడవి జాతితో స్నేహం చేయవచ్చునని భావించాడు.

అటు రుక్మిణీ, సత్యభామలను పెళ్ళిచేసుకోవడం వల్ల, యాదవ వంశానికీ, భోజులకూ చాలాకాలం నుంచి వున్న విరోధం తొలగిపోయింది.

ఈ రకంగా గృహచ్ఛిద్రాలనన్నిటినీ పోగొట్టుకుని బలవంతుడై మంత్రదత్త ప్రభావం చేత, మిక్కిలి ఉత్సాహవంతుడై విజృంభించి, నేలకు నింగికి తాళం వేయాలని చూస్తున్నాడు.

కృష్ణుడు చేస్తున్న ఈ యత్నాలన్నీ చారుల వల్ల మగధ సార్వభౌముడు జరాసంధ నరపాలుడు గ్రహించాడు.

"రాజా! కృష్ణుడి ఈ యాగడమేమిటి? మగధ చక్రవర్తినైన నేను ఒక యాదవునకు తలవంచుటయా? ఈ భూమండలంలో జరానంధుడి బాహుబలానికి అడ్డు కలుగుతుందా? ఇట్లాంటి చిత్రాలు సాగనిస్తానా? ఈ విపరీత చర్యలు కొనసాగనిస్తానా?

వృష్టికులుడైన కృష్ణుణ్ణి సంహరించి, అతని యెముకలని క్రొవ్వొత్తులతో ముద్ద చేసి, విజయలక్ష్మి ఫాలభాగాన బాణపు ములికితో కుంకుమ బొట్లు తీర్చి దిద్దుతా.

ఈ జరానందనుడ్ని ఎవడనుకున్నాడో? ఈ మాగధుని పౌరుష ప్రతాపాలను ఏమని భావించాడు? అడవిమూకని తలచాడా? నిజం అతడే గ్రహిస్తాడు" అని దండ నాయకుల్ని పిలిపించాడు.

పణవ, భేరి, కాహళ ఢక్కాని ధరావదనాలతో భూనభోంతరాళాలు బీటలు వార, అతుల సేనాపరివృతుడై కృష్ణుడి మీదకు దాడికి వెడలాడు. నాల్గహోరాత్రులు హోరాహోరీగా పోరాడాడు. జరాసంధుని సేనాధాటికి తట్టుకోలేక యాదవ సైన్యాలు చెల్లాచెదురై,

చెట్టుకొకరు, పుట్టకొకరుగా కాలికి బుద్ధి చెప్పాయి. శ్రీకృష్ణుడు కూడా చేసేది లేక ఆప్తుల్ని, బంధువుల్ని కలుపుకుని పలాయనమంత్రం జపించాడు.

జరాసంధుడు తిరిగి మగధా నగరం ప్రవేశించాడు.

కృష్ణుడు విసుగూ, విరామం లేకుండా విసిగి పారిన సైన్యాన్ని మరల కూర్చుకుని, మరల యుద్ధ ప్రయత్నం చేయడం ప్రారంభించాడు. ఈ సంగతి తెలిసిన మగధరాజు జరాసంధుడు తిరిగి దండెత్తిపోయి, పరాభూతుణ్ణి చేశాడు. కృష్ణుడు మాత్రం చేతికి చిక్కక పారిపోయాడు.

ఈ రకంగా ఇరవై ఆరుసార్లు ఓడించి కృష్ణుణ్ణి పారిపోయేటట్టు చేశాడు. కాని జరాతనయుడు యాదవుణ్ణి పట్టుకోలేకపోయాడు.

వీళ్ళిద్దరి మధ్య పోరు ఈ విధంగా సాగుతూనే వుంది.

ఇది యిట్లా వుంటే, అక్కడ మధురలో కంసుడు విపుల సైన్యాన్ని సమకూర్చుకుని యెట్లాగైనా ఆ కృష్ణుణ్ణి చంపాలని కోపంతో వున్నాడు.

"మేనమామయైన కంసుడి ఆలోచన వృష్టికులజుడైన శ్రీకృష్ణుడికి తెలిసింది. తాను కూడా కంసవధ చేయాలనే నిశ్చయంతో వున్నాడు.

"ఏ సమయంలోనైనా అదను చూసి కంసుణ్ణి సంహరించాలి. అతని తల నరకాలి. పగ దీర్చుకోవాలి. బంధువులకెవ్వరికీ విషయం ముందుగా పొక్కరాదు. ఒకవేళ ఈ విషయంముందే పొక్కితే, కార్యమంతా చెడిపోతుంది. అంతేగాకుండా, మగధ రాజైన జరాసంధుడికి ఈ విషయం తెలిసినా, ఒకవేళ అనుమానం వచ్చినా అతను సేనావాహినితో వచ్చి ముంచెత్తుతాడు. అనుకొన్న పని నెరవేరదు. 'అలస్యం అమృతం విష'మని పెద్దలంటారు. దీన్ని కూడా మనం కొట్టి పారేయగూడదు. నా పనిలో నేను జాగ్రత్తగా మసలుకోవాలి."

కృష్ణుడిట్లా కాపట్యంతో తలపోశాడు. అన్నయైన బలరాముణ్ణి తీసుకొని వెంటనే బయలుదేరి మధురానగరి చేరుకున్నాడు.

అక్కడ యింటి దాసి త్రివక్ర అనే దానితో అనురాగం ఒలకబోసి సరససల్లాపాలాడుతూ ఒక రాత్రి గడిపాడు.

బలసంయోగమని తెలిసి కూడా నేడక్కడ కార్యార్థి కాబట్టి, దాసి అనే సంకోచం లేకుండా వేమార్చి తన కామశాస్త్ర పాండిత్యాన్ని ప్రదర్శించి కుబ్జను సంతోషపెట్టాడు.

అనునయాలాడుతూ, తనకు కావలసిన రహస్యాలను గ్రహించి త్రివక్రను మరిపించి మాట పెట్టి, అన్నను తోడు తీసుకుని సాహసంతో కొలువుకూటం ప్రవేశించి వాడి గల కత్తితో కంసుడి శిరస్సు తెగనరికాడు. ఒక పక్క మొండెం, ఇంకో పక్క శిరస్సు రెండు భాగాలుగా కంసుడు తెగిపడ్డాడు.

శిరస్సు నరికిన ఉత్సాహంతో సింహనాదం చేస్తూ సభా మండపం బ్రద్దలయ్యేలా అరిచాడు. కృష్ణుడి హఠాత్తు చర్యకు సభికులంతా 'హాహా'కారాలు చేస్తూ పారిపోయారు. భటులు రాజు మరణం చూచి చెదిరి నలు దిక్కులకు పరుగెత్తారు. కొలువుకూటం మొత్తం ఒక్క క్షణంలో గందరగోళమయింది.

అంతకుముందు కంసుడికి భయపడి మధురా నగరం విడచి దూరప్రాంతాలకు వలసపోయిన తనవారినందరినీ పిలిచి – 'ఇక భయ పడవలసిన పని లేదు. సుఖంగా, నిర్భీతితో వుండండ'ని అభయం ఇచ్చి, వసతులేర్పరచి – నీతులు చెప్పి అలజడి మాన్పి సంతోషంతో పొంగిపోయాడు.

తరువాత తన తాతయైన ఉగ్రసేన నరపాలుడ్ని బంగారు సింహాసనంపై కూర్చుండబెట్టి మధురానగర రాజ్య రక్షణ – పాలన భారం అప్పగించాడు. తన తాతనే రాజుగా ప్రకటించి దగ్గరి వారితో మైత్రి సంపాదించాడు. రాజకీయవేత్తయైన వాసుదేవుడు కొంతకాలం అక్కడే వుండి మంచిచెడ్డల్ని సమీక్షించి స్వపక్షాన్ని వృద్ధి చేసుకున్నాడు.

భర్తయైన కంసుడి మరణం విన్నారు అతని భార్యలైన హస్తి – ప్రాస్తి – అనేవాళ్ళు. ఘోరపాపియైన యాదవుడు కృష్ణుడు ఇంత ఘోరకార్యం చేసి పోయాడా? మా కిన్ని కడగండ్లను అంటగడతాడా? మా తండ్రి జరాసంధుడికి ఈ విషయమంతా చెప్పి ఎట్లాగైనా కృష్ణుడ్ని సంహరించేట్లు చేసి ప్రతీకారం తీర్చుకొంటాం–" అని దుఃఖిస్తూ, కోపభారంతో ఆ ఇద్దరూ తండ్రి వద్దకు పోయారు.

అక్క చెల్లెళ్ళిద్దరూ తండ్రిని సమీపించి, జరిగిందంతా వివరించి, మాటిమాటికి ఏకధాటిగా కన్నీరు మున్నీరుగా విలపించారు

యాదవుడైన కృష్ణుడు తన అల్లుణ్ణి చంపి, కూతుళ్ళకు ఆరని దుఃఖాన్ని కలిగించడం తెలుసుకున్నాడు. మగధాధీశుడు వెక్కి వెక్కి విలపిస్తున్న ఆత్మజలను చూచి, మనసులోనే కుతకుతలాడాడు.

"కంసుడు తనకు అల్లుడే గాదు, పరమాప్తుడైన బంటు కూడా. ఇట్లాంటి వాణ్ణి ఒక ట్రుక్కడి చంపాడని విన్న జరాతనయుడు క్రోధోద్విగ్న మనస్కుడై పుక్కిలించి, బిడ్డలను చూచి –

"తనయలారా! కన్నబిడ్డలారా! దుఃఖించకండి. పది రోజులు దాటకుండానే నా భుజబల సంపద ప్రదర్శించి, మీకు కీడు గావించిన కృష్ణుణ్ణి హతమారుస్తా. నా శూరత్వాన్ని చూడండి. ఆ ట్రుక్కడి యాదవునకు వందలకొద్దీ భార్యలున్నారు. వాళ్ళనందరినీ మీకులాగానే అగతికలను చేస్తా. ఒక్క క్షణంలో ప్రతీకారం తీర్చుకొంటా. దీనికై మీరు చింతించవలసిన పని లేదు."

అని కన్నబిడ్డలను బుజ్జగించి, ఇద్దరినీ లోనికంపి, అతి రోషావేశంతో యుద్ధ

సన్నాహం చేయసాగాడు. దిక్కులు పిక్కటిల్లేలా వెంటనే ప్రస్థానభేరి వాయించాడు.

నడగొండల్లా వుండి ఎడమాక వెట్టుకొని పొగరేన్లుగున్న దండు అగ్రభాగాన నడుస్తుంది. కాలిగిట్టల నుంచి గాలి నేలపైకెగజిమ్మి, తేజీపాజు పారెలువారుతుంది. మిరుమిట్లు గొల్పేట్టు కొరమిట్లమిట్లాడ రథబలం సాగుతోంది; భూరి పరాక్రమంతో శత్రుమూకను చీకాకు పరచుట యెప్పుడా? అన్నట్లు కాల్బలం దాని వెంట కదులుతోంది.

మగధ చతురంగవాహిని యాదవ దేశాన్ని ముంచటానికన్నట్టు దుర్వారోద్రేక గరిమతో బయలుదేరింది.

ఇట్లు వచ్చిన మగధ సైన్యాన్ని చెచ్చరకని యాదవులు తాము కూడా సిద్ధమై కచ్చాలు బిగించుకుంటూ మాగధేయులపై విచ్చలవిడిగా వచ్చిపడ్డారు.

ఇరువాగులవారికి యుద్ధం ముమ్మరంగా సాగుతోంది.

ఒక్కో వేటుకి ఒక్కో మగధుడ్ని పోటరియైన యాదవ వీరుడు నేలగూలుస్తున్నాడు. అది గాంచిన మగధుడు "ఓయీ యాదవా! పోపో! ఇది కూడా మగతనమేనా? ఇది కూడా ఒక వ్రేటా? ఇదుగో చూడు" అని ఒక్క దెబ్బతోమగధ వీరుడొక్కడు యాదవ వీరుల్ని నలుగుర్ని నేలకూల్చాడు.

కోటానుకోట్ల తమ సైనికులు కుప్పకూలేటప్పటికి యాదవ వీరులు యుద్ధరంగంలో మగధుల కెదురు నిలవలేక పంచబంగాళమై పారజొచ్చారు. పారిపోతున్న శత్రువుల వెంటాడి తరిమి పాలద్రోలారు మగధ సుబాహులు.

ఈ వోటమిని గాంచిన కృష్ణుడు అన్నయైన బలరాముడితో పారిపోయి, అనతి దూరంలోనే వున్న ప్రవర్షణమనే పర్వత గుహలో దాక్కొన్నాడు.

కృష్ణుడిట్లా పర్వతగుహలో దాగిన విషయం జరాసంధుడు తెలుసుకొన్నాడు. జాగుసేయక మగధ నరపతి ఆ కొండగుహకు నిప్పు పెట్టాడు. కాని, మగధాధిపుని కళ్ళు గప్పి కృష్ణుడు తన అగ్రజుడితో గుహనుండి తప్పించుకొని మాయమయ్యాడు. బాల్యం నుండే పేదల యిండ్ల పాలు పెరుగు తాగే వెన్నదొంగకీ నేర్పుండడంలో ఆశ్చర్యం లేదు. మగధ సార్వభౌముడు కృష్ణుడిచేష్టలకు విసిగి వేసారి తిరిగి మగధ రాజ్యం ప్రవేశించి యంత్రాంగం చేస్తూ వున్నాడు.

# హంసడిభకులు మృతి

హంసుడు - డిభకుడు అనేవాళ్ళు మగధాధిపతియైన జరాసంధ చక్రవర్తి అమాత్యశేఖరులు. వాళ్ళు రాజసూయయాగం చేయాలని నిశ్చయించారు. ఒక పురోహితుణ్ణి బ్రాహ్మణుణ్ణి పిలిచి ద్వారకా నగరం కృష్ణుడి దగ్గరకు ఉప్పు కోసం పంపారు.

హంస డిభకుల వద్ద సెలవు తీసుకొని ఆ బ్రాహ్మణుడు ద్వారకా నగరానికి పోయి,

కృష్ణుడికి తాను వచ్చిన వృత్తాంతం - హంస డిభకుల రాజసూయయాగ విషయం వినిపించాడు.

మగధ మంత్రివర్యుల పనుపున వచ్చిన బ్రాహ్మణుడు చెప్పిన సర్వం విన్నాడు నందనందనుడు. సాధక బాధకాలన్నీ ఆలోచించాడు.

"వెదుకబోయిన తీగ కాళ్ళకు తాకినట్లు, ఈ భూసురుడు హితం గోరి తంత్రం నడుపుతున్నాడు. ఇది మంచి సమయం. సంశయించ వలసిన పని లేదు. అని తర్కించి, కాసేపు మౌనం వహించి కృష్ణుడు చివరికి ధరణీ దేవుణ్ణి గాంచి యిట్లా అన్నాడు.

"ఓ భూసురోత్తమా! పోయి, మీ భూనాధుడికి హితోక్తులుపదేశించు. యాదవులు శత్రు వర్గానికి తలలొగ్గి జీవించరు. కథలు చెప్పటం కూడా వ్యర్థం. ప్రాణహాని కలుగుతుందనే భయంతో అవమానాన్ని భరించరు.

ఉప్పు దెమ్మని నీతో చెప్పి పంపాడా మారాజు? ఆహా! ఎంత వింత? ఎంత విడ్డూరం విన్నాం? ఉప్పు తెమ్మని పంపడం తమకే ముప్పు వాటిల్లుతుందని మీ రాజచంద్రతో వచించటం మంచిది.

మీరు ధర్మమూర్తులు, మేము మాటలతో చెప్పదలచుకోలేదు. మేం ఏమి చెప్పేది మా రణభేరి చాటిచెపుతోంది. మా రణకేళిలో మరణకేళి నిక్కముగా జరిగి తీరుతుంది. దీనికి విచారం అనవసరం. అయినా, నిష్కారణంగా యుద్ధం మాత్రం ఎందుకు చేయాలి? దాని వల్ల వచ్చే లాభం మాత్రమేముంది?

కాబట్టి మీరే వెంటనే పోయి, యీ సంగతంతా మీ రాజుల మనస్సుకెక్కేటట్టు చెప్పండి. ఇంకా మీకు తోచినట్టుగా హితాన్ని వుపదేశించండి.

మా ముక్కున నావియున్నంతవరకు పరులకు భయపడి వుప్పు నిచ్చువాళ్ళం మాత్రం కాదు. ధర్మయుద్ధంతో వీరశయ్యా సుఖాన్ని అనుభవించాలని కోరుకుంటున్నాం"

ఈ మాటలు విని విప్రుడు లేచి, వాసుదేవుని వద్ద సెలవు తీసుకొని ప్రయాణోన్ముఖుడయ్యాడు.

అంత, దుందుభి తనయుడు, ఆనక దుందుభుల భీషణ ఘోషలను నిర్విరామంగా మోగిస్తూ, తన సేనలను సమీకరించుకొని పోరుకు కదలిపోయాడు.

కృష్ణుడిట్లా యుద్ధానికి సిద్ధమై సేనా సహితుడై వస్తున్న సంగతి చారుల వల్ల జరాసంధుడు తెలుసుకున్నాడు. తాను కూడా సమరోత్సాహంతో సైన్యాలను కూర్చుకొని, హంస డిభకులకు తోడ్పడ గంగాతీరాన దండు విడిసి, యాదవ సేన కోసం ఎదురుచూస్తూ వున్నాడు.

యాదవ సైన్యాలు కోలాహలంతో వస్తూ వుంటే చూచి, చేతుల తీట తీరునట్లుగా సమరం చేయసాగాడు.

ఒకచోట బృహద్రథ పుత్రుడు అలసట తెలియక శౌర్యకోపోద్రేకము పొంగులు వార యాదవ శత్రుసేనానివహమ్ము నిశ్చేష్టులై చూస్తూవుండగా భీకర సమరం సాగిస్తున్నాడు; ఇంకో వంక తన ప్రతాపోద్ధతినోర్వలేక శత్రువాహినీ నికరం కాలికి బుద్ధి చెప్పునట్టుగా హంసుడుదగ్రతేజుడై పోరాటం చేస్తున్నాడు. మరోపక్క ఎక్కడ చూచినా తానై విలయాన్ని సృష్టిస్తూ డిభకుడు వీరవిహారం చేస్తున్నాడు.

ఈ ముగ్గురు వీరులు విజృంభించి చీకాకుపరచగా, యాదవ సేనా సమూహము నిలువజాలక పారజొచ్చె. దాన్ని జూచిన శ్రీకృష్ణుడు సైన్య రక్షణమవశ్య కర్తవ్యమని నిశ్చయించాడు.

హంస డిభకుల ప్రతాపోద్ధతి గమనించిన కృష్ణుడు ఎదుటపడి వారిని జయించడం గాని, వారితో తలపడడం గాని సాధ్యం గాదని గ్రహించాడు. అందుకే వుపాయాంతరం ఆలోచించాడు.

తెగించి పోరాడుతూ యాదవ సైన్యాన్ని అల్లకల్లోలపరుస్తున్న డిభకుడి దగ్గరకు "యుద్ధభూమిలో హంసుడు హతమయ్యాడ"ని వార్త పంపాడు దేవకీ నందనుడు.

అన్న చనిపోయాడని వార్త విన్న డిభకుడు మహాశూరుడయ్యీ భరింపరాని శోకంలో మునిగిపోయాడు.

"అన్నలేని రాజ్యం నాకెందుకు? ఆయువెందుకు? భోగభాగ్యాలు మాత్రం ఎందుకు? ఈ భూమిలెందుకు?" అని ఆరని వగలో కూరుకుపోయి, పెదవి కరచికొని సమీపంలో వున్న గంగానదిలో దూకి ప్రాణాలు విడిచాడు.

తమ్ముడు డిభకుడు గంగలో దూకి మరణించాడనే వార్త హంసుడు తెలుసుకొన్నాడు. అపార దుఃఖ సముద్రంలో మునిగాడు. కొంతసేపటికి దుఃఖ మహోదధి నుండి బయటపడి, వ్యాకులచిత్తంతో అదలిపోయినవాడై -

"తమ్ముడు లేని రాజ్యం - తమ్ముడు లేని వైభవం - తమ్ముడు లేని సుఖాలు నాకీ లోకంలో ఎందుకు?" అని ధీరచిత్తుడైన హంసుడు కూడా గంగానదిలో దూకి మరణించాడు.

ఈ రకంగా హంస డిభకులిద్దరు సోదరులు కృష్ణుడి మంత్రాంగానికి లోనై గంగలో దూకి మరణించారు. తమ నాయకులు పరలోక గతులైన సంగతి తెలిసిన, ఆ వీరుల సైన్యం పటాపంచలయింది.

దీన్నంతా గమనించిన జరాసంధ భూవిభుడు నాల్గువైపులా విజృంభించి, యాదవ సైన్యాన్ని కదలనీయకుండా అరికట్టి, నిలువరించాడు.

హంస డిభకుల మరణానంతరం బార్హద్రథుడు విజృంభించి తన సైన్యాన్ని చిందర వందర చేయడం వాసుదేవుడు గమనించాడు.

చేసేది లేక తన సైన్యాన్నంతా కూర్చుకొని, యుద్ధరంగం నుంచి పారిపోయాడు. పౌరుషం సంగతి దేవుడికే తెలుసు, ముందు ఇక్కడి నుంచి తప్పించుకొని ప్రాణాలతో బయటపడడం మంచిదని భావించాడు.

రణరంగం నుంచి వెన్ను చూపిన వెన్నుడు దీర్ఘాలోచనలో పడ్డాడు.

"మధురలో వుంటే ప్రాణాలు దక్కవు. ఎప్పుడైనా జరాసంధుడు మీదకు రావచ్చు-" అని ఆలోచించి ఆప్తుల్ని - బంధువుల్ని - మంత్రుల్ని పిలిచి, వాళ్ళతో విషయమంతా చెప్పి - అందరూ కుటుంబాలతో, కుశస్థలీ ప్రదేశానికి వెళ్ళాలని నిశ్చయించుకొన్నారు.

పడమటి సముద్రంలో ఫలమంతమైన దీవి వొకటి వుంది. అది తమకు అనుకూలంగా వుంటుందని భావించాడు వాసుదేవ నందనుడు. గుళ్ళూ - గోపురాలూ కోటలు - పేటలూ - రాచబాటలూ - బురుజులూ - మేడలూ మిద్దెలూ - అన్నీ నిర్మింపజేశాడు. బంగారు అడుసుతోనే సుందరంగా వీటిని తీర్చిదిద్దే యేర్పాటు చేశాడు. చూప రులకు వీటి పనితనం కొట్టవచ్చినట్టు కనపడేట్టు నిర్మింపచేశాడు.

ఆ పట్టణానికి ద్వారక - అని పేరు పెట్టాడు. యదు - వృష్టి- భోజ - అంధకులతో కలసి , ఏమాత్రం రద్దీ – రవ్వా లేకుండా కృష్ణుడు శత్రు దుర్భేద్యమైన ఆ ద్వారకానగరంలో వుండి రాజ్యం పాలిస్తూ వున్నాడు.

అతుల సైన్యాన్ని సమకూర్చుకొన్నాడు. దివ్యజ్ఞానమూ - దివ్యదృష్టీ- దేదీప్యమానంగా వెలుగొందుతూ వుండగా, ఏకాగ్రతతో ఇతర వ్యాసంగం ఏమీ లేకుండా, శత్రు వ్యూహాల్ని మంత్ర తంత్రాలతోటే ఛేదించాలని యత్నం చేస్తూ నిశ్చింతగా ఆ పట్టణంలోనే వుంటున్నాడు.

ద్రావిడుడయినప్పటికీ వాసుదేవుడికి ద్రావిడ జాతివారంతా దాదాపుగా విరోధులుగానే అయ్యారు. ద్రావిడ జాతిని విడిచిపెట్టాడు, ద్రావిడ సంఘంతో పొత్తు పెట్టుకోవటమే మానివేశాడు. ద్రావిడ సార్వ భౌముడైన జరాసంధుడిపై కత్తి గట్టి, అతణ్ణి రూపుమాపాలని చూస్తున్నాడు. కాబట్టే, కృష్ణుణ్ణి ద్రావిడులెవ్వరూ దగ్గరకు చేరనీయటం లేదు.

ద్రావిడ సంఘంలో తనస్థానమేమిటో తెలుసుకొన్న యాదవుడు ఇక తనను తనజాతి వారెవ్వరూ దగ్గరకు రానీయరు; ఇంకోదారి ఆలోచించడం మొదలుపెట్టాడు. విజాతీయులైన ఆర్యుల చెలిమి చేయాలని నిర్ణయించుకున్నాడు.

తనకు వీలు చిక్కినప్పుడల్లా సహచరుల్ని కూర్చుండబెట్టుకుని, జాత్యహంకారాన్ని గూర్చి చెపుతూ వుండేవాడు.

"అభివృద్ధి చెందాలనుకొనేవాళ్ళకూ - బాగుపడాలనుకొనేవాళ్ళకూ - జాత్యహంకారం వుండరాదు - దాన్ని విడిచిపెట్టి కార్యాన్ని సాధించుకొంటూ వుండాలి. దేశ కాలపాత్రాలను గమనించి, మీదబడే వుపద్రవాల్ని తప్పించుకోవటం మంచిది. అది

మేలు చేకూర్చుతుంది. అట్లా గాక మొండివైఖరి ప్రదర్శించి మెలిగితే మొదటికే మోసమొచ్చి ఆత్మనాశం సంభవిస్తుంది" అంటూ తోటివారికి చెపుతూ వుంటాడు.

అంతేగాక, "భయంకర యుద్ధం చేయాలనే సంకల్పంతో కాలుదువ్వుతున్న శిశు పాలుడొకపక్క వున్నాడు. చతురంగ బల సమన్వితుడై సమరోత్సాహంతో కదన వ్యూహాన్ని పన్నుతున్న మగధ ధరణీ ధవుడొకప్రక్క వున్నాడు. వాళ్ళిద్దరూ కాక, దాయాదులు పెక్కుమంది మీదకు దూకటానికి పక్కలో బల్లెంలాగా వుండి తారాడుతున్నారు . ఇంతమంది, యిన్ని దిక్కుల్లో మనల్ని కసిమసంగటానికి సిద్ధమై వుంటే, మనం ఏరకంగా సురక్షితులమై వుంటాము? ఇది శక్యమా?

కాబట్టి, విజాతీయులైన ఆర్యులతో చెలిమి చేసి కాలం పుచ్చటం మంచిది. లేకపోతే మనకు మనవాళ్ళ చేతుల్లో చావు తప్పదు. మన తిప్పలు దేవుడు కూడా గమనించడు. నా మాటలు వినండి, అనవసరంగా నాశనం కాకండి-" అని వివిధ రకాలుగా చెప్పి, తన వాళ్ళని ఆర్యులతో మైత్రి చేయటానికి ఇష్టపడేట్టు చేశాడు.

అంతకుముందే పాండురాజు తమకు చుట్టం కావటం వల్ల, సవతి చెల్లెలు చిత్రను అర్జునుడికిచ్చి పెళ్ళి చేశాడు. తన యన్న వద్దని పంతం పట్టి కూర్చున్నా వినలేదు. అంతేగాకుండా పైగా గంతులువేస్తున్న అన్న కళ్ళకు గంతలు గట్టి మరీ చేశాడు. ఈ రకంగా కొంతకాలం గడిచింది. తరువాత అన్న మేనల్లుడూ - అర్జునుడి కొడుకూ అయిన అభిమన్యుడికి దొంగతనంగా మరో పెళ్ళి చేశాడు. అన్న ఎంత వద్దన్నా వినకుండా బలవంతంగా - దొంగ పెళ్ళి జరిపించాడు.

విసనకర్రలా వుండి నెత్తి మీద వుయ్యాలో - జంపాలో - అని వూగుతూ వుండే నెమలి పింఛాన్ని చూచినా; కృష్ణుడు నా పెద తండ్రి పుత్రుడే - అని ఏకలవ్యుడు చెపుతున్న మాటలు విన్నా; "నా ముద్దుల చిన్నికృష్ణా! నన్ను పెళ్ళాడవా" - అని వెంటబడి అడుగుతున్న చెంచెత పల్కులాలకించినా; నీలమేఘముడాలు డీలు చేయగ-జాతి శరీరపు నిగనిగకాంతులు కాంచినా; చెంచులందరికీ యిలవేల్పుగా ప్రకాశించే విధం తెలుసు కొన్నా... కృష్ణుడిదే కులం? ఏ జాతివాడు? ఎక్కడ పుట్టాడు? అనే ప్రశ్నలు వేయటం అనవసరం గదా! ఇదంతా వితండవాదంలా కనిపించదా? ఈ విషయమే కృష్ణుడెవరో తేటపరుస్తాయిగదా!

ఒక చేతిలో పిల్లన గ్రోవి - తలపై నెమలి పింఛం - చెంచు ప్రజలతో చుట్టరికం - నీలమేఘచ్ఛాయ నపహసించే మేని నైగనిగ్యం - ఇవన్నీ చూస్తుంటే, కృష్ణుడు చెంచు జాతివాడు కాదని చెప్పడం సత్యవిరుద్ధంగాదా! అట్లా అని చెప్పితే కిట్టని మాట అవుతుందా?

# ఏకలవ్యుడి వృత్తాంతం

అడవిలో పల్లెలు కట్టుకొని వుండడం వల్లా – ఆర్యజాతికి భిన్నమైనవి కావడం వల్లా – యదు, వృష్ణి, భోజ, అంధకాది ద్రావిడ జాతులు మొదట మ్లేచ్ఛ జాతులుగా చెప్పబడ్డాయి.

శ్రీకృష్ణుడు వంశం మాత్రం ఆర్యజాతికి లొంగి, అణగిమణగి వుండడం వల్ల క్రమక్రమంగా కొంత గౌరవం ఆర్యుల్లో పొందింది. దాని వల్ల ఆ వంశాన్ని మ్లేచ్ఛ వంశమని అనటం మానివేశారు.

ఆర్యుల ఆచార వ్యవహారాలు – ఆర్యమత ధర్మాలూ – చాలా విశిష్టమైనవనీ, నిరుపమానమైనవనీ, కార్యజ్ఞులైన యాదవులు ప్రచారం చేయటం మొదలుపెట్టారు. ఆ భ్రమలో మునిగి తాము వాటిని బీరు పోనీయకుండా ఆచరించడం ప్రారంభించారు. విజాతీయులైన ఆర్యులకు దాసోహమన్న యాదవులు మ్లేచ్ఛదశను దాటి కొంతలో కొంత వాళ్ళ దయాదాక్షిణ్యాలపై క్షత్రియత్వాన్ని పొంది రాజులుగా చెలామణి కావటం మొదలయ్యింది.

జాతిని విడిచి పరజాతినాశ్రయించడం కానీ – జాతి ధర్మాన్ని కాలదన్నడంగానీ – పాప మూలమని భావించి, తమ జాతినే అంటిపెట్టు కున్న జాత్యభిమానులు శబరులు శబరులుగానే మిగిలిపోయారు. ఇట్లా అభిమానంతో పెనగులాడే శబరులు అటూ ఇటూ తిరక్కుండా జాతినే అంటిపెట్టుకొని వున్నారు. వాళ్ళు ఆర్యుల వల్ల ఎన్నో కష్టాలు అనుభవించవలసి వచ్చింది. సుఖాలన్నిటికి దూరమైపోయారు.

ఆర్యులకు దాసోహమన్న జాతి ద్రోహులు, విజాతీయుల పట్టణాలను చూచి సంబరపడి, మోహంలో మునిగి పరవశించి, వాళ్ళలాగానే వుండాలని భావించారు. అందుకని అడవుల్లో వుండలేక, నవ నాగరికతను అలవరచుకోవటంకోసం పట్టణాలు కట్టుకోవడం మంచి దని తలచి ఆలుబిడ్డల్ని తీసుకొని, బయలుదేరి వెళ్ళారు.

అట్లా పోయిన ఆర్య దాసానుదాసులైన యదువంశస్థులు, వృష్ణి వంశస్థులు, అంధకులు సమధికోత్సాహంతో రెట్టించిన సామర్థ్యంతో మధురా పట్టణాన్ని నిర్మించుకొన్నారు. వాళ్ళు కట్టిన ఆ పట్టణాన్ని చూచి అంతా మెచ్చుకొన్నారు.

ఆ తరువాత అక్కడి వసతులు, భోగభాగ్యాలు గమనించి వసుదేవాదులు కూడా తమ భార్యాబిడ్డల్ని వెంటనిడుకొని మధురా నగరంలోనే కాపురముండటానికి పయనమైపోయారు.

వసుదేవుడికి తమ్ముడున్నాడు. అతని పేరు అనాధృష్టి. అడవిని విడిచి తన అన్న వసుదేవుడు మధురా నగరానికి పోయిన సంగతి తెలుసుకొన్నాడు, కాని, యితడు

మాత్రం తన జన్మస్థలమైన అడవిని విడిచి పెట్టి పోవటానికి యిష్టపడలేదు.

ఈ అనాధృష్టికి, అశ్మకి - శ్రుతదేవ - అనే పేర్లు గల ఇద్దరు భార్యలున్నారు. వాళ్ళలో శ్రుతదేవకు అనాధృష్టివల్ల శత్రుఘ్నుడు - అనే నామాంతరంగల ఏకలవ్యుడు - అనే కొడుకు పుట్టాడు. ఈతడు పుట్టుకతోనే మహా వీరుని కుండవలసిన లక్షణాలతో పుట్టాడు. తండ్రి తన తనయుడి శుభ లక్షణాలను చూచి పొంగిపోయాడు. ఏకలవ్యుడికి విద్యా వయస్సు వచ్చింది. ఒకనాడు తండ్రి అనాధృష్టి కొడుకును గాంచి -

"కుమారా! శస్త్రాస్త్ర విద్యల్లో ఎదురులేని పాండిత్యం సంపాదించడం మనకు తరతరాల నుండి వున్నది. ఈ విద్య మనకక్కరకు వచ్చినంతగా ఇతరులకు రాదు. మనమా కీకారణ్యాలలో వుంటున్నాం. విలువిద్యలో అందరికీ గురువైన ద్రోణుడి దగ్గరకు పోయి విలువిద్యా పారంగతుడవై రావడం అవసరం. కాబట్టి నీవు అక్కడకు వెళ్ళు" అని చెప్పాడు.

నల్లని శరీరకాంతి మిరుమిట్లు గొల్పుతూంది. తలమీది నెమలి పింఛం యింతగా విప్పారింది. విల్లు తీసుకున్నాడు. అమ్ములు నింపిన తూణీరాలు రెండు భుజాల ధరించాడు, కోచతనం విడిచిపెట్టాడు. కాసె కట్టాడు. ఏమీ సంకోచం లేకుండా తండ్రికి వినయవినమ్ర శిరస్కుడై వందనం గావించి కుర్రవాడైన ఏకలవ్యుడు ద్రోణుడి దగ్గరకు విలువిద్య నభ్యసించటం కోసం ప్రయాణమై వెళ్ళాడు.

పోయి, ద్రోణాచార్యుణ్ణి చూచి, భక్తి వినయ సంభ్రమాలు ముప్పిరికొనేట్టు నమస్కారం చేసి -

ఆచార్యవర్యా! నేను మీ వద్ద విలువిద్య నేర్చుకోవటానికి వచ్చా. దయతో నన్ను పారంగతుణ్ణి చేసి పంపగోరుతా- అని పలుసార్లు వేడుకున్నాడు.

కాని, ఆర్యజాతీయుడైన ద్రోణుడందు కంగీకరించలేదు. ఏకలవ్యుడికి నిరాశే మిగిలింది. వెనుతిరిగి అడవికి పోయి, విషాద వదనుడై తండ్రికి సమస్తం వినిపించాడు.

ఆర్యజాతి తిరస్కృతుడై, ఇనుమడించిన పట్టుదలతో అస్త్ర విద్యా పాండిత్యం సాధించాలని పట్టుబట్టాడు ఏకలవ్యుడు. ద్రోణుని ప్రతిమ తయారుచేశాడు. దీక్ష పట్టి - పరాకాష్ఠతో ఏకాగ్రచిత్తుడై ద్రోణుడి ప్రతిరూపం మీదే దృష్టి లగ్నం గావించాడు. దృఢ - ముష్టి - లక్ష్య లాఘవాలు విద్యాభ్యాసం వల్ల నేర్చుకుని నేర్పు సాధించాడు. ఇతరు లెవ్వరూ తన్ను తేరి చూడడానికే వీలు లేకుండా అవక్ర విక్రమంతో వెల్గుతూ, తన కీర్తి చంద్రికలు ఆ అటవీ సీమలో నాల్గు దిక్కులా వ్యాపించి దేదీప్యమానంగా ప్రకాశిస్తుండగా, తండ్రి తరువాత రాజ్యభారం వహించి, పూజ్య భావంతో ప్రజల్ని కాపాడుతూ వున్నాడు.

కన్ను పొడుచుకున్నా కానరాక దట్టంగా అలముకున్న అడవుల చిమ్మచీకటుల్ని చిమ్మివేశాడు. కాలు పెట్టటానికే వీలులేని కరకు నేలలన్నిటినీ తిన్నగా సవరించి సాగు

చేయించాడు. అడవి మెకాల యెద్దడి తప్పించటానికి చుట్టూ దిట్టమైన కంచె వేయించాడు; చిలుగు తొడుగు కంపంతా చెలగించి వేసి మంచి మంచి తోటల్ని పెంచేట్టు చేశాడు. పోటరులైన అరివీర భయంకరులగు బంటులు తన్ను నిరంతరం రెప్ప వాల్చక నమ్మికతో సేవిస్తూ వుండగా, ఒక్క వీసం కూడా ధర్మ మార్గం నుండి దప్పిపోకుండా ఏకలవ్యుడు రాజ్యం చేస్తూ వున్నాడు.

ఏకలవ్యుడి పాలనలో చెంచులు ఆకలి దప్పులెరుగరు. అసంతుష్టి అంటే తెలియదు. కరవు కాటకాల మాటే మరచిపోయారు. కష్టాలంటే ఏమిటో కలికానికైనా చూడలేదు. ముదిరిన వెదురు బియ్యం - తేనె కలిపి కడుపునిండా తిని గుర్రున త్రేపి, తృప్తిగా స్వేచ్ఛగా తిరుగాడుతారు. ఆ చెంచులు తప్పులెంచనివాళ్ళు. అంతేగాదు, ఆ శబరభుజుని పాలనలో శూరులైనా - సామాన్యులైనా - గ్రామ కట్టుబాట్లను కొంచెం గూడా దాటరు. పలికి బొంకటం వాళ్ళకు తెలియదు.

అతని యేలుబడిలో గల నేలలో వీరులు వేసిన తూపు ఏనాడూ ఒక్కటి కూడా వ్యర్థంగా పోయిన జాడ లేదు; ఒర నుండి దూసిన బాకు ఏనాడూ తన పని నెరవేర్చకుండా లేదు, భయపడి శరణన్నవారిని అభయమిచ్చి కాపాడకుండ వుండదు. ఈ చతురబ్ధిపరీత మహీతలంలో ఏకలవ్యునికి సాటి ఏకలవ్యుడే.

యదుకులంలో ప్రభవించాడు; అటవీ సీమలో రాజ్యాన్ని నెలకొల్పాడు, కృష్ణుడి పిన తండ్రికి అనుగు బిడ్డడు. శబర జాతికి ఏకైక ప్రభువు ఏకలవ్యుడు.

జాతిని విడిచి, నిజావాసమైన కానన సీమల బాసి, మేమూ - క్షత్రియులమే- అన్న జాతి ద్రోహకర చేష్టకు తలవొగ్గి పోయిన విద్రోహులతో చేతులు కలిపి తన వారలను విడిచిపోలేదు ఈతడు. జాతిని విడువని చెంచు వీరులకు అధినాధుడై పోటరి మాటరియై, ఏకలవ్యుడు నీతిమంతుడై రాజ్యం చేస్తున్నాడు.

ఇట్లా రెండు పాయలుగా చీలిన యాదవులకు ఉద్ది లేని రాజులిద్దరైనారు. ఒకరు మధురానగరంలో - ఇంకొకరు అటవీ భూములలో - ఒకడు కృష్ణుడు. - రెండవవాడు ఏకలవ్యుడు. ఇద్దరూ తమ తమ ప్రాంతాలను పాలిస్తున్నారు.

జాతికి ద్రోహం జేసి ఆర్యజాతి పంచన చేరిన కృష్ణుణ్ణి చూస్తే, జాత్యభిమాన ధనియైన ఏకలవ్య వీరునికి కళ్ళు జేగురిస్తాయి. అతని మాట అంటేనే కోపం కట్టలు తెంచుకుని దూకుతుంది; సమయం చిక్కినప్పుడల్లా ఆతడు వంచకుడని తన మిత్రులతో చెప్పుతూ వుంటాడు: ఎన్నడూ కృష్ణుణ్ణి ఏకలవ్యుడు నమ్మనే నమ్మడు.

"జాతికి ద్రోహం చేయటం అధర్మమని కూడా భావించకుండా స్వార్థబుద్ధితో విజాతీయులైన ఆర్య సంతతితో నెయ్యం చేసి, సంబంధ బాంధవ్యాలు నెరపిన కృష్ణుణ్ణి గోత పెట్టకుండా వుండను"- అని శబర పృధివీపతి ఏకలవ్యుడు సయితం ఉగ్రుడై

మాట్లాడుతూ వుంటాడు. 'జ్ఞాతి శ్చేదనలేనకిమ్మ'ని పెద్దవాళ్ళూరకే అనలేదు.

ఇక యిక్కడ కృష్ణుడు - ఏమాత్రం ఏకలవ్యుడి మొగం కనిపించినా, అతని సంగతి యెవరైనా తన ముందు ఎత్తినా - 'ఆహా! ఈతడెప్పుడు జాతి - జాతి - అని కలవరిస్తూ వుంటాడు. గర్వంతో తుళ్ళుతూ వుంటాడు. ఆ అడవుల్లోనే జాతి ప్రజలను అంటి పెట్టుకొని వుంటాడు. జాతి వైరం రక్తంలో జీర్ణింపచేసుకొని కాలుదువ్వుతూ వుంటాడు" అని ఎకసక్కేలాడుతూ గేలి చేస్తూ వుంటాడు.

ఇట్లా కృష్ణుడు - ఏకలవ్యుడు పరస్పర విరోధ భావాలతో మెలగుతూ వున్నారు.

ఒకసారి ఏకలవ్యుడు - అతని అనుచరులూ, అందరూ కలసి, వేట కోసం భీకరమైన అడవుల్లోకి పోయారు. వేట తమకంతో యిష్టం వచ్చినట్లు ఎవరికి వాళ్ళు సంచరించటం మొదలుపెట్టారు. పోటరులైన వాళ్ళు విజృంభించి క్రూర సత్వాలను కూలవేయటానికి తమ తమ ధనుర్బాణాలనెక్కుపెట్టి ఒకరి కంటె వొకరు శరలాఘవాన్ని ప్రదర్శి స్తున్నారు. ఘోరారణ్యమందలి జంతువులు కలగుండుపడి చెల్లాచెదరై పరుగెత్తసాగాయి.

ఏకలవ్యుడు పదునుగల వొక బాణాన్ని వింట సంధించి, పంది వెంటబడ్డాడు. అది ఆ వీరుని బారి తప్పించుకోదలచి పరుగు లంకించుకొన్నది. అయినా, ఆ ఏకలాన్ని విడువక ఏకలవ్యుడు దాని వెంటబడి తరుముకొంటూ దారితప్పి తన వారల వీడి గహన సీమలోకి వెళ్ళాడు.

ఇంతలో యింకో వైపు నుండి రణకోవిదుడైన అర్జునుడు, అప్పుడే వింట బాణం సంధించి గమ్మున ఏశాడు. దీనితోపాటే ఏకలవ్యుడు వదలిన బాణం కూడా ఆ పంది మోగాన నాటింది. శబర వీరుని శరాఘాతాని కోర్చుకోలేక పంది ధరణీస్థలిపై బడి అసువులు విడిచింది.

పాండునందనుడీ దృశ్యాన్ని గమనించాడు. చెంచు నరపాలుడి లక్ష్యశుద్ధికీ - శరాలాఘవానికి దిమ్మెరపోయాడు. ఏకలవ్యుణ్ణి కంట చూచాడు. కాని, తానీతనికి ఈడు కానని భావించి తొలగి, తేరిపార చూచి వెంటనే తిరిగిపోయాడు.

"ఆహా! ఇంతటి శస్త్రాస్త్ర విద్యా నైపుణ్యం గానీ - యింతటి శరా లాఘవాన్ని గాని నేనింతకు ముందెన్నడూ చూడలేదు; వినలేదు. చాలా వింతగా వుంది. ఈతడెవరో అంతు తెలుసుకోవటం మంచిది" అని అనుకొంటూ తక్షణం ధనుర్విద్యా గురువైన ద్రోణుడి దగ్గరకు పోయి, వినయముట్టిపడుతూ వుండగా, దీనవదనుడై చేతులు మొగిడించాడు.

"ఓ గురువర్యా! వేటకు పోయి నేడు, సాంద్రాటవిలో వొక ఎరుక వీరుని చూచా. అతని బాణ విద్యా నైపుణ్యాన్ని కన్నా. మహాత్మా! ఎంత మరుద్దామన్నా అతని రూపురేకలే మరుగున బడకుండా రేపూ మాపూ మరువరానివిగా కళ్ళకు కదుతున్నాయి.

మూడు లోకాలలో నాకు దీటైన పోటుబంటు లేకుండా విలు విద్యా పారంగతుణ్ణి చేస్తానని మాట యిచ్చారు. మేటి విలుకాం(డ్రకు ఒజ్జబంతిగా తీర్చి దిద్దుతానని పలికారు. కాని నేడా మాట వమ్మయిందని తెలిసిపోయింది. నాకంటే - మీకంటే - ఈ లోకంలోని ధనుష్కులందరికంటే అధికుడాతడు. నాకు మీరు చేసే మేలేమిటో చెప్పండి - అతడీ విద్య నెక్కడ నేర్చాడో తెలియదు. అతని గురువెవరో కూడా ఎరుగను. తప్పకుండా మీరు నాకిచ్చిన బాస నెరవేర్చవలసిందే".

అర్జునుని మాటలు విన్నాడు చాపాచార్యుడు ద్రోణుడు. దీర్ఘ నిశ్వాస విడిచి చింతించాడు. వెంటనే పార్థుడితో అరణ్య ప్రాంతానికి వెళ్ళాలని నిశ్చయించుకుని బయలుదేరాడు.

శిష్యుడు దారి చూపుతూ ముందు నడుస్తుంటే, ద్రోణుడు అతని వెంట వెళుతున్నాడు. డొంకలు, ముళ్ళతుప్పలు - వాగులూ- దాటుకొంటూ వెళ్ళారు. అంతలో వాళ్ళకు స్వేచ్ఛా సామ్రాజ్య ధురీణమైన గూడెం వొకటి కనిపించింది. కనిపించిన ఆ గూడెం దగ్గరకు పోయారు.

నెత్తిన దాల్చిన తలపాగాలోని నెమలి పింఛం కళ్ళు పెద్దవి చేసి చూస్తూ వుంది; అమ్ములపొది రాపిడి వల్ల కాయగాసిన మొగు మూపులు బిగువు ప్రతిఫలిస్తూ వుంది; చిత్రవర్ణ భాసురములైన పూసల పేరులు ఎదురు రొమ్ముపై అందంగా వున్నాయి. మొల చుట్టూ చుట్టుకున్న మోటు పన్నియ వస్త్రం మోకాలు దిగజారి ముచ్చట గొలుపుతూ వుంది; ఇటువంటి వేషం ధరించి యింటి ముందటి అరుగు మీద రెడ్డిగం వేసుకొని కూర్చున్న శబర దొడ్డదొరను చూచారు గురుశిష్యులు ద్రోణార్జునులు. శౌర్యరాశియైన శబర క్షమాపతిని చూచిన ఆ యిద్దరు బిడియపడ్డారు.

అతిథులిద్దరు రావటం అల్లంత దూరానే చూచిన ఏకలవ్యుడు తొందరగా లేచి, అర్ఘ్యపాద్యాదుల నిచ్చి ప్రయాణం వల్ల కలిగిన వాళ్ళ బడలికను పోగొట్టాలని తలచాడు.

చార పప్పు -ఊచబియ్యం, సన్నగా మండిన గుగ్గిళ్ళు - దోరగా ముగ్గిన మామిడి పళ్ళు - ద్రాక్ష- ఖర్జూర పండ్లు - తంగేటి జున్ను - తేనె - బాగా ఆరకాగిన పాలు ఆరగించండని పెట్టాడు.

"మహాత్ములారా! ఇంటికి వచ్చిన పెద్దల్ని వెంటనే పూజించటమనేది మా నియమం. అట్లాంటి నియమాన్ని పెట్టుకున్నాం. మా ఆతిథ్యాన్ని స్వీకరించి, ప్రయాణ బడలికను పోగొట్టుకోవలసింది" అని శబరి పార్థివుడు అనేకరకాల ప్రార్థించాడు.

ద్రోణార్జునులు చెంచురేడు గావించిన అతిథి సత్కారాన్ని గ్రహించి, సంతృప్తులయ్యారు. అట్లా వున్న గురుశిష్యుల్ని చూచి ఏకలవ్యుడు -

"ఎవరయ్యా మీరు? మీ నివాసమేది? ఎక్కడ నుంచి యిక్కడకు వచ్చారు? ఏ పని మీద వచ్చారు? నా వల్ల మీకు కావలసిన కార్యమేది? చెప్పండి, అది నాకలవియయ్యే

పనియైతే తప్పకుండా తీరుస్తా. మీరు వచ్చిన పని సెలవీయగోరుతా–" అని వినయంగా అడిగాడు.

ఆ మాట విన్న ద్రోణుడు, ఏమీ దాచుకోకుండా ఆ క్షణంలోనే చెప్పాడు.

"శబరనృపతీ! నా పేరు ద్రోణుడు; విలువిద్యా గురువును. లోకంలోని రాజపుత్రులంతా నా దగ్గరే విలువిద్య నేర్చుకొంటారు. నా వెంట వచ్చిన యీతడు అర్జునుడు. ఘోర రణకేళివిదగ్ధుడు. నాకు ప్రియమైన శిష్యుడు. మొన్న మొన్న వేటాడగోరి యీతడీ అటవీ మధ్యంలోకి వచ్చాడు. ఒక పందిని వెంటాడుతూ వచ్చి గురిపెట్టి బాణాన్ని వేశాడు. అప్పుడే నీవు విడిచిన బాణం కూడా వచ్చి ఆ పందికి తగిలి దాన్ని కూల్చిందట.

నీ లక్ష్యశుద్ధినీ – శర లాఘవాన్నీ గమనించి, నివ్వెరపడి తిరిగి వచ్చాడు. నన్ను సమీపించి నీ విలువిద్యా పాటవాన్ని వివరించి నిన్ను చూపటానికి ఇక్కడకు తీసుకువచ్చాడు. నీవీ బాణ విద్యను ఎప్పుడు నేర్చుకొన్నావు? ఎక్కడ నేర్చుకున్నావు? నీ గురువెవ్వరు?" సందేహించకుండా వివరంగా తెలియజేయకోరుతున్నా"

ద్రోణుడి మాటలు విన్నాడు ఏకలవ్యుడు. ఆనందాన్ని దాచుకోలేక, ఆదరంతో తన కనుబొమ్మల్లో వింత కాంతి గంతులు వేస్తూ వుండగా గురువుని చూచి అన్నాడు–

"ఆహా... ఏమిటేమిటి? మీరలు గురుదేవులైన ద్రోణులా! ఈతడర్జునుడా! ఎంత ఆనందం వేస్తుంది...! మీ రాక వల్ల ధన్యుణ్ణయ్యాను. నేను మీ దగ్గరే కదా విద్య నేర్చుకొన్నా."

ఏకలవ్యుడి మాటలకు ద్రోణుడు గతుక్కుమన్నాడు. కలగుండు పడిన మనస్సు కలవాడై – "ఈ బోయ తుంటరివాడై, మెరమెచ్చుల కోసమో, మిడిమేలానికో– మేలానికో యిట్లా మాట్లాడుతున్నాడు" అని సందేహించి, ఏకలవ్యుడి ముఖాన్ని బాగా పరీక్షగా చూచి, అతని ముఖంలో వింత లక్షణాలేమీ లేవని గమనించి – మనస్సు కుదుటపరచు కున్నాడు.

"ఏమయ్యా! చెంచురేడా! చాలా చిత్రంగా చెపుతున్నావే...? మమ్మల్ని నవ్వులాట పట్టిస్తున్నావా? నేను నిన్ను ఎరుగనే ఎరుగను. మా దగ్గర శిష్యరికం చేసి విలువిద్య ఎప్పుడూ నేర్చలేదు. ఇట్లా ఎందుకు చెపుతున్నావు? నీ చరిత్ర వింటుంటే, చాల ఆశ్చర్యం వేస్తుంది–" అని ద్రోణుడన్నాడు. దానికి బోయరాజు ఆచార్యుణ్ణి చూచి

– "గురువర్యా! నన్నెరక్కపోవటమేమిటి? విలువిద్య నేర్చుకోవాలనే కుతూహలంతో నేను చిన్నప్పుడు మీ దగ్గరకు వచ్చా. భయ వినయ సంభ్రమాలు ముప్పిరిగొనగా–

చాగిలపడి మిమ్మల్ని వేడుకొన్నా. కాని మీరు ససేమిరా అంగీకరించక – 'ఎరుకవానికి విలువిద్య నేర్పరాదని సకల శాస్త్రాలు చెపుతు న్నాయి– నేను నీకు విద్య నేర్ప'నని కసరి పంపించలేదా!

అట్లా మీ దగ్గర అవమానం పొంది దుఃఖితాత్ముడనై, ఏమీ తోచక- కొంచెం కూడా వంచిన తల యెత్తకుండా తిరిగి మా చెంచుగూడేనికి వచ్చా. ఇక్కడకు వచ్చి మీ ఆకారాన్ని బొమ్మగా చేసుకొని, ఆ ప్రతిమనే నిత్యమూ కొలుస్తూ భక్తిపరతంత్రతతో విలువిద్య సాధన గావించా. శర విద్యలో అమోఘ నైపుణ్యం సంపాదించా. నాకు ఎదురనేవాడు ఎవ్వరూ లేరు.

నన్ను ఏకలవ్యుడని అంటారు. ఈ అటవీ ప్రదేశం నా భుజ బలంతో రక్షింపబడుతూ వుంటుంది. ఇక్కడి ప్రజలు ఏ చీకూ చింతా లేకుండా వుంటారు. నాకే మాత్రం అదురుగానీ, యెదురుగానీ లేక యిక్కడే నివశిస్తూ వుంటా.

మా చెంచు గూడేలు మాటలు తప్పవు. ఒకవేళ మాట తప్పితే, తప్పినవాడికి పుట్టగతులు కూడా వుండవు. చుట్టుపక్కలంతా ఆగ్రహోదగ్రులై బాకులు దూసి మీదకు దూకి ప్రాణాలుతీస్తారు. బొంకనేది ఎరుగని కారు కోనలోని యీ మూకలకెల్లా నేను దొరను" అన్నాడు.

నిష్కల్మష హృదయుడైన ఏకలవ్యుడి మాటలు విని ద్రోణుడు-

"వీడు అంతకుడితో సమానుడు. ఈతని వుదంచిత భీషణ బాహుశౌర్య రవికాంతి గానీ, వీని అసమాన పరాక్రమాటోపం గానీ, ఈతని బాణ విద్యా ప్రావీణ్యం గానీ ఆర్యజాతికి ప్రాణాంతకమౌతాయి. ఎట్లాగైనా ఈతణ్ణి హీనుడిగా చేయటం అవసరం.

ఈతని శింజినీటంకారానికి మారుగా మోయింపగలవాడార్యుల్లో ఎవడూ లేడు. ఈతని భుజశక్తిని నిర్మూలించకుండా మా జాతికి మనుగడ సాధ్యం గాదు - అని తలచాడు.

కపటనటనాధురీణుడైన ఆర్య ద్రోణుడు అకపటియైన ఏకలవ్యుణ్ణి చూచి -

"నీకు శిష్యాచారం వొకటి వుందని తెలియదా? తెలిసి కూడా యిట్లా ఆచరించటం చెంచురేడువైన నీకు తగునా? గురుదక్షిణ నీయని దుర్మార్గుడికి సద్గతేనాటికీ కలుగదు" అని పలికాడు.

ఇట్లా తన మనస్సులోని కాపట్యాన్ని బయటపడనీయకుండా కుచ్చితంతో పలికిన ద్రోణుడి మాటలు విన్న ఏకలవ్యుడు -

"గురూత్తమా! తళతళమనే కత్తి యిదిగో! నా తల గూడ యిదిగో! మీరు కోరుకొన్న దానిని వెనుదీయకుండా యిస్తా. తలనే కోసి యిమ్మంటారా? లేక ధనం యిమ్మంటారా" అన్నాడు.

అకపటియైన యెరుకరాయని మాటలు గ్రహించాడు ద్రోణుడు. కపట మనస్కుడైన ఆర్య గురువు -

"శబర రాజా! నాకవేమీ వద్దు. కానీ నీ కుడి చేతి బొటనవ్రేలు గురుదక్షిణగా

ఈయి. అదొక్కటే చాలు" అని అన్నాడు.

ద్రోణుడి మాటల్లోని మోసం గ్రహించాడు చెంచు నాయకుడు. అయినా ఏమాత్రం తొట్రుపాటు పడకుండా కరకు కత్తిని తీసుకొని గిరుక్కున కుడి చేతి బొటనవేలిని ఖండించి – "గురూత్తమా! ఇదిగో మీరడిగిన గురుదక్షిణ – తీసుకోండి. ఈ శబర వీరుడు వెంగలివాడు కాదు. ఎప్పుడూ ఆడిన మాట తప్పడు" అని వచించాడు.

బొటనవ్రేలు తెగినా, చలించలేదు. తళతళలాడే కత్తిని కడిగి వొరలో పెట్టాడు. జలజల రాలుతున్న రక్తాన్ని గమనించి కూడా విషణ్ణచిత్తుడు కాకుండా, ధీరోదాత్త మనస్కుడై, మొగాన చిరునవ్వు చిందులాడ కాంతులీన మాటలాడుతున్నాడు. అతని స్థైర్యాన్ని గమనించిన ద్రోణార్జునులు బిత్తరపోయారు.

కపటబుద్ధులు ద్రోణార్జునులు ఏకలవ్యుణ్ణి చూచి, అతని వద్ద సెలవు తీసుకుని – కోర్కె నెరవేరిందని కులుకుతూ తమ నివాసానికి మరలిపోయారు. వీళ్ళు పోయిన తరువాత చెంచు పృధివీరుడు

"వీడు గురువట! పనికిమాలిన కోర్కె కోరి నీ బొటమ వ్రేలిని నరికించి గురుదక్షిణగా తీసుకొన్నాడు. ఇది న్యాయమా! శిష్యుణ్ణి గొప్పవాణ్ణి చేయటం కోసం స్వార్థ బుద్ధితో గురువు దక్షిణ కోరగవచ్చు, కాని శిష్యుణ్ణి కరుణ విహీనంగా అపకారంతో నాశనం చేయటం ధర్మమా!" అని కలవరపడుతున్న తన హృదయాన్ని వూరడించుకున్నాడు.

అంతలో యిట్లు జరగటానికి గల కారణాన్ని వూహించాడు.

అర్జునుడు కృష్ణుడి మేనత్తయైన కుంతి కొడుకు. ద్రోణుడు పార్థుడి గురువు. బహుశః కృష్ణుడే వీళ్ళను పంపి ఈ రీతి దుర్మార్గాన్ని చేయించి వుంటాడు. వేరే విధంగా దీన్ని ఆలోచించడానికి కూడా వీలు లేదు. కానీయండి; ఇంతమాత్రం చేత ఏమవుతుంది? ముల్లోకాలు ఆశ్చర్యంలో మునుగుతుండగా కృష్ణుడు యుద్ధరంగంలో నా ప్రళయ తాండవాన్ని చూచి బిత్తరపోవాలి.

సంగ్రామ రంగంలో అడ్డువచ్చిన హరిహరాదులనైనా – 'ఉఫ్ఫ'ని వూదేస్తా. ఒకవేళ కృష్ణుడే వచ్చి అడ్డం తగిలినా, వేటలో తునియలుగా అతన్ని విరుగగొడతా, ద్వారక మీదకు దండెత్తి పోయి, నా దండునంతా అక్కడ దందాటలాడిస్తా; పాండు కుమారులు ధర్మజాదులు తోడుగా వస్తే వాళ్ళ తలలతో బంతులాడతా; నాకున్న పది వేళ్ళల్లో ఒక్క వేలు పోయినంత మాత్రాన ఏమవుతుంది? అంతా వాళ్ళ దురాశ, ఈ ఏకలవ్యుడు నిఖిల లోక ధార్మికుడని లోకమంతా మారుమోగిస్తా.

అని రోషించి పోటరులైన పదాతులబంపి, చెంచుగూడేల నుంచి చెంచుదొరలను పిలిపించాడు. పేరుమోసిన సెలవిలుకాండ్రు, తటవిలుకాండ్రు, వెదురు విలుకాండ్రు, ఎదురులేక వొకరినొకరు పిలుచుకొని మించిన భక్తితో రాజు దగ్గరకు వచ్చారు. అప్పుడు

వెంటనే ఏకలవ్యుడు రణభేరి వేయించి, పయనం చేసి ద్వారకా పట్టణాన్ని చేరారు. చుట్టూ మూగి పైబడి ఆయా దారులనన్నిటినీ అరికట్టి, పట్టణంలో వున్న పదాచారులందరినీ బంధించి, కట్టెదుట వున్న దొడ్లను, తోటలను పాడుచేసి, పెక్కుమంది యోధుల్ని చంపి, కృష్ణుడు లేకపోవటం వల్ల తిరిగి వచ్చారు.

ఆ తరువాత కొంతకాలానికి మరల యుద్ధం మొదలైంది. అందులో అన్యాయంగా ఏకలవ్యుడు చంపబడ్డాడు.

# ధర్మజుడి రాజసూయం

ఎప్పుడూ భయంకరమైన యుద్ధాలు చేయటం వల్ల సంక్షుభితమైన విసుగు చెందిన మనస్సుతో కృష్ణుడు రత్నాలు పొదిగిన గోడలతో నిర్మించబడ్డ తన యింటి లోపల చంద్రశాలలో ఒంటరిగా ఆసీనుడయ్యాడు. దట్టంగా వస్తున్న చంద్రకిరణాలు తన హృదయానికి ఉల్లాసం గలిగిస్తున్నాయి. హాయిగా వుంది. ఒంటరిగా కూర్చున్న తాను తనలో తలపోయసాగాడు.

మురుడు, నరకుడు, హంస డిభకులు, శబర భూపతుడైన ఏకలవ్యుడు, కంసుడు మొదలైన పరరాజన్యవరులను సంహరించాను, వీళ్ళందరినీ చంపానన్నమాటే గాని, ఒక్కనాడైనా కంటి నిండా సుఖంగా నిద్ర పట్టిన పాపాన పోలేదు.

ఒక వంక మగధ రాజైన జరాసంధుడు బలోపేతుడై దండెత్తటానికి సిద్ధంగా వున్నాడు. ఇంకో వంక చేది దేశాధీశుడు శిశుపాలుడుద్భటారభటితో ఏమాత్రం జంకకుండా కాలుదువ్వుతున్నాడు. ఒక ప్రక్క పౌండ్రక వాసుదేవుడు సమరోత్సాహభరితుడై ముట్టడించటానికి ఉవ్విళ్ళూరుతున్నాడు. మరో చెంత సాల్వుడు వికటాట్టహాసం చేస్తూ, నన్ను కసిమసంగటానికి వేచి వున్నాడు. ఇంకోదెస కాలయవనుడు పెదవి కొరుకుతున్నాడు, వేరొక దండ దంతవక్త్రుడు భుజాలు చరుస్తున్నాడు. వీళ్ళందరి బారి పడకుండా ఎట్లా తప్పించుకోవాలి. కలలో కూడా వాళ్ళే కనిపిస్తున్నారు.

వీళ్ళ మాటల్ని వినగూడదు, వీళ్ళ చేష్టల్ని చూడగూడదు, వీళ్ళ పొత్తున బ్రతుకకూడదు. వీళ్ళతో స్నేహం కూడా చేయగూడదు.

విజాతీయులైన ఆర్యులతో కలసి పోయానని మా వాళ్ళు ఎక్కడ లేని కోపంతో నన్ను వెలివేశారు. అంతేగాదు, లేని తప్పొప్పులెన్నో నా మీద మోపి అందరికీ ద్వేషం కలిగేట్టు చేశారు. బలాలన్నీ సమకూర్చుకొని చతుర సైన్యంతో విసుగూ విరామం లేకుండా నా యంతు చూడాలని వెంటబడుతున్నారు. కంటి నిండా నిద్రగాని, కడుపు నిండా సరైన కూడు గాని యెరుగను. చాలాకాలం నుంచి జడుడిలాగా అయ్యాను. ఒంటరివాణ్ణి కావడం వల్ల పోరాటవీరులైన వీరితో పోరాడే శక్తి లేక, నా జన్మభూమిని

రక్షించుకునే బలం లేక కాని ద్వీపం చేరి, ఇల్లు కట్టుకుని చివరికిట్లా ఆరాటపడవలసి వచ్చింది.

నేను జాతిద్రోహిననే వంకతో పాపాత్ముడైన జరాసంధుడు ధనమదంతో కళ్ళు నెత్తికెక్కి సాటి రాజులందరినీ ఆనపెట్టి నా మీదకు ఉసిగొల్పుతున్నాడు. అతడి పేరంటేనే సింహ స్వప్నంగా వుండడం వల్ల అతనితో నాకెందుకులే అని తలచి – దూరంగా వుండడమే మంచిదని భావించాను. అందుకే మధ్య దేశాన్ని విడిచి చుట్టుపక్కవారితో సహా వచ్చి ఇక్కడుంటున్నా.

అక్కడ కూడా వున్న పచ్చికబీళ్ళనూ – వాటిల్లో విచ్చలవిడిగా తిరిగి మేసే ఆలమందలను – అవి యిచ్చే గుమ్మపాలనూ – ఇంకా అక్కడి సుందరమైన భూముల్ని విడిచి యింతదూరం రావలసి వచ్చింది.

జన్మభూమియైన మధ్య దేశంలో వుండకుండా అక్కడ నాకు నిలువ నీడ కూడా లేకుండా చేయగలిగాడు – ఈ మగధరాజు రాజ్యాన్ని కూకటివేళ్ళతో పెళ్ళికించకుండా, వాణ్ణి నాశనం చేయకుండా నాకు పెంపు పేరులుండవు.

జాతి ద్రోహినని చేసిన ప్రచారం వల్ల ద్రావిడ జనాల పంచలకు చేరలేను. కాబట్టి యెట్లాగైనా ఆర్యజనులనే ఆశ్రయించి, వాళ్ళకు తలలో నాలుకగా మెలగుతా. కావలసిన కార్యాన్ని సాధిస్తా.

సంజకెంజాయలు చలువ తిన్నెల మీద విహరించే భాగ్యం లేకుండా పోయింది. పండు వెన్నెల్లో ఆరుబయట పవళించే సౌభాగ్యం కూడా సమసిపోయింది; రాత్రింబవళ్ళూ పుప్పొడి దుమారంలో మునిగి తేలుతూ కేరింతలు గొట్టే మురిపెం కూడా ముగిసి పోయింది. పున్నాగల కూడి సురపొన్నల నీడలో పన్నాగాలు పన్నే చెన్నే తరిగిపోయింది. వంద జన్మలెత్తినా నా మాతృభూమియైన మధ్యదేశాన్ని మరువలేను, కాని, యిదంతా నాకు రాజచండాలుడైన జరాసంధుడి వల్లనే కలిగింది.

నేను ఆర్య జనులకు అమ్ముడుపోయానని, నా జాతి వాళ్ళైన ద్రావిడ జనులు నేనంటే ఇష్టపడడం లేదు; సందేహంతో నన్ను నమ్మటం కూడా లేదు. వాళ్ళను నమ్మినా యిక నాకు లాభం లేదు.

ఆర్య సమాజంలో యిప్పుడిప్పుడే భేదాభిప్రాయాలు పొడసూపి రెండుగా చీలిపోతున్నారని విన్నా. ఎట్లాగైనా నా రాజనీతినుపయోగించి, వాళ్ళు రెండు పక్షాలుగా చీలిపోయేట్టు చేస్తా. పొరపాటున కూడా ఆ రెండు పక్షాలు ఒకటి గాకుండా చూడడం నా కర్తవ్యం. వాళ్ళల్లో వాళ్ళకు ఇంకా చిక్కులు పెట్టి, ఒకరంటే ఒకరికి తీవ్రమైన ద్వేషం కలిగేట్టు చేస్తా.

కౌరవులు– పాండవులూ – కౌరవ రాజ్యం కోసం తన్నుకోబోతున్నారని వార్తలు

పొక్కాయి. నా చతురత నుపయోగించి చతురోపాయాలతో వాళ్ళ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గున మండేట్టు చేస్తా- వాళ్ళల్లో ఒకపక్షాన్ని దగ్గరకు తీసి కార్యక్రమం నడుపుతా. నా ధీశక్తిని సర్వస్వం వుపయోగిస్తా.

అయితే, యిందులో చతురంగ బలాలతో - సప్తాంగ బహుళ సంపత్తితో ధృతరాష్ట్ర తనయుడు దుర్యోధనుడు భాసిస్తున్నాడు. అతడు మాతో పొత్తు పెట్టుకొనడానికి యిష్టపడడు. అయినా, అతనితో మాకు సరిపడదు కూడా. అయినా బలవంతులతో ఏనాడు చెలిమి చేయ గూడదు. ఒకవేళ చేసినా వెంటనే కష్టాలు తప్పవు. చివరకు స్నేహం విరోధంగా మారుతుంది. కాబట్టి ధృతరాష్ట్ర తనయులతో పొత్తు ఏమాత్రమూ పనికిరాదు.

ఇక పర్యవసానమేమయినా ఫర్వాలేదు. పాపం గీపం చూచే పనే లేదు. సమయజ్ఞత పాటించి ఆర్యుల్ని చీలదీసి, వాళ్ళను కలవకుండా చేయటం నా విధి. ధైర్యంతో కనుక ఈ పని చేయకపోతే నా పని ఇక అడకత్తెరలోపల బద్ద పోకచెక్కలాగా అవుతుంది. ఈ విషయంలో చురుకుగానే పని నిర్వహించాలి.

దుర్యోధన రాజుతో మాకెటూ కుదరదు కాబట్టి, మాకు దగ్గర చుట్టాలూ - బాహుబల సమన్వితులూ - యుద్ధభూమిలో దర్పసమగ్రులూ - ఎంతటి వీరులనైనా వెనుకకు తగ్గకుండా ఎదిరించే శౌర్య పరాక్రమాలున్నవాళ్ళూ - పాండవులు. నా తెలివి తేటలుపయోగించి, వివేకంతో వాళ్ళను దగ్గరకు దీసి నా పనిని నెరవేర్చుకొంటా- ఇక అనవసరమైన కాలయాపన కూడా వద్దు.

అన్నన్నా! ఈ జరాసంధుడు నన్నెంత విపన్నుని కావించాడు? కన్నీటి మున్నీటిలో మునగవలసి వచ్చింది గదా?

పాండవులకు చుట్టపక్కాలు తక్కువ. చుట్టూ వున్న బలగం కూడా తక్కువే. కాబట్టి సంతోషంతో నా ప్రక్కన చేరతారు. నా రక్షణ కోసం వాళ్ళు ఉవ్విళ్ళూరుతారు. నా మాటల మీద వాళ్ళు కావలసినంత నమ్మకం వుంచుతారు. అందుకని నేనేం చెప్పినా, నా మాటలన్నీ వాళ్ళకు రుచిస్తాయి. ఒకవేళ కాదుకూడదన్నా నచ్చచెప్పటానికైనా వీలుంటుంది.

భుజబల మద గర్వంతో ద్రవిడ రాజ వంశీకులకూ - పాండునందనులకూ విరోధం సృష్టిస్తా. అప్పుడు పాండవేయులు ప్రాణభయంతో నా అండ పాయకుండా అంటిపెట్టుకుని వుంటారు. దీని వల్ల నాకూ నిండు బలం వస్తుంది. మేలు కూడా చేకూరుతుంది. దీని కోసం ఓ యెత్తుగడ వేయాలి. ధర్మజుడితో రాజసూయ యాగం చేయించటం అవసరం. పాండవులతో ఈ యాగం చేయిస్తే పుడమి మీది రాజ వతంసులతో తప్పకుండా వీళ్ళకు విరోధమేర్పడుతుంది. ఆరిపోని శత్రుత్వమే స్థిరపడుతుంది. క్షణంలో కోపాగ్ని

రాజుకుంటుంది. విద్వేషాగ్ని జ్వాలలు రేగుతాయి."

కృష్ణుడు తన రాజనీతి బయటపడేట్టు లోతుగా విచారించి వితర్కించాడు. వెంటనే దేవఋషియైన నారదుణ్ణి పిలిపించాడు. తాననుకొన్న రాజసూయ కార్య విధానాన్ని సర్వాన్ని వివరించాడు.

వెన్నుడి మాట ప్రకారం నారదుడు పయనమై యింద్రప్రస్థ నగరానికి పాండవేయుల దగ్గరకు వెళ్ళాడు. వచ్చిన దేవఋషికి ధర్మజాదులు అర్ఘ్య పాద్యాలొసంగి యథోచిత సత్కారాలు గావించి పూజించారు. నారదుడు కూడా సపర్యలు పొందిన తరువాత క్షేమ సమాచారాలన్నీ తెలుసుకొని, ప్రసంగవశాన ఏమీ తెలియనివాడిలాగా చెప్పడం మొదలుపెట్టాడు.

"జనపాలా! మొన్న మొన్ననే స్వర్గానికి పోయి వచ్చా. అక్కడ మీ నాన్నను చూచా. ఆ మహానుభావుడు స్వర్గంలో సుఖాలలో తేలియాడుతున్నాడు. నన్ను చూచిన వెంటనే, మీ నాయన నా దగ్గరకు వచ్చాడు. మీ యోగక్షేమాలన్నీ గుచ్చి గుచ్చి అడిగి నా ద్వారా తెలుసుకొన్నాడు. ఎంతో సంతోషించాడు. అంతలోనే, బిక్కమొగం వేసుకొన్నాడు. ఎందుకో అనుకున్నా- వెంటనే మీకు చెప్పమని నాతో కొన్ని మాటలు చెప్పాడు.

"పుత్రా! భూలోకంలో వున్నంతకాలం, శత్రువీరులను బంధించి సంపద కూడబెట్టడం తప్ప ఇంకేమీ వుండేది కాదు. భూలోకం వీడి స్వర్గలోకానికి చేరితే, పుణ్యం అవసరమని అనిపించలేదు. అందుకే అప్పుడు భూత యజ్ఞం చేసి పుణ్యం సంపాదించలేదు. విజ్ఞాన హీనుడైనా- అధర్మవర్తనుడైనా - అల్పుడైనా సరే, ఎవడైతే యజ్ఞం చేస్తాడో అతడు స్వర్గలోకం పొందుతాడు. ప్రజ్ఞా సమన్వితుడౌతాడు. కాని, ఎంత గొప్ప ధీరుడైనా - విజ్ఞాన ఖనియైనా ధర్మమూర్తియైనా - లోకోత్తరుడైనా - యజ్ఞం చేయనివాడు స్వర్గంలో ఔన్నత్యం కోసం ప్రాకులాడక తప్పదు.

కుమారా! ఏమీ యెద్దడి లేని భూతలమంతా పాలిస్తున్నావు. ఇంటికి పెద్దవాడవు నీవే. లోకమంతా నిన్ను పెద్దవని కీర్తిస్తుంది. నీ తమ్ములు భుజబల సంపన్నులు - అరి వీర భయంకరులు. రణ విశారదులు. నీవు రాజసూయయాగం చేస్తానని తలపెడితే, వాళ్ళు నిన్నేమీ వద్దనరు. పైగా, నీకీ యాగ నిర్వహణలో అన్నిరకాల అండదండలిచ్చి తోడుగా నిలుస్తారు.

నాకంటే గుణహీనులు- ధర్మచ్యుతులు- లుబ్ధులు - ఈ స్వర్గంలో గౌరవప్రదంగా బ్రతుకుతున్నారు. దీనికి కారణం వాళ్ళు యాగం చేయడమే. నేను కూడా సాటి క్షత్రియుల్లో ఉత్తముడిగా రాణించాలంటే, నీవు రాజసూయయాగం చేయాలి. అందుకని యాగాన్ని ప్రారంభించు. నా కానందాన్ని చేకూర్చిపెట్టు - స్వర్గంలో మేటివాణ్ణిగా నన్ను తీర్చిదిద్దు - కాబట్టి తండ్రియైన నా యాజ్ఞ పాలించి - చంద్రవంశపు కీర్తిపతాకం దశదిశలా

రెపరెపలాడేట్టు చేయి. మానసీయమైన మన వంశ ప్రతిష్ఠ దేశదేశాల కెగబాకి మెరిసేట్టు కావించు - నన్ను నీవు రాజసూయ యాగం ద్వారా వుద్ధరించాలి- అని చెప్పి నన్ను మీ దగ్గరకు పంపించాడు మహారాజా!"

నారదుడు చెప్పిన మాటలన్నీ ఎంతో గౌరవంతో విన్నాడు ధర్మరాజు. తండ్రి దుస్థితి విని కన్నీటి ధారలు గట్టి విలపిస్తూ, గడగడ వణకిపోతూ, నారదుణ్ణి చూచి -

"నారద మునీంద్రా! మా తండ్రి స్వర్గలోకంలో పొందే పరితాపాన్ని వివరించి చెప్పారు. ఈ సంగతి లోకులు వింటే యేమంటారో! యేమో! ఎంత ఆపుకొందామన్నా దుఃఖం పొర్లుకొని వస్తుంది. మా తండ్రి ఆజ్ఞాపించినట్లు, ఆయన ఆజ్ఞను తలదాల్చి యిప్పుడే రాజసూయయాగం చేయటానికి సన్నాహాలు మొదలుపెడతా. ఆలస్యం చేయను; కాని, మాకు రక్షకుడు - అన్నిటా మమ్మల్ని కాపాడుతున్నవాడు - మాకు పెద్ద అయిన కృష్ణుణ్ణి సంప్రదించాలి గదా!" అని యుధిష్ఠరుడు పలికే లోపల ద్వారపాలకుడు వచ్చాడు.

"మహారాజా! ధర్మజా! శ్రీకృష్ణులవారు వాకిట వేచి వున్నారు. లోపలికి తీసుకొని రమ్మంటారా?" అన్నాడు.

దేవారకుని వాక్కులు విన్న ధర్మరాజు క్షణంలో దిగ్గున లేచి యెదురుపోయి సాష్టాంగ దండ ప్రణామాలు చేసి, గుచ్చి, కౌగిలించుకుని తెచ్చి తగిన ఆసనం మీద కూర్చుండబెట్టి, కుశల ప్రశ్నలతో యోగక్షేమాలు తెలుసుకొన్నాడు. తరువాత, నారదుడు చెప్పిన వుదంతం సాంతం వినిపించాడు. దానికి, మోమున చిరునవ్వు తాండవమాడ కృష్ణుడు ధర్మజుని చూచి -

"ధర్మజా! ఇంతకంటే మనకు కావలసిందేముంది? తండ్రికి మించిన దైవం ఎక్కడుంది? జనకుడు సంతోషిస్తే చాలు. లోకమంతా ఆనందడోలికల్లో వూగినట్లే. కాబట్టి ఉచితజ్ఞులైన దైవజ్ఞుల రావించి - సుముహూర్తం నిశ్చయించు. వెంటనే, భీమార్జున నకుల సహదేవులైన నీ నలుగురి తమ్ముల్ని పిలిపించి, కప్పాలు తీసుకురావలసిందిగా నాలుగు దిక్కులకు పంపు. యాగ సంబారాలన్నీ చక్కగా సమకూర్చుకో. పెత్తనం చేయటానికి వున్న చుట్టుపక్కలను నలుగురినీ పిలవనంపు - మీ తండ్రి స్వర్గంలో సంతోష సముద్రంలో మునిగిపోయేట్టు నీవు నిర్వహించబోయే యజ్ఞాన్ని నలుగురి చేత 'సెభాస్' అని అనిపిస్తా.

కప్పాలు కట్టడానికి ఎదురు తిరిగిన రాజులెవరైనా వుంటే, వెనుదీయకుండా దండెత్తి పోయి ఆ రాజుల్ని యుద్ధ రంగంలో ఓడించి మదమడగించి, దీనుల గావించి, నీ స్వాధీనం చేస్తా. నీవు తలపెట్టిన రాజసూయయాగం ముగిసే వరకు యిక్కడే వుంటా. కావలసిన సంబారాలన్నీ సమకూర్చిపెట్టి, శత్రు భూపతులంతా - 'భళీ' అని మెచ్చుకొనేట్టు చేస్తా. ఈపాటి కార్యానికి కలత పడడమెందుకు?"

అని కృష్ణుడు ప్రోత్సహించి మాట్లాడాడు. వెంటనే కుంతీ సుతాగ్రజుడు తన తండ్రి యజ్ఞానుదేశం తలదాల్చి, యజ్ఞాన్ని ప్రారంభించ తలపెట్టి, తన తమ్ముల్ని నలుగురినీ పిలిపించాడు. నాలుగు దిక్కుల్లో వున్న రాజన్యవరుల నుండి కప్పం తీసుకుని రావలసిందిగా వారికి చెప్పి, నలుగురినీ నాలుగువైపులకు పంపాడు.

నాల్గుదిక్కులకూ పోయిన భీమార్జున నకుల సహదేవులు, కొంతకాలం గడచిన తరువాత, భీముడు, నకుల సహదేవులు వివిధ రాజచంద్రుల నుండి కప్పాలు గైకొని వచ్చారు. వాళ్ళు చేసిన కార్యాన్ని చూచి కృష్ణుడు – ధర్మరాజు సంతోషపడ్డారు.

అర్జునుడు మాత్రం బేలుపోయిన మనసుతో వట్టిచేతులతో తిరిగి వచ్చాడు. సిగ్గు ముప్పిరికొంటూ వుండగా, చెప్పలేక చెప్పలేక చివరకు తన అన్న ధర్మజుణ్ణి చూచి

"అన్నా! ధర్మనందనా! పోయీ పోవడంతోటే, రాజగృహం వెళ్ళా. అక్కడ ఒంటరిగా వున్న జరాతనయుణ్ణి – జరాసంధుణ్ణి చూచి, నేను వచ్చిన పని వివరించా. దానికాతడు నవ్వి – "ఓహో! ధర్మసూనుడు రాజా! ఇతడెప్పుడు రాజయ్యాడు? ఎట్లా జరిగింది? తాను రాజునని ప్రకటించుకొన్నంత మాత్రాన మగధాధీశుడైన జరాసుతుడు అప్పనంగా అప్పనాలిస్తాడా....? శత్రువుకు కప్పం కట్టడం మాకేనాడూ లేదు. ఒకవేళ దుర్దమదోర్దర్పం గల శత్రువులు ఎదురైతే నా బాహు పరాక్రమాన్ని రుచి చూపిస్తా. క్షణంలో మట్టుపెడతా. హరిహరాదులడ్డంగా వచ్చినా, విమత భూపతుల్ని అరిగాపులుగా చేస్తా" అని అన్నాడు.

ఈ విధంగా జరాసంధుడు పలికేటప్పటికి, ఎదురు మాట్లాడదానికి నోరు రాలేదు. కట్టువడ్డది; కిమ్మనకుండా వున్నా. చేసేది లేక సిగ్గుపడ్డా – అన్నా! నాకీ బ్రతుకు సహించరానిదిగా వుంది. అతణ్ణి చంపకుండా కంటికి కునుకు రాదు. నోటిలోకి ముద్ద పోదు. అతడి కర్ణ కఠోర వాక్యాలు – ఛలోక్తులు – ఈసడింపులు – నా చెవుల్లో యిప్పటికీ గింగురుమని మ్రోగుతున్నాయి.

కృష్ణుడీ మాటలు విన్నాడు.

"అర్జునా! జరాసంధుడంటే మాటలనుకొంటున్నావా? అతడు నీవనుకొన్నంత అల్పుడు గాడు. అతని చేవ – బలం – సొంపు – యుద్ధరంగంలో చూస్తేగాని తెలియదు. జరాసంధుని ముష్టియుద్ధ పాటవం – గదారణ పాండితి – శత్రువులైనా చూచి "వహ్వారే" అని మెచ్చుకోక తప్పదు. కాబట్టి నా మాటలు విని అతనిపైకి పోవడం మానుకో.

ధర్మరాజా! అయితే, నా మాటలు విను; భీమార్జునుల్ని నాతో పంపు. అలంఘ్య బల సంపన్నులైన వీరి సాయం అవసరం. అర్జునుడి రక్షాబలం, భీముడి బాహు శౌర్యం– నా నీతి – ప్రదర్శించి బృహద్రథ తనయుణ్ణి జరాసంధుణ్ణి ఏమాత్రం తొందరపడకుండా లోబరచుకొంటాం – సందర్భాన్ని బట్టి – సామంచేతనో, లేక భీకర సమరం గావించో తప్పకుండా మాగధుణ్ణి మా వశం చేసుకొని నీ వశం చేస్తాం. ఇక ఈనాటికి కొలువు

చాలిద్దాం" అని చెప్పి కృష్ణుడు ఒక్క క్షణం సేపు ధర్మరాజుతో రహస్య సమాలోచనలు జరిపి, రాత్రి గడపిపుచ్చి, మరునాటి రోజు పెందలకడనే నిద్ర లేచి, భీమార్జుల్ని తీసుకుని, జరాసంధుని రాజధానియైన గిరివ్రజమనే పట్టణానికి ప్రయాణం కట్టాడు.

యాదవ పాండవేయులు ముగ్గురూ స్నాతకులైన బ్రాహ్మణుల వేషాలు వేసుకొన్నారు. కొంచెం గూడా బిడియపడకుండా మాపన్నుల్లా బయలుదేరి గిరివ్రజ పురానికి వెళ్ళి వీళ్ళు ముగ్గురూ ఎంతో వొద్దికతో ఉబ్బకు - ఎండకు ఓర్చుకుని, దారిలో తోచక, కావలసిన సుద్దులు చెప్పుకొంటూ - ఒకనాటి అర్ధరాత్రి రాజగృహం దగ్గరకు పోయారు. ఆ రాజ గృహానికి కొంత దూరంలో వుండి, వాసుదేవుడు అటు - ఇటు పార చూచాడు. చీమ చిటుక్కుమన్నా వులికి పడుతూ, తనతో వచ్చిన పృథ్వీ తనయులతో ఏదో చెప్పి, అక్కడ వుండకుండా కదిలాడు.

పిరికివాళ్ళైన ఆ ముగ్గురూ రాచబాటలో ప్రయాణం చేయకుండా, కొండలు- కోనలు- లోయల్లో నడచి, కాలి చప్పుడు కాకుండా పిల్లుల్లా చిట్టచివరకు కోటగమిడి దగ్గరకు చేరారు.

కృష్ణుడికి మాగధుడైన జరాసంధుడి రాజ్యానికి సంబంధించిన సకల విషయాలు తెలుసు. అందుకని, పాండు కుమారులైన భీమార్జునుల్ని అక్కడే వుంచి, తానొక్కడే ముందుకు సాగి, ఆ గిరివ్రజ పట్టణానికి ఆయువుపట్టువైన దుందుభుల్ని పగులకొట్టాడు. వెంటనే బిరబిరా వచ్చి ఆ యిద్దరినీ తీసుకొని రాజధానిలో జొరబడ్డాడు. ఎవరికీ - ఏ రకమైన అనుమానం రాకుండా జాగ్రత్త పడ్డాడు.

రాజమందిరానికేగిన ఆ ముగ్గురూ - "తమదర్శనార్థం ముగ్గురు స్నాతకులు వచ్చి మొగసాల నుంచున్నారు. రమ్మందురా" - అని దేవారికుడితో వర్తమానం పంపారు.

అప్పుడు మగధీశ్వరుడు తన ఆరాధ్య దైవమైన శివుడి పూజలో నిమగ్నమై వున్నాడు. శివపూజా తత్పరమతియైన ఆ నరవరునకు దేవారికుడు మెల్ల మెల్లగా కృష్ణుడు చెప్పిన వార్తను వినిపించాడు.

వచ్చినవాడు బ్రాహ్మణుడు - మగధరాజు బ్రాహ్మణ భక్తి కలవాడు. ఒకవేళ తానీ విషయం చెప్పడం ఆలస్యం చేస్తే రాజుకీ విషయం తెలిసి తనపై ఆగ్రహిస్తాడేమోననే భయంతో కావలివాడు ఆలస్యం చేయకుండా తానీ వార్త రాజు చెవిన వేశాడు.

స్నాతక బ్రాహ్మణులు ముగ్గురు తన కోసం వాకిట వేచి వున్నారనే వార్త చెవి సోకగానే, పరమ శివభక్తుడు బార్హద్రథుడు సంభ్రమపడి పూజను మాని వచ్చాడు. కావలివాడు ముందు నడుస్తూ దారి చూపుతుండగా, కనులకానంద బాష్పాలు జాలువార - నూత్న వికాసం మొగమున చిందులాడుతుండగా - పంచరత్నా ప్రమాణాలు - మెలి తిరిగిన కండరాలు గల శరీరం - వృషస్కంధుడు - విపుల వక్షఃకవాటుడు -

అయిన జరాతనయుడు రాజప్రాసాదపు వాకిట దగ్గరకు వచ్చాడు.

వాకిట నిలిచిన ఆ ముగ్గురినీ చూచాడు. ముగ్గురూ అపూర్వంగా వున్నారు. జనపాలుని హృదిలో సందేహం తళుక్కున మెరిసింది.

"వీళ్ళ వేషాలు బ్రాహ్మణ రూపాలుగానే వున్నాయి. కాని, ముఖాలలో ఎవ్వరిలోనూ పూర్తిగా బ్రహ్మతేజం కనిపించలేదు. నిజంగా వీళ్ళు బ్రాహ్మణులేనా? ఎందుకిట్లు కృత్రిమ వేషాలు వేశారు? వాళ్ళను చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. అయినా, వీళ్ళ చర్యల్ని గమనించటం మంచిది" అని తనలో తాను వితర్కించుకుని, డోళాందోళిత మనస్కుడై వాళ్ళను చూచాడు.

"అయ్యలారా! మీరెవరు? ఎవరిని చూద్దామని యిక్కడికి వచ్చారు? మీ నివాస ప్రదేశాలేవి? అక్కడ మీ పాలకులెవరు? ఇంత రాత్రివేళ, ఏం పని మీద యిక్కడికి వచ్చారు? నాకేదో అనుమానంగా వుంది. నిజాన్ని దాచకుండా మీమీ వివరాలు చెప్పగోరుతా"

జరానందనుడి మాటలు కృష్ణుడు విన్నాడు. మొగంలో ఏమీ విలక్షణాలు కనపడనీయకుండా, తన కాపట్యం ఎక్కడా బయటపడకుండా వుండేట్టు జాగ్రత్తపడుతూ- దంబాన్ని ప్రదర్శిస్తూ ఆ భూపాలుడ్ని చూచి-

"దేవా! జరాసంధ భూపాలా' స్నాతకులమైన మాకు ఒక నియమం వుంది. రెండు జాముల మునుముందు రాత్రి పూట ఎవ్వరితోనూ పల్కము. ఎవ్వరినీ పలకరించం. కాబట్టి వేళగాని యీ వేళలో యిక్కడకు వచ్చాం.

ప్రభువైన మీతో ముఖ్యమైన పని వుండడం వల్ల యింత అర్ధరాత్రివేళ వచ్చాం. అంతా మీతో చెపుతాం. కాని, ఏదైనా ఏకాంత ప్రదేశానికి వెళదాం" అన్నాడు.

ఈ మాటలు విన్న జరాతనయుడు కృష్ణుడ్ని - భీమార్జునుల్ని తీసుకొని, విఖ్యాతమయిన తన పూజామందిరానికి తీసుకుపోయాడు.

నల్గురు లోపలకి వెళ్ళారు. కృష్ణుడు అర్జునుడికి కనుసైగ చేశాడు. దాన్ని గమనించి పార్థుడు వెంటనే తలుపులు మూశాడు. ముగ్గురూ బార్హద్రథుని దగ్గరకు చేరి, ఏవేవో నోటికి వచ్చిన మాటలు మాటలాడి, అతణ్ణి వాదంలోకి దింపారు.

జలజల పలుకులు పలుకుతూ కొంతసేపు ఎంతో స్నేహంతో వర్తిస్తున్నట్లు నటించారు - అంతలోనే తటాల్ని ముగ్గురూ ఒక్కటై జరాసంధుడి మీద కలియబడ్డారు.

పిడికిటి పోటులను పొడుస్తూ - భయభ్రాంతుడై విలవిలలాడిపోయేట్టు చేస్తూ నజ్జు నజ్జుగా అయ్యేట్టు పాదాలతో తంతూ - గొంతు పిసుకుతూ- మర్మావయవాలలో గుద్దుతూ - కుమ్ముతూ- ఆతణ్ణి చంపడం కోసం ముగ్గురూ ఏకంగా హింసించడం మొదలు పెట్టారు.

ఈ స్థితిని వెంటనే గ్రహించి జరాసంధుడు ముగ్గురికి మూడు మూర్తులుగా అయి ప్రచండ వేగంతో - కుపితానసుడై వాళ్ళ మీద కెగశాడు. కీలు కీలు తుంపి పడేసేట్టు వాళ్ళ మీద బడి భీకరంగా రెండు ముహూర్తాలు పోరాడాడు. 'నిజంగా వీరుడంటే ఈతడే' అనేట్టు తన ప్రతాపాన్ని ప్రదర్శించాడు.

ముగ్గురూ రోజుతూ - రొప్పుతూ చావును తప్పించుకోవడం కోసం వెతుకుతున్నారు. జరాసంధుడి ధాటికి తట్టుకోలేక - అతనిపై బడడం కూడా మానివేశారు. కాని, ముగ్గురితో తానొక్కడై, అందులో అకస్మాత్తుగా పోరాటం చేయటం వల్ల తాను అలసిపోయాడు జరాపుత్రుడు. అతనికి క్రమక్రమంగా బలం నీరసించింది. ఈ విషయాన్ని కనిపెట్టాడు కృష్ణుడు. వెంటనే భీముడికి చెప్పి, దూకించి భీముడితో మగధ భూపాలుడ్ని నేలపై కూలిపించాడు.

అట్లా పట్టుదప్పి క్రింద పడ్డ గిరివ్రజ పట్టణాధిపుణ్ణి కృష్ణార్జునులు పొదివి పట్టుకుని అదిమిపెట్టారు. వెంటనే భీముడు క్రిందపడ్డ జరాసంధుడి కాలు పట్టుకొని, ఫెళఫెళారావం పెచ్చరిల్లుతుండగా చీల్చి వేశాడు. విశార్ధ దేహుడైన జరాసంధుడు ప్రాణాలు విడిచాడు.

తెలతెలవారకముందే రాజు మరణించాడనే వార్త పట్టణమంతా వ్యాపించింది. కంగారుపడి ఎక్కడివాళ్ళక్కడే చెట్టుకొక్కరు పుట్టకొక్కరుగా వీరంతా పలాయనం చిత్తగించారు.

పేరుమోసిన రారాజు పేరు మాసిపోయింది. పట్టణంలో వున్న పోటుగాళ్ళు బిత్తరపోయి, యెదురు తిరిగి పెనుగులాడదామనే ఆలోచన లేకపోయింది. అనుకోకుండా డబ్బాటుగా జరిగిన సంఘటన కావటంతో పోటుమన్నీలు చేసేది లేక తొలగిపోయారు.

జరాసంధుణ్ణి చంపిన తరువాత ఆ ముగ్గురు వీరులు కృష్ణ భీమార్జునులు ఒడలి నిండా వీరగంధం పూసుకున్నారు; కోపాంచిత నేత్రులై, ఎర్రపూల దండలు, ఎర్రని వస్త్రాలు ధరించి రాచబాటలో ఎదురులేకుండా రొమ్ములు విరుచుకుని నిలబడ్డారు.

స్నాతకులైనవాళ్ళు క్షణంలో రక్తపానం చేసే కసాయివాళ్ళుగా మారిపోయారు. అంతా కాలమహిమ. రాజ్య కాంక్షతో మరిగే మానవులు ఘోర హత్యలు చేయటానికైనా ఏ మాత్రం జంకరు.

జరాసంధుణ్ణి చంపారు. రాజ్యం రాజు లేక అరాచకంగా తయారైంది. పట్టణమంతా పాడుపడ్డట్టుగా భాసిస్తుంది. ఈ విషయం గమనించి మగధేశ్వరుడి పుత్రుడైన సహదేవుణ్ణి పిలిపించారు. అతనికి శక్తి సామర్థ్యాలు లేకపోయినా, యువ రాజ్యాభిషేకం గావించి, రాజ్యపాలన ధర్మయుక్తంగా చేయమని చెప్పారు.

తండ్రి మరణం వల్ల భయపడ్డ సహదేవుడు తత్తరపడి వివిధ కానుకలు తెచ్చి కృష్ణుడికి సమర్పించాడు. 'ఇవన్నీ నాకెందుకులే'- అని అనకుండా తెచ్చిన కానుకలన్నీ

తాను వరుసగా స్వీకరించాడు.

అంతకుముందే జరాసంధుడి చేత ఓడింపబడి కారాగారంలో బంధింపబడిన నరపాలురెందరో వున్నారు. ఈ సంగతి గమనించిన కృష్ణుడు చెరసాలకేగి, బంధింపబడ్డ రాజలోకాన్ని విడిపించాడు. కారాగార విముక్తులైన నరపాలురు, భోగాలలోని కోర్కె తొందరపెట్టి, ఎవరికి వాళ్ళే తమ తమ పట్టణాలకు ఒకరి కంటె ఒకరు ముందుగా వెళ్ళారు.

చెర నుండి విడివడిపోయిన రాజకుమారులంతా యాదవ పాండవేయులకు విధేయులుగా మారిపోయారు. వాళ్ళ పట్ల ఎంతో అభిమానం పెంచుకున్నారు. కారాగార బాధల నుండి విముక్తి లభించింది గదా - అని సంతసించారు. జరాసంధుడిపై, అతని రాజ్యంపై కోపాన్ని ప్రకటించారు.

ఇట్లా జరాసంధుణ్ణి చంపిన తరువాత ముగ్గురూ ఇంద్రప్రస్థ పట్టణానికి వెళ్ళారు. వాళ్ళ రాకను చూస్తూ, చింతాక్రాంతచిత్తుడై యున్న ధర్మరాజుకు సమస్తం ఎరుకపరిచారు. అది విన్న ధర్మనందనుడు విస్మయాంచితుడై, అద్భుతరసావేశంలో మునిగి తేలుతూ కృష్ణ భీమార్జునుల్ని గాఢంగా కౌగిలించుకున్నాడు. ఇక సంతోషంతో రాజసూయయాగం చేయటానికి ప్రయత్నాలు చురుకుగా మొదలుపెట్టాడు.

దూరాభారం అని కూడా లెక్కపెట్టకుండా, మారుమూలల నుంచి కూడా రాజ్యంలోని జనం గుంపులు గుంపులుగా రాజసూయ యాగం చూద్దామని వచ్చారు. ప్రతి ఇల్లూ చుట్టపక్కాలతో - వచ్చిన వాళ్ళతో పిక్కటిల్లిపోయింది. ఇసుక వేసినా రాలని జనంతో కిటకిట లాడుతూ వుంది యింద్రప్రస్థ పట్టణం. ఎక్కడ చూచినా జనం పుట్టలు పుట్టలుగా ఉండేటప్పటికి నేల యీనిందా? అన్నట్టుంది.

నలు దిక్కులనుండీ భూపతులు వివిధ రకాల కానుకలు తెచ్చారు. చుట్టపక్కాలు, ఇంకా అభిమానమున్న రాజులు కూడా ద్రవ్య రాసుల్నీ - మేలిమి వస్తువుల్నీ మోసుకొచ్చారు. వీటినన్నిటినీ చూచి, ఆ పట్టణంలో వుండే అమ్మలక్కలంతా అదంతా చూచి - 'అమ్మక్క' అని ముక్కు మీద వేలు వేసుకున్నారు.

దైవజ్ఞులైన పురోహితులు చెప్పినట్టుగా మంగళస్నానం చేసి, సహధర్మచారిణియైన ద్రౌపదితో దీక్షితుడై యజ్ఞ ప్రారంభం కావించాడు; అయితే ముందుగా శాస్త్రప్రకారం అగ్రపూజ చేయాలి. ఆ పూజార్హులెవ్వరా అని మల్లగుల్లాలు పడుతున్నాడు - చిట్టచివరకు అతనికి ఒక ఆలోచన వచ్చింది.

"ఎల్లప్పుడూ కంటికి రెప్పలా మమ్మల్ని కాపాడే కృష్ణుడున్నాడు గదా! ఆ మహానుభావుడు మా పట్ల ఎంతో దయాదాక్షిణ్య భావంతో మెలుగుతూ వుంటాడు అట్లాంటి వెన్నుణ్ణి సంప్రీతుణ్ణి చేసి సంతోషించే భాగ్యం కంటే, నాకీ ధాత్రిలో వేరే యింకో

ధర్మమింకేముంది? నా కంటే బలవంతులైన ధరాధిపతులెందరు లేరు? నాకంటే శౌర్య సమర్థులైన భూపాలకులెందరు లేరు? నా కంటె ఉగ్ర రణ కోవిదులైన జనపాలకులెందరు లేరు? నాకంటె ధైర్యవంతులైన పృథివీపతులెందరు లేరు? నాకంటె ధర్మాత్ములైన భోజులెందరు లేరు? ఇందరుండగా, సకల ధరణీకోవిదులు - స్వర్గలోక నివాసులూ ఆశ్చర్యచకితులై చూస్తూ వుండగా అనన్య సాధ్యమైన ఈ రాజసూయ యాగం నాచేత చేయిస్తున్నాడు గదా! అందుకే ఈ నిండుసభలో కృష్ణుణ్ణి పూజించి, కృతజ్ఞతను ప్రకటించి, కృతకృత్యుణ్ణవుతా. ప్రతిపక్షాలతో నాకేమి పని?" అని ధర్మరాజు తన మనస్సులో నిర్ధారించుకున్నాడు.

సంపూర్ణోత్సుకత్వంతో పూజా ద్రవ్యాలన్నీ సంగ్రహించుకొన్నాడు. సద్భక్తితో కృష్ణుడి పాదపద్మాలను పూజించాడు.

ఆ పూజా కార్యక్రమం చూచి- కొంతమంది సంతోషించారు. మరి కొంతమంది మనకెందుకులే అని మౌన ముద్ర దాల్చి కూర్చున్నారు. ఇంకా కొంతమంది బాధపడ్డారు. వాళ్ళందరినీ అదిలించి, కాదని చేది దేశాధిపతి శిశుపాలుడు ధర్మజుణ్ణి చూచి -

"ఔరా ధర్మజా! యింతకాలం, ధర్మరాజువుగా బెట్టుగా వున్నావు. ఇట్లాగే వుంటే సరిపోయేది. నీవు కావించిన ఈ వృద్ధ సేవ యెంత గందరగోళానికి దారితీసింది! ఈ విషయం నీకు తెలియదా? ఇప్పటిదాకా వున్న నీ పేరు ప్రతిష్ఠలన్నీ ఈ దెబ్బతో నాశనమయ్యాయి. వెంగలివాడవై నావు. కృష్ణుడికి ఈ సభా గౌరవాన్ని ఎందుకు కట్టబెట్టావు? ఇటువంటివి యింతకు ముందు కన్నామా? విన్నామా? చాలా చిత్రంగా వుంది.

ఈ కృష్ణుడు క్షత్రియ వీరుడని గౌరవించి కాళ్ళు కడిగి పూజించావా? అదుగో అందుకు సుక్షత్రియ వీరుడైన దుర్యోధనుడున్నాడు; ఆచార్యుడు గదా! అని ఆలోచించి అర్చించావా? అదుగో అందుకర్హుడు లోకపూజ్యుడు గంగా సూతుడున్నాడు; అందరికంటే వృద్ధుడు కదా అని పెద్దగా యోచించి సేవించావా? అదుగో దానికి తగిన వృద్ధుడు బాహ్లికుడున్నాడు; సకల వేద వేదాంగ విద్యా పారంగతుడని ఈతణ్ణి కొలిచావా? అదుగో విశ్వ సన్నుతుడు వేద విభాగ కర్త వేదవ్యాసుడున్నాడు! నీవు పూజించిన యాదవునకు - కులం లేదు - జాతి లేదు - ధర్మమంటే తెలియదు. ఆచార్యత్వమంటే అసలే యెరుగడు- ఇట్లాంటివాణ్ణి ఎందుకు పూజించాలి? సభికులందరికీ తలవంపులు గాదా!

భూమీశా! నిన్న మొన్నటి దాకా యదుకులం మ్లేచ్ఛ జాతిగా వుంది. నీకీ విషయం తెలియదా? అట్లాంటి వాడికి ఈ సభా ముఖంలో అగ్రపూజనిచ్చి పూజ్యులనందరినీ అగౌరవపరుస్తావా? ఉత్తమ రాజ వంశ సంజాతులకందరికీ తలవంపులు కలిగించావు. నీ చిత్తమేమిటో ఈనాటికి తెలిసింది. ఇది ధర్మమంటావా? ఎంతమందో నిన్ను మెత్తని

పులి అని అంటారు. ఇదంతా తెలిసి కూడా భీష్ముడు నోరు తెరచి వొక పల్కును కూడా పలకడు. మూగలాగున్నాడు; ఎందుచేతనో కారణం తెలియదు.

సభికులంతా తమలో తాము గుసగుసలాడుతున్నారే గాని, ధైర్యంగా 'ఇది తప్పు' అని ఒక్కడూ విడిచి పల్కడు. ఆహా! ఇట్లాంటి సభికులెక్కడైనా వుంటారా! యింత పిరికితనం ఎందుకో! ఒకవేళ నీ చుట్టం గదా! అనుకొంటే, చుట్టంచూపుగా చూచి షడ్ర సోపేతంగా విందారగింపచేయి, వివిధ వస్త్రాలంకార భూషితుణ్ణి చేయి, అంతేగాని, యింతమంది పెద్దల యెదుట బుద్ధిమాలి గొల్లవారింటి గజదొంగను పూజించటమేమిటి? ఇంతైనా బిడియం అవసరం లేదా?

కృష్ణుడికే అగ్రపూజ చేసి గౌరవింప దలచుకొన్నవాడివి, మమ్మల్నందరినీ ఎందుకు పిలిపించావు? ఈ సభా ముఖంగా అందరినీ ఎందుకవమానపరిచావు? చీటికీ మాటికీ యిట్లా మాయోపాయాలు చేయటం మంచిదనుకొన్నావా?" అన్నాడు.

శిశుపాలుడు తన యిష్టం వచ్చినట్టు వాచాలత్వంతో మాట్లాడడం సభికులంతా విన్నారు. సభలో కోలాహలం చెలరేగింది.

అంతట్లో తోక తొక్కిన మహా కాలసర్పంలాగా బుసకొడుతూ అతి కోపంతో సహదేవుడు లేచి నిలువబడ్డాడు.

"ఓయీ! మూర్ఖా! శిశుపాలా! సభా ముఖంలో నీ యిష్టం వచ్చినట్టు కారుకూతలు కూస్తున్నావు. బ్రాహ్మణవర్యులు - క్షత్రియ వీరులు- ఉద్దండ పండితులు ఈ సభా ప్రాంగణంలో వున్నారన్న యింగితమే లేదా. మమ్మల్ని కాదని యిక్కడ ఎవడైనా నోటికి వచ్చినట్టు ప్రల్లదాలు పలికితే, పంతంతో అతన్ని తన్ని పంపిస్తాం; ఈ సంగతి తెలుసో, తెలియదో! ఓరీ! నీచాధమా! నీవు కూడా పెద్దల లాగే ధర్మాలు చెపుతున్నావు. ఇది నీకు చెల్లుతోందా! తక్షణం ఇక్కడ నుంచి పో! ఇంతమంది పెద్దలున్న సభలో ఆలోచించకుండా మాట్లాడడం తగదు"

సహదేవుని వాక్కులు విన్నాడు శిశుపాలుడు. సహనం చచ్చి పోయింది అతడిలో. సంభ్రమంతో వివశుడయ్యాడు. అహమహమికతో పాండవ కనిష్ఠుణ్ణి చూచి-

"ఓరీ! సహదేవా! తంతానని పైకెత్తిన కాలిని సభలో వున్న పెద్దలంతా చూస్తూ వుండగా, నా చిక్కుటంతో ఖండఖండాలు గావిస్తా. అనవసరంగా ప్రల్లదాలు పలికితే ప్రయోజనమేముంది? నన్ను తన్నగల శక్తి నీ దగ్గర వుందా? ఏదీ చూద్దాం! నాకు తెలియకడుగుతా నీయన్నలు దగ్గర లేకుండానే తన్నగలవా?

తంతానని పెద్దగా బీరాలు పలికి మాట తప్పి దద్దమ్మలాగా సభలో కూర్చున్నవాణ్ణి పెద్దలెవ్వరూ సహించరు. తన్నటమో - తన్నించుకోవటమో నీకు తప్పదు.

ముగ్గురు దొంగవేషాలతో పోయి, మహానుభావుడు - ధర్మమూర్తి - నిర్మల

హృదయుడు - స్నేహశీలి - పరమ శివభక్తి పరాయణుడు అయిన మా మాగధ నరపాలుని అర్థరాత్రి మూగి దబ్బాటుగా చంపడం కాదురా మగతనం! ఎంత దూలి పల్కినా, యీ యాగంలో మీ ఆగాన్ని సాగనిస్తామనుకొన్నావా?

ఓరి! చెడుగా! నీలాంటి పిరికి వెధవలకు శిశుపాలునితో పోరాటం శక్యమా? అది నీతరం గాదురా! శశిధరుడంతటివాడే నా బారి పడి వివశుడయ్యాడన్న సంగతి మూర్ఖుడవైన నీకేం తెలుసు?" అని గంభీరంగా పలికాడు.

'ధర్మ నిర్ణేతలు ధర్మం తెలిసి కూడా ధర్మ నిర్ణయం చేయకుండా అధర్మాన్ని సాగనిస్తున్నారు. ఇక యిక్కడ వుండడం మంచిది గాదు' అని అనుకొని శిశుపాలుడు లేచిపోవటానికి సిద్ధమయ్యాడు. ఈ సంగతి తెలిసిన ధర్మరాజు శిశుపాలుణ్ణి వెంబడించి, నచ్చచెప్పి తీసుకుని వచ్చాడు.

అయినా శిశుపాలుడు జరుగుతున్న అధర్మాన్ని సహించలేక, పరుష వాక్యాలు పలకడం ఆపలేదు. దానికి భీముడు రోష కషాయితుడై, భుజాల చరచి యుద్ధానికి అతనితో సిద్ధమయ్యాడు. భీష్ముడు దాన్ని గమనించాడు. భీముణ్ణి వారించి, అదిమి పట్టుకుని కూర్చుండబెట్టాడు.

"శిశుపాలుడు సామాన్యుడనుకొన్నావా? అతడు నీకసాధ్యుడు. ఊరుకో" అని తన ప్రయత్నం నుండి విరమింపచేశాడు.

చేది ధరణీపతి పరుష వాక్యాలకు - వీర వీక్యాలకు - ఎత్తిపొడుపులకు - యాదవ పాంచాలుర మనస్సు సంక్షుభితమైంది. అటు చైద్యులు యుద్ధం చేయటానికి సిద్ధమవుతున్నారు. సభంతా అల్ల కల్లోలంగా వుంది. ఈ సందడిని కనిపెట్టి, శిశుపాలుడు అజాగ్రత్తగా వుండడం కూడా చూచాడు కృష్ణుడు.

తన ఎగుమూపునకు తగిలించిన చక్రాన్ని నేర్పుతో తీసి దాని ధారతో శిశుపాలుడి శిరస్సు తెగిపడేట్టు వున్న చోటు నుండే ఎవరికీ తెలియకుండా ప్రయోగించాడు. సభంతా విస్తుపోయి చూచి ఎక్కడి వాళ్ళక్కడ చెదరిపోయారు.

ఇట్లు ధర్మరాజు రాజసూయ యాగాన్ని పరిసమాప్తి గావించాడు. దూర దేశాల నుండి వచ్చిన రాజుల్ని - బంధువుల్ని సాగనంపాడు. యాగ నిర్వహణ వల్ల ఆనందం మాత్రం అతనికి కలగలేదు.

కాని, కృష్ణుడు మాత్రం సంతసించాడు. రాజసూయయాగ నెపంతో జరాసంధుడు - శిశుపాలుడు - తనకడ్డం లేకుండా పోయారు. తనకిక కష్టాలు రావని మనస్సులో భావించి, ఉల్లాసభరితుడయ్యాడు.

మగధ రాజు జరాసంధ వధ - చేది భూపతి శిశుపాలుడి హత్య - ఈ రెండు పెక్కుమందితో విరోధాన్ని తెచ్చిపెట్టాయి. కురురాజు మానసము రాజసూయయాగాన్ని

తిలకించి కలత చెందింది. ఇక మా యిక్కట్లన్నీ తొలగిపోయాయి గదా! అని కృష్ణుడు ధర్మరాజు దగ్గర సెలవు తీసుకొని ద్వారకకు సంతోషంతో చేరాడు.

ద్వారకా నగరం చేరి తల్లిదండ్రుల్ని, అన్నదమ్ముల్ని- బిడ్డల్ని చూస్తూ కొన్ని నెలలు ప్రశాంతంగా గడిపాడు. ఈ కాలంలో ఎక్కడా ధనుర్జ్యావర్న టంకారాలు వినపడలేదు. మత్తు మదించిన ఏన్గుల ఘీంకారాలు చెవిని సోకలేదు. యుద్ధ భేరీభాంకారాల భీషణ ఘోష లేదు. శంఖారావాలకు అవకాశమే లేకుండా పోయింది.

ఇట్లా వుండగానింతలో, కృష్ణుడు చైద్యుడైన శిశుపాలుణ్ణి చంపాడని సాళ్వుడనే ద్రావిడ రాజుకి తెలిసింది. దానికి సాళ్వుడు కోపోద్దీపిత మనస్కుడై - "యుద్ధ రంగంలో కృష్ణుణ్ణి చంపి శిశుపాలుడి ఋణం తీర్చుకుంటా. ఈ ఉద్యమంలో నా ప్రాణాలను కానుకగా సమర్పిస్తా - ఎవ్వరడ్డుపడ్డా కృష్ణుడి అంతు తేల్చుకోకుండా వుండను. శిశుపాలుని మరణం ద్రావిడ జాతి శౌర్య ప్రతాపాలను ఇంకింపచేస్తుందా?

ఈ కృష్ణుడెప్పుడు ఇట్లాంటివాడే. వీడి సంగతి ఎవరికి తెలియదు? ఈతనికే విషయంలోనూ తప్పులనేవి లేవు. శూర కులంలో పుట్టినప్పటికిని శూరుల ధర్మాలేమాత్రమూ తెలియదు. రణ ధర్మాన్ని పాటించదు. వీడు బ్రతికి వుంటే, చాలా ప్రమాదం సంభవిస్తుంది.

మచ్చరంతో కృష్ణుణ్ణి చంపడమో? లేక యుద్ధ రంగంలో నేనే మరణించడమో జరగాలి" అని తలచి వెంటనే సాళ్వభూపాలుడు దేవతాజాతి గుమిగూడి అచ్చెరువొందేట్టు యుద్ధ సన్నద్ధుడయ్యాడు.

"ప్రళయ తాండవమాడిస్తా. ముక్కలు ముక్కలైన రథ సమూహాలు - ఆయుధ తండాలు - విశీర్ణ దేహఖండాలు - రక్త పంకం అయిన రణస్థలి, నక్కలు విహరించే భోగ భూమిగా మారుస్తా - అని కృతనిశ్చయుడయ్యాడు సాళ్వుడు.

సౌరభాకవిమాన నగరాన్ని యుద్ధానికి సజ్జీకృతం చేశాడు. రథ గజ తురగ పదాతి సైన్యాన్ని ఎక్కించి పదిలపరిచాడు. ఆయుధాగా రాలన్నింటిని శస్త్రాస్త్ర వివిధాయుధాలతో నింపివైచాడు. స్త్రీలను, బాలురను, వృద్ధ జనాలను వాహనం ఎక్కకుండా దించివైచాడు. అతి మెలకువతో మేఘ మండలిపైకి ఎగసేట్టు చేశాడు. తర్వాత సాళ్వుడధిరోహించాడా విమానాన్ని. సాళ్వ ధరణీపతి ఎక్కిన మరుక్షణమే చండభయద మేఘగర్జన వోలె భేరికాభాంకార ధ్వనులు రోదసీ గహ్వరంలో ప్రతినినదించాయి, జైత్రయాత్రా సమరోత్సాహం వెల్లివిరిసింది.

యాదవ సేనావాహినికూడా సముద్ర తీరంలో సాళ్వుడి సేననెదిరించి, తలపడి భీకర రణం చేయసాగింది. ఒకరినొకరు లెక్కపెట్టటం లేదు. పరాకును పొందడం లేదు, పరస్పరం జయాభిలాషతో సమర రంగంలో నిలబడి వెనుదీయక పోరు

సల్పుతున్నారు. రోజులు – వారాలు నెలలు గడచిపోయాయి. విజయం ఎవరికీ దక్కలేదు.

ఇట్లా ఘోర భీకర సంగ్రామం ఆరు నెలలు సాగింది. కృష్ణుడు మాయోపాయంతో సాళ్వుణ్ణి కూల్చాడు. సౌరభాకవిమాన నగరం సముద్రంలో తన విభునితో పాటే కూలిపోయింది.

యాదవ సాళ్వ వీరులు భయద భీకర రణం సల్పుతున్న సమయంలోనే అక్కడ ఇంద్రప్రస్థంలో ధర్మరాజు జూదమాడి రాజ్యాన్ని- తమ్ముళ్ళనూ- భార్య ద్రౌపదినీ - సర్వస్వాన్నీ వోడిపోయాడు. దుర్యోధనుడు ద్రౌపదిని సభకి పిలిపించాడు.

ద్రౌపదిని సభకీడిపించి, దుర్యోధనుడు వస్త్రాపహరణం కావించే సమయంలో కాపాడేవాళ్ళెవరూ లేకపోయారు. భోరున వలవల యేడ్చింది. కృష్ణుడు సాళ్వుడితో యుద్ధం చేస్తున్నాడు. తానే చావుబ్రతుకుల్లో వుండి, సాళ్వుణ్ణి హతమార్చడమెట్లా అనే ఆలోచనలో విచార మనస్కుడై వున్నాడు.

# పౌండ్రక వాసుదేవుడు

వాసుదేవుడనే ద్రావిడ ప్రభువు వున్నాడు. ఈతడు మహా పరాక్రమశాలి. అరివీర భయంకరుడు. గండరగండడు. మానధనాగ్ర యాయి. పుండ్రక జాతి కులపతి.

ఒకనాడు తన చారుణ్ణి పిలిచి, తాను చెప్పమన్నట్లు చెప్పమని కొన్ని మాటలు చెప్పి కృష్ణుడి వద్దకు పంపాడు.

"గోపీకుచాలంకరిష్ట! కృష్ణ! నీకు వాసుదేవుడను పేరు కావలసి వచ్చిందా! నేనూ వాసుదేవుణ్ణి; నీవూ వాసుదేవుడవేనా? నీకు శంఖ చక్రాలు ఆయుధాలుగా వుండాలా? ఔరౌర! ఇంతలోనే ఎంతవాడవయ్యావు?

ఓరీ కృష్ణ! ఏమిటి? నీ గురించి చాలా వింటున్నా. చిత్ర విచిత్రాలు చాలా చేస్తున్నావంట! నా పేరే పెట్టుకున్నావట కావాలని; అంతేగాక, శంఖ చక్రాలు నా మీద వైరంతోనే ధరించావట! నీకేమన్నా మతిపోయిందా! బ్రతుకు మీద ఆశ లేదా! నాతో యింత వైరం ఎందుకు పెట్టుకొంటున్నావు? నీకు పేరు ప్రతిష్ఠలు కావాలా? అనవసరంగా మొండి పట్టు విడిచి నా పేరు విడిచిపెట్టు; శంఖచక్రాలు ధరించటం కూడా మానివేయి. అట్లా విడిచిపెట్టకపోతే, సహించేది లేదు. శత్రురాజులంతా నా పేరే తలచేట్లు భీషణ రణాన నీ శరీరాన్ని వాడిగల బాణ పరంపరతో తట్టు పోయిస్తా. రక్తవాహిని నీ శరీరం నుండి కాల్వలై పారుతుంది. నీ మదం అణుస్తా. నీ పేరు మాసిపోతుంది."

పౌండ్రక వాసుదేవుడు తన చారుని ద్వారా పంపిన సమాచారాన్ని శ్రీకృష్ణుడు విచారం లేకుండానే విన్నాడు. తన యాదవ వీరులందరినీ పిలిచి, ఆ వృత్తాంతాన్ని చక్కగా విప్పి చెప్పాడు. గోచార ఫలం చూచుకొన్నాడు, తన వీరులనందిరినీ వాకబు చేశాడు.

శత్రువీర భయుడుగా సైన్యాన్ని కూర్చుకొని సమర రంగానికి భూరి సైన్య సంచారంతో బయలుదేరి వెళ్ళాడు.

పౌండ్రక వాసుదేవుడును గండు పులిలా గ్రుడ్లు తిప్పుతూ, గాండ్రని బొబ్బరింతలు పెడుతూ అతిశయించిన వేగంతో, ఒక దెబ్బతో తెగనరుకుతానని పలుకుతూ యాదవ వాసుదేవుణ్ణి ఢీకొన్నాడు. "వాళ్ళు - వీళ్ళు వస్తే నేను సహిస్తానా!" అంటూ బొబ్బరింతలు పెడుతూ ఎదుర్కొ న్నాడు.

వాసుదేవద్వయం యుద్ధరంగంలో తలపడ్డారు. లాఘవంతో శర సంధానం చేసి, సవ్యాపసవ్యంగా ఒకరికొకరు తీసిపోకుండా భుజబల దర్పం ప్రదర్శితమయ్యేట్టుగా, ఎవరికి వాళ్ళే దీటన్నట్టు పోరు సల్పుతున్నారు. వాళ్ళ యుద్ధ నైపుణ్యం చూస్తూ, ఉభయ పక్షాల వీరులు యుద్ధం మాట మరచి తదేక దీక్షతో తిలకిస్తున్నారు. జయలక్ష్మి తూగుటుయ్యాల ఎవరి దెసకు వచ్చి ఆగుతుందోనని వీరులుభయపక్షాలవాళ్ళు సందేహంలో పడ్డారు. రోజులు గడిచినా ఫలితం కనిపించలేదు,.

ఇట్లా వుండగా, శౌరి గర్జించి, అమేయ శక్తి పటిమ కనబరచి పౌండ్రక వాసుదేవుడి శిరస్సును తన చక్ర ధారాహతితో నేల దొరిలేట్టు చేశాడు. పౌండ్రక భూపతి అసువులు వీడాడు. తక్కిన పుర ప్రజలు వీరులు ధరణిపై దొరలి పొరలాడారు.

యాదవ వీరుడు కృష్ణుడీ విధంగా ద్రావిడ లోకంలో వున్న దొరల్ని ఒక్కొక్కరిని బట్టుకొని చతురత్వంతో చతురోపాయాలు ప్రయోగించి, నాశనం చేసి, ఎదురులేక నిర్జిత శత్రువై ప్రశాంతంగా ఏ దిగులు లేక కాలక్షేపం చేస్తున్నాడు.

ఇక ఆర్యలోకంలో తన మంత్రాంగం నాటిన విభేద బీజం మొలకెత్తి, వృక్షమై శాఖోపశాఖలతో ఎట్లా విస్తరిస్తుందా? అని ఆలోచిస్తున్నాడు.

# కృష్ణుని రాయబారం

జూదమాడడానికి దుర్యోధనుడు ధర్మరాజును పిలువనంపాడు. పిలిచిన వెంటనే - 'ఇది క్షత్రియధర్మం గదా...' అన్న వంకతో తనకున్న జూదమందలి వ్యసనాన్ని ప్రకటించటం కోసం వెళ్ళాడు ధర్మజుడు.

ధర్మరాజు అక్ష విద్యలో మంచి నేర్పు గలవాడు. ఈ సమయంలో తన జూద క్రీడా పాండిత్యం చూపించవచ్చునని భావించాడు. అంతకు ముందు పొందిన అపజయం వల్ల బాధపడుతూ, ఈ నెపంతో కురురాజ్యాన్ని, దాని వైభవాన్ని మొత్తాన్ని కొల్లగొట్టవచ్చునని ఆలోచించాడు. ఆ జూదంలో పందెం గూడా దురాశతో పరస్పరం కాచుకున్నారు. పన్నెండేళ్ళు అరణ్యవాసం - ఒకయేడు అజ్ఞాతవాసం - ఓడిపోయినవాళ్ళు పాటించాలని పణం పెట్టుకొని, నిండు సభలోనే నిర్ణయించుకుని జూదానికి సిద్ధమయ్యాడు

ధర్మజుడు. దుర్యోధనాదుల పక్షం - శకుని, పాండవుల పక్షం ధర్మరాజు జూదం ప్రారంభించారు. శకునితో జూదమాడి తన్నూ - సోదరుల్ని, ద్రౌపదిని, రాజ్యభాగాన్ని ఓడిపోయాడు. కట్టుబట్టలతో తమ్ములతో కూడి ప్రవాసదీక్ష సలపడానికి తక్షణమే బయలుదేరాడు.

అమితమైన వోర్పుతో, భయంకరాటవీ సీమలో నానా బాధలను భరించారు పన్నెండేళ్ళు. అంతకు మించిన సంయమనంతో అజ్ఞాతవాసాన్ని అసిధారావ్రతంగా గడిపి ఎట్లాగో ఉపప్లావ్యమనే పట్టణానికి చేరుకున్నారు.

తానూ, తన తమ్ముళ్ళూ, భార్యయైన ద్రౌపది - అంతా అక్కడే చేరారు. కాని, ఏం చేయాలో తోచలేదు. కాలహరణాన్ని సహించలేకపోతున్నారు.

బిడియపాటుతో - కలత చెందిన మనస్సుతో - పాలలో బడ్డ బల్లిలాగా తన్నుకులాడుతున్నాడు పాండవాగ్రజుడు. ఎడతెరిపి లేకుండా వూరికే అలోచించడం ప్రారంభించాడు; తమ రాజ్యాన్ని కౌరవులవద్ద నుంచి తిరిగి తీసుకోవడమెట్లాగా - పాలుపోవడం లేదు. బేలుపోయిన మనస్సుతో వున్నాడు.

ఇట్లు ఆలోచిస్తూ వుండగా ఓ వుపాయం తట్టింది అతనికి. మాయోపాయంతో తన కార్యాన్ని సాధించాలని తలచాడు.

"రణం -రణం - అని అంటే, ఇతర రాజులు గానీ, చుట్టపక్కాలు గానీ వస్తారో రారో? బహుశః యుద్ధం అంటే వెనుకాడతారేమో? ఏదో వొక వుపాయంతో అందరినీ యిక్కడకు రప్పించి, అందరినీ వుసిగొల్పాలి.

అభిమన్యుడి పెళ్ళి వుండనే వుంది. ఎటు దాన్ని రేపో మాపో చేయక తప్పదు. దీన్ని సాకుగా తీసుకుని అయినవాళ్ళనందరినీ - ఇతర రాజుల్నీ పిలిపిస్తా. ఏళ్ళైన తరువాత వచ్చిన బంధువుల సమక్షం లోనూ - రాజుల సమక్షంలోనూ మా గోడంతా వినిపిస్తా- బాగోగులన్నీ చక్కగా విచారించి, సామరస్యంతోటే సమస్యను పరిష్కరించి, మాకు సగభాగం ఇప్పించండని వేడుకొంటా.

ఇట్లా చెప్పి, పెళ్ళి పెద్దలందరినీ పోరు పెద్దలయేట్టు చేసి యుద్ధోన్ముఖుల గావిస్తా. విపుల సైన్య సమీకరణ గావించి రారాజు దుర్యోధనుడితో యుద్ధం చేయడం మంచిది.

వెంటనే మౌహూర్తికుల రప్పించి, ధర్మరాజు, అభిమన్యుడి పెళ్ళికి లగ్నం నిశ్చయించాడు. సమస్త బంధువర్గానికి - మిత్రులకూ - తెలిసిన వాళ్ళకు- తనకు హితులనుకునేవాళ్ళకూ - ఇతర రాజులకూ శుభలేఖలు పంపాడు. వాళ్ళ రాక కోసం ఎదురుతెన్నులు చూస్తున్నాడు.

కౌంతేయాగ్రజుడంపిన శుభలేఖలందుకొన్న బంధుమిత్రులు, ఇతర రాజులును సంతోషంతో, ఏమీ ఆలోచించకుండా ప్రయాణమై గుంపులు గుంపులుగా పరివార

సమేతులై వచ్చి దండు విడిచారు. ఆ జన సందోహంతో క్రిక్కిరిసిన ఉపప్లావ్య నగరం కిటకిటలాడజొచ్చింది.

కుంతిభోజుల్లో కొంతమంది, కుంతీదేవి అన్నదమ్ములు, మాద్రిదేవి సోదరుడు శల్యుడు ఇంకా కొద్దిమంది మాత్రం ఏ కారణం వల్లనో శుభలేఖలందినా పెళ్ళికి రాలేదు. పాండవులతో పల్కనైనా పల్కలేదు.

అక్కడకు చేరిన రాజులంతా మదగర్వంతో కళ్ళకు కొవ్వెగదట్టి బిత్తరించి చిత్తం వచ్చినట్టు మాట్లడడం మొదలుపెట్టారు. 'ఈ క్షత్రియ వీర లోకంలో - మాతో సమానులెవ్వరూ లేరన్నట్లుగా మీసాలు దువ్వుతున్నారు కొందరు. మీసాలు మెలి వేస్తున్నారు మరి కొందరు. అంతా ఎవరి ఆవేశం కొద్దీ వాళ్ళు రోషపు మాటలు, దురుసుతనంతోడి దుందుడుకు ప్రగల్భాలు పలుకుతూ ఒకళ్ళను మించి వొకళ్ళు యిష్టం వచ్చినట్లుగా విపరీతంగా మాటలతో సొరకాయలు తెగ కోస్తున్నారు.

అందరితోపాటే, అభిమన్యుడి పెళ్ళి శుభలేఖ ద్వారకా నగరానికి కూడా వోయింది. పెళ్ళి కబురందగానే కృష్ణుడు సంబరంతో తన మనోనేత్రముతో అంతా పారజూచాడు. పాండవులు దగ్గరకు పెళ్ళికి పోవడం మంచిదని నిర్ధారణ చేసుకున్నాడు. ప్రయాణమై సారథిని, దారుకుణ్ణి పిలిచాడు.

వెంటనే దారుకుడు కౌమోదకి - నందకం - సుదర్శనాలను ఎంతో జాగ్రత్తగా భద్రపరిచాడు. శుభ లక్షణలక్షితాయిన శైబ్య - సుగ్రీవ - మేఘ - పుష్ప - లాహకాలనే గుర్రాల నైదింటిని రథానికి పూన్చాడు. శత్రులోక దుర్నిరీక్ష్యమైన, దుర్వారమైన, క్రూరమైన గరుడ పతాకాన్ని కట్టాడు. ఇటు రథాన్ని సజ్జీకృతం చేసి, తాను రథ చోదకుడై దారుకుడు దాన్ని కృష్ణుడి ముందు పెట్టాడు.

బలరాముడు - కృతవర్మ - సాత్యకి - తనకు తోడు రాగా బయలుదేరి ఉపప్లావ్యానికి ప్రయాణమై రథాన్ని అధిరోహించాడు వాసుదేవుడు. వస్తూ వస్తూ దారిలో భవిష్యత్ కార్యక్రమాన్ని గూర్చి తనలో తానే నిర్ణయించుకొన్నాడు.

"ఆర్య సంఘంలో భయంకరమైన విద్వేషాగ్ని రగులుకొంది. దాన్నెట్లాగైనా చల్లారకుండా చేయాలి. ఈ వైరాగ్ని చల్లారకుండా కాపాడు కోగలిగితే, ఆశించిన ఫలితం వస్తుంది. ఏ విధంగానైనా రంధి గావించి సంధిని చెడగొడతా.

సంధి నియమాలు విన్న లోకం బాహ్యదృష్టితో పరికించి భళి...! భళీ...! అని మెచ్చుకోవాలి. సంధి మాత్రం కుదరకుండా పోవాలి. లోకానికి రాజనీతి నైపుణ్యం అంటే ఏమిటో ఈరోజునే చూపిస్తా.

నేను తలపెట్టిన కార్యానికి ఉపోద్ఘలాలుగా పరిస్థితులు చాలా కనిపిస్తున్నాయి.

పాంచాల గణానికి బ్రాహ్మణులకు విరోధం వుంది. అందులో విద్యాగురువైన ద్రోణుడు

పాంచాల భూపతి ద్రుపదుడితో బద్ధ వైరంతో మెలగుతున్నాడు. ద్రోణుడు గురుదక్షిణ పేరుతో తన పట్టణాలైన మాకంది - మారణవతం అనే పట్టణాలను కౌరవ పాండవులతో ఆక్రమింప చేయటం తెలిసి కూడా మానధనుడైన ద్రుపదుడు ఏమీ చేయకుండా, జీవచ్ఛవంలాగా బ్రతుకునీడుస్తున్నాడు.

కౌరవ పాండవ వీరులు ద్రుపదుణ్ణి చావబాది ఈ రెండు పట్టణాలను అపహరించడం మా కందరికీ తెలిసిందే. అప్పటి నుండి ఈ రెండు నగరాలు ద్రోణుడి వశంలోనే వున్నాయి.

ఇక దుర్మదుడైన సూర్యనందనుడు కర్ణుడు అంతకు ముందేనాడో మమ్మల్ని వోడించి మా పట్టణమైన కుశస్థలిని భుజబలంతో ఆక్రమించాడు. అది కూడా వాళ్ళ అధీనంలో నాటినుంచే వుంది ఆ విషయం ఈనాటికీ మాకు మర్మభేదకంగా వుండి గుర్తుకు వచ్చినప్పుడల్లా మా మనస్సులను కలచివేస్తుంది. ధర్మరాజును సమ్మతింపజేసి, నేర్పుతో దాన్ని గ్రహించడం మంచిది.

కాబట్టి, మాకంది - వారణావతం - వృకస్థలి - కుశస్థలి - అనే నాలుగూళ్ళు- వీటితో కలిపి ఇంకా ఏదైనా వొక పట్టణం కలిపి మొత్తం ఐదూళ్ళనిస్తే తప్పకుండా సంధి అవుతుందని జంకూ గొంకూ లేకుండా సభామండలి సమక్షంలో చెప్తుతా- దీనివల్ల చాలా ప్రయోజనం కలుగుతుంది.

ఐదూళ్ళడిగితే, ఇందులో పాంచాలురకు చెందిన మాకంది - వారణావతం అనే పట్టణాలున్నాయి కాబట్టి స్వార్థ పరాయణత్వం వల్ల తప్పకుండా పాంచాలురంతా నా పట్ల మొగ్గుచూపుతారు. ఏ మాత్రం సంకోచించరు. నన్ను కొలవటానికైనా వెనుదీయరు. నా పట్ల ప్రేమను, అభిమానాన్ని చూపుతారు. ఇక సభలో మమ్మెదిరించగల వీరులెవ్వరూ వుండరు.

నేను ఐదూళ్ళనడిగిస్తా; అంతే మోతాదులో - చాల గట్టిగా ఐదూళ్ళను గూడ ఈయనని కురురాజుచేత అనిపిస్తా - ఇందులో వీసమంతైనా నా దోషం కొంచెం కూడా కనిపించకుండా నటిస్తా; కప్పిపుచ్చుతా; నా రాజనీతి కొంచెం కూడా బహిర్గతం కాకుండా రాజరాజుతో రాయబారం నడుపుతా. సమస్త రాజలోకం నా రాజనీతి నైపుణ్యాన్ని చూచి 'భళిరా' అని మెచ్చుకొనేట్టు నా శక్తి యావత్తు చూపిస్తా.

భయ భీతులతో కౌరవులు పాండవులతో సంధి చేసుకుని ఐదూళ్ళిచ్చినచో ఒక మేలు కలుగుతుంది. అట్లా ఈయకపోతే, రెండు రకాల మేళ్ళు కలుగుతాయి. ఏ రకంగా చూచినా యిందులో లగ్గే గాని ఎగ్గు లేదు.

కృష్ణుడిట్లా తర్కించుకొంటూ, బలరామ, కృతవర్మ, సాత్యకీ సహితుడై వుపప్లావ్యానికి చేరాడు. తన రాక కోసం ఎదురుచూస్తున్న రాజలోకాన్ని సమాదరించాడు. పాండవులను

కుశల ప్రశ్నలు వేశాడు. రాజహంసలా తిరుగుతూ కొంతసేపు ఇష్టాగోష్ఠితో పొద్దుపుచ్చాడు. అభిమన్యుడి పెళ్ళి ముచ్చటలు తీరిన తరువాత ధర్మరాజుతో ఏకాంతంలో సంధి విషయం గురించి చాలాసేపు, చర్చించి, అతణ్ణి మెత్తపరిచాడు. ఐదూళ్ళనడగడానికి ధర్మనందనుణ్ణి యిష్టపరచి, నిండు ఉలగంలో దీన్ని నిర్ధారణ చేయటం మంచిదని వూహించి, ఏమీ తెలియని వాడిలా మిన్నకున్నాడు.

ఆ మరుసటి రోజే నిండు సభలో రాజులు కొల్వుదీరారు. తమ తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు. ఈ జన్మలో పాండవులు పడ్డ భంగపాటును తలపోశారు. ఇక యుద్ధం తప్పదనీ, పృథాభిమాని, కురురాజు తాను ఎవరెన్ని చెప్పినా, ఏ రకంగానూ రాజ్యభాగం పంచిపెట్టడనీ అన్నారు . ఇట్లు రకరకాలుగా అక్కడ చేరిన రాజులంతా కౌరవ నాధుడిపై అక్కసును వెళ్ళబోస్తూ ఆ మాటలూ– ఈ మాటలూ అన్నారు, అన్నీ విన్నాడు ధర్మరాజు. తాను కూడా చేరిన రాజ లోకాన్ని చూచి–

"ఓ పృథివీపతులారా! మీరింతకు ముందు ఎక్కడైనా, ఎప్పుడైనా కన్నారా? విన్నారా? రాజ్యాన్ని విడిచి, అందరూ అడవులకు పోయే పందెం జూదంలో పెట్టడం వుందా? మోసం చేయటానికే ఈ నియమం పెట్టి మమ్మల్నందరినీ అడవులకు పంపారు. అయినా, మేమా పందెపు నియమాన్ని పాటించి, దాన్ని నెరవేర్చి యిప్పుడు మీ అందరి సమక్షంలో ఈరీతిగా వున్నాం.

ఇంతకు ముందు జూదం లేదా? జూదంలో గెలిచిన శూరులు లేరా? ఏదీ, ఎవరైనా యిట్లా చేశారా? సుజనులైన వాళ్ళకు జూదంలో గెలిచిన గెలుపొక గెలుపా?

మీ అందరి ముందు చెప్పటానికి చాల సిగ్గుగా వుంది. రజస్వల –ఏక వస్త్రయైన స్త్రీని కొప్పు పట్టుకొని నిండు సభలోనికి ఈడ్చి తెచ్చి, పది మంది చూస్తూ వుండగా, ఎకసెక్కాలాడలేదా? ఏమాత్రమైనా సిగ్గు పడ్డారా ఈ పని చేయటానికి? ఇది కొవ్వు ఎగదట్టి చేసిన పని గాదా! ఈ యెగ్గులు రాచబిడ్డలైన వాళ్ళు సహిస్తారా? మీరే చెప్పండి.

పెద్దలైన ద్రోణ భీష్ములు, బాహ్లికాసోమదత్తులు అక్కడే వున్నారు. కాని వాళ్ళెవరూ జూదం ఆడడం మంచిది కాదని చెప్పలేదు. మేము ఒడ్డుతున్న వింత పందెం తెలిసి కూడా వారించలేదు. అయినా అంతా చూస్తూనే వున్నారు. వాళ్ళే గనుక వారించినట్టైతే, యిద్దరికీ సయోధ్య తొలగదు, పైగా సర్వనాశనకారకమైన యుద్ధం కూడా సంభవించదు.

జూదం ఆడినప్పుడు పందెంలో పెట్టుకొన్న షరతుల ప్రకారమే పన్నెండేళ్ళు అరణ్యవాసం, ఒక యేడు అజ్ఞాతవాసం గడపి, యెట్లో కష్టాలన్నీ అనుభవించి ఈనాటికి మిమ్మల్ని చూడగలిగాం. ఇక అంతా మీ దయ. మీరెట్లా చెబితే అట్లా చేస్తా. మీరే మాకు దిక్కుగా భావిస్తున్నాం.

మేమేమీ సమయం గదా అని లోకుల భాగమీయండని అడగడం లేదు, ఈ

రాజ్యమంతా మాకే కట్టబెట్టవలసిందిగా కూడా అడగడం లేదు. ఇతరుల రాజ్యాన్ని పంచిపెట్టమనైనా అడగడం లేదు, కాని, మా తండ్రి సంపాదించిన అర్ధభాగం మాత్రమే అడుగుతున్నాం.

రాజరాజు దగ్గరకు రాయబారం పంపి, అతడిచ్చిందేదో పుచ్చు కోవటమో, లేక యుద్ధం చేసి చేతబడిన భూమిని తీసుకుందామంటారో మీరే చెప్పండి" అని అన్నాడు.

ఈ మాటలు బలరాముడు విన్నాడు.

"ధర్మరాజా! బలాన్ని నమ్ముకొని సంధి యత్నం మానుకొని యుద్ధానికి కాలుదువ్వడం ధర్మం కాదు, రోషంతో ఈ పని చేస్తే, లోకులంతా మీదే దోషమని ఆడిపోసుకుంటారు. దీనివల్ల మేలు చేకూరదు. అన్నదమ్ముల బిడ్డలైన మీరు, ఒక పవిత్రమైన వంశంలో పుట్టి, భాగం పంచుకోలేక యుద్ధం చేశారన్న అపకీర్తి వస్తుంది. దీన్ని విన్నవాళ్ళు నవ్వుతారు.

కాబట్టి భాగమడగడానికి కౌరవుల పాలికి రాయబారాన్ని పంపు. సంధియైతే, మీకూ వాళ్ళకూ మేలు కలుగుతుంది. ఒకవేళ సంధి కాకపోతే, నాలుగు దిక్కుల్లో వున్న జనమంతా మిమ్మల్ని కొనియాడి, మీరే గెలవాలని నిస్సందేహంగా భావిస్తారు"

బలరాముడి ఈ మాటల్ని శినివరుడాలకించాడు. సభలోని వారినందరినీ ఒకసారి పరికించాడు.

"సుయోధనుడు మిక్కిలి లోభి. కర్ణుడు – సౌబలుడూ ఇద్దరూ అతనికి తోడున్నారు. అతడిక మనల్ని లెక్కపెట్టడు. రాయబారం పంపడం వృథా. యుద్ధమే శరణ్యమని నా యభిప్రాయం,

బంధు జనం మధ్య కలతలేర్పడ్డప్పుడు, నిద్రపోకుండా యేదో రకంగా యిద్దరికీ సంధి చేసి, అంతా సౌఖ్యంగా వుండాలని చూస్తాడు బలరాముడు. అతని మనస్సులో చెడ్డకు తావు లేదు; కల్లలేనివాడు – అమాయకుడు – బంధుజనప్రియుడు. సమభావుడు– కపటి గాదు; కాని, కార్యగతి పద్ధతి నెరుగడు. ఆయన మాటలకేమి గాని, కత్తిగట్టి పాలు పంచించితీరవలసిందే.

మన దండులో దండి మగలున్నారు. భయపడవలసిన పని లేదు; సంధికి పంపటం అనవసరం. భీకర రణరంగంలో శస్త్రాస్త్రముల బూని మన సైన్యం కురురాజ సైన్యాన్ని ఖండతుండాలుగా చేస్తుంది."

శశివరుడి మాటలు కృష్ణుడు విన్నాడు. ఆ మాటల్ని కాదనకుండా, సభలో నున్న భూమీశులంతా చెవులు రిక్కించి వినేట్టుగా, అందరి అభిమానాన్ని చూరగొనే విధంగా తాను మాట్లాడడం ప్రారంభిం చాడు.

"భూమీపతులారా! సంధి ప్రయత్నం మానుకోవద్దు. అట్లు చేస్తే లోకులంతా

పాండవులదే దోషమని దుమ్మెత్తి పోస్తారు. కాబట్టి ఆ ప్రయత్నం చేద్దాం. అయితే, మూర్ఖుడైన దుర్యోధనుడు సంధి కిష్టపడదు. ఇది తథ్యం; దీనివల్ల మనకే లాభం చేకూరుతుంది.

జనవాక్యం మనకనుకూలమవుతుంది. అదే గనుక జరిగితే, మనకెంతో బలం సమకూరుతుంది. అందుకని సంధి వద్దని యెందుకంటారు? సంధి మానవద్దు.

ధర్మరాజా! ఇక విషయం విను; రణకేళీ విదగ్ధులు - దుర్వార భుజబల సంపన్నులు - దుర్నిరీక్ష్య తేజోమూర్తులు - ద్రోణ భీష్ములు కౌరవ రాజపక్షాన వున్నారు. నీవు సంధియత్నం చేయకపోతే, వాళ్ళిద్దరూ కోపించి భీషణ సంగ్రామంలో వీరవిహారం చేస్తారు. అప్పుడెవ్వరితరమూ గాదు వాళ్ళ నడ్డుకోవడం. కాబట్టి వాళ్ళనేదోరకంగా లొంగదీయాలి.

కౌరవేశ్వరుడు కలుషాత్ముడై సంధి కిష్టపడకపోతే, ద్రోణ భీష్మ లాతన్ని ఏవగించుకుంటారు. మనపై పక్షపాతం వహించి, జాలిపడి యేమైనా మేలు చేయటానికి వీలుంటుంది."

అక్కడ చేరిన భూతల నాథులు - ధర్మసుతుడు- కృష్ణుడు చెప్పిందంతా విన్నారు. ఇదే మంచిదారి అని అంతా తలలూపారు. తరువాత నిండుసభ నుద్దేశించి ధర్మనందనుడు

"నరపతులారా! గతజల సేతుబంధనం మేలు కలిగించదు. ఇంతవరకు ఎన్నో కష్టాలనుభవించి కొన ప్రాణాలతో వున్నాం. అమేయమైన మీ భుజభక్తిని నమ్మి మా తండ్రి పాలు ఈయవలసిందిగా కోరుతున్నాం. మూర్ఖుడైన దుర్యోధనుడది కూడా యీయనని కారాలు ప్రేలుతున్నాడు.

మన పక్షంలో ఎంత గాలించి వెదికినా, కృష్ణుడికంటె వుపాయశాలి, ధీయుతుడు ఎవ్వరూ లేరు. అందుకే, దేవుడిపై భారం మోపి, ఆ మహానుభావుణ్ణి రాయబారిగా పంపుతున్నా" అని వినయంగా పలికాడు.

ఈ ప్రసంగమంతా కృష్ణుడు విన్నాడు. తన మంత్రాంగం పారిందని తెలుసుకొన్నాడు, లోలోన నంతసించాడు. దౌత్యం చేయటానికి అంగీకరించాడు. అందుకు కౌంతేయాగ్రజుడు సంతోష భారాక్రాంతచిత్తుడై -

"దేవా! కృష్ణా! దేవ గురువైన బృహస్పతి యంతటి వాడవు. నీకు నీతులు చెప్పలేము. అయినా, సంధికి పోయే ముందు మా మనోభిప్రాయాలను నీ ముందు పెడ్తున్నాము. వాటిని ఆలకించి, నీ యిష్టమెట్లాగో, అట్లాగే చేయి.

రాజోత్తములారా! పాండు భూపతి పుత్రులమైన మేము, మా తండ్రి భాగం ఈయండని కోరదగినవాళ్ళం కామా? ఇది తప్పు - అని చెప్పే పెద్దలెవరైనా యిక్కడ వున్నారా? తండ్రి సొత్తు మీద బిడ్డలకు ఆశ వుండదా? మాకు ఈ కోరిక వుండడం నేరమౌతుందా?

మా భాగం కోసం నిఖిల భూపాల చంద్రుల్ని నేలపాలు చేయము. యుద్ధ రంగంలో చచ్చిన భర్తల కోసం విలపించే భార్యలు, తండ్రులు చనిపోతే ఆక్రందించే బిడ్డలు, తనయులు మరణిస్తే తల్లడిల్లే తల్లులు - వీళ్ళ ఆక్రందనలు వియత్తలంలో ప్రతిధ్వనిస్తూ వుంటే రాజ్యాన్ని పాలిస్తామా! కాబట్టి మాధవా! సంధి చేయటం కోసం యింకా ఆలస్యం దేనికయ్యా!

ఒకవేళ కౌరవ భూతలేశ్వరుడు మా అర్ధభాగం పంచిపెట్టడానికి యిష్టపడకపోతే, అక్కడ పేరోలగంలో వున్న సమస్త ధరణీశ్వరులు వినేట్టుగా, నేనిప్పుడు చివరిగా చెప్పబోయే మాట చెప్పు

యుద్ధమంటే భయపడి వాళ్ళతో సంధికి దిగుతున్నామని భావించకు. కాని, యుద్ధం వల్ల వంశ క్షయమవుతుంది. ప్రాణ హాని సంభవిస్తుంది. అనవసరమైన ఈ వినాశనాన్ని తప్పించటానికే సంధి యత్నం. అందుకని కనీసం ఐదూళ్ళిచ్చినా సంధికి సిద్ధమౌతాం. మీ మాట కాదనం. ఆ గ్రామాలు కూడా ఏవని అనుకుంటారేమో - వినండి - వృకస్థలి - కుశస్థలి - మాకంది- వారణావతం - ఈ నాలుగింటితో పాటు ఇంకా ఏదైనా వాళ్ళకిష్టం వచ్చింది"- అని చెప్పి వూరుకొన్నాడు.

ధర్మరాజు మాటలు విన్న అక్కడి సభికులు పరిపరివిధాల గుసగుసలు పోయారు. 'ధర్మనందనుడింత పేదరికం చూపిస్తాడా?' అని కొందరు, 'ఆహా! ఈ ధర్మ తనయుడు ఎంత పాపభీతి కలవాడో' అని మరికొందరు, 'సాత్యకి - ధృష్టద్యుమ్నాది వీరులుండగా తనకింత పిరికితనమేంటి?' అని ఇంకా కొందరు, 'ధర్మజుడు సామాన్యుడు కాదు, ఇందులో ఏదో నిగూఢ రహస్యం ఇమిడి వుంటుంది' అని వేరే కొందరు భావించారు.

అక్కడే సభలో వున్న ద్రౌపది కూడా ధర్మరాజు మాటలు విన్నది. కౌంతేయాగ్రజుని మాటలు తన చెవిలో పడ్డాయో లేదో వెంటనే కస్సుబుస్సుమంటూ లేచి, మూతి ముకటించి, బొమలు ముడిచి కృష్ణుడితో పలికింది.

"కృష్ణా! ఏమరుపాటుతో పరధ్యానంగా వుండి సరిగా వినలేదు, రాజేంద్రుడు - ఏమని సంధి చేయమన్నాడు? చెప్పవా? సంధి మాటలు నేను వినగూడదా? కౌరవ రాజు కొలువుకు బోయి నిన్నేమని చెప్ప మన్నాడు? ఇదిగో - ఇట్లు - అని చెప్పితే ఆలకించి సంతోషిస్తా - ఆడువారికి భర్తతోడే లోకం గదా!

వాసుదేవా! నా భర్తలైదుగురూ నా దుఃఖాన్ని బాపకుండా మిన్నకుంటే నేనేమంటాను? ఇప్పుడిక్కడికి వచ్చిన రాజ బిడ్డలంతా ఏ మొగం పెట్టుకొని యిళ్ళకు వెళతారు. ఈ నేలలో ఆడువాళ్ళకు పుట్టగతులే లేవా? వాళ్ళు నన్నెంతలేసి మాటలన్నారో నీవెరుగవా? సభలో నన్ను పరచిన పాట్లు మరువగలనా? దాన్ని ఎక్కడైనా ఇల్లాండ్రు సహిస్తారా?

యుద్ధం చేయటానికి సిద్ధమై యిక్కడ రాజులంతా ఉత్సాహంతో పరవళ్ళు

తొక్కుతున్నారు. ఈ పరిస్థితుల్లో మన రాజు నిన్నేమని సంధి చేయమన్నాడు? ఏం కొంప మునిగిపోయిందని నీవిప్పుడు సంధి చేయటానికి రాయబారిగా కౌరవ రాజ సభకు వెళుతున్నావు? నాకు చెప్పవయ్యా!

ముడి కోక మాత్రం కడుతున్నా. వెంట్రుకలు ముడి వేయకుండానే వున్నా. దుర్యోధనుడి కుత్తుక తెగటారకుండా నాకు శాంతి లభించదు. ఇవి చెనటియైన దుశ్శాసనుడి వేళ్ళు తగిలి సగము తెగిపోయిన వెంట్రుకలు. దారుణ పరాభవాన్ని చల్లారకుండా వీటిని నాటి నుంచి నేటి దాకా దాచి వుంచా.

ఏడు తరాల నుంచి వస్తున్న చుట్టరికం నేటి ఈ సంబంధం వల్ల ఎట్లాగైనా తరించాలని మా తండ్రి ద్రుపద మహారాజు సంతోషిస్తుంటే, పంచపాండవులను భర్తలుగా చేపట్టి, నిశ్చింతగా కోడరికం చేశా; భరతవంశానికి ఎన్నడో వాసికెక్కేట్టుగా వీరులైన బిడ్డలను కాంచితి.

అన్నీ వుండి కూడా ఆఖరికి నాకిట్లా అయింది. మగలు చూస్తూ వుండగా కొప్పు పట్టి సభకీడిపించిన ఆ చేయి, ఇంతలింతలు తునియలై చెదిరి త్రెళ్ళి పడదాయె; నా యేడ్పు తీరదాయె.

యదునందనా! ఈ పంచ పాండవులు ఐదూళ్ళ పాలిగాళ్ళే - అన్న సంగతి మా తండ్రికి తెలిసివుంటే - యిట్లాంటి సంబంధాన్ని చేయటానికి యిష్టపడేవాడా? వీళ్ళ కాళ్ళు కడిగి పెళ్ళిచేసేవాడా? నన్ను కొలువులోనికి ఈడిపించాడు. దుస్సేనుడిచే గిలగిల తన్నుకొంటూ కేకలు వేస్తున్నా - రజస్వలనని మొత్తుకొంటున్నా ఏ మాత్రం వినటానికి యిష్టపడలేదు కౌరవ రాజేంద్రుడు. పైగా కిలకిల నవ్వాడు; అతనికి కీడు తలపెట్టకుండా వుంటానా?

నాకు జరుగుతున్న అవమానాల్ని పడుతున్న బాధలనూ - నా మగలు కళ్ళారా చూశారు. నా పగ దీర్చి, నా దిగులు తీర్చవలసిన వాళ్ళు వీళ్ళు - అట్లు చేయలేకపోతే, సెగలు జిమ్మే తూపులు గల జెట్టి మగలైన నా సహోదరులూ - నా తండ్రీ లేరా?

రాజ కుటుంబంలో పుట్టి - రాజదొరలు కూడిన పేరోలగంలో, నా భర్తల యెదుటనే తిట్లు తిని, తీరని భంగపాటుకు గురియై యింకా బ్రతకటం దేనికి? ప్రాణాలంటే అంత తీపిగా వుంటాయా?

కృష్ణా! పామైనా పగను మరచిపోతుందేమో గాని, భామిని మాత్రం ఎన్నటికీ పగను మరచిపోదు. నా మాటలన్నీ ఆలకించు, సంధి మాత్రం నాకు నచ్చదు. ఆయుధ సహితులై దొరలంతా ఈ ఉపప్లావ్య పట్టణానికి ఎందుకు వచ్చారు? ఒక స్త్రీకి అభయం ఇచ్చి రక్షించలేనివాళ్ళు ఇక్కడ కూర్చోవడం దేనికి?

ఇంతమంది అతిరథులు - మహారథులు కూడిన ఈ నిండు కొలువులో క్షత్రియ

ధర్మమేదో వొక అబల చెప్పవలెనా? భారత కుల శౌర్య ప్రతాపాలను మరచారా? ఇట్లాంటి జాలి కూడు తినే ఆలోచన మీకు తగునా? టకటొంకులు చెల్లుతాయా? సంధి కలుగుతుందా?

భీముడి గదా రణ పాండితిని - విజయుడి గాండీవాన్ని నమ్మి మోసపోయా. కౌరవ రాజు నిండు కొలువులో నేను బడ్డ భంగపాటును తీర్చే దిక్కు లేకుండా పోయింది.

ఓ రాజాధిరాజులారా! మా కుల గౌరవాన్ని కనుమాయకుండా వుంచాలని భావిస్తున్న మాకుల దైవతమయిన మాధవుడేమన్నాడు? ద్రోణ భీష్ములు ఆ కురురాజు పక్షమే వస్తారని గదా! మీరు కూడా నిర్మొహ మాటంగా చెప్పండి; భయంగా వుంటే, మీరూ మీ యిళ్ళకు పోవచ్చు.

ముసలి వగ్గులైన ద్రోణ భీష్ములిద్దరూ ఈనాడు బుసలు కొడితే భయం వేస్తే యిళ్ళకు పారిపోండి. దిక్కూ దరీ లేని ఈ ఆడదాని బ్రతుకు చివరికే మౌతుందో చూస్తాం.

అయినా యుద్ధ విముఖులుగాబోయే మీతో యేమని చెప్పేది? ఇంతకీ మిమ్మల్ని అనవలసిన పని యేముంది?

నన్ను గన్న పాణ్యంపతి వున్నాడు; నన్ను పెంచిన నెరజోదు మా యన్న వున్నాడు; తమకప్రతిష్ఠాకరంగా నా మగలు సంధి గోరినప్పటికీ - నా తండ్రీ, అన్న, కత్తిగట్టి యుద్ధం చేయరా?

వీర పత్నినని గర్వించటానికి ఈనాటికి సందేహంగా వుంది. అయినా నేను వీర మాతనే.

మేటి మగటిమి గల హిడింబాసుతుడు తోడు లేదా? వీర పరాక్రమ విస్ఫూర్జితుడు అభిమన్యుడు లేడా? ఇంకా పోటరులైన నా బిడ్డలు లేరా? వాళ్ళు నన్ను కాపాడరా! యుద్ధ రంగంలో కౌరవేంద్రుణ్ణి ఆటలాడింపనా?

పూర్వపు క్షత్రియ వీరుడు బాణం చేతబట్టినవాడు తల ప్రాణం తోకకి వచ్చినా, ప్రాణాన్ని తృణప్రాయంగా భావించి, ఏ మాత్రం లెక్కపెట్టకుండా పోరాడేవాడు. కాని, మీరు ప్రాణ భయంతో బాణం వేయటానికే జంకుతున్నారు. ఈ నేలలో ఎప్పుడైనా మీలాంటి రణ శూరులున్నారా? ఎక్కడైనా చూచామా?"

యుద్ధ భయాన్ని పారద్రోలాయి ద్రౌపదీ పలుకులు; రణోత్సాహాన్ని రెట్టింపు చేశాయి ఆమె వచస్సులు. ఆమె మాటలు విన్న సభ ప్రశాంత సాగరంలా నిశ్శబ్దంగా అయింది. వాసుదేవుడు నెమ్మదిగా తన పీఠం నుంచి లేచాడు. ద్రౌపది దేవి వంక దరహాస చంద్రికలను బరపి, మెత్తని మాటలతో ప్రసంగించాడు.

"తల్లీ! సోదరీ! నీవు నన్నెరుగవా? ఎప్పుడైనా పగ తీర్చుకోకుండా వుంటానా? కౌరవ రాజు మదంతో నిండు సభలోకి ఈడ్చి తెప్పించిన విధం - అందరూ వింటూ వుండగా

దుర్భాషలాడిన చందం - అతని దుస్సహవర్తనం - అన్నీ నేనెరుగనా? ఇప్పడీ పని ఏమీ యోచించకుండా చేస్తున్నానని మాత్రం భావించకు.

అమ్మా! దుఃఖాన్ని దిగమింగు. నా ముక్కున నావి గల్గినంత కాలం నీ పగ తీరుస్తా. నీవీ విషయం అడక్కపోయినా మరచిపోతా ననుకొన్నావా? ఎంత అమాయకురాలివమ్మా! శత్రువుల క్రొన్నెత్తురు పేటితో నీ పాదాలు రెండు కడుగుతా. నిజం; శపథం చేస్తున్నా. మునివేళ్ళ నుండి వేడి నెత్తురు జారి పడుతుండగా యువరాజు సంతోషంతో జడలుగా గట్టిన నీ కురుల్ని చిక్కు దువ్వి ముడి వేస్తాడమ్మా!"

ద్రౌపదికి సమాధానం చెప్పి, ఆమెను పట్టుదించి ఓదార్చాడు. అక్కడకు చేరిన రాజలోకాన్ని చూచి - " వీరులారా! యుద్ధం మాన్పి సంధి చేయించటానికి దుర్యోధనుడి దగ్గరకు పోయి వస్తా. అయినా మీరంతా మీ మీ సైన్యాలను సమకూర్చి పెట్టుకోవడం ఎంతైనా మేలు'' అని చెప్పి కౌరవ రాజు కొలువుకు హస్తినాపురం పోవటానికి ప్రయాణోన్ముఖుడయ్యాడు. సహదేవుడీ సంగతి గమనించాడు. చీదరించుకుని కృష్ణుణ్ణి చూచి-

"బావా! యదునందనా! ఒచ్చేమేమీ లేదు. కౌరవులు యుద్ధం మానుకొన్నా - మానుకోకపోయినా అక్కడ మన గౌరవానికి భంగం రాకుండా నిక్కచ్చిగా మాటలాడు; సంధి కోరుతున్నట్టే సుముఖత తెలియజేయి. ఒకవేళ ధృతరాష్ట్ర తనయులు కచ్చిగా ప్రవర్తిస్తే, మన కాచ్చని తీర్చుకొందాం.

అంతేగాదు, ఈ విషయం అట్లా వుంచు, ముందుగా నేను చెప్పేది విను.

అగ్రజుడు, భూపతి అయిన వారికి ఎదురుతిరిగి మాట్లాడరాదు. కాని, ఒక విషయం చెపుతున్నా. దాన్ని గూడా కాస్త చెవిలో వేసుకో - ఇప్పుడు నీవు ధర్మ నిర్ణేతవై వెడుతున్నావు. అసలు నీకు సంధి చేయటం ఎట్లా సాధ్యపడుతుంది.

జూదమాడేనాడు జూదరియైన ధర్మరాజు మాదాయాన్ని మొత్తాన్ని కౌరవరాజుకు, జూదంలో పందెంగా పెట్టాడు; దయారహితుడైన దుర్యోధనుడు మా సమస్తాన్ని దొంగిలించాడు; ఈ పదమూడు సంవత్సరాలు హాయిగా అనుభవించాడు; ఈ సమయంలో మా పేదరికాన్ని రూపుమాపటానికి నీవు పెత్తనాన్ని పయిన వేసుకొన్నావా?

పదమూడు సంవత్సరాలు నిరాఘాటంగా అనుభవించిన మా ఆస్తి మీద వచ్చిన ఆదాయాన్ని పదిలంగా మాది మాకిస్తే సంధి చేయవచ్చునని కుదిరిస్తావా? అసలు నీవెందుకు వెళుతున్నావు? నీ పథకమేమిటో కూడా నాకు తెలియరావడం లేదు." అన్నాడు.

కృష్ణుడు సహదేవుని మాటలు విన్నాడు. విని, చేతితో భుజం తట్టుతూ "నీవు చెప్పిన ధర్మ సూక్ష్మం విజ్ఞతతో అంగీకరించవలసిందే. కౌరవరాజు సభలో సంధి ప్రస్తావన

సమయంలో నీ మాటల్ని మనసులో వుంచుకునే ముచ్చటిస్తా–" అని బుజ్జగించాడు.

సంధి ప్రయాణానికి సన్నద్ధుడై, వివిధాయుధాలను రథంలో పెట్టుకొని, సాత్యకిని రథమెక్కించుకొని తన ప్రక్కనే కూర్చుండబెట్టుకొని హస్తినాపురాభిముఖుడై పోయాడు.

హస్తినాపురానికి పోయిన కృష్ణుడు విదురుడింటిలో బస చేశాడు. దుర్యోధనుడు విదురుణ్ణి తన మనస్సులో ఏనాడు లేశము కూడా నమ్మడు. అతణ్ణి ఎప్పుడూ వొక కంట కనిపెట్టి వుంటాడు. కృష్ణుడికి ఆ యిల్లే విడిది యిల్లయింది.

దుర్యోధన సార్వభౌముని కొలువుకూటంలోకి ప్రవేశించి సంధి విషయక ప్రసంగం చేయకముందే, హస్తినాపురంలోని రహస్యాలను తెలుసుకోవడం మంచిదని భావించాడు కృష్ణుడు. విదురుడు మొదటి నుంచీ పాండవ పక్షపాతి యని కృష్ణుడికి తెలుసు. అతడక్కడ విడిది చేయటానికి కారణం కూడా అదే.

వాసుదేవుడు విదురుడి యింటిలో బస చేశాడని దుర్యోధనుడు తెలుసుకొన్నాడు. మంత్రి - సామంత దండనాధులు వెంటరాగా విదురుడి యింటికి వచ్చాడు. కృష్ణుణ్ణి చూచి కుశల ప్రశ్నల తరువాత తన యింటికి విందారగించటానికి రమ్మని ప్రార్థించాడు.

"కౌరవ రాజా! నీవు పాండు పుత్రులకు పగవాడవు; కాబట్టి నాకూ పగవాడవే. పగవాని యింటిలో భోజనం చేయటం భావ్యమా?" అని పుల్లవిరుపు మాటలు మాట్లాడి, దుర్యోధనుణ్ణి తిప్పి పంపించాడు వసుదేవ నందనుడు.

మరుసటి రోజు రారాజు నిండు కొలువు తీర్చి సంధి విషయము వినటానికి శ్రద్ధాళుడై సింహాసనంపై కూర్చుని వున్నాడు. కమలనాభుడు సాత్యకి కృతవర్మలతో కొలువులోనికి వచ్చి ఆమాటలు, నీ మాటలతో కొంతకాలం వెళ్ళబుచ్చి జల్పాకుడై ధర్మరాజు పంపిన భట్టు లాగా ప్రసంగం ప్రారంభించాడు.

ధృతరాష్ట్ర మహారాజా! పాల బుగ్గలతో పోరాడే వయసు నుండి పాండవులు ధర్మాత్ములు; కురు వృద్ధ జనాలను గురు భక్తితో కొలిచి నిరంతరం సేవించారు. పంచజనులంటే పంచ ప్రాణాలుగా వుండి ఎంతో శ్రద్ధతో సంచరించారు. దాస దాసీ జనాలను నీలాగే ఎంతో ప్రేమతో ఎల్లప్పుడూ సాకేవాళ్ళు; ఇక మాటలెందుకు? కుటుంబానికి పెద్దవనే గౌరవంతో నిరంతరం నీ అడుగులకు మడుగులొత్తారు. అట్లాంటి వాళ్ళను కాదని తృణీకరించి పరుల పంచల పాలుచేయటం న్యాయమంటారా?

ధర్మమో! అధర్మమో జూదంలో వోడిపోయి, అందులో బెట్టుకున్న పందెం ప్రకారం ఆ కట్టుబాటుకు కట్టుబడి అడవుల్లో తిరిగి - ఆకలి దప్పులకు వోర్చి, ఏదో రకంగా వచ్చి మరలా పృథివీపతులందరినీ చూడగలిగారు. ఈ పరిస్థితుల్లో వాళ్ళను దగ్గరకు తీయకుండా పెడగా వుంచడం మీలాంటి ధర్మమూర్తులకు ధర్మమందురా!

అంబికేయా! అంతేకాదు; మా తండ్రియైన పాండు నృపాలు పాలు

మాపాలొనరించమని జాలితో నిండు కొలువులో చెప్పమని నేర్పుతో చెప్పి పంపారు నీ తమ్ముని బిడ్డలు. వాళ్ళు నీకెంతగానో అండగా వుంటారు. యథార్థం చెపుతున్నా; ఇంకేమీ మాట్లాడకుండా – పాండవ నందనులను ఉపేక్షా భావంతో చూడక వెంటనే పిలిపించు.

నీ తనయుడు దుర్యోధనుడు ధూర్తుడై చిన్ననాడే వాళ్ళను నానా కష్టాలపాలు చేశాడు; లక్క యిల్లు కట్టించి, ఎంతో లాలనతో అందులో వుంచి తగులబెట్టించాడు. నీచాతి నీచమైన జూదమాడించి ఓడించి యింటి నుంచి వెడలగొట్టించాడు; కాలకూట సర్పాలనెన్నింటినో ఏరి సంపాదించి భీమసేనుణ్ణి కరిపించాడు; రజస్వల అని తెలిసి కూడా ద్రౌపదిని క్రూరుడై సభకీడిపించి, అందరూ చూస్తూ వుండగా అవమాన పరచాడు; అంతే గాక ఇంకా చేయరాని పనులెన్నో చేశాడు. ఇట్లాంటి నీ సుతుడు సాధువని భావిస్తున్నావా?

కౌరవేంద్రా! కాబట్టి, నీ తమ్ముని బిడ్డల్ని చేరదీసి, అవసరమ నుకొంటే నీ తనయుడైన దుర్యోధనుణ్ణి తృణీకరించు; పాండు పుత్రులకు దాయం పంచిపెట్టు. వివేకం చూపితే లోకం మెచ్చుకొంటుంది. దానివల్ల భీకరయుద్ధం సంభవించే పరిస్థితులు తొలగి పోతాయి. శాంతి ఏర్పడుతుంది. ధరాధిపతులంతా సంతోషిస్తారు. బంధుమిత్రులు– రాజలోకం సౌఖ్య పరంపరలో మునిగితేలుతుంది.

కర్ణ శకుని మాటలు గనుక వింటే భారత వంశం నాశనానికే దారితీస్తాయి. చెడుగులైన వాళ్ళ మాటలు విని చెడిపోవడం దేనికి? పరువు మర్యాదలతో బ్రతకడం అవసరం గదా!"

తన రాజనీతి వైశారద్యం తేటపడేట్టు కృష్ణుడు వివిధ రీతుల కౌరవ రాజ సభలో ముచ్చటించాడు.

సభలో సంధి విషయం ప్రసంగం మొదలు పెట్టినపుడు, అక్కడున్న రాజులంతా సంధికి సుముఖంగానే వున్నారు. కృష్ణుడి మాటలు ఆసాంతం విన్న తరువాత రాజులంతా సంధికి విముఖత చూపారు. అప్పుడు సుయోధన సార్వభౌముడు, కళ్ళెర్రజేసి, సభనంతా కలియజూచాడు. పాండవరాయబారి వాసుదేవుణ్ణి చూచి –

"బావా! ఈ సంవాదంతో పనేమి? నీవేవో చెప్పి, అవిభాజ్యమైన కురు రాజ్యంలో భాగం పంచి పెట్టమని అంటున్నావు. కాని, సగభాగం పంచి యీయటానికి నేనెవణ్ణయ్యా! నీకీ సంగతి తెలియదా! అదుగో మా ముత్తాత బాహ్లికుడుండాడుగా? రాజ్యంలో సగభాగం పంచి యీయవలసిందని తన అన్నను ఆయన అడిగాడా? అర్థించాడా?

కావున, యదునందనా! ఇంక మాటలెందుకు? నిఖిల ధారుణీ చక్రం ఈరోజుదాక తళుకులీనే కత్తి మొనమీదే నిలిచి వుంది. అనవసరంగా మాటలు దండుగ కావటం తప్ప, పరుల ప్రార్థించినంత మాత్రాన నీకేం వచ్చిపడుతుంది?" అన్నాడు.

అంతకుముందు కృష్ణుడు కొలువులో పాండవ రాయబారిగా పలికిన మాటలూ - వాటికి దుర్యోధనుడిచ్చిన సమాధానపు ప్రసంగం - కౌరవ రాజసభలోని ఆతని పక్షపు నరపాలురెంతో వోర్పుతో విన్నారు; విని రకరకాలుగా తమ మనస్సులో భావించారు.

"ఒకవేళ పాండవులు ధర్మాత్ములేనని అనుకొందాం! కాని, ఈ వాసుదేవుడు మన రారాజును నోటికి వచ్చినట్టు మర్యాద దక్కి దూషించడం దేనికి?" అంటూ కనులెర్రజేసి ధరాధిపతులంతా బిత్తరించి కత్తులపై చేతులు వేశారు.

కౌరవపక్ష యోధుల్ని కృష్ణుడు జాగ్రత్తగా ఓ కంట కనిపెడుతూనే వున్నాడు. తన మాటల వల్ల వాళ్ళల్లో కలిగిన అశాంతిని కన్నారా గమనించాడు. అమితానందం పొందాడు లోలోపల. దూరదృష్టితో పరికించి- యిక కౌరవ పాండవులకు సంధి కుదరడం కల్ల - అని నిశ్చయించుకొన్నాడు. తన పాచిక పారిందని పొంగిపోయాడు. అయినా, వెలితి పడకుండా గంభీర మనస్కుడై తన కాపట్యం బయటపడనీయకుండా దాచిపెడుతూ తన ప్రసంగాన్ని కొనసాగించాడు.

"ధృతరాష్ట్ర మహారాజా! పిన్నలు పెద్దలు ఈ సభలో వున్నారు గదా! ఇంకా ఎవరు కావాలి? నా విన్నపం కూడా వొకటుంది వినండి. కొలువులో వున్న పెద్దలు అన్నెం - పున్నెం గమనించారా? ఒకవేళ పాండురాజు సగభాగం పంచి యాయటానికి మీకిష్టం లేకపోతే, చివరకు కనీసం ఐదుగురికి ఐదూళ్ళైనా యిచ్చి సంధి చేసుకొవడం ధర్మం. ఆ వూళ్ళు కూడా చెబుతా విను- కుశస్థలి - వారణావతం - మాకంది - వృకస్థలి - ఇవిగాక ఐదవది మీ యిష్టం వచ్చిందేదైనా వొకటి.

ఆఖరి మాటగా చెప్పా; ఇక కష్టాలే తెచ్చుకుంటారో? సుఖాలే అనుభవిస్తారో? మీ యిష్టం. దుష్టబుద్ధుల మాట వింటే రెండు వంశాలూ నాశనమౌతాయి. ఇది నేను ప్రత్యేకించి చెప్పవలసిన పని లేదు."

రాధేయుడు శ్రీకృష్ణుడు మాటలు విని, వాటిల్లో వున్న నిగూఢ భావాల్ని గ్రహించి బిడియపాటు లేకుండా వెంటనే వాసుదేవ తనయుణ్ణి చూచి -

"జలజాక్షా! ఎందుకీ యెత్తులు వేస్తావు. మా ముందు యెత్తు గడలు పనికిరావు. నీ మాటల ఆంతర్యం ఎరుగలేమా? ఇంతమాత్రం కూడా తెలియని శుంఠల మనుకొన్నావా? మాలో మాకు కలహం కల్పించాలని భావించి యీ యైదూళ్ళ నడిగావు.

కుశస్థలి నాకిచ్చింది - మాకంది, వారణావతాలు రెండు గురుడైన ద్రోణుడికిచ్చినవి. ఈ సంగతి నీకూ - ఇక్కడి వాళ్ళందరికీ తెలుసు. అందుకే యీ వూళ్ళడిగావు. దాని వల్ల మాకు రారాజుపై కోపం వస్తుంది. మాలో మాకు చీలికలు సంభవిస్తాయని తలచావు. నిజంగా దుర్యోధన సార్వభౌముడు సంధి చేయటానికి యిష్టపడితే, నీవు కోరిన ఐదూళ్ళను ఇప్పుడే యిచ్చేస్తాం. మాకు కావలసింది - సకల కురు రాజ్య సౌభాగ్యమే గాని, మా

స్వార్థం కాదు” అన్నాడు.

రవి నందనుడి మాటలు సుయోధన చక్రవర్తి విన్నాడు. సింహాసనాశీనుడైన రారాజు సింహపీఠి దిగ్గున దిగి, సభికులంతా తల చాచి సెహబాసని కొనియాడే విధంగా గంభీర భాషణలు పలికాడు.

“పంకజాక్షా! బాల్యంనుంచి రాజవంశాన్ని విడిచి గొల్లపల్లెలో పెరిగి పెద్దవాడవయ్యావు గదా! వాళ్ళ ఆచారాలూ – మాటలూ పట్టుబడ్డాయి. ఆ పల్లె మాటల్ని మాను.

విలువిద్య నేర్పినందుకు గురుదక్షిణగా ద్రుపదుణ్ణి చితకబాది వారణావతం, మాకంది అనే గ్రామాలను కైవసం చేసుకొని గురుడైన ద్రోణుడికిచ్చాం. ఇది వాళ్ళూ – మేమూ కలసి చేసిన పనే– గురువుకు కానుకగా యిచ్చిన వాటినే ధర్మజుడు కోరుకున్నాడంటే, గురు ధనాన్ని ధర్మనందనుడు అపహరించటానికి చూస్తున్నట్లే గదా! ఔరా! ధర్మరాజెట్లాంటి శిష్యుడో?”

తన అవక్రవిక్రమాటోపం మెరియ రాధేయుడు మునుపు మమ్మల్ని మెప్పించి కుశస్థలిని పుచ్చుకున్నాడు. దానినే తిరిగి అడుగుతున్నారు. నిజ భుజార్జితమైన దానిని కర్ణుడి నుండి నేనెట్టు తీసుకొనేది? యెక్కడ యిచ్చేది?

పాండవదూతా! కృష్ణా! అతి కరుణా సముద్రులయిన కర్ణ ద్రోణులు నేనడిగితే, నా పై గౌరవమో– వాత్సల్యమో కనబరచి వాళ్ళా గ్రామాలనే యిస్తారు గాక! కాని, నీ మాటలన్నీ కైత్వంతో కూడినట్టుగా వున్నాయి. దానం చేసి, తిరిగి వాటిని తీసుకున్న రాజులున్నారన్న వార్త నీవెప్పుడైనా, ఎక్కడైనా విన్నావా?

పేరు పెట్టి ప్రత్యేకంగా ఆ యైదూళ్ళే అడగడం దేనికి? కౌరవ రాజ్యంలో యిక గ్రామాలే లేవా? వాటిని అడక్కుండా వుండడం దేనికి? నీ మాటల్లోని మోసాన్ని గ్రహించలేమా?

సమస్త భూచక్రం నా కైవసంలో వుంది. ఐదూళ్ళు గాదు, వాడి సూది మొన మోపినంత స్థలం కూడా యీయను. పరుషంగా మాట్లాడానని భావించకు. నాతో ఎవరిప్పిస్తారో చూస్తా!”

దుర్యోధనుడి సూక్తుల్ని ‘భళిరా’! అని అక్కడున్న సమస్త భూపతుల లోకం కొనియాడింది. అంతలో కార్యజ్ఞులై యాదవ వీరుణ్ణి కృష్ణుణ్ణి బంధించటం మంచిదని కూడా భావించారు.

ఆ సభలో వున్నవాళ్ళంతా గుసుగుసలు పోయి, చెవుల్లో చెప్పుకొని, ఇద్దరు ముగ్గురు చొప్పున బయటకు పోవడం. తిరిగి లోపలకు రావడం, మరలా ఇతరులతో మంతనాలాడడం, విడిపోవడం, ఇంకొకరితో కలసి సంప్రదించుకోవడం అంతా అలజడిగా వుంది. కౌరవ సభలోని సభికులు పన్నుతున్న కుట్రను సాత్యకి గ్రహించాడు. వాసుదేవుడికి

వివరించాడు. ఈ విషయం భీష్మడి దృష్టికి తీసుకుపోగా, గంగా తనయుడు ధృతరాష్ట్రునకు చెప్పి సభను చాలించటానికి యత్నం చేశాడు.

ఇంద్రజాలికుడయిన సవర తనయుడు కనుకట్టు కట్టి, పెక్కుమంది యోధులు తనను బట్టుకొలుస్తున్నట్టు కనపడేట్టు చేసి సాత్యకితో గూడ బయటపడ్డాడు. ధృతరాష్ట్రుడు కొలువు చాలించాడు. రాజులంతా తమ తమ విడిదిలకు వెళ్ళారు.

లేనిపోని పోరామి కల్పించుకొని కృష్ణుడు కర్ణుడు చేతిని తన చేతిలోకి తీసుకొని తనతో కొంతదూరం తీసుకుపోయి, మెల్లగా ఇతరులెరూ వినకుండేట్టు చూచి అతని జన్మ రహస్యాన్ని వినిపించాడు. కర్ణుడు వాసుదేవుణ్ణి ఎగాదిగా చూచి - "కృష్ణా! ఈ నీ మేనత్త రహస్యాన్ని దాచకుండా నాకెందుకు చెప్పావయ్యా! నన్నేమని పాండవుల్ని చేర మంటావు? కుంతి కనిపారేసింది, చేరదీసి పెంచింది రాధాదేవి. కళ్ళు తెరువని నెత్తురు కందును పొదిగిళ్ళతోపాటు నట్టేట తోసింది కుంతీదేవి. నట్టేట దొరికిన కసిగందును పొదిగిళ్ళలో పెట్టి పోషించింది రాధాదేవి.

పుత్రమోహాన్ని దిగమింగి జాలిలేని రాతి గుండెతో అన్నెం పున్నెం తెలియని కన్నబిడ్డను లోకాపవాదాన్ని పోగొట్టుకోవడం కోసం గంగపాలు చేసింది కుంతీదేవి; కావు - కావని ఏడుస్తున్నా - దిక్కులేని పసిపిక్కను తెచ్చి జన్ను కుడిపి, పెంచి పెద్దను చేసి, మలచింది రాధాదేవి. పెళ్ళి పేరంటాలు చేసి అపరిమితానందాన్ని పొందింది రాధాదేవి. నేనెవ్వడినైతే నేమి? లోకానికి రాధేయుణ్ణే కాని, కౌంతేయుణ్ణి కాను.

చదువు సాములు చెప్పేవాళ్ళు లేక దేశదేశాలు తిరిగి తిరిగి ద్రోణుడి దగ్గరకు వస్తే మొగమాటం లేకుండా కుటిలుడై 'నీకు బ్రహ్మాస్త్ర ప్రయోగం నేర్పటానికి వీలులేదు-' అని చెప్పి అవమానపరచినప్పుడు, పరశురాముడు కష్టకాలంలో భార్గవాస్త్రం జపించటానికి గుర్తురాదని చెప్పి శపించినప్పుడు, నిష్కారణంగా ఒక బ్రాహ్మణుడు నన్ను తిట్టినప్పుడు కుమారాస్త్ర విద్యా ప్రదర్శన సమయంలో భీముడు నన్ను గేలి చేసినపుడు, నేను బడ్డ మానసిక సంతాపం ఎవ్వరికి తెలుస్తుంది?

నాకీ ప్రపంచంలో చోటున్నదా! అనే సందేహం కలిగింది. ఇట్లు బ్రాహ్మణుల చేత శపించబడి, దిక్కు లేక నేనల్లాడిపోతున్నపుడు, నన్ను జూచి, కనికరంతో సుయోధన సార్వభౌముడు నా కాశ్రయమిచ్చి, ఆదరించి, గౌరవాన్నిచ్చి, పెద్దను చేసి, పరివారమిచ్చి, సరివాళ్ళల్లో తలయెత్తుకొని తిరిగే అవకాశమిచ్చి మన్నించాడు. స్వామి ద్రోహం గాని - మిత్ర ద్రోహం గాని చేయడం ఈ కర్ణుడికి చేతగాదు.

ఓ కృష్ణా! ఈ జన్మానికి కర్ణుడు రాధేయుడే! సుయోధన సార్వభౌముడి నమ్మిన బంటే. నా మాటకు తిరుగులేదు.

గోపాలా! నాకు రాధాదేవి కన్నతల్లి. మహారథుడు కన్నతండ్రి. సుయోధన భూపాలుడు

పాలకుడు. ఇవి త్రికరణశుద్ధిగా చెపుతున్న మాటలు. ఈ మహానుభావుడికి అపచారం తలచుట గాని, చేయుట గాని మహా పాప హేతువు. అది తలపెట్టజాలను. చేయజాలను. ఇక మాటలు చెప్పి నన్ను బాధింపక తిరిగిపో" అని చెప్పి, తటాలున సెలవు తీసుకొని గిరుక్కున వెనుదిరిగి కర్ణుడు శ్రీకృష్ణుడి సమీపం నుండి తిరుగుడు పడుతున్న మనస్సుతో వెళ్ళిపోయాడు.

తర్వాత కృష్ణుడు కర్ణుడి ప్రతివచనానికి నివ్వెరపడి కొంతసేపు ఏమీ తోచక నిలిచి వుండి, మేనత్త యయిన కుంతిని చూచి, సభా వృత్తాంతమంతా వివరంగా పూసగుచ్చినట్లు చెప్పి, ఆమె చెప్పిన మాటలు కూడా విని, విదురుడితో ముచ్చటించి అక్కడ నుండి తిన్నగా ఉపప్లావ్యానికి పోయాడు.

పాండవ పక్ష వీరులకు - పాండవులకు తాను కౌరవ సభకు పోయి సంధి కావించటానికి చేసిన ప్రయత్నం - అక్కడ జరిగిన విషయాలు సభాముఖంలో చెప్పాడు. యదునందనుడి మాటలు విన్న వీరులంతా సింహనాదాలు చేస్తూ యుద్ధ సన్నాహానికి సమాయత్తమై, 'యుద్ధం ఎప్పుడెప్పుడా' అన్నట్లు ఆసక్తి చూపారు.

ఆ ఉపప్లావ్యమంతా భేరీ భాంకారాలతోను- మత్త గజేంద్ర ఘీంకారాలతోనూ ధనుష్టంకారాలతోనూ దద్దరిల్లిపోయింది.

# కురుక్షేత్రం

విజయాభిలాషతో రెండు వర్గాల ధీరులు మొక్కవోని విజృంభణతో తమ తమ సైన్యాలను తీసుకొని యుద్ధానికి కాలు దువ్వుతూ, పుణ్యక్షేత్రమయిన కురుక్షేత్రంలో దండు విడిచారు.

యాదవవర్గంలో కృష్ణుడు - సాత్యకి - చేకితానుడు - పాండవ పక్షపాతియై వాళ్ళవైపు చేరారు. నారాయణ గోపాలుడు - విందానువిందులు - కృతవర్మ - దుర్యోధనుడి పక్షం చేరారు. బలరాముడు వాస్తవానికి దుర్యోధనుడి పక్షపాతి కాని భీముడు తన శిష్యుడు కావడం వల్లనూ, బాహ్లిక సోమ దత్తాదులు దుర్యోధనుడి పక్షంలో వుండడం వల్లనూ తానూ బాహ్లికుడి మనుమడు కావటం చేతనూ ఎటూ చేరక, ఏమీ చేయాలో తోచక, తీర్థయాత్రల నెపంతో ఎక్కడికో వెళ్ళిపోయాడు.

రుక్మిణి సోదరుడు అయిన రుక్మి అటు పాండవులచేత- ఇటు కౌరవుల చేత తిరస్కరింపబడి యింటిలోనే వున్నాడు. దుర్యోధనుడి సవతి తమ్ముడు యుయుత్సుడు ధర్మరాజు పక్షం వెళ్ళాడు. ధర్మనందనుడి మేనమామలు కుంతిభోజులు రెండువైపులా చేరారు. కవలల మేనమామ శల్యుడు దుర్యోధనుడి పక్షమునలంకరించాడు.

ఈ రకంగా కౌరవ పాండవులు పరస్పరం యుద్ధ కార్య నిమగ్నులై ఎదురెదురుగా

నిలబడ్డారు. పాండవ సైన్యానికి ధృష్టద్యుమ్నుడు సర్వసేనాధిపతయ్యాడు; కౌరవ బలానికి పితామహుడైన భీష్ముడు సేనాపతి అయ్యాడు.

యుద్ధ సన్నద్ధులై ఒకచోటకి చేరిన గురువృద్ధ బంధువధ చేయ నిరాకరించిన అర్జునుడికి విషయ బోధ చేసి యుద్ధోన్ముఖుణ్ణి చేశాడు కృష్ణుడు. ఇక వుభయ సైన్యాలు పెచ్చుపెరిగి తలపడి పోరు చేయనారంభించాయి.

కౌరవచమూపతి భీష్ముడు గ్రీష్మకాలంలోని సూర్యుడిలాగా చెలరేగి వాడి వేడి గల తన బాణ కిరణ సముదాయంచేత పాండవ వాహినిని కంపింపచేస్తున్నాడు. గాంగేయుడి తాపానికి తట్టుకోలేక తన సైన్యం కకావికలంగావటం చూచిన అర్జునుడొకనాడు కోపోద్దీపిత మనస్కుడై, వృద్ధ వీరుణ్ణి ఎదిరించి సమకట్టి ఘోర భీకర బాణపరంపరచే శాంతవుణ్ణి నొప్పించాడు. దీనికి ప్రతిగా బీష్ముడు తన విలువిద్య పాండితి ప్రకాశింప పాండవ మధ్యముణ్ని చీకాకుపరిచాడు. కృష్ణుడీ సంగతి గమనించి - అంతకుముందు ఆయుధం ముట్టనని చెప్పిన తానే పగ్గాలను నొక గట్టున పెట్టి చక్రాన్ని దీసి చేతబట్టి సాహసంతో గంగా పుత్రుడి మీదికి చంపేస్తానని దూకాడు. అప్పుడు ధనుంజయుడు అడ్డం వచ్చి, తిరిగి రథం మీదికి తీసుకొనిపోయాడు.

తనను కాపాడటానికి వాసుదేవుడు ప్రతిజ్ఞా భంగం చేశాడని కుంతీ తనయుడు సిగ్గిల్లి, కోపించి సముత్సాహ సంరభంతో గాండీవ చండ కోదండజ్యా నిర్ఘోషంతో కౌరవసేన తత్తరపడిపోయేట్టు వాడి గల బాణ పరంపర కురిపించి యుద్ధం ప్రవర్తింపచేశాడు.

భీష్ముడు దానిని గ్రహించి, తాను కూడా పాండవసేన చెదిరి కకావికలమయి చిందరవందరగా కాలికి బుద్ధి చెప్పేట్టుపక్రమించాడు. దానికి కూడా తట్టుకోలేక అర్జునుడు తల్లడిల్లిపోవ, రెండోసారి కృష్ణుడు తన ప్రతిన మరచి రథం దిగి, నదీ తనయుణ్ణి మొండెం చేస్తానని దూకాడు. వెంటనే కుంతీ నందనుడు ఇది కార్యం కాదని నచ్చచెప్పి, అడ్డుపడి తిరిగి రథంపై కూర్చుండబెట్టాడు.

ఇట్లు అతి భీకరంగా యుద్ధం తొమ్మిది రోజులు జరిగింది. తొమ్మిదోనాడు గాంగేయుడు సత్రానుదాహిలుడు భీకరుడై పాండవ సేనావాహినిని తుత్తునియలు కావించాడు. భీష్ముడి శరలాఘవానికి - అతని బాణ ఘాతానికి - ధర్మనందనుని సేన గగ్గోలు పెట్టింది. పంచ పాండవులు - సేనాపతులు –తక్కిన పాండవపక్ష నరపతులు - అంతా దిమ్మెరపోయి ఏమీ తోచక వొకచోట గుమిగూడారు. భీష్ముడి ప్రతాపాన్ని చూసి గడగడ వణకిపోతున్నారు. ఇదంతా గమనించాడు కృష్ణుడు.

ధర్మరాజును చూచి "ధర్మజా! తాతకు నీ వంటే ఎంతో ప్రేమ. ఏ రకంగానైనా నీకే విజయం చేకూరుతుందని ఆలోచనతో వుంటాడు. కాబట్టి, మర్మమేమిటో విప్పి చెప్పు.

ఏమాత్రం అనుమానం వద్దు. ఇది దుష్కార్యం గదా అని అనుకొంటావేమో! అట్లాంటిదేమీ భావించక వెంటనే నదీ తనయుణ్ణి సమీపించు.

యుద్ధం చేయబోయే ముందు, నీవు అతని దగ్గరకు పోయి నమస్కరించి, సెలవీయవలసిందిగా కోరినప్పుడు, 'నీకేదైనా ఆపద చుట్టుముడితే తప్పకుండా నా దగ్గరకు రా–' అని నీకు చెప్పాడు గదా! ఆ మాట నీకు గుర్తులేదా! ఆ పని నెరవేర్చుకొనటానికి తగిన సమయం యిదే. తప్పకుండా అతని దగ్గరకు పో" అని చెప్పాడు.

పగలంతా యుద్ధం చేసి అలసిపోయిన కారణాన దొరలంతా బాగా నిద్రబోతున్నారు. ధర్మరాజు అతడి దగ్గరకు పోవాలని నిశ్చయించు కున్నాడు. ఆ నడిరేయి మెల్లగా అడుగులో అడుగు వేసుకొంటూ గంగాసుతుణ్ణి సమీపించి కౌంతేయాగ్రజుడు తన గోడు వెళ్ళబోసుకున్నాడు.

"తాతా! శాంతనవా! నీవు యుద్ధ భూమికి రావడంతో నా బ్రతుకంతా ఆపద పాలైంది. నీ యెదుట అల్లెతాడు వింటికి బిగించి, బాణం సంధించి గురి తప్పకుండా నిర్భయంగా వేయగల మాసటీడీ పదునాల్గు లోకాలలో యెవడైనా వున్నాడా? ఇక విజయం నాకు గగన కుసుమమేగదా!

ఇట్లా నీవు జాలి ఏమాత్రం చూపకుండా తెగించి భయంకర యుద్ధం చేస్తావనుకొంటే రాజ్యంలో సగభాగం కావాలని మేము పట్టుబట్టేవాళ్ళం కాము; కౌరవులు మమ్మల్ని ఎంతలు చేశారో, ఎట్లు హింసించారో నీవెరుగవా! ఇంతకీ మేము పేదవాళ్ళమనే కదా – ఈ రకంగా మేమంటే వుపేక్షా భావంతో వుండడం?

ఓ మహానుభావా! ఇప్పుడే పోయి నా పక్షమందున్న రాజులందరినీ కలిసి – "ఇక మీరు మీ నివాసాలకు వెళ్ళండి – నా తప్పు క్షమించండి' అని చెప్పి వాళ్ళనీ ముప్పు నుండి తప్పిస్తా– ఈ పని చేయకపోతే అంతా నన్ను ఆడిపోసుకుంటారు. ఆ పాపమంతా నేను మూట కట్టుకోజాలను. అంతటి మూర్ఖుణ్ణి కూడా కాను. నాకిప్పుడేం తోచడం లేదు; ఎట్లాగైనా వొకదారి చూపించాలి.

ఒకప్పుడు మా తండ్రి చనిపోతే, ప్రేమతో తాతవైన నీవే మమ్మల్ని నీ చేతుల మీదుగా పెంచావు. ఇక యిప్పుడు నీకు నిశ్శాంతి కలిగేట్టు నీ చేతులతోటే చంపుతావా! నీ చిత్తం వచ్చినట్లు చేయి. రెండు చేతులెత్తి మొక్కుతా–"

ధర్మరాజు మాటలన్నీ విన్నాడు శాంతనవుడు. సంతోష పడ్డాడు. ముసి ముసి నవ్వులు నవ్వుకొన్నాడు. ముఖంలో వికారాన్ని ఏ మాత్రం కనపడనీయలేదు. కుంతీసుతుణ్ణి చూచాడు.

"ధర్మనందనా! శత్రు సైన్య మధ్యలో వున్న గుడారాలలోకి యింత అర్థరాత్రిపూట

రావచ్చునా? ఈ అకార్యాన్ని ఎందుకు చేశావు? నీవిట్లు అనడం బాగుండలేదు; ఇప్పటిదాకా కూడు-గుడ్డ యిచ్చి దుర్యోధనుడే కాపాడుతున్నాడు. ధర్మమో - అధర్మమో అతడి పక్షాన యుద్ధం చేయబూనాను"

గంగాసుతుడి ఈ మాటలకు పాండవాగ్రజుడు దీనమొగం పెట్టాడు. దీనంగా వున్న అతని ముఖాన్ని చూచాడు వృద్ధ వీరుడు. కటకటపడ్డాడు. అంతలో దయ గలిగి-

"తనయా! ధర్మజా! ఇంతకు ముందే నీవెందుకు నా దగ్గరకు రాలేదు...! అని భావిస్తున్నా. ఇప్పుడు వచ్చావు; నేనేం చేసేది? నీ బాధ లెట్లా తీరతాయి? కౌరవరాజు దుర్యోధనుడు చాలా బలవంతుడు. అతనికి భూరివిక్రాంతి గల సైన్యం వేలు, లక్షలు వున్నది. ఒకవేళ నా వంతు సాయం నేను చేసినా, నీ వంతలు తీరిపోతాయా! ఈ కురుపతికి లావంతలు - దేవంతలు - మావంతలు అయిన బలం లక్షల కొద్దీ వున్నది.

నా చేతిలో ధనుస్సుండగా, ఈ లోకంలో ఎవరూ ఎదుర్కోలేరు. బాల సామంతుడైనా నాకు మోకరిల్లవలసిందే. విల్లు మోపెట్టి ఒక్క బాణాన్ని కూడా వేయలేదు. ఈ పరిస్థితుల్లో నీ పక్షాన వున్న రాజులు ఎంత విలువిద్యా నైపుణ్యం గలవారైనా నా ముందు వింటి బాణం సంధించి వేయగలరా? అంతటి నైపుణ్యం వుందా?

నేను ముసలివాణ్ణైపోయా. ఇంకా ఎన్నో యేళ్ళు బతకను. ఒకవేళ బ్రతికినా యిప్పుడు వచ్చే లాభమేముంది? మనుమలు యుద్ధరంగంలో కొట్టుకొని పరస్పరం చస్తూ వుంటే చూడడానికా బ్రతికి వుండడం? క్షత్రియుడైనవాడు యుద్ధ గంగంలో చావడమే కోరుకొంటాడు. నేను దాన్నే కాంక్షిస్తున్నా.

బ్రతికి వుంటే నీకు తోడ్పడలేను, చస్తే లాభం వస్తుంది. కాబట్టి వొక వుపాయం చెపుతా - నాకు నీవే మరణాన్ని ప్రసాదించాలి.

నాకో వ్రతం వుంది. అంగనాపూర్వుల ముఖం చూడను. నీ మరిదియైన శిఖండి అంగనాపూర్వుడే. అతణ్ణి ముందు పెట్టుకుని అర్జునుడితో రేపు నన్ను పడవేయి. మీకు మేలు గలుగుతుంది. మిమ్మల్ని పెంచాను కాబట్టి మీరంటే వాత్సల్యం. మీకు భాగం పంచిపెట్టేట్టు చేయటానికి విశ్వప్రయత్నం చేశా. కాని దుర్యోధనుడు నా మాట కూడా చెవిదూరనీయలేదు. కర్ణుడి దివ్యాస్త్ర మహిమల్ని నమ్ముకొని వున్నాడు. అందుకని, కర్ణుణ్ణి నిరుత్సాహపరచటంకోసం అతణ్ణి అర్థరథుణ్ణి చేశా. దాని వల్ల మీకు లాభం కలిగింది. నా మీద కోపంతో యిప్పటివరకు అతడు రణరంగానికి రాలేదు. అతడు అసామాన్యుడైన యోధుడు. అతణ్ణి కనిపెట్టి వుండడం అవసరం. నీవు నీ గుడారానికి వెళ్ళు. కార్యోన్ముఖుడవు కా" అని చెప్పాడు.

తరువాత ధర్మరాజు తాతకు సాగి నమస్కరించి, సెలవు తీసుకొని తన పర్ణ కుటీరానికి పోయి, అంతా కృష్ణుడికి వివరించి చెప్పాడు. ఆ మరుసటి రోజు బీష్ముడు చెప్పినట్టుగా

యుద్ధం చేసి, కరుణ లేకుండా తాత అని కూడా భావించక, అర్జునుని చేత శరశయ్యపై పడుకునేట్టు చేయించాడు. నదీ నందనుడు అంపసెజ్జ మీద కూలబడ్డాడు. వెంటనే కౌరవ మహీపతి సుయోధనుడు ద్రోణుడ్ని పిలిచి కురుసైన్యాధిపతిగా పట్టం గట్టాడు.

పాంచాలగణంతో తనకున్న పూర్వ వైరాన్ని మనసులో వుంచు కొని ద్రోణాచార్యుడు తీవ్రమైన పరాక్రమంతో విజృంభించాడు. ఈ పరిస్థితుల్లో వొకనాడు - చాపాచార్యుడు పద్మవ్యూహాన్ని పన్ని ప్రచండ సమరం సాగిస్తున్నాడు. ఆ పద్మవ్యూహాన్ని చీల్చి జొరబడి యుద్ధం చేయటానికి అభిమన్యుడు - అతనికి బాసటగా భీమాదులు వచ్చారు. కాని, అభిమన్యు కుమారుడు మొగ్గరంలో జొరబడగానే, తక్కిన వాళ్ళకు వ్యూహం తలకాడ వున్న సైంధవుడు భీమాదుల్ని లోపలకు రానీయకుండా బయటనే ఆపివేశాడు. అభిమన్యుడికి తోడు రావటానికి వాళ్ళ చేతకాలేదు. లోపల దూరిన అర్జున తనయుడొక్కడే శత్రు సైన్యం మధ్యలో వుండి యుద్ధం చేస్తున్నాడు. అతని యుద్ధపాండితిని చూచి సహించలేక కర్ణాదులు పదిమంది అతని చుట్టూ చేరి అన్ని వైపుల నుండి బాణ వర్షం కురిపించి ఆ అభిమన్య వీర కిశోరాన్ని మట్టుబెట్టారు.

తన పరోక్షంలో పద్మవ్యూహాన్ని పన్ని, వీర కిశోరమైన తన తనయుణ్ణి పలువురు చుట్టిముట్టి చంపిన సంగతి అర్జునుడికి తెలిసింది. నివ్వెరపడి, నిశ్చేష్టుడయ్యాడు. దీనికంతటికీ కారణం సైంధవుడేనని తెలుసుకొని దూరంగా వున్న అతన్ని తిట్టి శపథం చేశాడు.

"సూర్యాస్తమయం కాకముందే, సైంధవుడి తల భూమిపై పడేట్టు చేస్తా. అట్లు చేయకపోతే, అంతా చూస్తూ వుండగా, నాలుకలు చాచిన భయంకరాగ్నిలో గాండీవంతో పాటు దూకుతా." అర్జునుడి ఈ శపథాన్ని చాపాచార్యుడు - కౌరవ సేనాధ్యక్షుడు ద్రోణుడు విన్నాడు. మరుసటి రోజు శకట వ్యూహాన్ని పన్ని, సైంధవుణ్ణి సైన్య సమేతంగా దాని నడుమ సుస్థిరంగా వుండేట్టు చేశాడు.

బీభత్సుడు బీభత్సంగా భూన భోంతరాళాలు పిక్కటిల్లేటట్లు దేవదత్తాన్ని పూరించి, ప్రచండ గాండీవ జ్యాటంకారానికే కౌరవ సైన్యం కలవరపడేట్టు చేశాడు. రథాన్ని ఎక్కి ద్రోణుడు పన్నిన శకట వ్యూహం దగ్గరకు వచ్చాడు. ఆ వ్యూహ ద్వారంలోనే వున్న ధనుర్విద్యా గురుడితో పోరు సాగించాడు. కృష్ణుడు దాన్ని గమనించాడు. ఇట్లాగే వుంటే కాలహరణం అవుతుందని గ్రహించాడు. గురువుకు దక్షిణంవైపు తాను రథాన్ని తోలాడు. అర్జునుడు సైంధవుణ్ణి చేరాలనే తమకంలో శకట వ్యూహాన్ని చించుకొంటూ మహాదారుణంగా పోరాడుతూ పోతున్నాడు.

ఇక్కడ ధర్మరాజు సాత్యకిని చూచి - "తన ప్రతిజ్ఞను నెర వేర్చుకొందామని నీ గురువొక్కడే సైన్య సమాకులమైన శకట వ్యూహంలోకి చొరబడ్డాడు. అక్కడ ఒంటరిగా

ఎట్లా యుద్ధం చేస్తున్నాడో? ఏమో? నాకు తెలియదు. నీవు కూడా అర్జునుడికి తోడుగా వెళ్ళి సాయం చేయి' అన్నాడు. ఈ మాటలకు సాత్యకి పొంగిపోయాడు.

వ్యూహం ముఖభాగాన వున్న ద్రోణుడి దృష్టిలో పడకుండా, పక్కకు తప్పిపోయి, శత్రు సైన్యాన్ని తుత్తునియలు చేస్తూ, కౌరవ సేనకు పిట్ట పిడుగులాగా విహరిస్తున్నాడు.

ఇట్లు అతి భయంకరంగా యుద్ధం చేస్తూ సాత్యకి శకట వ్యూహ మధ్య భాగంలోకి చొచ్చుకుపోయాడు. అక్కడ భూరిశ్రవుడెదురయ్యాడు. పాత పగలు పొగలు చిమ్ముతూ వుంటే వొకరినొకరు పేర్కొని, దార్కొని - మార్కొని తులారణం చేస్తున్నారు.

కొంతసేపటికి యిద్దరు విరథులై ముష్టి యుద్ధానికి దిగారు. భూరిశ్రవుడు సమరోత్సాహంతో రెట్టించిన పౌరుషంతో సాత్యకిని బట్టుకొని, పడవేసి, రొమ్ముదొక్కి నిలచి, కాలసర్పంలాంటి కత్తిని దాల్చిన తనచేతిని పైకెత్తాడు. కృష్ణుడు దూరాన వుండి దీన్ని గమనించి పరికించి, తొందరపడి అర్జునుణ్ణి చూచి -

"అర్జునా! అదుగో అటు చూడు, నీ శిష్యుణ్ణి కిందపడవేసి, ఎవడో మదంతో గొంతు కోయటానికి సిద్ధంగా వున్నాడు; చూడు; ఆ శత్రు హస్తాన్ని నరికి నీ శిష్యుణ్ణి బ్రతికించు - యుద్ధనీతి గాదని ఆలోచించకు; రణనీతి సంగతి దైవానికెరుక; ముందు నీ శిష్యుణ్ణి బ్రతికించు; యుద్ధంలో సాయం చేద్దామని నీకోసం వచ్చాడు. ముందు వెనుకలాలోచిస్తే లాభం లేదు. తొందరపడు" అని వుసికొలిపాడు.

కృష్ణుడి మాటలు చెవిన బడ్డ వెంటనే సవ్యసాచి అమోఘమైన బాణం తన వింటితో వెంటనే ఆ దిక్కునకు వదిలాడు. పాండవ మధ్యముడి వింటి నుండి విడువబడ్డ బాణం తగిలీ తగలటంతోటే సోమదత్త హస్తం సగం తెగి నేల మీద బడ్డది. దాన్ని చూచిన యోధ వరులంతా భయకంపితులయ్యారు.

కోపోద్రేకంతో వాడలు తెలియక సాత్యకి భూరిశ్రవుని కిందకి పడదోసి, కంఠం తెగనరికాడు. ఉభయ సైన్యాలు హాహాకారాలు చేశాయి. ఇక సైంధవుణ్ణి చంపాలనే ఉత్కంఠతో అర్జునుడు కౌరవ సేనాపతుల్ని చిందరవందర చేస్తున్నాడు. ఇంతలో పొద్దుగూకవచ్చింది. అర్జునుడు విషాద చిత్తుడయ్యాడు.

పొద్దుగూకజొచ్చింది. చెడగొండ ఏర్పడ్డది. ఆకాశంలో ఎర్రలు తోలుతున్నాయి. ఉండబట్టలేక సైంధవుడు మెడ సాచి పటమట దిక్కుకు చూడసాగాడు. కృష్ణుడీ దృశ్యాన్ని చూచాడు. "ఇదే మంచి సమయం - పోనీయరాదని అర్జునుడికి సైగ చేశాడు. క్రీడి ఏమాత్రం తడపడకుండా విద్యామోఘమైన శస్త్రాన్ని వింటిన సంధించి ఆ బాణంతో సైంధవుడి తల నేల దొర్లిపడేట్టు చేశాడు.

పొద్దుగూకింది. అర్జునుడు బాస తప్పి సైంధవుణ్ణి చంపాడు - అని కొంతమందన్నారు. పొద్దుగూకిందని పొరబడ్డారే కాని, నిజంగా పొద్దుగూకలేదని కొంతమంది గొల్లుమని

పలికారు.

ఏది ఎట్లా అయితేనేం మొత్తం మీద సైంధవుడి తల నేల బడ్డది. అర్జునుడు అగ్నిలో ప్రవేశించలేదు.

యుద్ధం మొదలై పదిహేను రోజులు గడిచాయి. కౌరవ సేనాధ్యక్షుడు ద్రోణుడు "ఈనాటితో యుద్ధం ముగుస్తుంది" అని పలికి వుగ్రరూపం దాల్చి ఆహవ రంగంలో, ద్రుపద విరాట రాజులను తన నిశితాంబకములతో తుదముట్టించాడు.

నాటి ద్రోణుడి వీర విహారాన్ని తిలకించిన పాండవ సేన బెగడిల్లి ప్రాణాల మీద తీపి బుట్టి, ఆయుధాలు విడిచిపెట్టి సమర రంగం దద్దరిల్లేలా కాలికి బుద్ధి చెప్పటం మొదలుపెట్టారు.

అప్పుడు పాండవ సైన్యం చెల్లాచెదరై పారిపోవడం కృష్ణుడు చూచాడు. తాను ఏమీ చేయలేదు. అప్పుడు యాదవుడు ధర్మరాజును చూచి – "ధర్మజా! తప్పని అనబోకు, యిది యుద్ధనీతి కాదని కూడా చెప్పవచ్చు. నీవు ద్రోణుడికి సమీపంగా బోయి – వొక మాట అంటే, యిప్పుడు మన సైన్యానికి దాపురించిన ముప్పు తప్పుతుంది. లేదా – యిప్పుడే మనకు చాల మూడుతుంది.

ద్రోణుడు శస్త్రాన్ని విడిచిపెడితే గాని, మనం అతని ధాటికి తట్టుకొని నిలబడలేము. అతని చేతిలో విల్లున్నంతవరకు నిలువరించటం ఎవ్వరి తరము కాదు. వినకూడని మాట వింటే, అస్త్ర సన్యాసం చేస్తాడనే మాట నాకూ తెలుసు. కాబట్టి, మన భీముని వల్ల చచ్చిన అశ్వత్థామ అనే పేరు గల ఏనుగు నెపంతో – అశ్వత్థామ– చచ్చె– అని చెప్పు" అన్నాడు,

కృష్ణుడి మాటలు విని కొంతసేపటివరకు ఇష్టం చూపలేదు, తరువాత 'సరే' అని ద్రోణాచార్యుడి దగ్గరకు పోయి, పెద్దగా – 'అశ్వత్థామ చచ్చె' అని చెప్పి, చిన్నగా – ఏనుగు అని అన్నాడు. ద్రోణుడు మొదట అన్న మాట విని అస్త్ర సన్యాసం గావించాడు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు విజృంభించి ద్రోణుడి రథం మీదకి దూకి, జుట్టు పట్టుకుని తల నరికి మొండేన్ని భూమి మీదకు పడవేశాడు.

గురుడైన ద్రోణుడు మడిశాడు. కులపతి కురు సైన్యానికి కర్ణుణ్ణి అధ్యక్షుడిగా నియమించాడు. పదిహేడో రోజున కర్ణార్జునులిద్దరూ యుద్ధం చేయటానికి ఆహవ రంగంలో పరస్పరం ఒకరినొకరు ఎదుర్కొన్నారు.

సుశిక్షితులు – అనన్యవీరులైన కర్ణార్జునులు ఎక్కటి కయ్యం చేస్తూ వుంటే ఉభయ సైన్యాలు యుద్ధం మాని, చుట్టూ మూగి, వాళ్ళ కయ్యపు పోరును తిలకిస్తున్నారు. కనురెప్పలు కూడా ఆర్పకుండా వుభయ సైన్యాలు తదేకంగా చూస్తున్నాయి. ఇద్దరి శక్తి సామర్థ్యాలు ఒకే రూపుగా కనిపించసాగాయి.

ఇట్లా జరుగుతున్న సమయంలో సూర్యనందనుడి రథచక్రం ఒకటి భూమిలో దిగబడ్డది. ఒక చక్రం దిగబడేటప్పటికి రథం ఒడ్డు బారుగా వుంది. కర్ణుడు చేసేది లేక రథం దిగి, చక్రం లేవనెత్తటం కోసం నిల్చున్నాడు. అర్జునుణ్ణి చూశాడు.

"అర్జునా! నేను నిరాయుధుణ్ణి. రథ చక్రం పైకెత్తే ప్రయత్నంలో వున్నా. కాబట్టి చక్రాలు పైకి లేవనెత్తే వరకు బాణం వేయబోకు. క్షత్రియ ధర్మం నీకు వేరుగా చెప్పవలసిన పనిలేదు" అన్నాడు కర్ణుడు.

దానికి పార్థుడు నవ్వి "కర్ణా! యుద్ధ నీతి నీకిప్పుడు తెలిసిందా? పసివాడైన నా కొడుకు అభిమన్యుణ్ణి, ఒంటరి చేసి పట్టుకొని పదిమంది చుట్టుముాగి చంపినప్పుడీ రణ ధర్మం ఎక్కడికి పోయింది చెప్పు? కాని మాటలెందుకు-?" అనేటప్పటికి సూతసుతుడు పాండవ మధ్యముణ్ణి చూచి-

"పలువురితో పోరాడాలని యుద్ధానికి వచ్చిన వాడితో పదిమంది కలసి యుద్ధం చేయడం నేరమౌతుందా? చంపటం అధర్మమౌతుందా? పాలకుడవు గాబట్టి ఏమైనా మాటలాడుతావు.

అదీగాక -

ఇది ధర్మమని చెప్పా, అంతేగాని, నీతో యుద్ధం చేయటానికి భయపడి, ఏదోరకంగా ప్రాణాలను కాపాడుకోవాలనే కాంక్షతో పలకలేదు. నేను పుట్టి బుద్ధెరిగినప్పటి నుండీ పరులనెవ్వరినీ యేదీ కోరలేదు. ఇంతకు ముందెవ్వరినీ ప్రార్థించలేదు. నీ యిష్టం వచ్చినట్లు ప్రతాపం ప్రదర్శించు."

ఒకడెవడో అధర్మం చేశాడని చెప్పి, నీవు కూడా అధర్మం చేయడం మంచిదా? అయినా, కృష్ణుడి శిష్యుడివైన నీకేమి ధర్మం తెలుస్తుంది" అనేటప్పటికి పార్థుడికి ఆగ్రహం కలిగింది.

"ఓయి రాధేయా! మాకు ధర్మంతో పనేమిటి? శత్రు సంహారం చాలు; నీవు నీ పనులన్నీ తీరిగ్గా చేసుకొనేదాకా నేను కాచుకుని కూర్చుంటానా?"

"అవునవును, అర్జునా! నీవు కృష్ణుడి శిష్యుడవన్న సంగతి మరచి పోయా! ఈ రకంగా ధర్మం వల్లించటానికి తగినవాడవే" అంటూ నవ్వుతూ కర్ణుడు రథచక్రాన్ని కాలితో తన్నిపెట్టి పైకి లేవనెత్తటానికి ప్రయత్నిస్తున్నాడు.

ఆ సమయంలో అర్జునుడు దివ్య బాణమొక్కటి తన వింట సంధించి విడిచి కర్ణుడి తల తెగవేశాడు.

ఆ తరువాత సర్పకేతనుడు దుర్యోధనుడు శల్యుణ్ణి సైన్యాధ్యక్షుణ్ణి చేశాడు. అతడు దొమ్మి సమరం గావించి, ధర్మరాజు బాణహతిచే యుద్ధభూమిలో నేలకొరిగాడు.

శల్యుడు కూడా చనిపోయాడు. శల్యుడి మరణంతో కౌరవ సేనలు పారిపోయాయి.

ఇదంతా కౌరవ క్షమాపతి చూచి, తల్లడపడ్డాడు. ఇక తనకు కూడా వల్లడి తప్పదని అతని మనస్సు డిల్లపడింది. ఏమీ తోచలేదు, విపరీతమైన విచారంలో మునిగిపోయాడు. చేసేది లేక గదాయుధాన్ని తోడుగా తీసుకొని యెవ్వరికీ కనబడకుండా ఎక్కడికో పోయాడు.

# ఊరు భంగం

శంఖ చక్ర పద్మరేఖల చిహ్నితలైన కాలిజాడల్ని బట్టి దుర్యోధన సార్వభౌముడు ద్వైపాయన మడుగులో జల స్తంభన విద్య చేత దాక్కొన్నాడని యెంచి ధర్మరాజు శ్రీకృష్ణ సహితుడై అక్కడికి వెళ్ళాడు. తరువాత భీమాదులు పోటుమాటల చేత ఉడికించగా, అభిమాన ధనుడైన సుయోధనుడు నీటిలో నుండి బయటకొచ్చి, ఒడ్డుకు చేరి నిలుచున్నాడు. కృష్ణుడు ఎగతాళి చేస్తూ నవ్వాడు.

"ఓ కురు వంశవర్ధనా! రాజ్య భాగం పంచిపెట్టకుండా సోదరుల్ని, చుట్టాల్ని, హితుల్నీ, పుత్రుల్ని వ్యర్థంగా స్వర్గానికి పంపావు, నీ కోసమని వచ్చి యెందరో రాజులు యుద్ధ రంగంలో ప్రాణాలు విడిచారు. ఇదంతా చూచి, లోకులు నవ్వుతారని కూడా భావించకుండా ఈ మడుగు లోపల దాక్కున్నావెందుకయ్యా!"

కృష్ణుడెద్దేవగా పలికిన పలుకులు విన్నాడు దుర్యోధనుడు.

"కృష్ణా! అలసిపోయా, సేద తీర్చుకొందామని ప్రశాంతంగా వుంటుందని యీ మడుగులోకి వచ్చా. అంతేగాని, మీకు భయపడి యిక్కడ దాగలేదయ్యా! అనవసరంగా లేనిపోని మాటలనటం దేనికి?" అని సమాధానం చెప్పాడు.

ధర్మరాజా మాటలు విని "దుర్యోధనా! రారాజా! నీతో యుద్ధం చేయటానికే వచ్చాం. అయితే, మేమయిదుగురమున్నాం కదా - అని భయపడవలసిన పని లేదు. నా మాట విను, మా అయిదుగురిలో నీవొక్కడితో యుద్ధం చేస్తే చాలు. నీవు గెలిస్తే రాజ్య సంపదలు నీకే దక్కుతాయి. లేదా స్వర్గభోగాలు లభిస్తాయి. అందుకని నీ యిష్టం వచ్చినట్టు చేయి. అంతేగాదు, వివిధ యుద్ధ పద్ధతుల్లో నీకిష్టమైన యుద్ధమే చేద్దాం- అది కూడా నీ కిష్టమైన వానితోటే-" అని అన్నాడు.

కౌంతేయాగ్రజుని పలుకులకు సారసదళాక్షుడు ఉలిక్కిపడ్డాడు. ఉడ్డకుడిచాడు, వెగటుదనం మొగాన కొట్టవచ్చినట్టు కనిపించింది. ఆశ్చర్యపడ్డాడు. అర్జునుడి దగ్గరకు మెల్లగా పోయి ఏదో చెప్పబోతున్నాడు, కృష్ణుడి పరిస్థితి గమనించాడు దుర్యోధనుడు.

"వనరుహనాభా! ధర్మరాజు వట్టి అమాయకుడని అనుకొంటున్నావా? అది చాల పొరపాటు,. అతడందరికంటే ఘటికుడు. నా సంగతి అతనికి చిన్నప్పటి నుండీ బాగా తెలుసు. అందుకే అట్లు మాట్లాడాడు. మీకేమీ అనుమానం వద్దు. భయం అంతకంటే వద్దు.

తెలిసో - తెలియకో- నాకు ధర్మరాజు మంచి గౌరవాన్నే కల్పించాడు. నేను దాన్ని దక్కించుకోవాలి. దక్కించుకుంటాను కూడా! నీవేమీ కంగారుపడబోకు.

కృష్ణా! కౌరవ వంశ గౌరవ ప్రతిష్ఠలకు సంప్రదాయాలకూ కొంచెం కూడా భంగం రానీయకుండా రాజ్యపాలన గావించా; శత్రువులు గూడా మెచ్చుకొనేట్లు అమిత శ్రద్ధాసక్తులతో ఆర్తుల దీనాలాపాలను ఆలకించా. ధర్మమార్గం లవలేశం కూడా దాటకుండా దుర్మార్గులైన వాళ్ళ మదాన్ని అణచివేశా, జూదచోరుల్ని సమీపంలో లేకుండా యిటువైపు కలలో కూడా తేరిపార జూడకుండా పారదోలాను. ఎవరెంత అడిగితే అంత దానం చేశా. ప్రజలు సంతోషించేలా వివిధ యజ్ఞాలు, యాగాలు కావించా, సకల విధ భోగ భాగ్యాలనుభవించా. ఇక నాకు చావంటే భయమెందుకు, సందేహమెందుకు?

నిన్నుగాని, ధర్మజుణ్ణి గాని, అర్జునుణ్ణిగాని, కవలలను గానీ యుద్ధం చేద్దాం రండి - అంటే గదారణంలో విజయం సాధించడం నల్లేరుపై బండి నడక - అది నాకు తెలుసు; కాని, ఇట్లా చేస్తే నన్ను లోకంలో మెచ్చరు; నా మనస్సు కూడా అంగీరించదు. నా వంశ గౌరవ మర్యాదలను చచ్చేవరకు విడిచిపెట్టను.

ఇప్పటివరకు - రారాజు - అనే పేరు సార్థకం చెందేట్టు రాజ్యపాలన గావించా. ఇక నుండి నన్ను లోకం - మాన దుర్యోధనుడు అనే రీతిగా కవ్వించేట్టు మసలుకొంటా" అని బరవశము చేస్తూ, మహా సంరంభంతో భీముని దిక్కు చూచి చేయి విసిరాడు.

"భీమా! ఇద్దరం వొక్క గురువు దగ్గరే గదా యుద్ధం నేర్చుకొన్నాం. కాని యిప్పటిదాకా మన యుద్ధ కౌశలాన్ని ఎక్కడా చూపలేదు. అట్లాంటి అవకాశం కూడా కలుగలేదు. ఇప్పుడీ అవకాశం వచ్చింది. అందులో కృష్ణుడి సాన్నిధ్యంలో రావటం చాలా మంచిది. గురుదేవులైన బలరాముని వద్ద విద్దెను నేర్చుకొన్నాం. ఎన్నో రహస్యాలు గదా యుద్ధానికి సంబంధించినవి ఆయన మనకు నేర్పాడు. ఆ విశేషాలను వితథం చేయకుండా, యుద్ధనీతిని వీసం కూడా వీడబుచ్చకుండా నిన్ను, నీ పితరుల దగ్గరకు పంపుతా. నీ భీకర మరణాన్ని చూచి మాధవుడావలిస్తాడు.

అదుగో! మాటల్లోనే తాలాంకుడు గురుదేవుడు బలరాముడు వచ్చారు. అయనకు నమస్కరిద్దాం పద. ఆ మీదటనే యుద్ధానికి దిగుదాం. ఇక మనకేమాత్రం కొదవుండదు. ఇందుకు సంకోచించవలసిన పని కూడా లేదు. జంకు కొంకులతో పనిలేదు.

వాయునందనా! భూపతులంతా పొగడేట్టు గదా రణ పాండిత్యాన్ని చూపించి కీర్తి చంద్రికలను వ్యాపింపచేయవచ్చును. నాకూ నీకూ భయంకర యుద్ధం తప్పదు. ధర్మ పీడ జరుగుతుందనే భయం కూడా అవసరం లేదు. ఇక మాటల్ని కట్టిపెట్టి యుద్ధానికి రా." అంటూ బలరామ గురుదేవులను వినమ్రుడై సుయోధనుడు సమీపించాడు.

"దేశికేంద్రా! శిష్యుడైన సుయోధనుడభివాదం చేస్తున్నాడు, అతి భయంకరమైన

యుద్ధం చేయటానికి ప్రాణాన్ని పణంగా బెట్టి వెళ్తున్నాడు. దీవించి పంపగోరతా" అని వినయంగా నమస్కరించాడు.

కౌరవ రాజీవిధంగా బలరాముడిచే దీవెనలంది, సంతోషంతో మొగమింత చేసి, ఒడలు పెంచి, భుజాస్ఫాలనం కావించి, గర్జించి, దీర్ఘమైన గదా దండాన్ని కమిచిపట్టి యుద్ధ రంగంలో నిలబడ్డాడు. భీముడు కూడా కన్నెరుగని కోపంతో గదను చేతబట్టి సారిస్తూ తొడ చరిచి సుయోధనుణ్ణి యెదుర్కొన్నాడు.

భీమదుర్యోధనులిద్దరూ జయ కాంక్షతో పోరు సాగించారు. ఒకరినొకరు, సమీపిస్తున్నారు, అంతలోనే దూరంగా జరుగుతున్నారు. గదను గిరగిర త్రిప్పి ఒకరినొకరు కొడుతున్నారు. గుండ్రంగా చక్రాకారంలో తిరుగుతున్నారు, మెలకువలతో తమ తమ చాతురిని చూపిస్తూ చాలాసేపు యుద్ధం చేశారు. స్థూల శరీరం గల భీముడు క్రమక్రమగా అలసిపోవటం కనిపించింది. రోజుతూ రొప్పుతూ నిట్టూర్పులు విడుస్తున్నాడు. అతి కష్టంమీద గాని మండలి భ్రమణం చేస్తున్నాడు, ఎదుట వున్న శత్రువును కొట్టడం మాని, తన్ను తాను రక్షించుకొనే ప్రయత్నంలో వున్నాడు. దుర్యోధనుడు మాత్రం అతి లాఘవాన్ని ప్రదర్శిస్తూ చురుకుదనంతో ఎక్కడ చూచినా తానే అన్నట్టు భీముణ్ణి ముప్పుతిప్పలు పెడుతున్నాడు.

సర్పధ్వజుడైన సుయోధనుడు చకచక మాటలాడుతూ చకపికమని గదను తిప్పుతూ - కకావికలై - తికమకలై- కళ్ళు తిరిగి పడేట్టు భీముణ్ణి తీవ్రంగా కొట్టాడు. ఆ దెబ్బ తట్టుకోలేక భీముడు సొక్కి సోలిపోయి సొమ్మసిల్లాడు. కొంతసేపటికి తెప్పరిల్లుకొని గదను బట్టుకొని, పెదవి కరచి యుద్ధం చేయ ప్రారంభించాడు.

భీముడికి అడుగులు తడబడుతున్నాయి, బాగా బడలిక కనుపిస్తూంది; భయంతో వణికిపోతున్నాడు; చేతిలోని గద పైకి లేవటం లేదు. శ్రీకృష్ణుడు భీముడి దుస్థితిని పసిగట్టాడు. అర్జునుణ్ణి సమీపించి-

"ఫల్గుణా! విను! మన భీముడీ దుర్యోధనుణ్ణి గెలవడమనేది కల్ల. అలవాటు లేకపోవడం వల్ల, అతికష్టంతో పోరాడుతున్నాడు. జాగ్రత్తగా చూడు నీకే తెలుస్తుంది. మాట మాటకీ తూలిపోతూ చప్పబడిపోతున్నాడు. నడకలో కూడా ఏ మాత్రం బిగువు కనిపించటం లేదు. హస్తినా పురాధీశ్వరుడు దుర్యోధనుడు ఎంతో లాఘవాన్ని - చాకచక్యాన్ని ప్రదర్శిస్తూ వెరవుతో, గదను తన యిచ్ఛ వచ్చినట్టు తిప్పి విసరుతున్నాడు. మన వాయుపుత్రుడో! ప్రతివీరుణ్ణి పీచమణచడం మాని, తన్ను తాను కాపాడుకొనే ప్రయత్నంలో వున్నాడు. కావాలంటే చూడు; వాయుపుత్రుడి చావును నేను కళ్ళారా చూడలేను.

ఇక లాభం లేదు; పళ్ళ బిగువుతో గదను తిప్పుతున్నాడు. నిట్టూర్చటం యెక్కువైంది. ఉపేక్ష చేస్తే కాసేపటికి భీముడు మనకు దక్కడు; కౌరవుడు భీముణ్ణి అంతమొందించాలనే

కోపంతో కాచుకొని వున్నాడు.

ధర్మం సంగతి మనకెందుకయ్యా! దాని ఆలోచనే మనకు వద్దు. తొడలు విరగ్గొట్టించి ధూర్తుడైన ధార్తరాష్ట్రుణ్ణి చంపిస్తా; విజయలక్ష్మి ధర్మరాజును వరించేట్టు చేస్తా. గదా యుద్ధంలో నాభి క్రింద భాగాన కొట్టకూడదనే యుద్ధ నీతి వుంది. నీతిమంతులంతా దాన్ని యెలుగెత్తి చెపుతారు. కాబట్టే, దుర్యోధనుడు పైభాగాన్ని మాత్రమే కాపాడుకొంటు న్నాడు. బొడ్డు క్రింద భాగాన్ని చూడనే చూడడం లేదు.

కాని, గదా కళా పండితుడు, ధర్మ శీలుడు బలరాముడిక్కడే వున్నాడు. అతడీ విషయంలో అడ్డు వస్తాడనే భయం మనసును కలతపెడుతుంది. అయినా, దుర్యోధనుణ్ణి నేలపై కూల్చిన తరువాత బలరాముణ్ణి యేదోరకంగా శాంతింపచేయవచ్చులే.

కాబట్టి నీవు భీముని యెదుటకు పోయి, తొడ చరచుకో. దాన్ని వాయునందనుడు గుర్తుగా గ్రహించి కౌరవనాథుడి తొడలు విరగ్గొడతాడు. ఈ పని నీవు చేయాలి. దీన్ని పొక్కనీయబోకు" అని వినిపించి సలహా యిచ్చాడు.

అర్జునుడు కృష్ణుడి సలహా ప్రకారం, యేదో పని వున్నవాడిలా భీమ దుర్యోధనులు యుద్ధం చేస్తున్న చోటికి పోయి, భీముడికి ఎదురుగా నిలబడి అతడు తన్ని చూచేట్టు చేసి తొడ చరచి సైగ చేశాడు. భీముడు పార్థుడి సంజ్ఞను గ్రహించి వుత్సాహం తెచ్చుకొన్నాడు.

దుర్యోధనుడు మాత్రం బలదర్పదుర్వాసుడై, ఉరవడితో ఆకాశానికెగిరి, గదను చక్కబట్టుకొని ఒక్క పెట్టుతో భీముణ్ణి మట్టుపెట్టటానికి గర్జించాడు. గర్జించి సమర్ధజవంతో ప్రచండ గదాహతితో తన్ను మట్టిపాలు చేయటానికి మీదకు లంఘించే కౌరవ భూపాలుణ్ణి చూచాడు భీముడు. బలాన్ని కూడలాక్కొని భీకరంగా దండహతితో ఊరుయుగ్మాన్ని నుగ్గునూచిగా భగ్నం గావించాడు. బాణం దెబ్బ తగిలిన పక్షిరాజు వేదన బొంది నేలపై కుప్పకూలినట్లు సుయోధన సార్వభౌముడు రారాజు పడిపోయాడు.

నేలకొరిగిన మానధనాగ్రయాయి కౌరవ నృపాలుని చూచి భీముడు మాత్సర్యంతో దగ్గరకు పోయి - పదిమందీ - 'ఇది తప్పు, వద్దు' అని అంటున్నా లెక్కచేయక తీవ్ర కోపంతో అతడి శిరస్సును ఎడమ కాలితో తన్నాడు. ఈ ధూర్త వర్తనాన్ని చూచి అంతా అసహ్యించుకొన్నారు. అంతాగ్రహం కూడదన్నారు. అక్కడే వున్న బలరాముడు కూడా ఆ దృశ్యాన్ని చూచాడు. దుర్భరపరితాపం బొందాడు. భరించలేక, భయంకరమైన గదను తీసుకొని 'ఓరీ ! భీమా! అక్కడే వుండు; అధర్మ యుద్ధం చేసి కౌరవ నృపాలుని మానధనుణ్ణి కూలుస్తావా? ఇప్పుడే నిన్ను యమసదనానికి పంపుతా. కౌరవ భూపాల క్షోభాన్ని నేను పాపలేనా!. చూడు" అంటూ భీముడి మీదకు పోబోయాడు.

ఒక వంక ధర్మరాజు అధర్మ యుద్ధం జరిగింది కదా.... అని ధర్మ పీడకు

భయపడుతున్నాడు. వెంటనే కృష్ణుడు అన్నయైన బలరాముడికి అడ్డం వచ్చి, చేతిలోని గదను లాక్కొన్నాడు. గద్గద స్వరంతో అన్నను చూచి చెప్పాడు.

"అన్నా! నీవు భీమసేనుణ్ణి చంపితే చచ్చిన దుర్యోధనుడు వస్తాడా? మన మేనత్త - పొచ్చెం లేనివాడివని - నిన్నెప్పుడు మెచ్చుకుంటుంది గదా! అయిన పనేదో అయింది. యిప్పుడు కోపం వస్తే మాత్రం వచ్చేదేముంది?" అని బ్రతిమాలి అతణ్ణి అవతలకు పంపాడు.

బలరాముడు కూడా వాళ్ళ చేష్టలనేవగించుకొని - 'కర్మఫలం తప్పకుండా అనుభవిస్తారులే" అని అంటూ తన దారిన తానెక్కడికో వెళ్ళాడు.

భీముడి గదా ఘాతం వల్ల తొడలు విరిగి క్రింద పడి వున్న సుయోధనుడీ సంభాషణంతా విన్నాడు. విని, నడుం విరిగి మణిరోచిష్టులై పడగ విప్పి లేచి యాడే కాలసర్పంలాగా వివిధ మణికాంతులతో ధగద్ధగ మెరుస్తున్న కిరీటం గల తన తలనెత్తి, నేల మీద చేతుల నానించి కృష్ణుణ్ణి చూచి -

"ఓయీ కృష్ణా! సేతువు మొదలు హిమాలయాలు వరకు గల భరతమాత ధాత్రీతలమంతా భర్తలను, సంతానాన్ని కోల్పోయిన స్త్రీల ఆక్రందనలతోను, హాహాకారాలతోను ప్రతిధ్వనిస్తోంది. నిద్రపోదామని కన్నులు మూస్తే మాత్రం నీకు నిద్ర పడుతుందా! నీ తలవ్రాతే నీకీరకమైన దుఃఖాన్ని తెచ్చిపెట్టింది.

భుజబల పరాక్రమోన్నతులైన మహీశులంతా భరత రణరం గంలో మరణిస్తే, ఈ వసుంధరా వలయమంతా నీవే పాలించవచ్చుననుకొన్నావా! అందుకే యాదవ సేనా వాహినిలోని బల్లిదొరలెవరినీ ఈ యుద్ధంలో పాల్గొననీయలేదు. ఇది తేటతెల్లంగా తెలుస్తుంది; కాని, ధర్మరాజు నీ కుతంత్రాన్ని బసిగట్టకుండా వుండడు.

మాధవా! సమస్త ధారుణీశ్వరులు సమరాంగణంలో రాలిపోతే, యాదవ వంశమే పాలిస్తుందని భ్రమలు పడ్డావా? ఇది ముమ్మాటికీ చెల్లదు; ఈ సత్యాన్ని గ్రహించు; నీ వల్ల సంభవించిన బహుపాతకమూలక ధర్మ పీడలు నీ యాదవ వంశాన్ని దుఃఖమయం చేసి, పీల్చి పిప్పి చేయకుండా వుంటాయా!

బలహీనుడెప్పుడు బలవంతుణ్ణి నమ్మకూడదు; సమయం చూచి బలవంతుడు బలహీనుణ్ణి మింగకుండా వుండడు కూడా!

నిఖిల రాజనీతి మర్మజ్ఞా! నిన్ను నమ్ముకున్న పాండవుల చేత పగవాడి కాళ్ళు పట్టించావు; కురువృద్ధుల్ని - ద్రోణ భీష్ముల్ని - పరువు విడనాడి కొట్టించావు; యుద్ధ నీతిని తుంగలో దొక్కి అధర్మ యుద్ధం చేయించి మహిత వీరులనందరినీ మట్టు పెట్టించావు. శాంతి సౌభ్రాతృత్వంతో విలసిల్లుతున్న భరత నందనవనంలో ఆరని విద్వేషాగ్నిని రగిల్చావు. ఇంతటి మహాదారుణమైన పాపకార్యాల ఫలితాన్ని

ఎవడనుభవిస్తాడనుకొన్నావు? కలవరపాటు గల నీవు చావగలవు.

రణ ధర్మాన్ని వీసర పోనీయకుండా, పెద్దలు మెచ్చేట్లు వీర విహారము సలిపి భీకర సంగ్రామం చేశా. స్వర్గ సుఖాలనుభవించడానికి వెడుతున్నా. నాకు దుఃఖమనేది లేదు. నీవూ - పాండవులూ - మీ కుత్సిత కార్యాలకు అంతులేని విషాద ఖేదాలలో మునిగిపోతారు. నీ బంటులైన పాండవులు ధర్మదూరులై, నీతి బాహ్యులై భరత కులానికి కళంకం ఆపాదించారు. చంద్రవంశానికి నీ పుట్టుకవల్ల పుట్టుమచ్చ దాపురించింది.

వాసుదేవా! నీవు భీముడి సమక్షంలో అర్జునుడితో సైగ చేయించటం నా కళ్ళారా చూచా. ఇంతటి నీచానికి ఒడిగడతావని భావించలేదు; నీ పాప కార్యంవల్లనే యిట్లు అయా! బలరామ గురుదేవులున్నారు గదా! మోసమేమీ జరుగదనే అభిప్రాయంతో వున్నా. అందుకే శరీరం పైభాగాన్ని కాపాడుకొంటున్నా-గదా యుద్ధనీతిని గమనించి; కాని క్రింది భాగాన్ని కాపాడుకోలేదు.

కాబట్టే ఈ స్థితి సంభవించింది. వీరస్వర్గాన్నలంకరిస్తా. కౌరవ వీరాధివీరులకిచ్చే కైవారాలనందుకుంటా. గౌరవ విషయంలో నాకే మాత్రం లోటులేదు" అని అంటూ దగ్గుత్తిక పడి, క్రమక్రమంగా మాగన్ను పెట్టి మాటలాడకుండా వూరుకున్నాడు. తరువాత పాండవులు కూడా కృష్ణుడితో కలసి యథేచ్ఛగా వెళ్ళారు.

కృష్ణుడికి మాత్రం మనసులో ఒక ఆలోచన తట్టింది - "అశ్వత్థామ సామాన్యుడు కాడు; కౌరవ రాజుపై అమితమైన ప్రేమాదరాలున్నవాడు. కురురాజు మరణం సంగతి తెలుసుకొంటే, కుపితాత్ముడై యుద్ధం చేసి పాండు కుమారులనందరినీ తునియలు చేస్తాడు,. లేదా, దొంగపాటుననైనా బలిగొంటాడు. పాండవేయులాతని బారి పడకుండా ఎట్లాగైనా ఈ రాత్రి కాపాడాలి. వాళ్ళ నెక్కడైనా సురక్షితంగా వుంచి రక్షించాలి" అని అనుకుని ధర్మరాజును చూచి -

"ధర్మజా! పద్దెనిమిది రోజులు ఎడతెరిపి లేకుండా యుద్ధం చేశాం. బాగా అలసిపోయాం. దుర్మార్గుడైన దుర్యోధనుడు కూడా మరణించాడు. నీవూ - నీ సోదరులు - నేను - సాత్యకి అందరం ఈ రాత్రి ఓఘవతీ నది నిర్మల వాయు తరంగాలలో సేదదీరి, ఆ నది యిసుక తిన్నెలపై విశ్రమిద్దాం" అని చెప్పి, కౌంతేయాగ్రజుని ఒప్పించి, ఆ రాత్రి పంచపాండవులని కృష్ణుడు, సాత్యకితో ఓఘవతీ పుణ్యస్థలంలో విశ్రమించారు.

అశ్వత్థామ విజృంభించి, న్యాయయుద్ధంలో పాండవులను గెలవడం దుర్లభమని తలచి, అర్ధరాత్రి పట కుటీరాలలో ప్రవేశించి కృప, కృతవర్మల సాయంతో అందరినీ ఉపపాండవులను చంపి, రారాజు ఋణం తీర్చుకొన్నాడు.

# యాదవ ప్రళయం

భారత యుద్ధం ముగిసింది. సాయం చేసి యుద్ధంలో గెలిపించాడు గదా - అనే సంతోషంలో పాండవులు కృష్ణుణ్ణి గౌరవించి సన్మానించారు. పాండవుల సమ్మానం పొంది వారి జనాభుడు ద్వారకా నగరానికి బయలుదేరాడు. కొంత దూరం పోయేటప్పటికి సంజ చీకటి కావచ్చింది. అక్కడికి దగ్గరలోనే ఉద్దాలక మహాముని ఆశ్రమం వుందని తెలిసి, ఆ యదు కేశవుడు రాత్రి అక్కడ గడుపుదామని ఆ మున్యా శ్రమానికి చేరుకొన్నాడు.

సంతోషించిన ఉద్దాలకుడు ఆశ్రమానికి వచ్చిన కృష్ణుడ్ని గౌరవించి, అతిథి మర్యాదలతో సత్కరించాడు. తరువాత కుతూహలం కలిగి కృష్ణుణ్ణి చూచి -

"సారస దళ నేత్రా! కౌరవ పాండవులకు పగ కలిగింది గదా! అదేమైంది? సంధి అవుతుందని కూడా విన్నా; జరిగిందా? అదెట్లు మారింది? సంధిని నీవే చేస్తున్నావని తెలిసింది; నిజంగా నీవే సంధి చేస్తే అది కాకుండా పోదు; ఎవరూ సంధిని వ్యతిరేకించరు. ఇది ధ్రువం" అని అడిగాడు.

ఉద్దాలక మహాముని మాటలు విన్న కృష్ణుడు -

"తాపసేంద్రా! మీరన్నది నిజము. దుర్యోధన మహారాజు మొండితనాన్ని ప్రదర్శించడం వల్ల సంధి కుదరలేదు; సమరమే సంభవించింది. ఆ యుద్ధంలో కౌరవులంతా నేలపాలయ్యారు. విజయ లక్ష్మి ధర్మరాజుని వరించింది. పద్దెనిమిది అక్షౌహిణుల సైన్యం, పద్దెనిమిది రోజులు హోరాహోరీగా పోరు సలిపి అంతా నశించారు. కౌరవుల్లో అశ్వత్థామ - కృతవర్మ - కృపుడు మాత్రం మిగిలారు. పాండవుల పక్షంలో పాండవులైదుగురూ, సాత్యకి - యుయుత్సుడు - నేను బ్రతికాం.

భయంకరమైన ఆ యుద్ధం చూచిన ప్రతివాడికీ కంపం కలిగించింది. అన్నదమ్ములు దాయాభాగం కోసం తన్నుకోగా భరతార్ణవమంతా పీనుగు పెంటలతో నిండిపోయి, చివరకు నిర్మానుష్యమైంది" అని వచించాడు.

నళినాక్షుడు చెప్పిన మాటలు విని ఉద్దాలకముని కునారిల్లాడు; మండిపడ్డాడు; కటతటాలదిరిపోయాయి మునికి. కోపం కట్టలు తెచ్చుకొని వచ్చింది - సహించలేక -

"కృష్ణా! ఎందుకీ పనికిమాలిన మాటలు చెపుతావు? యుద్ధాన్ని నివారించగలిగి వుండి కూడా నివారించకుండా కౌరవ పక్ష యోధుల నందరినీ అన్యాయంగా ఘోర సంగ్రామం చేయించి చంపించావు. శాపాగ్నితో నిన్ను దగ్ధం చేస్తా చూడు. ఇదుగో శాపోదకం; నీ చాపల్యాన్ని భస్మం చేస్తా" అంటూ కోపంతో కమండలం చేత్తో తీసుకొని పైకెత్తి శాపమీయటానికి సిద్ధమయ్యాడు.

"ఉద్దాలక మహామునీ! ఆగుమాగుము! కోపం దిగమింగు. ముందు కమండలువు

అటు పెట్టు; ఇప్పుడు నేను చెప్పబోయే మాటలు విను; విన్న తరువాత నీకెట్లా తోస్తే అట్లా చేయి. తొందరేమొచ్చింది?

వాళ్ళనూ వీళ్ళనూ మాట్లాడినట్లుగా నన్ను కూడా మాట్లాడితే యెట్లా? ఈ యుద్ధం వూరికే రాలేదు. భూభారాన్ని తీర్చటం కోసం - వీర వినాశన హేతుభూతమై ఈశ్వర ప్రేరితమై ఈ సమరం సంభవించింది. దీన్ని మాన్పే శక్తి నాదగ్గర వుందంటావు; ఈశ్వర ప్రేరితమైన యుద్ధాన్ని మాన్పటానికి నేనెవరినయ్యా! ఈ సంగతి ఆలోచించావా?

పూర్వకర్మ ఫలాన్ని అనుభవించకుండా దాటిపోవడం ఎవరికైనా శక్యమంటావా మునీంద్రా? మానవుడు కర్మ చేతిలో కీలుబొమ్మ గదా! ఇందులో మర్మమేముంది?

ఎట్లాగైనా యిద్దరికీ సంధి చేద్దామని శక్తి వంచన లేకుండా ఎన్ని పాట్లు పడ్డానో యెవరికి తెలుస్తుంది? కౌరవ నాధుడొక్కడే నా మాట వినకుండా వున్నాడు; అందుకే బెడిసి కొట్టి సంధి విఫలమై, సమరం ముంచుకొచ్చింది.

యుద్ధంలో దారుణ మారణకాండ జరుగుతూ వుంటే, అతి భయంకరంగా గుండెలు వ్రయ్యలయ్యేట్టు హాహాకారాలు - యేడ్పులు- పెడబొబ్బలు చెలరేగుతుంటే - అది నాకేమైనా విందుగా వుంటుందనుకొన్నావా! నీవే ఆలోచించు మహామునీ!"

కృష్ణుడిట్లా కల్లబొల్లి మాటలు పెక్కులు చెప్పేటప్పటికి, వుద్దాలక మహాముని నిరుత్తరుడై మిన్నకున్నాడు. వెంటనే వసుదేవ తనయుడు ఇదే సమయమనుకున్నాడు.

ఉద్దాలక మహాముని పర్ణశాల మరుభూమిలో వుండి, మంచి నీళ్ళు కూడా దొరకని స్థితిలో వుందని కనిపెట్టి, నాలుగు మంచి మాటలు చెప్పి, చుట్టుపక్కల వున్న పొలాన్ని శోధించి నీళ్ళు పడే చోటు చూపి త్రవ్వించాడు. నిలువు లోతు పోయేటప్పటికి మంచి జల పడి గలగలమని నీళ్ళు పొంగి పైకి వచ్చి పొలాలన్నీ తడిసాయి.

ఋషి కూడా ఈ ఆకస్మిక జలపాతానికి మెత్తపడి, నోరు తెరచి మాట్లాడక వూరుకున్నాడు.

కృష్ణుడిట్లా బొంకులు బొంకి, వుద్దాలక మహాముని హృదయం లోతుపై వున్న కళంకాన్ని తుడిచి వేసి, అంతా దుర్యోధనుడిదే దోషమని చెప్పి, ఆ రాత్రి ఆశ్రమంలోనే కాలం వెళ్ళబుచ్చి, తెల్లవారు సమయాననే లేచి, మునీశ్వరుడి వద్ద సెలవు తీసుకుని ద్వారకా నగరం ప్రవేశించాడు. నిశ్చింతతో కాలం గడుపుతున్నాడు.

కురుపాండవ యుద్ధం భారత సవిత్రిని వీరరక్త కాసారమయం చేసింది. భూమి సమస్తం నిస్సారమైంది. ఎక్కడ చూచినా కన్నీటి కాలువలు, ఏ యింట చూచినా శోకార్తాలాపనలు నింగిని తాకుతున్నాయి. ఇక ఏ మాత్రం ఆటంకం లేకుండా జారచోరులు స్వేచ్ఛా విహారం చేస్తున్నారు.

యుద్ధంలో విజయం లభించింది గదా అని, విందామంటే ఎక్కడా మంగళవాద్యాలు

వినిపించటం లేదు. ఓదార్చటానిక్కూడా వీలుపడని యేడ్పులు మిన్నుముట్టాయి. చెవిటివాళ్ళు-గ్రుడ్డివాళ్ళు తామర తంపరలుగా పడి వున్నారు. చూద్దామన్నా పంట పొలాలు కాగడా పెట్టి వెదికినా లేవు. పీనుగు పెంటలతో కుళ్ళిపోయిన దుర్గంధ భూయిష్ట ప్రదేశాలు కనిపిస్తున్నాయి; ముచ్చట పడి చూద్దామంటే పుణ్యాంగనలు పొడగట్టడం లేదు.

దుఃఖ సముద్రంలో మునిగిన ముండమోపులే అంతటా వున్నారు. పెడబొబ్బలు లేని యిల్లు గాని, వూరు పల్లెలు గానీ మచ్చుకైనా కన్ను పొడుచుకున్నా కానరావు. భారత వర్షమంతా వల్లకాడుగా మారిపోయింది.

ఒకడి రాజ్యకాంక్ష - ఇంకొకడి మొండితనం - మరొకడి రాజనీతి - భారత ధాత్రిని పీల్చిపిప్పిచేశాయి, పేదరికం దేశంలో వికట నృత్యం చేసేట్టు చేశాయి. భీకరమైన పేదరికాన్ని నిర్మూలించటానికి ఈ బీదలకు దిక్కెవరున్నారు?

ధర్మపీడలు మాన్పదగినవాళ్ళు లేకపోవడం వల్ల పాపకృత్యాలు మితిమీరిపోతున్నాయి, మగవాళ్ళు యుద్ధంలో మరణించటం వల్ల స్త్రీల స్వైర విహారం మిన్నంటింది. తగవు దీర్చగలిగిన తగవరులెవ్వరూ లేకపోవటం వల్ల యువకుల ఆగడాలకు హద్దులు లేకుండా పోయాయి. భారతదేశమంతా దుస్సహమైన నరకంగా మారిపోయింది. కాలు కదిలించటానికే వీలులేకుండా పోయింది. ప్రాణ భయం దేశమంతటా అలముకొంది. ప్రతిదినం బ్రతుకు దిగులు పట్టుకొని పీడిస్తుంది. ఇట్లు భారత భూభాగమంతా సంక్షుభితమైంది; వ్యాకులమైంది. పాపమయమైంది. శోక రసాధిదేవత కావాసమైంది.

ఇక, అక్కడ ద్వారకలో యాదవులు తమ కెదురు లేదనే గర్వంతో ఎవరినీ లెక్కచేయక నీలుగుతూ- నిక్కుతూ వున్నారు. రాజులనందరినీ ధిక్కరించి, బలోపేతులై వృద్ధిచెందారు. భారత యుద్ధంలో వీరులంతా మరణించారు. తమకిక ఎదురే లేదన్నట్లు దుర్భర మదంతో తుళ్ళిపడుతున్నారు.

కుల పెద్దల్ని చూచి భక్తితో పూజించి, మర్యాదలను చూపడమే మానారు. గురువుల్ని గౌరవంతో అర్చించి శ్రద్ధాసక్తులతో దక్షిణ లీయటం మానివేశారు. ధర్మాత్ముల దగ్గరకు పోయి అణకువగా మాట్లాడడం వదిలిపెట్టారు. దైవతారాధాన పట్ల గల ఆసక్తిని విడిచి, మూడు పూటల సంజనే విడిచిపెట్టారు; యాదవులు గర్విష్ఠులై సప్త వ్యసనాలలో చిక్కుకుని క్రమం తప్పి పెద్దల్ని మోసగించి మూర్ఖులై తిరుగుతున్నారు.

యాదవ యువకులంతా పెద్దా చిన్నా అనే భేదం లేకుండా అందరి ముందు మద గర్వంతో తిరుగుతూ, ఇష్టం వచ్చినట్లుగా రాత్రింబవళ్ళు మద్యం తాగి ఎవరిష్టం వచ్చినట్లుగా వాళ్ళు ఒక్కొక్కడూ ఒక్కోరకంగా కాలమంతా పానశాలల్లో - కాలం వెళ్లపుచ్చుతున్నారు. ఇంత జరుగుతున్నా యాదవ వంశమంతా నాశనమౌతోందని

చూస్తున్నా యెవ్వడూ 'ఇది మంచిది గాదు' అని వాదించేవాడు లేడు. తాగుబోతు తనం తగినది కాదు. దాన్ని ముట్టుకోవద్దని చెప్పేవారే పుట్టలేదు. ఇంకో విచిత్రమేమిటంటే, కృష్ణుడి ముందే యిది జరుగుతున్నా - అతడు కూడా ఏమీ చేయలేని స్థితిలో వున్నాడు.

"తాగరా...! తాగు. నీ యిష్టం వచ్చినంత తాగు. - వెనుకా ముందు చూడకు. తెగ తాగు - అంటూ ఒకణ్ణి వొకరు వుసికొల్పుతూ తాగిస్తూ - తాగుతూ - ఆ పట్టణంలోని యదు కుమారులు మద్యపానమత్తులై - సారా దేవతకు నమస్కారాలు చేస్తారు చేతులెత్తి - తప్పతాగి నేల మీద పొర్లాడేంత వరకు తాగి సంతోషాన్ని అనుభవిస్తున్నారు.

"ఒరేయ్ సారా యిటు తీసుకురా! రావా! ఇటు తెమ్మంటే తేవేమిరా! నీ పేరేంటో తెలియదు నాకు! మన పేరంటేనే బలాదూర్... ఆ సారా గ్లాసు తీసుకురారా! ఇవ్వాళ దిట్టంగా తెగ తాగుతా. మనల్నెవరూ అడ్డగించలేరు'' అంటూ తాగుబోతులు విహరిస్తున్నారు.

సారా తాగి - తాగి - మానావమానాలు గాలికి వదిలి, రాజ వీధుల్లోనే నోటికివచ్చినట్లుగా మాట్లాడుతూ తిరుగుతున్నారు. చేతికందిందల్లా మెక్కుతూ - కారుకూతలు కూస్తూ - పందేలు కాస్తూ - వచ్చీ రాని పద్యాలను కూనిరాగాలాలపిస్తూ ఎక్కడ చూచినా తామై మత్తులో మునిగిన యాదవ యువకులు హద్దుమీరి ప్రవర్తిస్తున్నారు.

ఇప్పుడు - అప్పుడు అనకుండా తప్ప తాగిన యదుకుమారు లెప్పుడు ఆ పురవీధుల్లో వనితల తగులాటలతో వావి వరుసలు మరచి తిరుగుతున్నారు. వాళ్ళ దుర్వ్యాపారానికి అవధుల్లేవు.

శత్రు వీర భయంకరులై, రణ రంగంలో ఎదురు లేకుండా పోరాడే వీరులంతా తమ నెదిరించే పోటరులు లేకపోవడం వల్ల తాగుడుకు అలవాటు పడి సందు గొందులన్నీ తిరిగి నిస్సారులయ్యారు. సామరులంతా సోమరులయ్యారు.

యువకుల స్థితి యిట్లా వుంటే, మదవతులైన మదిరాక్షీమణులు కూడా తాగుడు నేర్చుకొన్నారు. తరుణులు తమ వంట గదుల్లోనే బానల నిండా సారా నింపుకొనేవారు. చివరికి ఆ గదులే కామ మందిరాలుగా మారి ధర్మ వినాశనానికి మూలకందాలయినాయి.

పొరపాటున యెవరైనా పెద్దలు పొరుగూరు నుంచి వచ్చారంటే, తాగి మత్తుగా తిరిగే యాదవ కుమారులు వాళ్ళ పరువు కూడా తీసేట్టు ప్రవర్తిస్తున్నారు. నారదుడు లాంటి మునులకే ద్వారకా నగరం వస్తే ఈ పాట్లు తప్పటం లేదు. ఈ రకంగా ద్వారకా నగరంలోని యాదవ కుమారుల స్వైరవిహారం దారి తప్పి మితిమీరి మిన్నుముట్టింది.

ద్వారకా నగరంలో రకరకాల మద్యాలను అమ్ముతున్నారు. యువకులందా

రాత్రింబవళ్ళు పానశాలల్లోనే కాలం గడుపుతూ -పానశాలల్లోనే మునిగి తేలుతూ వున్నారు. ఆ దుకాణాలు రేయింబవళ్ళూ తెరిచే వుంటాయి. అంతా గందరగోళంగా వుండి తాగిన మైకంలో తన్నుకోవటం కూడా జరుగుతూ వుంటుంది.

ఆ పట్టణమంతా యీ రకంగా దుర్వ్యసన పంకిలమై తన కళ్ళకు కనిపిస్తున్నా, కృష్ణుడు మాత్రం ఏమీ చేయలేక విషణ్ణ వదనంతో పక్కకు వొరిగి తిరుగుతున్నాడు. ఈ స్థితిని గమనించి యాదవ కుమారులు మరీ విజృంభించారు. మరీ అంతకంతకూ చెలరేగి కావరంతో సంచరిస్తున్న యువకుల్ని చూచి, వుగ్రసేన మహారాజు భరించలేక చాటింపించాడు.

"ఓ యదుకుమారులారా! ఈ మాట వినండి! మద్యపానం చేసిన వాళ్ళను కుటుంబ సహితంగా శూలారోహణ చేస్తా - ఇది వేళాకోళం గాదు; ద్వారకా నగరం పొలిమేరల్లో ఎక్కడ పానశాలలుండరాదు. వినకుండా పాన గోష్ఠుల్ని నిర్వహించేవాళ్ళను మరుభూములకు పారదోలుతా. ఈ శాసనం అందరికీ వర్తిస్తుంది. ఎవ్వరూ దీని నుంచి తప్పించుకోలేరు"

ఉగ్రసేన భూపతి చాటించిన శాసనాన్ని యాదవ కుమారులంతా విన్నారు. విని, కుపిత మనస్కులై అంతా వొకచోట గుమిగూడారు.

"ముసలివాడు కాబట్టి రాజు ఏదో రకంగా కాలం గడుపుకొంటాడు., కాని, యువరక్తం పొంగులువారే కుర్రవాళ్ళ సంగతేమిటి? వీళ్ళకు కాలమెట్లా గడుస్తుందో కూడా అనుకోకుండా భయంకరమైన శాసనమిట్లు చేయటం రాజనీతి యవుతుందా? సరే, ఈ సంగతి చూద్దాం-" అని అంతా రోష కషాయ నేత్రులయ్యారు.

రహస్యంగా వొకరినొకరు పిలుచుకొని, బందుకట్ట శాసనాన్ని ఎట్లాగైనా నిరర్థకం చేయాలని నిర్ణయించుకొన్నారు. జాతర చేయాలని తలంచారు.

బుసబుస పొంగుతూ పులికంపు గొట్టే కల్లు కుండ కావళ్ళను ధరించారు, మదపు వాసన వేసే మధువు నింపిన కడవల్ని భుజాలపై పెట్టుకొన్నారు; లాహిరి గలిగించి లంభింప చేసే మద్యం నింపిన బానల్ని పట్టుకొన్నారు. మదిరాక్షుల కింపుగా దోచే మదిరను నింపిన కుండల్ని బండ్ల మీద తోలుకెళుతున్నారు. ఇక ఈ రాజు ఏం చేస్తాడో చూద్దామని ద్వారకా నగరం విడిచి సముద్రం తీరానికి పోయి ఇష్టం వచ్చినట్లు తాగవచ్చుననే వుబలాటంతో అంతా తరలిపోయారు.

రాజ శాసన భయం రవ్వంత కూడా లేకుండా, పాన పాత్రల్ని చేతబట్టుకొని, రేకల్ని తీసుకొని మంచి మైరేయాన్ని యాదవులంతా పీకలదాకా తాగారు.

గొంతువరకు తాగిన యదు కుమార ప్రవరులు చీకులు అమ్మే దుకాణాల దగ్గరలో, ఇక ఇకలుగా, పకపకలుగా నవ్వుతూ, తిరుగుతున్నారు. తప్పదాగిన మైకంలో అడుగు

ముందుకు వేయలేక కొంతమంది అక్కడే కూలబడుతున్నారు. కొంతమంది విసవిస పరుగెత్తుతూ బట్టలూడిపోయినా గమనించటం లేదు. కొంతమంది తమలో తామే గుసగుసలు పోతున్నారు. కొంతమంది మత్తు తలకెక్కి కళ్ళు తేలవేస్తున్నారు.

ఇట్లా యాదవ వంశ యువకులు ఒడలు మరిచి తిరుగుతూ వుండడం వల్ల, అంతా తాగుబోతులమయమై సముద్రతీరం మొత్తం బహు కోలాహలంగా వుంది. ఆ పరిస్థితుల్లో సాత్యకి ప్రద్యుమ్నుణ్ణి ఆనుకొని తన వాచాలత్వం బయడ పడేసుకొన్నాడు.

తప్పతాగిన సాత్యకి కనుగ్రుడ్లు ఎర్రబడ్డాయి. చిటపటలాడుతూ మహావీరుడైన కృతవర్మను చూచి, కనుబొమలెగురవేస్తూ అడిపోసు కొన్నాడు.

"యుద్ధం చేసి చేసి అలసిపోయి రాత్రిపూట శిబిరాలలో నిద్రపోయే ప్రథితులైన బాలురను అర్ధరాత్రిపూట దయావిహీనుడై; నెత్తురోడుతుండగా ఎగ్గూ సిగ్గూ లేకుండా, ముందు వెనుకలాలోచించకుండా కంఠాలను గిరుక్కున త్రెంచిన మహా బలవంతుణ్ణి కొనియాడుతున్నా"

తననిట్లా ఎగతాళి చేసి పలికిన పలుకుల్ని కృతవర్మ విన్నాడు. మనసులో కోపం కట్టలు తెంచుకొని వచ్చింది. అయినా దాన్ని బయటకు పొక్కనీయకుండా చిరునవ్వుతోడే సాత్యకిని చూడనట్టుగా తానూ విసురు విసిరాడు.

"శత్రువు నేలపై పడవైచి, రొమ్ము దొక్కి కంఠం తెగవేయటానికి కత్తి పట్టుకొన్న చేతిని పైకెత్తితే, అది గ్రహించిన అర్జునుడు దూరాన నుండే ఆ చేతిని నరికిన తరువాత – ఒంటి చేయి గల శత్రువును ప్రక్కకు త్రోసి క్రింద బడ్డ తాను పైకి లేచి, ఏకహస్తుణ్ణి హతమార్చిన వీరవరుణ్ణి స్మరిస్తున్నా" అని ఎద్దేవా చేశాడు.

ఇట్లా అని కృతవర్మ వెంటనే కొంటె చూపులతో సత్యభామ ముఖాన్ని చూచాడు. ఆమె సిగ్గు – కోపం – ముప్పిరిగొనేట్టు తలవంచుకొంది. ఈ స్థితిని సాత్యకి గమనించాడు.

ఒక ప్రక్క భోజుడైన కృతవర్మ ఎత్తిపొడుపు, ఇంకోవైపు సత్యభామకు కలిగిన అవమానం – క్రమ్మి తన మనస్సును కలతపరిచి, కుపితస్వాంతుడై కూడా సాత్యకి తొందర పడకుండా కృష్ణుడి వైపు తన చూపును ప్రసరింపజేశాడు.

దీన్ని గమనించిన కృష్ణుడు తక్షణమే కడగంటి చూపులతో సాత్యకికి సైగ చేసి హెచ్చరించాడు. కృష్ణుడిచ్చిన వూపుతో సంభ్రమించి, సాహసం చూపి ఉత్సాహభరితుడై పండ్లు పట పట కొరికి కృతవర్మను చూచాడు.

"అవునులే. మమ్మల్ని స్మరిస్తావు గదా! అది కూడా యింకె న్నాళ్ళులే..." అని అంటూ వెంటనే కృతవర్మ తల తెగనరికాడు. తాగుబోతుతనం వుంటే ధ్యేయం మాత్రం ఎక్కడుంటుంది?

భోజులు కృతవర్మ చావును చూచారు. సమిద్ధ పరాక్రమ విక్రమాఢ్యులై, మదమెక్కి

కళ్ళు గానక క్రూర ఖడ్గాలను చేతబూని, అదరక బెదరక యదు కృష్ణ వంశస్థులతో యుద్ధం చేయటానికి మీదకు దూకారు. యదు కృష్ణ వంశజులు కూడా వెంటనే గమనించి, ఆయుధ పాణులై భోజుల్ని ఢీకొని యెదిరించారు. ఆ కోలాహలానికి భూమి కంపించినట్లయింది. ఇరువర్గాలవాళ్ళు ఒకళ్ళొకళ్ళు తీసిపోకుండా భయంకరంగా పోరాటం చేస్తున్నారు.

కృష్ణుడీ యుద్ధ దృశ్యాన్ని చూచాడు. దారుకుణ్ణి చేరబిలిచాడు.

"ద్వారకా నగరంలో వున్న స్త్రీలను, వృద్ధుల్ని – పిల్లల్ని తీసుకొనిపోయి హస్తినాపురంలో సురక్షితంగా వుంచమని అర్జునుడికి చెప్పిరా" అని దారుకుణ్ణి హస్తినాపురానికి పంపించాడు. వెంటనే బభ్రుణ్ణి దగ్గరకు పిలిచి "అర్జునుడు వచ్చిందాకా నీవు, ద్వారకలో వున్న స్త్రీ, బాల వృద్ధ జనాలను జాగ్రత్తగా కాపాడుతూ వుండు. నగరానికి వెళ్ళు " అని చెప్పి పంపాడు.

ఆ తరువాత తాను కూడా వొక పక్క నిలిచి, సముద్ర తీరంలో భయంకరంగా జరుగుతున్న యుద్ధాన్ని చూస్తూ వున్నాడు,

అధిక సంఖ్యాకులు కావడం వల్ల వృష్ణి వంశస్థుల్ని – యాదవుల్ని – భోజులు పిప్పిపిప్పి చేశారు. దీన్ని గమనించిన కృష్ణుడు కోపోపరీత మనస్కుడై యుద్ధం చేసి మిగిలిన భోజులనందరినీ నేలగూల్చాడు.

యాదవులు – వృష్ణికులులు – సాత్వితులు – భోజులు ఈ రకంగా పీకల దాకా తాగి, వొళ్ళు మరచిపోయి, మత్తులో మునిగి తమలో తామే యిష్టం వచ్చినట్టు వాదులాడుకొంటూ తన్నుకొని చావడం కళ్ళారా చూచాడు. ఈ రకంగా నేటికి యాదవ నాశనం జరిగింది గదా! అని మధనపడ్డాడు.

తనముందే కులక్షయం కావడం చూచి, భరించలేక వేదన గల మనస్సుతో దైవాన్ని తిట్టి, ఇక సముద్ర తీరంలో వుండలేక దగ్గరలోనే వున్న దట్టంగా, ఏపుగా పెరిగిన చెట్టు నీడకు పోయి పండుకొన్నాడు.

చిన్నప్పటి నుండీ తాను చేసిన సకలకార్యాలు వరుసగా వొక్కటొక్కటిగా కళ్ళకు కడుతూ వుంటే, ఆశ్చర్యపడి అన్నిటినీ తలచుకుని మనసులో ఆశ్చర్యపోతూ వుండగా కొంతసేపటికి కొంచెం నిద్రగూర్కాడు.

ఆ సమయంలో ఒక బోయవాడు కృష్ణుడక్కడ పరుండడాన్ని చూచాడు – బాగా వీక్షించి ఆతడు కృష్ణుడేయని గమనించి – "కృష్ణుడిప్పుడు చేతికి చిక్కనే చిక్కాడు. ఎట్లు తప్పించుకు పోతాడో చూస్తా–" అని సంతోషకలిత మనస్కుడయ్యాడు.

చెట్ల కింద వెల్లకిల పడుకొన్న కృష్ణుణ్ణి బోయవాడు చూచి బాణం వేయటానికి అవకాశం కోసం చూస్తున్నాడు. ఎంతకీ వీలు చిక్కడం లేదు, ఇంతలో కృష్ణుడు అటునిటు

పొరలి ఎడమ కాలి మీద కుడికాలు పెట్టుకొని కదలకుండా నిద్రపోతున్నాడు. ఎరుక దాన్ని కనిపెట్టి సంతోషంతో ఆలస్యం చేయకుండా పొది నుండి మంచి బాణాన్ని ఒకదాన్ని తీసి, వింట దొడిగి యితరులెవ్వరూ చూడకుండా, చెవి దాకా అల్లెతాడు లాగి గురి చూచి కృష్ణుడి కాలికి బాణాన్ని వదిలాడు. బోయవాడు విడిచిన బాణం రివ్వురివ్వున వచ్చి సూటిగా కృష్ణుడి కుడి కాలి బొటన వేలుకు తాకి దాన్ని మొదలంట నరికివేసింది.

దుర్మార్గుడైన బోయ వేసిన బాణం కరుక్కున దూసిపోగా: బొటనవేలు చురుక్కుమంటే కృష్ణుడు చివుక్కున లేచి అటు ఇటు పరికించి చూచాడు. కళ్ళ యెదుట బోయవాడు గనిపించాడు. ఇద్దరూ పరస్పరం వొకళ్ళ నొకళ్ళు చూచుకొన్నారు. లోగుట్టుగా భావాలను గూడా తెలుసుకొన్నారు. వెంటనే బోయవాడు గిరుక్కున తిరిగి, సంతోషధారాక్రాంత చిత్తుడై పోయాడు. బోయవాడు అటు పోగా కృష్ణుడు కూడా తనువు చాలించాడు.

కులపెద్దలంతా సంతోషించేట్టు కులనాశకుడైన కృష్ణుణ్ణి చంపాననే సంతోషంతో ఎరుక ఎంతో కులికాడు. ఎంత కాలం గడిస్తే మాత్రం పాత పగలు మాసిపోతాయా?

ఎనభై నాలుగు సంవత్సరాలు భారత దేశాన్ని అరచేతిలో పెట్టుకొని దేగాట యాడించిన లీలా మానుష విగ్రహుడైన కృష్ణుడు కాలానికి చిక్కి, నిషాద బాణ వ్యాఘాత నెపంతో మరణించవలసిన వాడయ్యాడు.

ఇంతకు ముందు యాదవ ప్రళయం సముద్ర తీరంలో మహా ఘోరంగా జరుగుతుంటే, ఒకచోట బలరాముడు కుత్తుక దాకా తెగ తాగి, వొడలు తెలియకుండా అటు ఇటు తూలుతూ, తప్పటడుగులు వేస్తూ దారిలో ఒక త్రాచుపామును తొక్కాడు. ఆ కాలసర్పం కస్సుమని లేచి బలరాముణ్ణి కాటు వేసింది.

బాగా తాగి వుండడం వల్ల బలరాముడు నాగుబామును బట్టుకొని గిర్రున తిప్పి విసరి పారవేశాడు. అ తరువాత నెమ్మదిగా మత్తుతో కదలిపోయి వొక చెట్టు మొదట పడి గుర్రు పెట్టి నిద్రపోయాడు. అప్పుడు కసిబట్టిన ఆ పామేనేమో పసిబట్టి అక్కడికి వచ్చి బుసకొడుతూ, పైబడి బలరాముడి మొఖాన బాగా కరచింది. దీనితో తక్షణం అతడు దీర్ఘ నిద్రపోయాడు.

ద్వారక నుండి దారుకుడితో పంపిన వార్త శూలం లాగా చెవిలో నాటిన మరు నిముషమే పార్థుడు బయలుదేరి, నిరంతర ప్రయాణం చేసి ద్వారకా నగరం చేరాడు. కృష్ణుడు – బలరాముడు – సాత్యకి మొదలైన వీరులంతా చనిపోయారు. ఎక్కద చూచినా అంతా ఆర్తాలాప దైన్యమై కురుక్షేత్ర యుద్ధం తరువాత కళ తరిగిన హస్తినాపురాన్ని గుర్తుకు తెస్తున్నట్టుంది ఆ ద్వారకా పట్టణం. అంతా గ్రహించిన అర్జునుడు చాలాసేపు చింతించి, కొంతసేపటికి తన్ను తానూరడించుకొని ధైర్యం అవలబించాడు.

తరువాత అంతఃపుర కాంతా జన సంతాపాన్ని పోగొట్టి ఊరడించాడు. వృద్ధుల్ని –

బాలురను దుఃఖం దిగమింగమని చెప్పి చిడిముడి పాటుతో పసిపిల్లల్ని – కసిగందుల్ని అంతటా వెదకి తీసుకొని వచ్చి ద్వారకను వదలి అందరినీ తీసుకుని బయలుదేరాడు పార్థుడు.

అర్జునుడి రక్షణలో ద్వారకలోని కాంతా జనం పట్టణం విడిచి హస్తినాపురానికి వెళుతుందనే సంగతి, ద్వారకా నగర పరిసరములందుండే కౌరవ రాజుల మూకలు పసిగట్టాయి. గుంపులు గుంపులుగా అటవీ మధ్యంలో బారులు గట్టి దారి దోయటానికి సిద్ధమయ్యారు. యాదవ వంశంపై తమకు అంతకుముందున్న విరోధాన్ని తీర్చుకోవటానికి నడుం గట్టారు.

పార్థుడొక్కడు రక్షణ కార్య నిమగ్నుడై, యాదవ స్త్రీ జనాలను తీసుకొని వస్తూ వుండగా, అకస్మాత్తుగా చెంచు దొరలు వాళ్ళపై బడి నిర్దయగా దోపిడీ మొదలుబెట్టారు.

ఒక చెంచు ఉన్మత్తుడై చెలరేగి వొక నెలతను నిలువుదోపిడీ చేశాడు. ఒక బోయి కళ్ళు గానక ఒక కాంత ముప్పేట హారాన్ని హరించి మొలలో దోపుకొన్నాడు. ఒక కొరవంజి కొమరాలి నొకర్తను అదలించి ముంగెరను తెగ గుంజి మూటగట్టాడు; ఒక శబరుడు ధైర్యసాహసాలు ప్రదర్శించి ఒక కాంత మెడ పేరు లూడలాగాడు; ఒక వ్యాధుడు పడతి నొకదానిని అదిమిపట్టి శరీరం మీద నున్న బంగారం మొత్తం వొలుచు కున్నాడు. ఒక యెరుక పేరాశతో బోటి నొకదాని పైబడి బంగారు మొలనూళ్ళు ఊడదీశాడు; యాదవ మదవతీ సమూహ మధ్యంలో అంతా అలగోలు బాలగొల్లుగా అయింది. ఏం చెప్పేది? ఇదంతా చూచి పార్థుడు పట్టరాని మహోగ్రకోపుడయ్యాడు.

బావురుమని యేడుస్తున్న యాదవ కాంతలను జూచి, భరింపరాని రోషంతో, భయంకర రూపం దాల్చాడు. గాండీవాన్ని యెక్కు పెట్టటానికి చాలా యత్నం చేశాడు; కాని ఫలించలేదు. కనీసం అల్లె తాడు కూడా తగిలించలేకపోయాడు సవ్యసాచి. ధనస్సు పట్టు జారిపోయింది. కంటి నుండి నీటి బొట్లు జారాయి. చిత్తం చెదరి పోయింది. చీకాకు పడ్డాడు. ముదిమి వల్ల చేతులు వణుకుతున్నాయి.

కళ్ళు తెరచి గుడ్లప్పగించి చూస్తున్నాడు. గాండీవ ప్రయోగం మరచిపోయాడు. ఆలోచనలో పడ్డాడు. ఏమీ చేయలేక నలుగురు నవ్వేట్టు అట్లాగే నిలుచున్నాడు నరుడు.

అర్జునుడు నిలువు గుడ్లతో నిలబడి వుండేటప్పటికి, నిలువు దోపిడీ అదుపు లేకుండా జరిగిపోయింది. యాదవ కాంతలు కొత్త పోటరులకు మెత్తపడ్డారు.

పుర్వార్జితాలైన పొలాలనన్నిటినీ, పొంగి పొరలిన సముద్రం పూడ్చివేసింది. కాయకష్టం చేసి సంపాదించిన ధనధాన్య సంపద సమస్తం నాశనమైపోయింది; పుట్టి పెరిగిన ప్రదేశమంతా క్షణంలో సముద్రంలో కలసిపోయింది. కనుకుట్టు లేకుండా బ్రతికించే భర్తలు యుద్ధరంగంలో తొలిగిపోయారు. అంతా చెప్పరాని అగచాట్లు దాపురించాయి.

తెలియని కొత్త ప్రదేశాలకు పోవలసి వచ్చింది. ఇదంతా అనవసరం. ఎరిగిన చోటే వుండడం మంచిది కదా! పర దేశాలకు పోయి కష్టాలను కొని తెచ్చుకోవడం దేనికని యాదవ కామినీ జనం మనస్సుల్లో భావించారు.

ఒక సొగసుగత్తె తన కడగంటి వాలుచూపు చేతనే చెలికాడికి సూరెలంపింది. ఇంకొక మిటారి సోలి సుందరాంగుడి వైపు చూపు సారించి మనస్సు చుక్కానిని తిప్పింది; కందెల తెగిపడ్డ చెంచలాక్షి వొకత్తె చెంచు మగనిని వంచించుకుపోయింది; వలపుల మిటారి వొకర్తె పెరిగిపోయిన పేరు వెదుకుతూ వలపు చూపును మరల మరల పంపింది; అటు దోచుకొన్నవాళ్ళు - ఇటు దోయబడ్డవాళ్ళు ఒక్క క్షణంలో జంటలై పోయారు. యాదవ కాంతలంతా యిట్లా గావడం కళ్ళారా చూచిన అర్జునుడు పెదవి కొరుక్కొన్నాడు.

కొత్తగా పుట్టిన ప్రేమ పెల్లుబికి, నూత్న సౌందర్యంతో కనిపిస్తున్న యాదవ కామినీమణులు చెంచు యువకులతో కిలకిల కేరింతలు కొట్టడం చూచిన పాండవ మధ్యముడు అవమానం పొంది భరించలేక మూల నిలబడ్డాడు. ఇక తానీ కార్యాన్ని ఆపలేడు. అందుకే ప్రక్క నిలబడ్డాడు.

రుక్మిణి పొదలో దూరి వికారంగా అయింది. సత్యభామ తపిస్తూ చలమలకు పోయింది; తక్కిన కులకాంతలంతా యేమయ్యారో దేవుడికే తెలియాలి. కటకటా! చిట్టచివరకు యదు కులమంతా యిట్లా అయింది.

అబ్బాయి! రామస్వామీ! సముద్ర తీరంలో యోధులు, వృష్ణికులులు, భోజులు పీకలదాకా తాగి సిగ్గువిడిచి పరస్పరం కలహించుకొని చచ్చారు. కృష్ణుడు కూడా నిషాద బాణ హతుడయ్యాడు. అప్పటివరకు కృష్ణుణ్ణి ఆశ్రయించుకొని, అతడి చెలిమిని - చుట్టరికాన్ని చేసిన యాదవ స్త్రీలంతా, కామ సుఖాలనుకోరి, చెలరేగి మితిమీరి నియమాలు కూడా వుల్లంఘించి మ్లేచ్ఛులు - కిరాతులు - నిషాదులు అయిన మగవాళ్ళను చేరి, మరులెత్తి కొత్త మగవాళ్ళతో అడవుల బడిపోయారు. కనీసం కుల గౌరవాన్ని కూడా పాటించలేదు. ఎవరినీ లెక్క చేయలేదు; దుశ్చింత నాసక్తి విటులతో తైతక్కలాడారు. ఇక చెప్పాలన్నా ఇంతకంటే యింకేముంది?

ఇట్లు కొత్త విలుగాళ్ళతో లేచిపోయిన వాళ్ళు పోగా, మిగిలిన స్త్రీలను వెంటబెట్టుకొని అర్జునుడు హస్తినాపురానికి వెళ్ళాడు. భయంకరమైన యాదవ ప్రళయాన్ని ధర్మరాజుకు వినిపించాడు.

ఇంద్ర తనయుడు భీకరంగా చెప్పిన యాదవ ప్రళయమంతా విన్న ధర్మరాజు చాలాసేపు దుఃఖించి, నిట్టూర్పు పుచ్చాడు.

కృష్ణుడి చావు నాలకించాడు; సాత్యకి మృతుడైన సంగతి విన్నాడు. వాళ్ళిద్దరూ చిన్నతనం నుంచి తమకు చేసిన మేళ్ళను తలచుకొని పొరలి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక

పురపురా దుఃఖించాడు. కొంతసేపటికి తెప్పరిల్లి పోయిన వాళ్ళ గురించి దుఃఖించి ప్రయోజనం లేదు, ఇక కావలసిన కార్యం ఆలోచించాలని భావించాడు. అందరి యెదుటే, వాసుదేవుడి మునిమనుమణ్ణి వజ్రుణ్ణి పిలిచి - ఇంద్రప్రస్థ పట్టణాన్ని ఆతడికిచ్చి - బంధువులంతా సంతోషిస్తుండగా పట్టంగట్టి - 'న్యాయం తప్పకుండా పాలించుకో' అని చెప్పాడు.

ఆ తరువాత సాత్యకీ తనయుడికి సరస్వతీ నగరాన్ని యిచ్చాడు; భోజ వంశస్థుడైన కృతవర్మ కొడుక్కి మూర్తికావతమనే పట్టణాన్ని యిచ్చాడు. ఇది మిక్కిలి అరాజకంగా వుంది. అందుకే సమర్థుడని యెంచి ఆతనికా పట్టణాన్నిచ్చాడు.

కొన్నాళ్ళు గడచిన తరువాత ధర్మ నందనుడొకనాడు అతి దుఃఖావేశపరుడై కలవరపడి, వొంటరిగా కూర్చుండి దీర్ఘంగా విచారించాడు.

"ప్రాణ సమానంగా వుండి, తనకన్నివిధాలా అండగా నిలబడ్డ కృష్ణుడు చనిపోయిన తరువాత బ్రతకటం మరింత విషాదకరంగా వుంది. వెంటనే రాజ్యాన్ని కుమారుడికిచ్చి మహాత్ముడైన కృష్ణుణ్ణి గూర్చి ధ్యానం చేసుకోవడం మేలు"

అని నిశ్చయించుకొని, అలస్యం చేయకుండా భీమార్జున నకుల సహదేవులను, ద్రౌపదిని పిలిపించి కంపితస్వరంతో వాళ్ళను చూచి అన్నాడు.

"సోదరులారా! కాలం మారిపోయింది, మనకాలం నాటి పరిస్థితులు తారుమారయ్యాయి. దుష్కాలం దాపురించింది; మన కళ్ళముందే యెంతోమంది కాలం చేశారు. పోయిన కాలమే మేలుగా కనిపిస్తుంది. గాలంలాగా గుచ్చుకొనే కష్ట పరంపర దాపురించింది. మీరీ విషయాన్ని గమనించారో! లేదో!

ఇష్టసఖుడు - అఖిలేశ్వరుడు - అయిన కృష్ణుడస్తమించాడు - ఏవైనా కష్టసుఖాలు మునుపటిలాగా చెప్పుకొందామన్నా యెవరూ లేరు. సంతోషం దూరమయింది. ఏమీ తోచడం లేదు. ఈ భ్రష్టు లోకంలో వుండలేను. మీరే చెప్పండి ఎట్లా వుండాలో?

ఈ రాజ్యానికి ముని మనుమణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేసి, ఆనందంతో, నిరాటంకంగా అరణ్యాలకు పోయి మునిజనం సేవ చేస్తా. క్షత్రియ వృత్తిని విడచి - దీక్షబూని సన్యాసం పుచ్చుకొంటా. మూడు లోకాలకు కారకుడయిన ఆ పరమాత్మ దర్శనం గోరి ధ్యానం చేయాలని నిశ్చయించుకొన్నా. పూర్వాచారాలన్నీ మన కళ్ళ ముందే ఛిన్నాభిన్నమై శీఘ్రంగా ముక్కలైపోతున్నాయి. ఈ సంగతి నేను మీకు వివరించి చెప్పవలసిన అవసరం కూడా లేదు.

కానీనుడని తెలిస్తే మునుపటిలాగా సరిపెట్టుకునే కొమరాంద్రే లేరు. కసరి కొడుతున్నారు. క్షేత్రజుడని చెపితే గేలి చేస్తారే గాని, ఏ జవరాలూ తల వూపదు; ఈతడు సహోఢజుడంటే అంతా ఎగతాళిగా గోల చేస్తారు- అంతే గాని ఏ పడుచుగత్తె

కూడా యిష్టపడడం లేదు. ఈతడు గూఢోత్పన్నుడని బయటపడితే అందరూ నిలదీస్తారు - ఏ మగవాడు ధైర్యంతో అంగీకరించడం లేదు; ప్రపంచమంతా తారుమారయింది. ఎన్నో వింతలూ - విడ్డూరాలూ పడుతున్నాయి. కాలమంతా తలక్రిందులయినట్టుగా కనిపిస్తుంది. కలికాలం ప్రవేశించబోతోంది.

పిల్లలు లేకపోతే పున్నామ నరకం వస్తుంది. ఆ నరకం నుండి తప్పించుకోవాలంటే పిల్లలు కావాలి. పుత్రుల్ని పొందటం కోసం బ్రాహ్మణులతో సంపర్కం పెట్టుకొని పుత్రుల్ని కందామంటే ఏ భార్యా యీనాడు మాట వినడం లేదు. ఇక తాపత్రయమెట్లు తీరుతుంది. ఆహా! చూశారా! ఎంత చెడ్డకాలం దాపురించిందో?

బహుపతిత్వం తప్పు- ఇది పనికిరాదు -అని చెప్పి మగువలు ఈ రకమైన పెళ్ళిళ్ళు మానివేశారు. గర్భవతులు పెళ్ళిచేసుకోవడం న్యాయ విరుద్ధం. చులకనగా వుంటుందని చెప్పి పడతులెవ్వరూ ఈ పెళ్ళిళ్ళు చేసుకోవడం లేదు. సంతానం కలిగిన స్త్రీలెవ్వరూ పెళ్ళి చేసుకోవడం మంచిది గాదని చెప్పి, సంతానవతులైన యువతులు పెళ్ళిళ్ళు మానివేశారు. మారుమనువు చేసుకోవడం మర్యాదగా వుండదని భావించి వెలదులు ఈ పెళ్ళిళ్ళు చేసుకోవడం లేదు; అంతా యిట్లా తారుమారు గావటానికీ - కాలమంతా తలక్రిందులు గావడానికీ కారణం కలి ప్రవేశించడమే.

ఎన్ని యిబ్బందులెదురైనా కార్యసాధన కోసం సత్యం చెప్పాలి. సత్యమే కావాలి - అని అంటున్నారు. సత్యం మార్గం తప్పితే నరకం తప్పకుండా వస్తుందంటున్నారు.

నీతి నియమాలు లేకపోతే యిష్టం వచ్చినట్లుగా తిరిగితే కానీనులు మాట పడతారేమోనని చెప్పి, ఆడపిల్లలకు బాల్యంలోనే పెళ్ళిళ్ళు చేసి, వాళ్ళను ఇంటిలో నుంచి బయటకు పోనీయకుండా వుంచుతున్నారు. పూర్వం ఇటువంటి విచిత్రాలు విన్నామా? కన్నామా!

అడవుల్లో వేటాడి మృగాలు చంపకూడదనీ - యాగాల పేరుతో అశ్వమేధం లాంటివి చేసి గుర్రాలను చంపరాదనీ - వాదాలు బయలుదేరాయి. రకరకాల చిట్టలు పుడుతున్నాయి. - ఇక యిట్లాంటి రాజ్యంలో వొక్క నిమిషం కూడా వుండలేం.

వేదం ఆర్షేయమట, వేదాన్ని అందరూ చదువవచ్చునంట- వినవచ్చునంట- పాఠాలు చెప్పవచ్చునట- ఇట్లాంటి సంగతులెప్పుడైనా విన్నామా?

మద్యపానం చేయుట చాలా తప్పట! ఆడవాళ్ళు మద్యపానం సంగతే యెత్తగూడదట! అక్కటా పూర్వాచారాలన్నీ అదఎదలైపోయాయి. అంతా ఆశ్చర్యంగా వుంది.

నేను మాత్రం యిక యిక్కడ వుండలేను. వన భూములకు పోయి, ముని జనులకు సేవ చేసుకొంటూ తక్కిన వయసును వెళ్ళ మారుస్తా. తృణప్రాయంగా ఈ శరీరాన్ని విడిచిపెడతా. మోక్షం పొందడానికి యిదే సరైన మార్గంగా కనిపిస్తుంది.

వాయునందనా! మీరు కూడా ఆలోచించండి- నాతో వస్తా నంటే సంతోషంగా తీసుకుపోతా. ఎవరి అభిప్రాయం వాళ్ళది. మంచీ చెడు మీరే ఎవరికి వాళ్ళు విచారించుకోండి"

ధర్మజుడు చెప్పిన మాటలు ద్రౌపది - తక్కిన భీమార్జున నకుల సహదేవులంతా విన్నారు. విని, వొకరి మొగం వొకరు చూసుకున్నారు. చివరకు ధర్మజునితో - అన్నా మేం కూడా మీతోనే యెక్కడికైనా రావడానికి సిద్ధంగా వున్నాం-" అని చెప్పారు.

వెంటనే ధర్మనందనుడు పరీక్షిత్తుని పిలిపించి సమస్త కురు రాజ్యానికి పట్టాభిషిక్తుడ్ని చేసి "ఇది సంధి కాలం కావడం వల్ల ధర్మాధర్మ నిరూపకం చేయడం చాల కష్టం. కాబట్టి అప్రమత్తుడవై, అతి శ్రద్ధాళుడవై, రాజ్యపాలన చేస్తూ - పరంపరగా వస్తున్న వంశ మర్యాదకు భంగం రానీయకుండా కాపాడుము" అని చెప్పవలసిన రీతిలో బుద్ధులు చెప్పి హస్తినాపురం విడిచారు.

తమ మాతృభూమి యైన శతశృంగ పర్వత సమీపంలో వుందామని నిశ్చయించుకొని ముందుగానే, ఆ దేశాన్ని అనువుగా బాగుచేయించుకున్నాడు ధర్మజుడు. తన సోదరులు నలుగురూ వెంటనంటి రాగా ఆ ప్రదేశానికి పయనమై బయలుదేరాడు. ముండ్ల తుప్పలూ- గజిబిజి గందరగోళంగా వున్న మార్గంలో అతి ప్రయాసమీద నడక సాగిస్తున్నారు.

ఆకలి దప్పులకు తాళలేక- చలిగాలి దెబ్బలకు తట్టుకోలేక - ధర్మజుడు తక్క తక్కినవాళ్ళంతా - ద్రౌపది - భీమార్జున నకుల సహదేవులు మార్గమధ్యంలోనే రాలిపోయారు. యుధిష్ఠిరుడు మాత్రం మిగిలాడు. అతనొక్కడే నడక సాగించి గమ్యాన్ని చేరుకొన్నాడు.

**వచన సూత పురాణం అయిపోయింది**

# కవిరాజు

కవిరాజు కవి. పండితుడు. సంస్కర్త. హేతువాది. చదువు, జ్ఞానం, విజ్ఞానం ఒక కులం గుత్త హక్కులు కావని వాటిని ఆర్జించే హక్కు ప్రతి ఒక్కరికీ జన్మహక్కనీ చాటిచెప్పిన ఆద్యుల్లో ఒకరు. బ్రాహ్మణేతరుల్లో ఆత్మగౌరవాన్ని ఆత్మవిశ్వాసాన్ని నింపిన దార్శనికుడు. దక్షిణాదిన బ్రాహ్మణేతర ఉద్యమ తొలి నాయకుల్లో ఒకరు. మూఢనమ్మకాలపైన కత్తులు దూసిన వీరుడు. బౌద్ధిక ప్రపంచాన్ని ఏలుతున్న ఆనాటి పెత్తందార్లను ప్రశ్నించి ఎదిరించిన ఏకవీరుడు. తన భావాలబాటలో తన పయనాన్ని ఒంటరిగా ప్రారంభించి దానిని ఒక ఉద్యమంగా మలిచిన మహానిర్మాత. తెలుగునాట త్రిపురనేని నిర్వహించిన చారిత్రిక పాత్రను ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. సమాజంపై ఆయన కలిగించిన ప్రభావాన్ని ఎంత కుదించినా అపారంగానే ఉంది. ఇది వచన సూతపురాణం. దీనిని వచనంగా మార్చినవారు నాస్తిక ఉద్యమనేత కీ.శే. బి. రామకృష్ణగారు. రామకృష్ణగారు తన జీవితపర్యంతం తను నమ్మిన ఉద్యమానికి కట్టుబడే ఉన్నారు.